

# సమాధానమ్

జిజ్ఞాసువుల సందేహాలకు-

బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మగారి

సమాధానాలు

2వ భాగం





ఋషిపీఠం ప్రచురణలు



# సమాధానమ్

జిజ్ఞాసువుల సందేహాలకు
సామవేదం వారి సమాధానాలు

(భాగం-2)



ఋషిపీఠం ప్రచురణ



# సమాధానమ్
(భాగం-2)

**జిజ్ఞాసువుల సందేహాలకు**
**సామవేదం వారి**
**సమాధానాలు**

**ప్రథమ ముద్రణ:**
శ్రీహేమలంబ, భాద్రపదం- సెప్టెంబర్'2017
**ద్వితీయ ముద్రణ:**
శ్రీవిళంబి, చైత్రం- మార్చి'2018
**తృతీయ ముద్రణ:**
శ్రీవిళంబి, కార్తికం- నవంబర్'2018



**వెల:** రూ. 100/-లు

**డిజైనింగ్ :** రాముపండా

**ముద్రణ:** సంహిత గ్రాఫిక్స్, హైదరాబాద్

**ప్రచురణ:**
**ఋషిపీఠం చారిటబుల్ ట్రస్ట్**
ప్లాట్ నెం-1-19-46,
హెచ్.ఐ.జి.ఎ-40,
డా॥ఎ.ఎస్.రావు నగర్,
హైదరాబాద్-500 062.
ఫోన్: 040 27134557, 27132550

# ఇది ఆర్షభారతి సమర్పనం

**స**నాతన ధర్మంపై అనేక సందేహాలు కలుగుతుంటాయి. ముఖ్యంగా జిజ్ఞాసువులకు సాధనార్థం కలిగే సందేహాలు ప్రధానమైనవి.

సాధన దశలో తమలో కలిగే ప్రశ్నలే కాక, బైట నుండి వినబడే కొన్ని సందేహాస్పద విషయాలు సందిగ్ధంలో పడవేస్తాయి. వాటిని దూరం చేసి మనసును సమాధాన పరచే ప్రయత్నంలో వివిధ శాస్త్రాల ప్రమాణాలతో అందించిన సమాధానాలను 'ఋషిపీఠం'లో ధారావాహికగా ప్రచురించడం జరిగింది.

వాటిలో కొన్నిటిని సంకలనం చేసి పుస్తకరూపంలో అందించాలని చాలామంది సహృదయులు ఆకాంక్షను వ్యక్తపరచడంతో ఈ గ్రంథం రూపుదిద్దుకుంది.

జ్ఞానం సమృద్ధిగా ఉన్న చోట మీమాంసకి అవకాశం ఉంటుంది. యుగయుగాల అనాది సనాతన ధర్మంలో విస్తార వాఙ్మయం, వివిధ కాలాలలో మహాత్ములచే జరిగిన సమన్వయాలు, సంస్కరణలు, సామాన్య-విశేష- ఆపద్ధర్మాలు... వంటి బహుళాంశాలున్నాయి.



నేటి కాలంలో మన సనాతన ధర్మవిషయంలో కలిగే సందేహాలను-

- ✦ అపోహలు,
- ✦ అవగాహనారాహిత్యం
- ✦ అధ్యయన-సమన్వయలోపం
- ✦ సాధనాపరమైన జిజ్ఞాస
- ✦ కువిమర్శలు- అనే భాగాలుగా విభజించవచ్చు.

వాటికి సాధికారంగా, శాస్త్రప్రమాణాల సమన్వయంతో చెప్పే సమాధానాల సమాహారమే ఈ గ్రంథం.

ఋషిపరంపరకు ప్రాంజలిస్తూ, ఆర్షభారతిచరణసేవగా సమర్పిస్తూ...



**బుధజనవిధేయుడు**

సామవేదం షణ్ముఖ శర్మ

**ప్ర: కుచేలుడు, శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళినప్పుడు, 'కాపలాదారునికి లంచమిచ్చి వెళదామన్నా డబ్బులేదే' అని బాధపడ్డట్లుగా భాగవతంలో ఉంది. "ద్వారపాలురు... అడ్డపెట్టిరే నపుడు వారికేమైన పరిదానమిచ్చి చొచ్చెదనన్న ఊహింప నర్థశూన్యుండ" – అని పోతన భాగవతం. అయితే ఈ మధ్య టీవీలో కుచేలుడ్ని కాపలాదారులు తోసివేసినట్లు చూపెట్టారు. ఆ రోజుల్లో కూడా లంచాలు, దౌర్జన్యాలు ఉన్నాయా?**

**జ:** ఈ రెండు ఘట్టాలు మూలభాగవతంలో లేవు. పోతన గారి కాలంలోని ద్వార పాలుర వైఖరిని ఆయన ప్రతిబింబించి ఎత్తి చూపించారు. వ్యాసుని భాగవతంలో ఆ విషయం లేదు. అది శ్రీకృష్ణుని నగరం. ధర్మానికి నివాసం. అందుకే అవమానించడం గానీ, లంచగొండితనం కానీ ఉండవు. లేవు. శ్రీకృష్ణుని కృపా (సంకల్ప) బలం చేత ఏ ఒక్క అవాంతరమూ లేకుండా కుచేలుడు నిరాటంకంగా స్వామి అంతఃపురం లోనికి ప్రవేశించాడు... అని మూలభాగవతంలో (వ్యాసుని రచనలో) స్పష్టంగా ఉంది.



**ప్ర: భాగవతం వ్యాసుడు రచించలేదనీ, అసలు పురాణాల్లో ఇది లేదనీ, అష్టాదశపురాణాల్లో దేవీభాగవతం ఒకటి అనీ... చాలా చోట్ల చదివాను. ఇవి ఎంతవరకు ప్రమాణం?**

**జ:** భాగవతం వ్యాసుని రచనగా సుప్రసిద్ధం. అయితే 18 పురాణాలను, భారతాన్నీ రచించాక దీనిని వ్రాసినట్లు భాగవతం ఆదిలోనే వ్యాసుని మాటగా ఉన్నది. కనుక వ్యాసుడు దీనిని ప్రత్యేకంగా రచించాడని కొందరంటున్నారు.

ఇక విమర్శలంటారా? ఇవి తేలని విషయాలు. గతం ఒక అంతుపట్టని అగాధం. ఎవరి నమ్మకాలు, ఎవరి ప్రమాణాలు వారు చూపెట్టగలరు. వారి వారి యుక్తి చమత్కారాల ననుసరించి వారి ఋజువులు వారు చేస్తారు. ఇవి ఏ ప్రాచీన గ్రంథానికైనా, ఏ కాలానికైనా తప్పనివి. కానీ ఈ వాదాల వల్ల ప్రయోజనం శూన్యం. విలువైన కాలం వృధాకావడం కన్నా మరేమీ లాభం లేదు.

దీనిని వ్యాసుడు రచించాడనీ, మోక్షకారకమైన సాత్త్వికమైన భాగవత ధర్మం ఇందులో ప్రతిపాదించాడనీ ఇంతవరకూ దేశమంతటా అధికసంఖ్యలో విశ్వసిస్తూ, పారాయణ చేస్తూ ఎందరో తరించారు. తరిస్తున్నారు. దానిని ప్రోత్సాహ పరచి, ప్రమాణ బుద్ధితో

అనుసరించి మనమూ తరించడమే కర్తవ్యం. ఎవరు రచించినా – ఆ గ్రంథం వేదాంతతత్త్వ ప్రతిపాదకమై, మధురంగా, హృదయంగమంగా సామాన్యుల్ని సైతం ధర్మ, భక్తి మార్గాలకు ప్రేరేపిస్తున్న మహాసాధన మనడంలో సందేహం లేదు. అందువల్ల– తర్కాలను ఆవలనెట్టి విశ్వాసానికే పీఠం వేయాలి.

**ప్ర: శ్రీమద్రామాయణ, మహాభారతాలు ఏ మన్వంతరంలో జరిగాయి? తక్కిన మన్వంతరాల్లో జరిగిన విశేషాలేమిటి? గ్రంథాల వివరాలు తెలుపగలరు?**

**జ:** పురాణాలు మన్వంతర గాథలను తెలియజేస్తున్నాయి. విష్ణు, మత్స్య– మొదలైన పురాణాలను చూస్తే ఏ మన్వంతరంలో ఏం జరిగాయో కొంతమేరకు తెలుసుకోవచ్చు. పురాణాల ఆధారంగా పరిశీలించితే రామాయణ, భారతాలు ఈ మన్వంతరంలోనే జరిగాయి. అయితే ఈ వైవస్వత మన్వంతరంలో 24వ మహాయుగంలోని (నాలుగు యుగాలు కలిపి ఒక మహాయుగం) త్రేతాయుగంలో రామాయణం జరిగిందనీ, ఇప్పటి 28వ మహాయుగంలోని ద్వాపరంలో–అంటే ఇప్పుడు నడుస్తున్న కలియుగానికి ముందరి(నిన్నటి) ద్వాపరంలో– భారతం జరిగిందనీ పురాణాల లెక్క.

**ప్ర: మరణించినవారి అస్థికల్ని గంగలో కలపడానికి కాశీకి వెళితే, అస్థి నిమజ్జనమయ్యాక విశ్వనాథుని మందిరానికి వెళ్ళవచ్చా?**



**జ:** ఏడాదిలోపల వెళ్ళినట్లయితే, అస్థి నిమజ్జన కర్మానంతరం, స్నానం చేశాక విశ్వనాథుని ఆలయంలో కేవలం దర్శనానికి వెళ్ళవచ్చు. అర్చనా, అభిషేకం వంటివి చేయరాదు.

**ప్ర: వేదపఠనంలో ఘన–క్రమం–జట... అనగానేమి? వివరిస్తారా?**

వేదాలలో ఏ చిన్న పొరపాటు రాకుండా ఉండడానికి మన ప్రాచీనులు ఏర్పరచిన పద్ధతులు ఎన్నో ఉన్నాయి. లిఖిత రూపంలో లేని శ్రుతులను యధాతథంగా, మంత్రోచ్చారణ పొరపాటు రాకుండా పదిలపరచేందుకు ఏర్పరచిన విధానాలు ఇవి. ఆ పద్ధతులే ఈ ఘన, క్రమ, జట... మొదలైనవి.

వాక్య, పద, క్రమ, జట, మాల, శిఖ, రేఖ, ధ్వజ, దండ, రథ, ఘన... అని ముఖ్య పద్ధతులు. వీటి ప్రధాన ప్రయోజనం – ఏమాత్రం పొరపడకుండా వేదాలను పరిరక్షించడమే. మంత్రాలనూ ఒక వాక్యంలా వల్లెవేయడాన్ని 'వాక్యపాఠం' అంటారు. దీనినే 'సంహిత పాఠం' అంటారు. పదాన్ని దేనికదిగా, విడిగా వల్లించడాన్ని 'పదపాఠం' అంటారు. ఈవిధానంలో మొదటి పదాన్ని రెండవదానికీ, రెండవపదాన్ని మూడవ

పదానికి, మూడవ పదాన్ని నాల్గవదానికీ చేర్చుకుంటూ వాక్యం పూర్తయ్యేవరకూ వల్లించడమౌతుంది.

ఇక 'జటాపాఠం' పద్ధతి మొదటి పదాన్నీ, రెండవ పదాన్నీ కలిపి వల్లిస్తాయి. ఆ తరువాత ఆ రెండు పదాలను తిరగవేసి వల్లిస్తారు. తరువాత మళ్ళీ మామూలు వరుసలో చెప్తారు. (1-2-2-1-1-2) శిఖాపాఠంలో ఈ విధంగానే వస్తూ మూడేసి పదాలను కలుపుతారు.

'ఘన' పాఠం వీటన్నికంటే క్లిష్టమైనది. (1-2-2-1-1- 2-33- 2-11-2-3, 2-3-3-2-2-3-4- 4-3- 22-4... ఇలా) అయితే సంహితపాఠంలో అసలైన మంత్రం లభిస్తుంది. కనుక దీన్ని పదపాఠమనీ, ప్రకృతి పాఠమనీ అంటారు. మిగిలినవి వివిధ పద్ధతులలో దానిని క్రమబద్ధంగా విన్యసిస్తూ చెప్పడమే. వీటిని వికృత పాఠాలంటారు. ధారణాశక్తికి ఇవి గొప్ప తార్కాణాలు.

**ప్ర: మనదేశం ఆధ్యాత్మికతకీ, వైరాగ్యానికీ ప్రాధాన్యాన్నీయడం చేత ఆర్థికాభివృద్ధినీ, భౌతిక అభ్యున్నతినీ సాధించలేకపోయిం(తోం)దని కొందరి విమర్శ. ఏంటి సమాధానం?**



**జ:** ఇది పూర్తిగా తప్పుడు అభిప్రాయం. చారిత్రకంగా గమనించినా, పురాణేతిహాసాలను పరిశీలించినా ఈ దేశం భౌతిక, పారమార్థిక ప్రయోజనాలను సమన్వయం చేసిన దిగా కనిపిస్తుంది. ఎంతో ఆర్థిక సంపద, వైభవం కలిగిన ఈ దేశంపై విదేశీ యుల దాడి, దోపిడీ కారణాలుగా దారిద్ర్యం వచ్చిపడింది. క్రమంగా ఆధ్యాత్మికతకు, ధర్మానికి ప్రాధాన్యాన్ని ఇవ్వకుండా, భౌతిక సంపదల కోసం పరితపించే పాశ్చాత్య ధోరణి కారణంగా వ్యక్తిస్వార్థం చెలరేగి లంచగొండితనం, అన్యాయార్జన పెరిగి దేశదారిద్ర్యం పెరుగుతోంది. స్వప్రయోజనాల సాధింపు కోసం దేశప్రయోజనాలను నాశనం చేయడానికి వెనుదీయని నాయకుల స్వార్థం, కుట్రలు... వీటికి తోడు ప్రజల అలసత, ఉదాసీనత దోహదపడి అభ్యున్నతి దెబ్బతింది. మరియొకవైపు చూస్తే అనేక రంగాలలో భారతాభివృద్ధి ప్రత్యక్షంగా కనిపిస్తోంది. కానీ- రాజకీయ సమాచారాన్నే సమస్తంగా భావిస్తూ, అక్రమ దుర్మార్గ ఘటనలే సంచలన వార్తలుగా ఆకర్షణీయంగా ప్రచురించే ధోరణికి అలవాటుపడ్డ మీడియా (మాధ్యమిక) రంగంకూడా మన అభివృద్ధిని తెలియనివ్వడంలేదు.

ధర్మం ప్రవృత్తి, నివృత్తి మార్గాలుగా రెండు విధాలు. రెండింటిలో ఏదో ఒక్కటే

గొప్పది–అని మన శాస్త్రాలు చెప్పవు. ప్రవృత్తి మార్గంలోని వారు ధనసంపాదన, వినియోగం వంటి వాటిలో అప్రమత్తంగా ఉండాలి. ధర్మం ప్రాతిపదికన ఎంత సంపాదించినా అది దోషంకాదు. స్వధర్మానికి దెబ్బ తగలకుండా అర్థ, కామ సంపాదనను ధర్మబద్ధంగా సాగించేవాడే నిజమైన మనిషి.

నివృత్తి మార్గంలోని వారి వైరాగ్యాన్ని మనం అనుసరించరాదు. మానసికంగా వైరాగ్యాన్ని బోధించినా, భావిస్తున్నా భౌతికంగా ధర్మాన్నీ, ధర్మ బుద్ధినీ మరువరాదు. కుటుంబంలో, సమాజంలో బ్రతికేవాడు కుటుంబంపట్ల, సమాజంపట్ల బాధ్యతగా ప్రవర్తించాలి. ధర్మంలో తనని తాను నియంత్రించుకుంటూ, దేశ ఆర్థికాభివృద్ధికి కృషిచేయడమే భారతీయాదర్శం. రాజసూయాదుల్ని నిర్వర్తించి ధనసమీకరణ చేసిన ధర్మరాజు, ధర్మ ప్రాధాన్యం చేత వాటిని వదలి, తిరిగి స్వధర్మబద్ధమైన యుద్ధవిధానం వల్ల పోయిన సంపదని సాధించాడు. లేనిపోని వైరాగ్యంవల్ల కర్తవ్యం మరచిన అర్జునునికి ఈ దేశపు ఆధ్యాత్మికౌన్నత్యమే ఓదార్పునీ, ప్రబోధాన్నీ అందించాయి.

అంగళ్లలో రత్నాలను రాశులుగా పోసి, 'అర్థ', 'కామ' శాస్త్రాలను ఏర్పరచి, ఆరోగ్యవంతమైన ధార్మిక పరిధుల్లో ప్రవృత్తి మార్గగామి పురోగమించగలడని ప్రబోధించిన ఆధ్యాత్మిక సంస్కృతి మనది. విద్యకీ, ధనానికీ అన్నిటికీ ప్రాచీన కాలంలో సమాజం సమప్రాధాన్యాన్నిచ్చింది. క్రమంగా భారతదేశం స్వాభి మానాన్ని కోల్పోయి, అనుకరణాన్నే అభ్యుదయంగా భావించడంచేత అభ్యున్నతిని చాటలేక పోతోందనిపిస్తోంది.

మనకి జ్ఞానపూర్వకవైరాగ్యం కలిగితే మన వ్యక్తిగత భోగాలను త్యజించాలిగానీ గృహానికీ, దేశానికీ వైభోగంగా వైభవాలుండేలా జాగ్రత్త పడాలి. నివృత్తి మార్గంలోని వానికి ధనాన్ని నిల్వచేయడం దోషం. ప్రవృత్తి మార్గగామికి ధనాన్ని దాచకపోతే దోషం. అధర్మం చేయకుండా నిగ్రహించే ఆధ్యాత్మిక, వైరాగ్యధోరణి ప్రవృత్తి మార్గంలో అవసరం. దానినే బోధించింది భారతదేశం.

**ప్ర: నేను ప్రతిశుక్రవారం, శనివారం లలితా, విష్ణు సహస్ర నామాలను పారాయణ చేస్తున్నాను. ఇవి పారాయణ చేసేటప్పుడు గానీ, చేసే రోజున గానీ పాటించవలసిన నియమాలను తెలుపగలరు.**

**జ:** వారి వారి శక్త్యనుసారం నియమాలను పాటించవచ్చు. ఆ రోజున తామసా హారాన్ని (ఉల్లి, వెల్లుల్లి వంటివి) విసర్జించాలి. అన్నం తిన్నవెంటనే పారాయణ చేయకపోవడం

మంచిది. ధూపదీపాలర్పించాక ఏ పండో, పాలో నివేదించి, హారతి నిచ్చి, పారాయణా నంతరం వీలైతే ఒక కొబ్బరికాయను కొట్టి హారతినిచ్చి భగవదర్పణం చేయాలి. ప్రధానంగా ఈ నియమాలను పాటిస్తే చాలు.

**ప్ర: 'భక్తి' అనేది పురాణ కాలంలో వచ్చినదనీ, వేదాలలో 'భక్తి తత్త్వం' గురించి లేదనీ అంటారు కొందరు. కాస్త వివరణ ఇస్తారా?**

**జ:** వేదకాలమనీ, పురాణ కాలమనీ విభజించి చూసే దృష్టే సరియైనది కాదు. వేదాలలో లేనిది పురాణాల్లో చెప్పరు. **'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్'** – వేదమే ఇతిహాస పురాణాల్లో విస్తృతంగా చెప్పబడుతుంది.

వేదంలో – **"దేవ సంస్థాన సహసాపోషస్యేశిషే**
**తస్యనో రాస్వ తస్య నో ధేహి**
**తస్య తే భక్తివాంసః స్యామ॥** ***(అథర్వ సంహిత)***

'ఓ అభ్యుదయదాయీ! నువ్వు ఆధ్యాత్మికాది అసంఖ్య శాశ్వత పుష్టులకు స్వామివి. వాటిని మాకు ప్రసాదించి, మాయందు స్థాపించు... ఆ మహా పుష్టిపతి అయిన పరమేశ్వరునిపై భక్తియోగాన్ని అవలంబించి, ఆ పావన భక్తి ద్వారా అభీష్ట పుష్టులను సంపాదిస్తాం."



**"యస్యతే స్వాదు సఖ్యం స్వాద్వీ ప్రణీతిః" – ఋగ్వేదం**

'పరమాత్మతో కమ్మని సఖ్యం, అనన్య భక్తి' – ఈ మంత్రంలో ప్రస్తావించబడింది.

**'తమస్మాకం తవస్మసి' ॥** (ఋగ్వేదం)

'నీవు మా వాడవు. మేము నీ వారము.'– ఇలా ఎన్నో వేద వాక్యాలు భక్తి తత్త్వాన్ని తెలియజేసేవి ఉన్నాయి.

**ప్ర: ఈమధ్య ఒక స్వామివారు ప్రసంగిస్తూ 'ఆదిశంకరులు కేవలం ముప్ఫయి రెండేళ్ళున్నారు, కనుకనే కొంతమేరకే సత్యాన్ని చెప్పగలిగారు. కానీ మన ఆచార్యులు నూట ఇరవైఏళ్ళు బ్రతికారు కనుక సంపూర్ణంగా సత్యాన్ని చాటారు" అన్నారు. దానితో మనస్సు గాయపడింది. అసలు ఆ మాటలు ఎంతవరకు సమంజసం?**

**జ:** దీని సమాధానానికి పెద్ద తర్కం అవసరంలేదు. కాసింత ఇంగిత జ్ఞానం చాలు. వయస్సులు, ఆయుష్షులు సత్యాన్ని నిర్ణయించలేవు. తపస్సులే సత్యప్రతిపాదన చేయగలవు.

ప్రహ్లాదుని వయస్సు, హిరణ్యకశిపుని వయస్సు పరిశీలించండి. ఎక్కువ ఆయువు,

వయస్సు ఉన్న హిరణ్యకశిపుని నాస్తికత్వం సత్యమా? అయిదేళ్ళ ప్రహ్లాదుని ఆస్తికత్వం సత్యమా? సనకాదులు, ధ్రువుడు, మార్కండేయుడు, ఉపమన్యువు... వీళ్ళందరి వయస్సులెంత? 'నఖలు వయస్తేజసాం హేతుః' – తేజస్సుకి వయస్సు హేతువు కాదు – అని భర్తృహరి సుభాషితం కూడా ఆ స్వామివారు చదువుకోలేదా?

ఎనిమిదేళ్ళ ప్రాయానికే వేదవేదాంగాల నధ్యయనం చేసిన అవతారమూర్తి ఆది శంకరులు. సిద్ధపురుషులు. నేడు విశ్వమంతా అంగీకరించిన తత్త్వాన్ని అందించిన జగద్గురువు. విజ్ఞానశాస్త్రం, వివేకం – ఈ రెండూ చేసే విచారణకి నిలబడగలిగే పరిపూర్ణ సత్యాన్ని ఆవిష్కరించి, సర్వధర్మ సమన్వయం ద్వారా సంస్కృతిని పటిష్ట పరచిన ఏకైక మహాత్ముడు. ఆ కారణజన్ముని సత్యప్రతిపాదనను సుప్రతిష్ఠితం చేసిన విద్యారణ్యస్వామి, చంద్రశేఖరేన్ద్ర సరస్వతీస్వామి దీర్ఘాయుష్మంతులు మనకు బాసటగా నిలుస్తారు.

అయితే ఆ స్వామివారు చెప్పిన ఆచార్యులు కూడా సామాన్యులు కారు. వారూ కారణజన్ములు. మహాత్ములు. సత్య ప్రాప్తికి వీరు మరో దర్శనాన్ని అనుగ్రహించారు. సాధకులకు అది ఆమోదమే. తత్పూర్వమే శంకరులు దానిని ఆమోదించారు. ఆదిశంకరులు అన్నిటినీ స్వీకరించి సమన్వయపరచి అంతిమ లక్ష్యాన్ని స్పష్టపరచిన లోకశంకరులు. ఒకరి గొప్పతనాన్ని చెప్పడానికి ఇంకొకరిని కించపరచవలసిన అగత్యం లేదు. నిజంగా తమ సిద్ధాంతంలో బలముంటే ఎవరినీ కించపరచకుండానే ప్రతిపాదించవచ్చు. వయస్సుల్నీ, ఆయుష్షుల్నీ సత్యప్రతిపాదనకు ప్రాతిపదికగా తీసుకొనే వారి తెలివి ఏపాటిదో, కాస్త ఆలోచిస్తే మనకే అర్థమౌతుంది. అది హాస్యాస్పదం– పేలవమైన సమర్థన.

భారతీయ ధర్మానికి పట్టుకొమ్మలైన ఆచార్యులను సిద్ధాంతాల రాద్ధాంతాలతో అవ మానపరచడం ధర్మగ్లానికి హేతువౌతుంది. వాటిని గ్రహించవద్దు, గాయ పరచవద్దు, ఆదరించవద్దు. అదే మన కర్తవ్యం.

**ప్ర: 'మహన్యాసం' అనే మాటకి అర్థం ఏమిటి? అది చేసి రుద్రాభిషేకం చేయాలంటారు. దానిని ఏర్పరచిన వారెవరు?**

**జ:** 'న్యాసం' అనే మాటకు 'ఉంచుట', 'ప్రతీకగా ఎంచుట' – అని అర్థాలు. మనలో ఉన్న ఈశ్వర చైతన్యాన్ని గుర్తించాలి. 'నారుద్రో రుద్రమర్చయేత్' – రుద్రుడు కానివాడు రుద్రుని అర్చించరాదు. వైదిక మంత్రాలతో ప్రతి అవయవాన్నీ శుద్ధం చేసుకుంటాం.

నిప్పు నావరించిన నివురుని ఊదినట్లుగా, మంత్రంతో దేహాదులలోని సూక్ష్మమాలిన్యాన్ని (పాప దోషాలను) వదలించుకొని, అంతర్గతమైన ఈశ్వర చైతన్యాన్ని జాగృతపరచడం ఆ ప్రక్రియలోని పరమార్థం.

మంత్రం ద్వారా భగవత్‌శక్తిని మనలో ప్రతిష్ఠించుకోవడం, 'ఉంచుట' అనే అర్థం. తద్వారా – మనమే ఈశ్వరమయంగా మారి, తాదాత్మ్య స్థితిని పొందుతాం. అదే 'ప్రతీకగా ఎంచుట' అనే అర్థాన్ని చెబుతుంది. ఈ రెండు భావాలను స్వీకరించాలి. మంత్రాన్ని జపించినా, అర్చన చేసినా ఆ భగవత్‌శక్తితో తాదాత్మ్యం చెందాలనేది తాత్పర్యం. ఈ విధానంచేత శరీర శుద్ధి, మనశ్శుద్ధి, పరిసరాలశుద్ధి ఏర్పడుతుంది. అప్పుడు అర్చనకు అర్హులమౌతాం.

ఈ ప్రక్రియను అనేకమంది ఋషులు వేదాధారంగా ఏర్పరచారు. కల్పసూత్రాలను ఏర్పరచిన బోధాయనుడు వివరించిన ప్రకారంగా ఇప్పుడు మహన్యాసాన్ని మనం నిర్వహిస్తున్నాం.

ప్ర: **భోజనం చేసేటప్పుడు ఏ దిక్కున తిరిగి భుజించాలి?**

10 జ: తూర్పు ముఖంగాగానీ, పశ్చిమముఖంగాగానీ భోజనం చేయాలి. పితృకార్యాలలో ఉత్తరముఖంగా కూర్చొని భుజించాలి. దక్షిణముఖంగా ఎప్పుడూ భుజించరాదు.

**ప్రాక్ ముఖస్తు సమశ్నీయాత్ ప్రతీచ్యాం వా యధాసుఖం।**
**ఉత్తరే పితృకాలేషు, దక్షిణే నకదాచన॥** –అని ధర్మశాస్త్రవచనం.

ప్ర: **"మనిషి దేవుడ్ని మనిషి ఆకారంలో ఊహించి ధ్యానిస్తాడు. జంతువులు ధ్యానించ వలసివస్తే జంతువుగా ధ్యానిస్తాయి" అని ఒక గొప్ప తత్త్వవేత్తగారే చెప్పారు. అంటే దేవుని ఆకారాలు మన కల్పితాలేనా?**

జ: ఆ తత్త్వవేత్తగారు కూడా విగ్రహారాధనను సమర్థిస్తూ లౌకికంగా చెప్పారు. దానిని కాదనక్కర్లేదు కానీ – దేవతాకారాలు ఋషుల ధ్యానంలో తపస్సులో దర్శనమిచ్చినవి. ప్రతి ఆకారంలోనూ ఒక శక్తి, తత్త్వం వ్యక్తమౌతాయి. పైగా మన దేవతా విజ్ఞానంలో వరాహ, సింహ, వానరాది ముఖా లున్న దేవతాకారాలున్నాయి. కూర్మం, మత్స్యం, గోవు, వృషభం, గరుడ, శరభాది జంతు, పక్షి రూపాలున్నాయి. దేవతా విభూతులలోని శక్తి విశేషాలే ప్రకృతిలో నిక్షిప్త మౌతాయి. భగవద్విభూతుల్ని నదుల్లోను, వృక్షాల్లోను కూడా దర్శించి ఆరాధించే సంస్కృతి మనది.

వీటిని గమనిస్తే దేవతాకారాలు మన కల్పనలు కావని తెలుస్తుంది. ఋషులు

దర్శించి వర్ణించిన దేవతాకృతులనే మనం ధ్యానించి ఆరాధించుకుంటున్నాం.

**ప్ర: ఖడ్గమాలాస్తోత్రానికి ఆ పేరు ఎందుకు వచ్చింది? మరి 'అస్య శ్రీ శుద్ధ శక్తిమాలా మంత్రస్య' అని ఎందుకన్నారు? ఖడ్గమాలలోని ఆ పేర్లన్నీ ఎవరివి?**

**జ:** ఖడ్గమాల శ్రీవిద్యకు చెందినది. తొలుత లలితా త్రిపురసుందరి నామం చెప్పబడి, అటుపై న్యాసాంగ దేవతలు, తిథినిత్యా దేవతలు, దివ్యౌఘ సిద్ధౌఘ మానవౌఘ గురు మండల నామాలు; ఆ తరువాత క్రమంగా శ్రీచక్ర నవావరణ దేవతల నామాలు, నవచక్రేశ్వరీ నామాలు; చివరగా దేవీ విశేషణాలు చెప్పబడ్డాయి.

ఒకే అక్షరం గల మంత్రాలు 'పిండ' మంత్రాలనీ, రెండక్షరాలు కలవి 'కర్తరి' అనీ, మూడు నుండి తొమ్మిది అక్షరాలు కలవి 'విధి బీజముల'నీ, 10 నుండి 20 అక్షరాల వరకు కలవి మంత్రములనీ, 21 నుండి ఎన్ని అక్షరాలున్నా మాలామంత్రములనీ వ్యవహరింపబడుతాయి. ఆ కారణం చేతనే ఇది మాలా మంత్రం!

15 అక్షరాల పంచదశీ (శ్రీ) విద్యను ఆధారం చేసుకుని 15 విధాల మాలా మంత్రాలు ఏర్పడ్డాయి. అవి : శుద్ధ శక్తిమాల, నమోంత శక్తిమాల, స్వాహాంత శక్తిమాల, తర్పణాంత శక్తిమాల, జయాంత శక్తిమాల, శుద్ధ శివ సంబుద్ధ్యంతమాల, నమోంత శివమాల, స్వాహాంత శివమాల, తర్పణాంత శివమాల, జయాంత శివమాల, శుద్ధమిథున మాల, నమోంత మిథునమాల, స్వాహాంత మిథునమాల, తర్పణాంత మిథునమాల, జయాంత మిథునమాల.

ఇందులో ప్రసిద్ధంగా లభిస్తున్నది 'శుద్ధ శక్తిమాల'. దీనిని 'ప్రకృతిమాల' అని కూడా అంటారు. ఈ మాలా మంత్రాలను వివిధ ప్రక్రియలతో ఉపాసించి కొన్ని సిద్ధులను పొందవచ్చు. పై చెప్పిన 15 విధాల మాలామంత్రాలకు 15 సిద్ధులున్నాయి. అందులో మొదటిది 'ఖడ్గసిద్ధి'. తరువాత చెప్పబడిన పదునాలుగు : పాదుకాయుగ్మ సిద్ధి, అంజన సిద్ధి, బిల సిద్ధి, వాక్సిద్ధి, దేహ సిద్ధి, లోహ సిద్ధి, అణిమాద్యష్ట సిద్ధి, వశీ కరణ సిద్ధి, ఆకర్షణ సిద్ధి, సమ్మోహన సిద్ధి, స్తంభన సిద్ధి, చతుర్వర్గ సిద్ధి, ఐహికాముష్మిక సిద్ధి, భోగ మోక్ష సిద్ధి.

ఒక్కొక్క సిద్ధి కోసం ఈ మాలా మంత్రాలను వివిధ (15) విధాల వినియోగిస్తారు. 'ఖడ్గాది' 15 సిద్ధుల నిచ్చే మాలా మంత్రము కనుక ఇది 'ఖడ్గమాల' అని లోకంలో ప్రసిద్ధి పొందింది.

**'తాదృశం ఖడ్గమాప్నోతి యేన హస్త స్థితేనవై।**

**అష్టాదశ మహాద్వీప సమ్రాడ్భుక్తా (సమ్రాడ్భోక్తా) భవిష్యతి॥'** – అని ప్రస్తుత లభ్య గ్రంథాలలో ఉంది.

కానీ ఈ శుద్ధశక్తిమాలను 14వ దైన ఐహికాముష్మిక సిద్ధి కోసం వినియోగించడమే మంచిదని విజ్ఞుల అభి ప్రాయం. దానికి సంబంధించిన శ్లోకం :

**అలౌకికం లౌకికం చేత్యానంద ద్వితయం సదా।**

**సులభం పరమేశాని త్వత్పాదౌ భజతాం నృణామ్।**

శుద్ధశక్తిమాలను నిష్కామంతో జపించితే సర్వ (15) సిద్ధులూ లభిస్తాయని శాస్త్ర వచనం. సర్వసిద్ధులలో మొదటిది 'ఖడ్గసిద్ధి' కనుక – దానిని మొదలుకొని మిగిలిన సిద్ధులను ఇచ్చే శుద్ధశక్తి మాలామంత్రాన్ని 'ఖడ్గమాల'గా వ్యవహరిస్తున్నాం.

ప్ర: **నమస్కారంలోని ఆంతర్యం, అర్థం తెలుపగోరిక.**

జ: వేదంలో అయిదు ప్రణవాలను చెప్పారు. అవి : ఓంకారం, స్వాహాకారం, స్వధాకారం, వషట్కారం, నమస్కారం. 'నమః' అనే శబ్దం దేవతకు మన సమర్పణను తెలియజేస్తుంది. ఇది దేవతను ఆహ్వానించే శబ్దం కూడా, నమస్కారాన్ని మినహాయించి మిగిలిన నాలుగింటికీ వివిధ సందర్భాలు, నియమాలు ఉన్నాయి. నమస్కారం అలాంటి నిబంధన లేవీ లేని ప్రణవం.

ఒక గొప్ప వస్తువులోని గొప్పతనాన్ని గుర్తించి తలవంచడమే 'నమ్ర'భావం. దేవత యొక్క మహిమను తెలుసుకొని, నమ్రులమయ్యామనే భావనే 'నమస్కారం'లోని ఆంతర్యం.

మరియొక అర్థంలో – 'మనః' శబ్దమే 'నమః' అయింది. దీనిని 'వర్ణవిపర్యయ న్యాయం' అంటారు. మనస్సును భగవంతునికి సమర్పించడమే నమస్కారంలోని ఆంతర్యం. మనస్సమర్పణ అంటేనే అహంకార త్యాగం. కనుక అహంకారాన్ని భగవదర్పణం చేయడమే దీనిలోని అంతరార్థం.

క్రమంగా ఈ భావన అహాన్ని బ్రహ్మముతో లీనం చేసే కైవల్య సిద్ధికి హేతువౌతుంది. కనుకనే ఈ నమస్కారానికి అంత ప్రాధాన్యం.

ప్ర: **రామాయణం సుందరకాండలో హనుమంతునికి మైనాకునిపై సేదతీరమని చెప్పిన సముద్రుడు, తరువాత యుద్ధకాండలో రామునికి మూడు రోజుల దర్భశయనం తరువాత, రామబాణానికి భయపడి మాత్రమే త్రోవ యిచ్చాడు. ఎందుకని?**

జ: సముద్రుడు సైతం పరమాత్ముడైన శ్రీరామునికి దాసుడే. అందుకే రామకార్యార్థియై

వెళుతున్న హనుమకు విశ్రాంతిగా ఆతిథ్యాన్నిమ్మని మైనాకునితో చెప్పాడు. అయితే శ్రీరామునికి కొన్నినాళ్ళ తరువాత త్రోవ యివ్వడంలో ఆంతర్యం ఉంది.

ఎక్కుపెట్టిన రామబాణం ద్వారా, అక్కడికి సమీపంలో ద్రుమకుల్యల ప్రాంతంలో సముద్రుని క్షోభ పెడుతున్న రాక్షసుల్ని సంహరింపజేయాలని సముద్రుని ఉద్దేశం. అందుకే బాణమెక్కుపెట్టే వరకు నిరీక్షించాడు. తరువాత రాముని ప్రార్థించి, ద్రుమకుల్యల వద్ద దనుజుల్ని వధించమని ప్రార్థించాడు. రాముడు ఆతని ప్రార్థనను మన్నించాడు. ఇది ప్రధాన కారణం.

అయితే దీనిలో మరియొక ఆంతర్యం. ప్రకృతి శక్తులను అనుకూలపరచడానికి సనాతన ధర్మంలో అనేక దీక్షా విధానాలు చెప్పబడ్డాయి. ముందుగా ఆ దీక్షలను చేపట్టి ప్రకృతి శక్తులకు అధిష్ఠానమైన దేవతలను ఉపాసించి, ప్రసన్నం చేసుకోవాలి. అప్పుడు ప్రకృతి అనుకూలమవుతుంది. ఈ ధర్మం మనకు బోధించడానికై, తాను దర్భశయన దీక్ష ద్వారా ఆచరించి బోధించాడు రామచన్ద్రమూర్తి.

**ప్ర: రాముడు అరణ్యవాసానికి వెళ్ళినప్పుడు, కౌసల్యను 'రాముడు అవతారపురుషుడనీ, ఏమాత్రం బాధపడవద్దనీ సుమిత్ర ఓదార్చుతుంది. మరీ ఈ విషయం కన్నతల్లి కౌసల్యకు తెలియదా?**

జ: **రామః పిత్రోః పుత్రభావం రావణాయ మనుష్యతాం।**
**ఋషీణాం భగవద్భావం దర్శయన్ విచచారహ॥**

"రాముడు తల్లిదండ్రులకు పుత్రుని వలె, రావణునకు సామాన్య మానవుని వలె, ఋషులకు తన అసలు స్వరూపమైన భగవంతునిగా గోచరించి విహరించాడు" – అని భరద్వాజ రామాయణ వచనం. కౌసల్యాదశరథుల దృష్టిలో రాముడు తమ పుత్రుడు. ఆ భావంతోనే తరించే పుణ్యఫలం వారిది. నందయశోదలు శ్రీకృష్ణుని తమ పుత్రునిగానే భావించి తరించారు. తత్కాలంగా విశ్వరూపాన్ని చూపినా, వెంటనే యోగమాయా ప్రభావంతో పసివాని వలె భ్రమింప జేశాడు. ఆ మాయనే రామావతారంలో కూడా ప్రదర్శించి తన అవతార కార్యాన్ని నెరవేర్చుకున్నాడు. ఆ కారణం చేతనే కన్నతల్లి కౌసల్యకు రాముడు అవతార పురుషుడనే గ్రహింపు లేదు.

రామాయణాన్ని అనుసరించి – సుమిత్ర తత్త్వజ్ఞురాలు. వాల్మీకంలో సుమిత్ర పాత్ర అంతగా కానరాకున్నా, కౌసల్యతో ఆమె పలికిన మాటల ననుసరించి రామతత్త్వం తెలిసినదిగా స్పష్టమౌతోంది. కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం ప్రకారం సుమిత్ర

ఉపాసనా ధర్మానికి ప్రతీక. అందుకే కైంకర్య స్వభావుడైన లక్ష్మణుడు ఆమెకు జన్మించాడు.

**ప్ర: భగవంతుని ధ్యానం చేసేటప్పుడు శుచిగా ఉండాలంటారు. నేను చాలాకాలం నుండి నడకలో భగవద్ధ్యానం చేస్తున్నాను. ఆచమనం, సంకల్పం లేకుండా కేవలం భగవద్ధ్యానం చేస్తే ఫలితం ఉండదా? పూజ దేవుడు ఎదురుగుండానే చెయ్యాలా?**

**జ:** ధ్యానం శుచిగా చేయడం శ్రేష్ఠం. దానికి ఆసనం, ప్రాణాయామం సమకూరాలి. అటు తరువాతనే ధ్యానం. అయితే నడకలో చేసే దానిని 'స్మరణ' అంటారు. అది శ్రేష్ఠమైన విషయం. భగవత్ స్మరణ సర్వపాపహరం – సర్వాభీష్ట ఫలప్రదం. అది నిరభ్యంతరంగా నడకలో చేయవచ్చు. మీరు చాలా కాలం నుండి చేస్తున్న భగవత్ స్మరణ మంచిదే.

ధ్యానానికిగానీ, స్మరణకిగానీ ఆచమనం, సంకల్పం అవసరం లేదు. అవి లేకుండానే ధ్యానస్మరణలు చేయవచ్చు. వాటికి తప్పక ఫలితముంటుంది.

పూజ అనేది బాహ్యం, మానసికం అని రెండు విధాలు. మానసిక పూజకి దేవుడు ఎదురుగా ఉండనక్కర్లేదు. ఈ మానసిక పూజని కొంతమేరకు 'ధ్యానం' అని నిర్వచించవచ్చు. బాహ్య పూజకు ఎదురుగా దేవుని బింబం (పటంగానీ, విగ్రహంగానీ) ఎలాగూ అవసరమే కదా! ఆ పూజకు ఆచమనం, సంకల్పం వగైరాలు అవసరమే. బాహ్యపూజ వలన శరీర, మనశ్శుద్ధులు ఏర్పడి మానసికమైన భావన, స్మరణ, ధ్యానం వంటివి శీఘ్రంగా సిద్ధించే అవకాశం కలుగుతుంది.

**ప్ర: కాంచీక్షేత్రంలో కామకోటి పీఠాన్ని ఆదిశంకరులు స్థాపించారంటారు కదా! మరి లలితా సహస్రనామాలలో 'త్రికూటా కామకోటికా' అనే నామం ఉంది. అంటే లలితా నామాలు శంకరుల తరువాత రచించినవా? లేదా – కామకోటి పీఠం ముందే ఉన్నదా?**

**జ:** అష్టాదశ శక్తిపీఠాలలో ఒకటి కామకోటిపీఠం. అది అనాది శక్తి క్షేత్రం. ఇదే కాంచీపురి. మోక్ష పట్టణాలలో ఒకటి. ఇక్కడి తల్లి కామాక్షి. శంకరులకు పూర్వమే ఈ శక్తిపీఠం ఉన్నది.

అయితే ఆదిశంకరులకు అత్యంత ఆరాధ్యమైన ముఖ్య శక్తి క్షేత్రమిది. కామాక్షిదేవి వద్ద శ్రీచక్రాన్ని ప్రతిష్ఠించి, కాంచీక్షేత్రంలో వసించినట్లు చరిత్ర ఉంది. అందుకే ఇక్కడ శంకర పీఠానికి కూడా 'కామకోటి పీఠం' అనే నామం ప్రసిద్ధమయింది.

శంకర పరంపరకు చెందిన సత్సంప్రదా యాన్ని అనుసరించి, ఈ శంకరపీఠంవారే అమ్మవారికి అన్ని ఉపచారాలను నిర్వహిస్తున్నారు. ఈ శంకరపీఠానికి 'సర్వజ్ఞపీఠం' అనే పేరుంది.

ఆదిశంకరులవారికి పూర్వమే వ్యాసప్రోక్తంగా 'లలితా సహస్ర నామస్తోత్రం' ప్రసిద్ధి వహించింది. ఇవి సాక్షాత్తు వశిన్యాది వాగ్దేవతలు రచించినవి. వీటిని వ్యాఖ్యా ప్రాయంగా తన సౌందర్య లహరిలో వర్ణించారు శంకరులు. అనేక శ్లోకాలు లలితా సహస్రనామాలకు విస్తృతి.

ప్ర: **మత మార్పిడుల గురించి కొందరు మన హిందువులే అంటారు కదా – "మన మత ప్రకారం మనం ఏ దేవుడినైనా ఏ రూపంలోనైనా పూజింపవచ్చును గదా. అటువంటప్పుడు కొందరు ఏసుప్రభువునో అల్లానో పూజిస్తే తప్పేంటి? హిందువులు మతం మారి ఏసును పూజిస్తే అంత గగ్గోలు పెడతారెందుకు? హిందూమతం ఆ స్వేచ్ఛ నిచ్చిందికదా!"–మరి అలాంటి వారికి మన సమాధానం ఏమిటి?**

ప్ర: **మత మార్పిడివల్ల మతానికేకాక, దేశానికేమైనా ప్రమాదముందా?**

ప్ర: **ఈమధ్య ప్రముఖ దిన పత్రికల్లో "యేసు గురించి వేదాలలో ఉందనీ, భవిష్య పురాణంలో చెప్పారనీ, కనుక క్రైస్తవం భారతీయమేననీ, భారతీయులకు పరాయి మతం కాద"ని ప్రకటనలిచ్చారు. అది కూడా హిందువుల పర్వదినాలైన దసరా, దీపావళి రోజుల్లో. ఇది ఎంతవరకు సమంజసం?**



**జ:** పై మూడు ప్రశ్నలకు సమాధానం.....

ఇటువంటి ఉత్తరాలు పుంఖానుపుంఖాలుగా మాకు వస్తున్నాయి.

మన మత ప్రకారం ఆరాధనా స్వేచ్ఛ ఉంది. దేవతలను ఆరాధిస్తాం. గురువును గౌరవిస్తాం. సిద్ధపురుషులను సేవిస్తాం. అయితే ఇవన్నీ కూడా మతం మారకుండానే మనం చేస్తాం. మన పరంపరాగతమైన దేవతలను వదలకుండానే, మన పండుగలను మానకుండానే, మన స్వాభావికమైన కట్టుబొట్టును వీడకుండానే వీటిని సాగిస్తాం. పైగా మనం ఆరాధించే ఏ రూపమైనా, దేవుడైనా ఈ దేశపు సనాతన ధర్మ భావనలో జనించినదే. అంతేగానీ – మన బొట్లని మార్చి, సంప్రదాయాలు వదలి దేనినీ ఆరాధించం. అందుచేతనే ఆ స్వేచ్ఛవల్ల మూల ధర్మానికి ప్రమాదం లేదు. ఇదే ఏసువంటి విదేశీ మతాల వైపు వెళ్ళేవారు వారి పరంపరను, కులదేవతలను, ఇంటి దేవతలను, సంప్రదాయ వ్రత పూజాదులను, కట్టూబొట్టును వదులుతున్నారు. దానికీ

మన మతానికీ ఆచార విధానాలలో పొసగదు. ఎడారి భూములలోని వారిని సంస్కరించడానికి పుట్టిన కొద్దిపాటి నీతివాక్యాల, పరలోకభయాల మత విధానాలు వేరు. పుణ్య నదీతీరాలలో, పర్వతగుహల్లో అసంఖ్యాక మహర్షుల తపోదీక్ష వలన లభించిన మన ధార్మిక సంస్కార విజ్ఞానానికి అవి అతకవు. అవి ఆ మతంలో పుట్టిన వారికి అను సరణీయాలే. వారిని విమర్శించవలసిన పనిలేదు. కానీ మనవారు అటు మళ్ళితే మూలాలతో బంధం తెగినవారవుతారు.

మన ధర్మంలో స్వేచ్ఛాపూర్వకమైన పలు విధానాలు, పలు ఆరాధనలు ఒకే వేదవృక్షానికి ప్రభవించిన శాఖలు. ప్రతి చక్కని స్వేచ్ఛకీ సవ్యమైన నియమా లుంటాయి. ఈ దేశంలో ఈ మతంలో ఎవరు ఏ విధానాన్ని అనుసరించినా ప్రధాన నియమాలు ఒక్కటే.

మత మార్పిడి వల్ల తాము మారిన మతపు మూలాలను పై దేశాలలోనే స్మరిస్తారు. విదేశాలే వారికి మూలక్షేత్రాలవుతాయి. క్రమంగా వాటిపై మమకారం పెరిగి స్వదే శీయ మూలాలతో బంధం తెగుతుంది. "ఇది నా జన్మభూమి, దీని సంస్కృతికి నేను వారసుడ్ని" అనే ముఖ్యమైన పౌరభావం దెబ్బతింటుంది. అటువంటివారు దేశద్రోహానికి ఒడిగట్టినా ఆశ్చర్యపోనక్కర్లేదు. ఈ దేశంపై ప్రమాదం తలపెట్టిన అతి క్రూరుల్ని, కేవలం తమ మతానికి చెందినవాడు కనుక వదిలి వేయాలని ఒత్తిడులు తెస్తున్న వారిని చూసైనా మనం తెలుసుకోవాలి.



అంతేకాదు – క్రమంగా ఈ దేశసంస్కృతి దెబ్బ తింటుంది. గుమ్మాలకు పసుపు కుంకాలు, మామిడి తోరణాలు, నమస్కారం, దీపం...ఇవన్నీ హిందూ ధర్మాలగానే కాక, ఈ దేశ సంస్కృతిగా కూడా అనుసరించబడుతున్నాయి. కానీ క్రమంగా ఈ మార్పిడులు ముదిరితే ఈ దేశ సంప్రదాయలన్నిటినీ మత దృష్టితో చూసి వదిలి వేస్తారు. ఫలితంగా అసలైన భారత దేశపు ఆనవాళ్లు మిగలవు. క్రమేపీ వారి మత జన్మస్థానాలైన విదేశాలవారు పాలించితే బాగుంటుందనే భావంలోకి కూడా వెళ్లవచ్చు. దేశము – దాని సంస్కృతి వేరుకావు. అందునా హిందూ మతానికి జన్మభూమి, వృద్ధిభూమి కూడా భారతదేశమేనని మరచిపోరాదు.

అయితే ఈ సంస్కృతిని దెబ్బతీసే ప్రయత్నంలో – తమ మతమూలాలు మన ధర్మ గ్రంథాలలో ఉన్నాయని చెప్పుకొస్తున్నారు. ఆ ప్రకటనల్ని హిందువుల పండుగ దినాలలోనే ముద్రించడం వెనుక కుత్సిత బుద్ధిని మనం తెలుసుకోగలగాలి. వారు

వేద పురాణాల నుండి ఉటంకించిన అంశాలకీ, వారు చేసే అన్వయాలకీ ఏమీ సంబంధంలేదు. భవిష్యపురాణంలో చాలా అంశాలున్నాయి. దుర్మార్గులైన మ్లేచ్ఛులు, హూణులు ఈ దేశాన్ని చీలికలు చేస్తారనీ, ధర్మాన్ని దెబ్బతీస్తారనీ కూడా ఉంది. అలాంటి సందర్భాలలో వారి మతాల ప్రసక్తి ఉండవచ్చు. అలాగని ఆ మ్లేచ్ఛులందర్నీ దేవతలుగా కొలుచుకుంటామా! భూమండలానికి చెందిన సర్వాంశాలనీ వేదాదులు చెప్పాయనడంలో సందేహంలేదు. అంతమాత్రాన వేదం మనకు పొసగని వాటన్నింటినీ స్వీకరించి సాంకర్యంతో, భ్రష్టత్వంతో బ్రతకమనలేదు.

సరే – వారి మత మూలాలు మన వేదాలలోనే ఉన్నాయని ఒప్పుకుందాం. ఈ విషయం వారి పెద్దలచేత, పోప్‌గారిచేత, ప్రపంచ వ్యాప్తంగా ప్రచురిస్తున్న వారి ప్రతి మత గ్రంథ ప్రతిలో ముద్రించమనండి.

**"మన మతానికి మూలాలు భారతీయ వేదపురాణాలలోనే ఉన్నాయి. మనకంటే ముందు వారే నాగరికంగా ఎదిగి, మన మతం గురించి కూడా చెప్పగలిగిన భవిష్య ద్దర్శన శక్తి కలిగి ఉన్నారు. కనుక మన మతం భారతీయమతం"** – అనే వాక్యాలను వాటికన్ సిటీ నుండి పోప్‌గారిచే ప్రతి దేశానికీ ప్రకటించమనండి.

ఆ ధైర్యం వారికుందా?

కేవలం ఈ దేశీయుల్ని మభ్యపెట్టడానికే వారు చేస్తున్న కుత్సితమది. చివరకి 'అల్లోప నిషత్' లాంటివి కూడా వ్రాసినవారున్నారు కదా మనకి. అలాగని వాటిని వేద భాగాలంటామా! ఈ దేశంలో 'వేదవాక్కు' పట్ల ఉన్న గౌరవాన్ని గమనించి వారు చేస్తున్న కుటిలకుట్ర ఇది!

**ప్ర: ఇంద్రుని నామాలు విష్ణు సహస్రంలో కనిపిస్తున్నాయి. 'ఇన్ద్రః', 'మహేన్ద్రః' – మొదలైనవి. అలాగే చమకంలో 'అగ్నిశ్చమ ఇన్ద్రశ్చమే' ... అనే మంత్రాలు. ఇంద్రుని ప్రధాన దైవంగా పరిగణించాలా? ఇంద్రశబ్దానికి అర్థం ఏమిటి?**

**జ:** ఒకే పరమేశ్వరునే బ్రహ్మ విష్ణు రుద్ర ఇన్ద్ర నామాలతో వేద వాఙ్మయం స్తుతించింది. దేవతా కోటిలో స్వర్గాధిపతి – భగవద్విభూతి కలవాడు కనుక 'ఇంద్ర' శబ్దంచే వ్యవహరింపబడుతున్నాడు.

కానీ వేద హృదయం ప్రకారం ఇన్ద్ర శబ్దం పరమాత్మకు చెందినది. వేదం కొన్నిచోట్ల సూర్యపరంగా కూడా ఈ శబ్దాన్ని ప్రయోగించింది. విశ్వవ్యాపకమైన పరమేశ్వరుని నామాలే విష్ణు సహస్రనామాలు. ఆతడే 'ఇన్ద్రుడు' అని స్పష్టంచేసింది ఆ స్తోత్రం.

**'ఇది – పరమైశ్వర్యే' 'ఇంధీ – దీప్తౌ'** – అనే రెండు ధాతువుల నుండి కలిగినది 'ఇంద్ర' శబ్దం. పరమమైన (గొప్పదైన) ఐశ్వర్యము, ఈశ్వరత్వము కలవాడు ఇన్ద్రుడు. అలాగే – ప్రకాశ స్వరూపుడు ఇన్ద్రుడు.

ఈ రెండు పరమాత్మునికి సంబంధించిన తత్త్వములే. కనుక వేదం ప్రస్తావించిన ఇన్ద్రుడు సృష్టి స్థితిలయకారకుడైన పరమేశ్వరుడు. ఆతనినే ఉపనిషత్తులు 'పరబ్రహ్మ' అని ప్రస్తావించాయి. 'సహస్రాక్షః' వంటి ఇంద్రనామాలు పరమేశ్వర లక్షణాన్ని తెలియజేసేవే.

యజ్ఞాలలో ఆరాధింపబడే ప్రధానదైవం ఇన్ద్రుడు. త్రిలోకాధిపతిగా పురాణాదులలో అభివర్ణించబడినా, సర్వేశ్వరుని విభూతిగానే భావించడంచేత ఈతడు పూజార్హుడు.

ప్ర: **క్రైస్తవులు బైబిల్‌ను పంచినట్లుగా మనం కూడా వేదాలను ప్రింట్ చేసి పదిమందికీ పంచవచ్చు కదా? తద్వారా వేదధర్మం అందరికీ తెలుస్తుంది. దీనివల్ల మతం మారకుండా ఉంటారు.**

**జ:** వేదం మతగ్రంథంకాదు. వేదానికి పుస్తక రూపం లేదు. అది శ్రుతి. ప్రత్యక్షరం ఒక దేవతాస్వరూపం. దానిని టెక్స్ట్ పుస్తకం చదివినట్లు చదవలేం. అత్యంత పవిత్రంగా నియమబద్ధంగా స్వర సహితంగా అభ్యసించాలి.

ఒకవేళ అర్థం చెప్పదలచుకొన్నా – వేదమంత్రాల అర్థాలకు షడంగజ్ఞానం అవసరం. ప్రతి మంత్రానికీ ఆధిభౌతిక– ఆధ్యాత్మిక – ఆధి దైవిక... అనే మూడు అర్థాలుంటాయి. ఈ మూడు అర్థాల కారణంగానే వేదాలకు 'త్రయీ' అని పేరు.

నిజంగా వేదం పుస్తకంగా పంచితే – అది సరిగా అర్థంకాక, ఆ నియమాలను అవలంబించలేక వెంటనే మరో మతంలోకి మారిపోయే ప్రమాదమూ ఉంది.

వేదాధ్యయనం రెండు విధాలు.

**ఒకటి –**స్వరయుక్తంగా, దాని నాద శక్తితోపాటు మంత్రాలను పరిరక్షించడం.

**రెండవది –**అర్థసహితంగా నేర్చుకొనడం. సాధారణంగా రెండూ చేసేవారు కొద్దిమందే.

హిందూమతోద్ధరణకు ఇతర మతాల పద్ధతులను అనుసరించడం అనవసరం.

ఆ మత లక్షణాలు వేరు. మన ధర్మ స్వభావం వేరు.

అయితే మీరన్నట్లు వేదధర్మం అందరికీ తెలియాలి. భారతీయులందరూ వైదికులే. అందుకే వేదధర్మాన్ని ఆఖ్యానోపాఖ్యానాలతో, అద్భుతమైన తాత్త్విక వివేచనతో,

ధర్మాధర్మ విచక్షణలను తెలియజేస్తూ... ఆచరణయోగ్యంగా, ఆస్వాదనీయంగా అందించేందుకు రామాయణ, భారత, భాగవతాదులు, పురాణాలు వ్యాసాదులచేత ఆవిష్కృతమయ్యాయి. అవి మామూలు మనిషికి సైతం సులువుగా అర్థమయ్యే రీతిలో, చక్కగా రచింపబడ్డాయి.

వాటి వల్లనే హిందూమతం ఇంకా బలంగా సామాన్యులకు సైతం చేరువగా ఉన్నది. అత్యంత కఠిన నియమాలతో సాగించే యజ్ఞాదులకు ప్రత్యామ్నాయంగా సులభ సాధ్యంగా వివిధ దేవతారాధనలను ఆ గ్రంథాలు తెలియజేస్తున్నాయి. అదేవిధంగా వివిధ ధర్మమర్మాలను, వేదాంత చర్చలను ఆ పురాణాది గ్రంథాలు బహుముఖాలతో అందజేశాయి. వైదికోపనిషత్తుల మర్మాలను, వేదయజ్ఞాంశాలను మహాభారతంలాంటి గ్రంథాలు సర్వజనోపయోగంగా అందించాయి. భగవద్గీత, విష్ణుసహస్రం.... లాంటివి మనం అందరికీ పంచి, బోధించి అనుష్ఠానపరులను చేయవచ్చు. ఇంకా స్తోత్ర వాఙ్మయం చాలా ఉంది.

మనసుని భగవద్భక్తితో తన్మయం చెందించి, ధర్మాచరణకు పురికొల్పేందుకు ఈ అపార సాహిత్యాలను అందించవచ్చు. వాటి రాశినీ, వాసినీ చూసినా, ఇతర మత గ్రంథాలకు ఏమీ తీసిపోవు. అయినా మన సంస్కృతి ఏదో ఒక గ్రంథం మీద ఆధార పడినది కాదు. పరంపరపై నిలచిఉంది.

ఎన్ని వేదాలు వల్లించినా ఉండవలసింది ధర్మం, నైతికత, భగవద్భక్తి.

ఈ మూడు కలిగిన ఎవరైనా సరే తరించుతారు. వీటిని ఏర్పరచడానికే రామాయణ పురాణాది వాఙ్మయరాశి ఉద్భవించింది.

**ప్ర: దేవీభాగవతం పారాయణ చేయనక్కర్లేదనీ, అది వ్యాసుడు వ్రాయలేదనీ, 'శ్రీమద్భాగవత' మే (విష్ణు కథా గ్రంథం) పారాయణ చేయాలని ఈ మధ్య ఒకాయన అన్నారు. దేవీభాగవతం వ్యాసకృతం కాదా?**

**జ:** ఇది విష్ణువును తప్ప మరి దేనినీ అంగీకరించలేని సంకుచిత స్వభావులెవరో అన్నమాట కావచ్చు. దేవీ భాగవతం వ్యాసకృతమేనని స్పష్టంగా ఉంది. పైగా పురాణాలు అన్నీ వ్యాసుని ద్వారా గ్రహించిన సూతులవారు చెప్పినవే.

దేవీ భాగవతం వ్యాసుడే స్వయంగా జనమేజయునకు వివరించాడని ఉంది.

పద్దెనిమిది పురాణాలలో 'దేవీభాగవతం' ఒకటి. పురాణాలన్నీ రచించిన తరువాత వ్యాసుడు శ్రీవిష్ణుస్మరణను, భాగవత ధర్మాన్ని సుప్రతిష్ఠితం చేయడానికై 'శ్రీమద్భా

గవతం' రచించినట్లుగా అందులోనే ఉంది.

కనుక ఇది వ్యాసకృత ప్రత్యేక గ్రంథమని కొందరి అభిప్రాయం.

అసలామాటకొస్తే 'శ్రీమద్భాగవతం' కూడా వ్యాసకృతం కాదు – అని తాము పరిశోధించిన ప్రకారం తీర్మానించిన వారున్నారు. వ్యాసుని పేర ఉన్న గ్రంథాలన్నీ వ్యాసకృతాలు కావన్నవారు కూడా చాలామంది ఉన్నారు.

నిజానికి మనకీ వాద వివాదాలు అనవసరం. వ్యాసకృతమైనా కాకున్నా – అటు దేవీ భాగవతం, ఇటు శ్రీమద్భా గవతం రెండూ మన సనాతన ధర్మాన్ని జీవితంలో ప్రవేశింప జేసేందుకే అవతరించాయి. రెండూ పారాయణ యోగ్య గ్రంథాలే. అనేక పురాణాలలోని విష్ణు కథ 'శ్రీమద్భాగవతం'లో ప్రత్యేకంగా ప్రత్యక్షమౌతుంది. అదేవిధంగా అన్ని పురాణాలలోని శక్తితత్త్వం 'దేవీ భాగవతం'లో స్వతంత్ర గ్రంథంగా వ్యక్తమౌతుంది.

ఈ రెండూ మనకు శిరోధార్యాలే. అర్థంలేని వాద వివాదాలు మనకు అనవసరం. గ్రంథాల ప్రయోజనమే మనకు ముఖ్యం. ఆ ప్రయోజనం – మనలను ధార్మికులుగా, భగవద్భక్తులుగా మలచడమే. 'భగవానుడు' అన్నా, 'భగవతి' అన్నా తత్త్వం ఒక్కటే. ఈ రెండు గ్రంథాల వలన తరించిన భక్తులు చాలామంది అప్పుడూ ఉన్నారు. ఇప్పుడూ ఉన్నారు. ఎప్పుడూ ఉంటారు.



అనవసర తర్జనభర్జనలు కలవారు అసలు ప్రయోజనాన్ని పొందలేక 'సంశయాత్మా వినశ్యతి'.

**ప్ర: కృత త్రేతా ద్వాపర కలియుగాలనే పేర్లకు అర్థం ఏమిటి?**

**జ:** వాటి లక్షణాల ననుసరించి ఆ పేర్లు పెట్టబడ్డాయి.

**1.** 'క్రియత ఇతి – కృతం' – యత్కృత్యం వర్తతే కృత యుగః.

**2.** త్రీన్ ధర్మ పాదాన్ ఇతా (ప్రాప్తా) త్రేతా –

**3.** ద్వాభ్యాం కృతత్రేతాభ్యాం పరః.

**4.** కల్యతే (కలహం కుర్వంతీ త్యస్మిన్) ఇతి కలిః.

1. 'చేయబడినది కృతం'. ఆ యుగంలో 'ఇది చేయి' అని బోధించవలసిన అవసరం లేదు. ఎవరూ చెప్పనవసరం లేకుండానే ధర్మాలను ఆచరిస్తారు. అక్కడ ధర్మం 'కర్తవ్యం' కాదు. కృతం – సహజంగా ఆచరింపబడుతుంది. మహాత్ములకు ధర్మం సహజం. అందుకే అది కృతం. ఆ మహాత్ములున్న యుగమే కృతయుగం.

2. మూడు పాదములతో ధర్మములను పొందినది – త్రేతాయుగం. ఈ యుగంలో మూడు పాదములు మాత్రమే ధర్మం పూర్ణంగా ఉంటుంది కనుక త్రేతాయుగం.

3. కృత త్రేతలనే రెండు యుగాల తరువాత వచ్చినది కనుక ద్వాపరం. ఈ యుగంలో రెండు పాదాలు మాత్రమే ధర్మం.

4. ఏ యుగంలో కలహం వ్యాపించి ఉంటుందో అది కలి యుగం. ఒకరంటే ఒకరికి పడకపోవడమే ఈ యుగంలో లక్షణం.

**ప్ర: యోగాసనాలు వేస్తూ ఉంటే, ఎంత కాలానికి 'యోగి' కాగలం?**

**జ:** యోగవిద్య వేరు, యోగాసనాలు వేరు. యోగాసనాలు వేసినంత మాత్రాన యోగి కాడు. క్రమం తప్పకుండా యోగాసనాలు వేస్తే, మంచి ఆరోగ్యవంతుడౌతాడు. అంతే. 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' అన్నారు పతంజలి. చిత్తవృత్తులు నిరోధించి, పరమాత్మతో కలిగే సంయోగమే యోగం. దానికి అష్టాంగయోగం ఆధారం. యమ, నియమ, ప్రాణామయ, ధ్యానాదులు ఇందులో చెప్పబడతాయి. అది ఆహార విహార నియమాలతో, ఇంద్రియ నిగ్రహాలతో సాగించాల్సిన సాధన.

**ప్ర: అయ్యప్ప గురించి పురాణాల్లో లేదని, అది మన సనాతన పద్ధతికి చెందినది కాదని కొందరు హిందువులే అంటున్నారు. నిజంగా పురాణాధారం లేదా? శివకేశవ సుతుడనే గాథకి ఆధారం ఏమిటి?**



**జ:** మంత్ర స్వరూపులు దేవతలు. ఎన్ని మంత్రాలున్నాయో అందరు దేవతలున్నారు. మంత్రశాస్త్ర సంబంధమైన కొన్ని పురాణాలున్నాయి. వాటి ఆధారంగా పూజింపబడే చాలా దేవతలున్నారు. అలా ఆరాధింపబడే దైవం శాస్త. శాసించు వాడు శాస్త. అనగా గురుస్వరూపం. 'గురువు' అనే పూజ్య భావాన్నే మళయాళ భాషవారు 'అయ్యప్ప' అని సంబోధిస్తున్నారు. వేదాంత విద్యకు ఈయన సాకారం. ఆ యోగపట్టం, చిన్ముద్ర... పూర్తి సనాతన ధర్మ స్వరూపం.

పురాణాల్లో కొన్నిటిలో అయ్యప్ప ప్రస్తావన స్పష్టంగా ఉంది. ముఖ్యంగా 'బ్రహ్మాండ పురాణం'లో విశదంగా ఇతివృత్తం చెప్పబడింది.

**పునర్గృహీత్వా తామీశః కామం కామవశీకృతః।**
**ఆశ్లిష్యదతివేగేన తద్వీర్యం ప్రచ్యుతం తదా॥**
**తతస్సముదితో దేవో మహాశాస్తా మహాబలః।**
**అనేక కోటి దైత్యేన్ద్ర గర్వనిర్వాపణక్షమః॥**

మోహినీ రూపధారియైన విష్ణువు సాక్షాత్తు పరాశక్తి స్వరూపమే. ఆతని శివమోహినీ రూపాన్ని చూసి మోహితుడైనాడు శివుడు. వారిరువురి తనయుడు 'మహాశాస్త'.
పురాణాల్లో ఒకచోట చెప్పనిది మరొకచోట చెప్తారు. ఏవో కొన్ని గ్రంథాలను మాత్రమే చూసి, మిగిలిన వాటిని ప్రమాణం కావు అనరాదు. ఎవరి ప్రమాణాలు వారి కుంటాయి. కథారూపాలను అటుంచి, విగ్రహ స్వరూపం, ఆరాధనాగమ విధానాలను పరిశీలిస్తే తత్త్వం అర్థం అవుతుంది.
హరిహరాద్వైతానికీ, బ్రహ్మవిద్యకీ ప్రతీక అయ్యప్ప. ఆగమాలలో హరిహరమూర్తి ఆరాధన ఉన్నదే. ఈ ఏకతత్త్వోపాసన భక్తికీ, ధర్మానికీ ప్రోద్బలకం. ఇటువంటి గొప్ప స్వామినీ, గొప్ప ఉపాసననీ కాదనడం వల్ల సాధించే ప్రయోజనమేమిటి? శివకేశవ సమన్వయాన్ని అంగీకరించలేక, భేదవాదులు మన ధర్మంలో తెస్తున్న చీలికలలో భాగమే అయ్యప్పను విమర్శించడం.
ఈ సువిశాల భారతావనిలో ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క విధంగా దైవశక్తి వివిధ భావనలతో, ఆగమ పద్ధతులతో ఆరాధింపబడుతోంది. అన్నిటినీ సనాతన ధర్మంలో భాగంగా తెలుసుకున్ననాడే సమగ్ర హైందవ సమైక్యం సాధ్యమౌతుంది.



**ప్ర: నటరాజు పాదం క్రింద ఒక రాక్షసుడు కనిపిస్తాడు. అతడి పేరు ఏమిటి? ఇదేవిధంగా దక్షిణామూర్తి పాదం కింద కూడా ఒక రాక్షసాకృతి కనిపిస్తుంది. అతడెవరు? దీని ఆంతర్యం ఏమిటి? దక్షిణామూర్తికీ, నటరాజమూర్తికీ సంబంధం ఏమిటి?**

**జ:** నటరాజు కుడి పాదం క్రింద ఉన్న రాక్షసుడు అపస్మారుడు. ఇతడికి మరి కొన్ని పేర్లు కూడా పురాణాల్లో కనిపిస్తున్నాయి. కథ ప్రకారం – శివుడు ఆదిభిక్షకునిగా దారుకావనం ప్రవేశించినప్పుడు, ఆయనను గుర్తించలేని కొందరు యాజ్ఞికులు ఆయనను మట్టుపెట్టేందుకు అభిచార హోమాన్ని తలపెట్టారు. ఆ సమయంలో అగ్నిహోత్రం నుండి వాళ్ళు సృష్టించిన మారకశక్తులు అగ్నిగా, డమరుకంగా, పులిగా, అపస్మారదనుజుడిగా ఆవిర్భవించి శివునిపైకి వచ్చాయి. శివుడు అగ్నినీ, డమరుకాన్నీ హస్తాలతో ధరించి వాటిని నిగ్రహించాడు. వ్యాఘ్రాసురుడ్ని సంహరించి దాని చర్మాన్ని వస్త్రంగా దాల్చాడు. అపస్మార దనుజుని తన పాదం కింద మర్దించి నృత్యం చేశాడు.

ఈ కథలో అహంకార శక్తుల్ని పరమేశ్వరుడు నియమించిన వైనమే ప్రతీకలుగా కనిపిస్తాయి. 'అపస్మారుడు' బుద్ధిని బాధించే అపస్మృతి అనే ఆసురీశక్తి. దీని వల్ల

బుద్ధిశక్తి దెబ్బతింటుంది. ఈ ఆసురీశక్తిని మర్దించి బుద్ధిని చైతన్యవంతం చేసే జ్ఞానస్వరూపుడు శివుడు. డమరుకం – శబ్దశక్తికీ, అగ్ని – కాంతిశక్తికీ సంకేతాలు. దక్షిణామూర్తి జ్ఞానమయమైన శివమూర్తి. ఈ దక్షిణామూర్తి యొక్క మరియొక స్వరూపమే నటరాజు.

నటరాజును "చిదంబర దక్షిణామూర్తి" అని మంత్రశాస్త్రం చెబుతోంది.

**ప్ర: శ్రీరాముని జన్మ తిథిని శ్రీరామనవమి అంటాం. మరి ఆ రోజునే కల్యాణం ఎందుకు జరుపుతాం? అసలు దేవుళ్ళ పెళ్ళిళ్ళు మనం మళ్ళీ మళ్ళీ జరిపించడం ఎందుకు? చైత్ర శుద్ధ నవమినాడే శ్రీరామునికి కళ్యాణం జరిగిందా? జన్మించిన సంవత్సరం పేరేమిటి?**

**జ:** దీనిపై పరిశోధనలు చేసి పురాణాదుల ఆధారంగా పండితులు తేల్చిన తిథి నిర్ణయాలున్నాయి.

శ్రీరాముడు విళంబి నామసంవత్సర చైత్రశుద్ధ నవమి బుధవారం పునర్వసు నక్షత్ర యుక్త కర్కాటక లగ్నంలో జన్మించాడు. ఇది అభిజిత్ లగ్నం. సౌమ్యనామ సంవత్సరం ఫాల్గుణ పూర్ణిమ ఉత్తరా నక్షత్రంలో సీతారాముల వివాహం జరిగింది.

అయితే పవిత్రమైన రామజన్మ తిథి నాడే ఈ కళ్యాణాన్ని జరిపి, తద్వారా సీతా రామానుగ్రహ పాత్రులయ్యేందుకు మన తెలుగునాట కల్పితమైన సదాచారమే. ఈ రెండింటికీ భద్రాచల శ్రీరామనవమి ఉత్సవాలతో సంబంధం ఉంది. తెలుగునాటలో ప్రతి ప్రాంతంలో శ్రీరామనవమి పందిళ్ళు వేసి ఉత్సవంగా, ఉత్సాహంగా వివాహాలు జరిపిస్తారు.

దివ్యత్వ, మానవత్వాల ఆరాధ్య ఆదర్శ తత్త్వాలను కలబోసిన దంపతులు సీతా రాములు. కుటుంబ వ్యవస్థకి మూలాధారమైన దాంపత్య వ్యవస్థ భద్రత కోసం పుణ్యదంపతులైన సీతారాములను సేవించి తరించుతారు. అంతేకాక లక్ష్మీ నారా యణ స్వరూపులైన సీతారాముల ఆరాధన ఇష్టప్రాప్తినీ, అనిష్ట పరిహారాన్నీ కలిగి స్తుంది. ఈ కల్యాణరూపంగా ఆ శాశ్వత దంపతులను అర్చించుకొని జన్మపావనం చేసు కొనడమే పరమార్థం. చైత్ర శుద్ధ సప్తమినాడు శ్రీరామ పట్టాభిషేకం జరిగింది.

**ప్ర: శివాలయానికి వెళ్ళేటప్పుడు నంది నుండి శివుని చూడాలంటారు. ఆ విధానం, చెప్పవలసిన స్తోత్రం ఏమిటి?**

**జ:** నందీశ్వరుని కొమ్ముల మీద ఎడమచేయి ఉంచి, వెనుక భాగంలో కుడిచేతితో

స్పృశించడం చేత అతడు శిరసు వంచుతాడు. అప్పుడు కొమ్ముల నుండి శివుని చూడాలి. పశుపతి అయిన శివుడు, పశువులైన జీవులకు ప్రభువు. ఆ పశుత్వాన్ని దాటి శివుని చూడాలి.

మరియొక భావంలో – నంది ధర్మస్వరూపుడు. ఆ సనాతన ధర్మాన్ని గౌరవిస్తూ, ధర్మం ద్వారానే దైవాన్ని దర్శించాలనే సంకేతం కూడా ఇందులో దాగి ఉంది.

**నందీశ్వర! నమస్తుభ్యం**
**శాంతానంద ప్రదాయక!**
**మహాదేవస్య సేవార్థం**
**అనుజ్ఞాం దాతుమర్హసి॥** –అనే శ్లోకాన్ని పఠిస్తూ "హర హర – శివశివ" అనే శివ నామాన్ని పలుకుతూ, నంది కొమ్ముల మధ్య నుండి శివ లింగాన్ని దర్శిస్తే– వేదపఠనం చేసిన ఫలం, సప్తకోటి మహా మంత్ర జపఫలం లభిస్తాయనీ, పాప పరిహారమవు తుందనీ పురాణాలు చెబుతున్నాయి.

ప్ర: **ఇటీవల పూరీజగన్నాథ క్షేత్రంలో ఎవరో విదేశస్థుడు ప్రవేశించాడని, ప్రసాదానికై వండిన అన్నరాశిని మట్టిలో కలిపారు. ఇది అవివేకం కాదా! అన్నాన్ని వృథా పరచడం తగునా? ఎందుకీ నియమాలన్నీ! దేవుడు అంతటా ఉన్నవాడే కదా!**



**జ:** స్థూల దృష్టితో చూస్తే ఇది అవివేకంలా కనిపించవచ్చు. సూక్ష్మదృష్టితో గమనించితే దీనిలో ఉన్న ఔన్నత్యం అవగత మవుతుంది.

కొన్ని ఆలయాలకి కొన్ని సంప్రదాయాలు ఉంటాయి. అవి పరిరక్షించుకోవాలి. జగన్నాథుని ప్రసాద మహిమ పురాణ ప్రసిద్ధం. దేవునికి నివేదించే వరకు అత్యంత శుద్ధిని పాటించాలి. అది పరంపర నుండి వస్తున్న విధానాలననుసరించి చేయాలి. ఆలయం, దైవశక్తి – కేవలం విశ్వాసాల మీద నడిచేవి కావు. ఆగమశాస్త్ర విధానాలను పాటించినప్పుడే ఆలయంలో కేంద్రీకృతమైన దైవశక్తిని కాపాడు కోగలం. విశ్వ వ్యాపకమైన దైవశక్తికి ఏ నియమాలూ ఉండవు. అంతటా ఉన్న దేవుని కొలుచు కోడానికి ఏ పరిమితులూ లేవు. కానీ మంత్ర – యంత్ర – ఆగమ విధానాలతో ఆ దైవశక్తిని విగ్రహ – ఆలయ పరిధులలో కేంద్రీకరించినప్పుడే నియమాలు ఉంటాయి. అవి ఉన్నంత కాలమే ఆలయంలో పవిత్రత, శక్తి నిలుస్తాయి. ప్రజల్ని రక్షిస్తాయి. ఏ సంప్రదాయంలో ఆలయం నిర్వహింపబడుతున్నదో ఆ సంప్రదాయాన్ని అను సరించేవారు మాత్రమే అందులో ప్రవేశిస్తారు. ఆపరేషన్ థియేటర్‌లోకి డాక్టర్లు –

నర్సులు మాత్రమే ప్రవేశించాలి కదా. అది భౌతికంగా కొన్ని వైద్య నియమాలయితే, ఇవి సూక్ష్మంగా ఏర్పడిన దైవనియమాలు.

**'స్వధర్మే నిధనం శ్రేయః'** అని చెబుతుంది మన మతం. ప్రతి మతమూ గొప్పదే. ఏ మతంవారికి ఆ మతం అనుసరణీయం. ఇతర మతాలలోని గొప్పతనాన్ని గౌరవించ వచ్చు. తన దానికి విరుద్ధంకాని కొన్ని భావాలను మనసా స్వీకరించవచ్చు. "హైందవే తరులకు అనుమతి లేదు" అని అక్కడ ఉన్న నియమ వాక్యాన్ని ఉల్లఘించడం కూడా తగదు కదా!

ఆలయ శౌచ నియమాలు వేరు, ఇంట్లో దేవుడి గది శౌచ పద్ధతులు వేరు. ఆ శాస్త్ర పరిజ్ఞానం ప్రకారంగానే అక్కడ అనుసరించాలి. అది 'చాదస్తం' అనడానికి లేదు. ఆ మాటకొస్తే ప్రతి దేవ విశ్వాసమూ నాస్తికులకి చాదస్తంగానే కనబడుతుంది. అలాగని నాస్తికుల సిద్ధాంతాల ప్రకారం ఆస్తికతని నడపలేం కదా!

జగన్నాథుని కృప అందరిదీను. ఆలయ నియమాలలోనే పరిమితులుంటాయి. నివేదన అయిన తరువాత ప్రసాదాన్ని కుల వర్గ వర్ణ విచక్షణ లేకుండా అందరూ భుజించడం పూరీ క్షేత్రంలోని విశిష్టత. చివరికి ఎంగిలి చేతులతో ఇచ్చిన ప్రసాదాన్ని కూడా పూరీలో స్వీకరించి తీరాలిగానీ ఏ మాత్రమూ నిరసించరాదు. ఇంత సమత్వాన్ని చూపే ప్రసాదమది. ఇది ప్రసాదంగా మారకముందు–అంటే, దేవునికి నివేదించక ముందు మాత్రం తగిన శౌచం పాటించాలి.

ఇటువంటి శుచి నియమాలు ప్రతి ఆలయానికీ ఉన్నాయి. ఎవరి ధర్మాన్ని వారు పాటించాలనే స్వధర్మ నిష్ఠని కూడా గౌరవించాలి కదా. ఇవి వ్యక్తి స్వార్థాల వల్ల జరిగినవి కావు. సంప్రదాయ వ్యవస్థను పాటించే సదాచారమిది. కేరళ గురవాయూరు వంటి మందిరాలకీ నియమాలున్నాయి.

ఇతరుల మతాలతో మన మతాన్ని పోల్చదగదు. కొన్ని భావాలు కలిసినట్లనిపించినా వేటి ప్రత్యేకత వాటిదే. వారివి ప్రార్థనామందిరాలు. మనవి దేవాలయాలు.

అసలు – వారి ప్రార్థనామందిరాలలో కూడా వారి దేశాలలో వారికున్న చాలా నియమాలతోనే నడుపుతున్నారు. మన దేశంలో మార్పిడుల ప్రాధాన్యం వల్ల వాళ్ల నియమాలను కూడా సడలిస్తున్నారు.

ముస్లింసోదరుల పుణ్య క్షేత్రాలలో గానీ, క్రైస్తవుల మందిరాల్లోకి గానీ వారిగా మనం మారనిదే మనకూ ప్రవేశముండదు.

పైగా – జగన్నాథ క్షేత్రం ప్రసాద ప్రధాన క్షేత్రం. మిగిలిన ఆలయాలలో నివేదనలు కూడా బాహాటంగా, దృష్టి పడేటట్లుగా జరుపరు. అలాంటిది– ప్రసాద ప్రాముఖ్యమున్న పూరీలో నైవేద్యం జరిపేటప్పుడు అధికమైన ఆచార నిష్ఠ అవసరం. దాని కారణంగానే అది అంత శక్తిమంతమై యుగాల నుండి భక్తులను తరింపజేస్తోంది. మన దేవాల యాల్లో స్వయంభూ క్షేత్రాలు కొన్నైతే, ఆగమశాస్త్రబద్ధంగా ప్రతిష్ఠించబడినవి ఇంకొన్ని. ఆలయ నిర్మాణాన్ని మొదలు కొని, నిత్యార్చనల వరకు నియమాలున్నాయి. వాటిని అతిక్రమించినప్పుడు దుష్ఫలితాలు తప్పవు. అందుకే పరంపరను పాటిస్తూ వారు అన్నాన్ని మట్టిలో కలిపారు.

వైజ్ఞానికంగా ఆలోచిస్తే – ఆ అన్నం భూగర్భంలో కూడా పచనమై చేరవలసిన జీవులకి చేరుతుంది. దానిని వృథా అనరాదు. మనిషి మాత్రమే జీవి కాదు కదా!

ఎలాపడితే అలా నివేదిస్తే అది ప్రసాదమవదు కదా! మామూలు వంటకమే అయితే అంత శక్తిమంతమైన భావన ఎలా కలుగుతుంది? ప్రసాదశక్తిని పదార్థంలో ఆవి ష్కరించడానికి ఆ నియమాలు అత్యవసరం. అయితే – అంతటి నియమాలు లేకుండా ఇతర స్థలాల్లో పూజలు చేసి జరుపు తున్న వైనాలు కనబడుతున్నాయి. అవి ఆ పరిస్థితులకి సరిపోతాయి. వాటిని తప్పు అనలేము.

కానీ – క్షేత్ర ప్రాధాన్యం కలిగిన ప్రాచీన ఆలయాల ప్రాచీన నియమాలను మాత్రం అధిగమించరాదు. ఈ నియమాలను ఉల్లంఘించకుండానే, ఆలయ మర్యాదలను గౌరవిస్తూనే మన దైవాలను ఉపాసించి ముక్తిని పొందిన, పొందుతున్న కృష్ణభక్తులైన విదేశీయులు అసంఖ్యాకంగా ఉన్నారుకదా! భక్తికి కుల మతాల పనిలేదు. ఆచారాల లోనే నిబంధనలు. ఎవరి ఆచారంలో వారు భక్తిని అలవరచుకుంటారు.

అందరూ చూడదగిన, అందరూ చేయదగిన ఆలయాలు, ఆచారాలు కూడా ఉన్నాయి మనకి. కొన్ని స్థలాలు మాత్రం పరిమితులలో ఉండాలి. కొన్నిటికి పరిమితులక్కరలేదు. వాటి పద్ధతి వాటిదే – వీటి పద్ధతి వీటిదే. మనకి తోచినట్లుగా స్థూల నిర్ణయాలతో సంప్రదాయ దేవమందిర నియమాలను ఎట్టి పరిస్థితుల్లోనూ మారనీయకూడదు. విశ్వాసమంటూ ఉంటే – నియమోల్లంఘన దేశ క్షేమానికే భంగకరం – అనే శాస్త్రోక్తిని విశ్వసించాల్సిందే. విశ్వాసం లేనప్పుడు దేవాలయంతోనే పని లేదు. ఇంక నియమాలను వ్యాఖ్యానించే అవకాశమెక్కడిది!

మీ ప్రశ్న వ్యాజంగా – కొంతమేరకు ఆలయ నియమాల ప్రాధాన్యాన్ని అందరికీ

అవగాహనపరచడానికై ఇంత విస్తృత వివరణ ఇవ్వవలసి వచ్చింది.

ప్ర: **లలితా సహస్రనామాల ఫలశ్రుతిలో – వేయి విష్ణు నామాల కంటె ఒక శివ నామం గొప్పదనీ, వేయి శివ నామాల కంటె ఒక శక్తినామం గొప్పదని ఉంది. ఇది సమం జసమేనా? అన్నీ సమానమే అన్నా ఫరవాలేదు. ఈ ఎక్కువ తక్కువలు దేనికి?**

జ: ఏ దేవతా ఉపాసనలోనైనా ఇవి సర్వ సామాన్యంగా ఉండే వాక్యాలే. వీటిని 'ప్రశస్త వాక్యాలు' 'అర్థవాదాలు' అంటారు. వాటిని అనుష్ఠించే వారికి వాటియందు నిష్ఠనీ, శ్రద్ధనీ కలిగించడానికై ఈ వాక్యాలు ఉపదేశింపబడతాయి. ఇందులో మిగిలిన వాటిని తగ్గించడం ప్రధానం కాదు. తన ఉపాసనా విధానాన్ని శ్రద్ధగా చేయడానికై వీటిని నిర్దేశిస్తారు. విష్ణూపాసనలో విష్ణువుతో సాటియైన దైవం లేదనీ, విష్ణు నామా లతో సమానంగా మరేవీ లేవనీ ఉంటాయి. అలాంటి మాటలే శివనామాల విషయం లోనూ ఉంటాయి. ఉపాసనా సంప్రదాయం తెలిస్తే–ఇవి 'నహినిందా' వాక్యాలు (నిందించడానికై చెప్పలేదు) అని అర్థమవుతాయి.

ప్ర: **కపిలగోవు శ్రేష్ఠమైనది అంటారు. 'కపిల' అంటే ఏమిటి? ఆ లక్షణాలను ఎలా గుర్తించాలి? ఒళ్ళంతా నల్లని రంగు ఉంటే కపిల గోవు అని గుర్తించాలా?**

జ: ఆవులు ఏ రంగులో ఏ రూపులోనున్నా శ్రేష్ఠమైనవే. పూజ్యములే. కపిల శబ్దానికి – నలుపు అని ప్రధానార్థం. నల్లని గోవుల్ని కపిల గోవులు అంటారు. అవి మరింత శ్రేష్ఠములని శాస్త్రోక్తి.

గోవు అమృతశక్తితో దివ్యలోకాలలో ఉద్భవించినది. తొలి గోమాత సురభి. ఆమె అంశలే విశ్వములో గోవులుగా వ్యాపించాయి. ఒకసారి కొన్ని గోవులు హిమగిరి పరిసరాలలో సంచరిస్తుండగా, ఒక గోవు పాలను లేగతాగుతున్నది. ఆ సమయంలో పొదుగు నుండి స్రవిస్తున్న పాలనురగ గాలికి చింది, సమీపంలో తపస్సు చేసు కుంటున్న పరమేశ్వరునిపై పడింది. దానితో కనులు తెరచిన ధూర్జటి ఫాలనేత్రం నుండి ఎగసిన సెగ తగిలి అక్కడి గోవులు నలుపెక్కాయి.

అవి శివుని శరణు వేడి ప్రార్థించాయి. శివదృష్టి శక్తిని పొందడం చేత ఆ గోవులకు ప్రత్యేక శ్రేష్ఠత లభించింది. శివుడు వాటికి ప్రత్యేక పూజ్యతను వరంగా అందించాడు. కపిలగోవు శరీరమంతా నలుపురంగుతో (ఎరుపు కూడా) ఉండనవసరం లేదు. చెవులు, కొమ్ములు, కన్నులు, గిట్టలు, నాసికా పుటములు, గొంతులు, ముష్కములు కపిల వర్ణంతో ఉన్నా కపిలత్వ గుణానికి చాలు. ముఖ్యంగా మూపురం, గంగడోలు

ఉన్న భారతీయ గోసంతతి – మన శాస్త్రాలలో వర్ణించిన ఉత్తమ గోవులుగా నిర్ణయింపబడుతున్నాయి.

ప్ర: **ఉసిరికాయను రాత్రివేళ తినరాదంటారు. ఇంక ఏ ఏ రోజుల్లో నిషేధం?**

జ: రాత్రివేళ తినరాదనేది శాస్త్రవచనమే. ఆదివారంనాడు, సప్తమి తిథినాడు ఉసిరి తినరాదు. దేవతా విజ్ఞానంతోపాటు, వైద్య పరిజ్ఞానం కూడా ఇందులో ఉంటుంది. తినే పదార్థాలకు కాలాది నియమాల ప్రభావం కూడా ఉంటుందని ఆయుర్వేద గ్రంథాలు చెబుతున్నాయి.

ప్ర: **స్వర్గస్థులైన మాతాపితరులకు గయలో పిండప్రదానం చేసిన తరువాత ప్రతి సంవత్సరం యధావిధిగా అగ్ని హోత్రంతో ఆబ్దికం జరపాలా?**

జ: గయలో చేయడం చాలా ఉత్తమం – అని మాత్రమే శాస్త్రోక్తి. గయాశ్రాద్ధం పుత్రత్వానికి సార్థకత. అంతేకానీ గయలో చేసినంత మాత్రాన ప్రతి ఏడు చేసే ఆబ్దికాలను మానరాదు. వారి వారి పద్ధతుల ప్రకారం అగ్ని హోత్రాదులతో ఆబ్దికాన్ని జరపవలసినదే.



ప్ర: **మరణానంతరం జీవులు కర్మానుసారం మళ్ళీ జన్మిస్తారని చెప్తారు కదా. అటువంటప్పుడు వారికి ప్రతి ఏడాది ఆబ్దికం జరపడం వారికి క్షేమమా?**

జ: మరణించిన జీవుడు ఎక్కడో జన్మిస్తాడని మనం ఊహించి కర్మలు ఆపనవసరం లేదు. ఆ జీవుడి వలన జన్మించిన మనం ఉన్నంతకాలం వారికి ఆబ్దికాలు పెట్టవలసినదే. ఆ జీవుడు ఏ లోకంలో ఉన్నా, ఏ జన్మలో ఉన్నా ఆ ఆబ్దిక కర్మ వలన వారికి ఉన్న స్థితి కంటే ఉన్నత స్థితి లభిస్తుంది. అలా జీవుడు ఏ స్థానంలో ఉన్నా వారికి అందజేసే పితృదేవతా వ్యవస్థ విశ్వంలో ఉంది. వారే వసురుద్ర ఆదిత్యులు – అనే పితృదేవతలు. తమ పితరులను తలంచుకొని శ్రాద్ధాదులు జరిపేవారికి ఆ పితృ దేవతలు ఆశీర్వదిస్తారు. ఆ కృతజ్ఞతా ధర్మంచేత ఆ కర్మ చేసే తనయులకు క్షేమం. మరణించిన జీవులందరికీ వెంటనే జన్మించే యోగం ఉండదుకదా! వారి వారి కర్మానుసారం తిరిగి జన్మని స్వీకరించడానికి సమయం పడుతుంది.

ప్ర: **దశ మహావిద్యలలో శ్రీవిద్య ఉన్నదా? అసలు దశ విద్యల పేర్లేమిటి? 'షోడశీ' అంటే ఏ దేవి? వీటిని 'విద్యలు' అని ఎందుకు అంటారు.**

జ: కాళీ, తార, షోడశి, భువనేశ్వరి, భైరవి, ఛిన్నమస్తా, ధూమవతీ, బగళా, మాతంగి, కమలాత్మిక – ఈ పది దశమహావిద్యలు. ఇందులో మూడవది షోడశి. ఈ షోడశినే

'శ్రీవిద్య' అంటారు. ఈ దేవి మహాత్రిపుర సుందరి. లలితగా, రాజరాజేశ్వరిగా ఆరాధింపబడే విద్య ఇది. విద్య అనేమాటకి మంత్రమనీ, ఉపాసన అనీకూడా అర్థం. 'విద్య' అంటే 'తెలియజేసేది'. దేవతను తెలియజేసే మంత్రం విద్య. అయితే స్త్రీ దేవతామంత్రాలను 'విద్య' లంటారని ఒక సంప్రదాయం.

**ప్ర: నిత్యకర్మలుగా ఎనిమిది ఉన్నాయంటారు? అవి ఏమిటి?**

**జ:** సంధ్య, స్నానం, జపం, హోమం, దేవతార్చన, పితృతర్పణం, అతిథిపూజ, వైశ్వ దేవం... వీటిని నిత్యకర్మాష్టకం అంటారు.

**ప్ర: 'హనుమాన్ చాలీసా'లో - "అష్టసిద్ధి నవనిధికే దాతా" అనే నామం ఉన్నది. అష్టిసిద్ధులు, నవనిధులు - అంటే ఏమిటి ?**

**జ:** హనుమంతుడు తన భక్తులకు (భక్తిబలాన్ని అనుసరించి) అష్టసిద్ధులను, నవనిధులను అనుగ్రహిస్తాడు- అని తులసీదాసు తెలియ జేస్తున్నారు.

**అష్టసిద్ధులు :** 1. అణిమా, 2. మహిమ, 3. లఘిమ, 4. ప్రాప్తి, 5. ప్రాకామ్యము, 6. ఈశత్వం, 7. వశిత్వం, 8. సర్వ కామసిద్ధి (కామావసాయిత్వము). కొన్ని చోట్ల 'సర్వకామసిద్ధి' బదులుగా 'గరిమ' అని చెప్పబడింది.

'అణువు'లా సూక్ష్మరూపాన్ని పొందడం 'అణిమాసిద్ధి'. అనేక కోట్ల బ్రహ్మాండాల కంటే అధికుడవడం 'మహిమా సిద్ధి'. పరమాణువుల కంటే తేలిక కావడం 'లఘిమా సిద్ధి'. గొప్ప బరువుగా మారగలగడం 'గరిమ'. ఇష్టపదార్థాలను పొందగలగడం 'ప్రాప్తిసిద్ధి'.

లౌకిక పారలౌకిక పదార్థాలలో దేనిని కావాలంటే దానిని పొందడం 'ప్రాకామ్యసిద్ధి'. అన్నిటిపై, అందరిపై అధికారాన్ని పొంది, తన ఇచ్ఛ మేరకు నడిపించడం 'ఈశత్వం'. దేవతలతో సహా తాను కోరిన వారిని వశం చేసుకొనడం 'వశిత్వం'. అన్ని కోరికలను పూర్తిగా తీర్చుకొనడం 'కామావసాయిత్వం'.

**నవనిధులు :** 1. పద్మం, 2. మహాపద్మం, 3. శంఖం, 4. మకరం, 5. కచ్ఛపం, 6. ముకుందం, 7. నీలం, 8. కుందం, 9. వరం. ఇవి ఐశ్వర్య ప్రతీకలైన నిధులు. ఇవి కుబేరుని వద్ద మహాలక్ష్మి దయవలన కలిగి ఉన్నాయి. ఈ నిధి దేవతల వలన భూ, జల, లోహ భోగాది సంపదలు లభిస్తాయి.

**ప్ర: ఆచమనం చేయడానికి, తీర్థం పుచ్చుకోడానికి నియమాలు ఏమిటి?**

**జ:** ఆచమనం చేసేటప్పుడు సాధారణంగా కేశవాది 24 నామాలను స్మరిస్తాం. దీనిని

'పురాణాచమనం' అంటారు. ఇవికాక 'శ్రౌతాచమనం' వంటివి ప్రత్యేక ఆచమనాలున్నాయి.

ఆచమనం చేసేటప్పుడు, తీర్థం పుచ్చుకునేటప్పుడు కూడా చప్పుడు కారాదు. క్రింది పెదవికి మాత్రమే తగిలినట్లు ఆచమనం చేయాలి. సాధారణంగా నీళ్ళు తాగినప్పుడు, తీర్థం పుచ్చుకొనేటప్పుడు కూడా ఈ నియమం పాటించాలి. ఒకేసారి చేతిలో నీళ్ళు పోసుకొని మూడుసార్లు తాగితే ఎంగిలిదోషం.

మూడు పర్యాయాలు విడివిడిగా నీరుపోసుకొని ఆచమించాలి.

ఆచమించే కుడిచేతి అనామికకు (ఉంగరం వేలికి) దర్భముడిగానీ, బంగారపుదికానీ, వెండికానీ, రాగిగానీ ఉంగరం ఉంచాలి. ఉంగరం లేకుండా ఆచమించినా, చప్పుడయ్యేలా నీరు తాగినా అది రక్తపానంతో సమానం.

తీర్థం పుచ్చుకొనేటప్పుడు వస్త్రాన్ని నాలుగు మడతలుగా ఎడమ చేతిలో ఉంచి దానిపై కుడిచేతినుంచి గ్రహించాలి. క్రింద ఒక్క చుక్క కూడా పడనీయకూడదు. క్రింద తీర్థ బిందువు పడితే మహాపాతకం. ఒంటి చేతిని చాచి తీర్థం పుచ్చుకోరాదు. చప్పుడయ్యేలా స్వీకరించరాదు. పూజ చేసినవారు ముందు తీర్థం పుచ్చుకొని, తరువాత మిగిలిన వారికీయాలి. తీర్థం తాగిన తరువాత ఆ చేతిని తలపై రాసుకోరాదు. ఒక వస్త్రంతో తుడుచుకోవాలి.



**ప్ర: ఆదిశంకరుడు శివావతారమని కూర్మపురాణం, శివరహస్యం చెప్పాయన్నారు. పురాణాలు శంకరునికి ముందున్నవే కదా! వాటిలో ఈ అవతారం గురించి చెప్పడం ఎలా సంభవం?**

**జ:** పురాణాలు గతానికి మాత్రమే కాక అనంతకాలానికి చెందినవి. భవిష్యదవతారాలను కూడా పురాణాలు ప్రస్తావించాయి. **'శంకరోవతరిష్యతి' 'కరిష్యత్స్వవతారం'...** అనే వాక్యాలు భవిష్యకాలాన్ని సూచించేవి. యుగాంతంలో రానున్న కల్కి అవతారం గురించి కూడా పురాణాలు చెప్పినవి. అందుకే – శంకరునకు ముందే ఉన్న పురాణాలలో ఆయన అవతార ప్రసక్తి ఉండడం ఆశ్చర్యంకాదు. అయితే కొంతమంది ఈ పురాణ సంప్రదాయాన్ని సరిగ్గా గ్రహించలేక తమ మతాల దేవుళ్ళను కూడా మన పురాణాలు చెప్పాయని తప్పుత్రోవ పట్టిస్తున్నారు. జాగ్రత్తగా మనం వ్యవహరించాలి.

**ప్ర: ఆబ్దికం చేసేటప్పుడు – చనిపోయినవారి తిథి ఆ రోజు పగలు పదిగంటలకు వచ్చి, మర్నాడు ఉదయం కొన్ని గంటలు మాత్రమే ఉన్నప్పుడు శ్రాద్ధకర్మ ఎప్పుడు చేయాలి?**

**జ:** ఇది జ్యోతిష – ధర్మ శాస్త్రాల సమన్వయంతో తేల్చ వలసిన అంశం. మీరు అనుసరించే పంచాంగ సంప్రదాయం ప్రకారం నిర్ణయించుకోవాలి.

అయితే–అపరాహ్న (మధ్యాహ్నం 12 గం॥) సమయంలో ఉన్న తిథినే గ్రహించాలి కనుక, 10 గంటలకు వచ్చిన తిథి ఉన్న రోజునే ఆబ్దికానికి స్వీకరించాలి.

**ప్ర: సాలోక్య, సామీప్య, సాయుజ్య ముక్తులు.. అంటే ఎట్టివారు? భేదాలేమిటి?**

**జ:** పై మూడింటితో పాటు 'సారూప్య' అనే ముక్తి కూడా ఉన్నది. సారూప్య, సాలోక్య, సామీప్య, సాయుజ్య.... అని ముక్తి భేదాలు. తాను ఉపాసించే దేవతను నిరంతరం ధ్యానించడం చేత ఆ దేవతా రూపాన్ని (దివ్యమంగళ దేహాన్ని) ధరించడం సారూప్యముక్తి. వైకుంఠంలో విష్ణువువంటి రూపాలు, మణిద్వీపంలో అమ్మ వంటి రూపాలు, కైలాసంలో శివుని వంటి రూపాలు.. ఇవి సారూప్యముక్తులు. నిరంతరం భగవల్లోక భావన (భగవంతుడే లోకంగా ఉండడం) చేత ఆ దేవతాలోకంలో నివసించడం 'సాలోక్యం'. ఆ లోకంలో కూడా దేవతకి సమీపంలో ఉండగలిగే భాగ్యం 'సామీప్యం'. చివరకు మరి దేవతకు భిన్నము కాకుండా పూర్తిగా తన జీవభావం దేవతలో విలీనం కావడం సాయుజ్యం. ఇది అద్వైతంలో చెప్పబడుతుంది. తాదాత్మ్య ఉపాసన, అభిన్న భావన వలన లభించే ముక్తి ఇది. వారి వారి ఉపాసన స్థాయిని బట్టి ఈ ముక్తులు అనుగ్రహించబడతాయి. ఇంకా– ఈశ్వరుని శక్తులవంటి శక్తులను పొందే 'సార్ష్టి' అనే ముక్తిని కూడా కొన్ని గ్రంథాలు చెప్పాయి.

**ప్ర: 'ఏడుగడ' అనే మాట ప్రాచీన తెలుగు సాహిత్యంలో కనిపిస్తోంది. ఆ 'ఏడు' సంఖ్య దేనికి వర్తిస్తుంది? ఆ పదానికి అర్థం ఏమిటి?**

**జ:** 'ఏడుగడ' అనే మాటకి 'ఆధారము, ఉనికి' ప్రధానార్థం. వ్యక్తి ఏడు రకాల ఆధారాల వలన తన జీవితాన్ని నిర్వహించగలడు. తల్లి, తండ్రి, గురువు, పురుషుడు (జీవ చైతన్యం), విద్య, దాత, దైవము – ఈ ఏడు ఉనికికి, మనికికి కావలసినవి. కనుక వీటిని 'ఏడుగడ' అంటారు. ఒక శక్తి గానీ, వ్యక్తి గానీ ఈ ఏడురకాలుగా సహకరించినప్పుడు ఆ శక్తినీ, వ్యక్తినీ 'ఏడుగడ' అనడం సంప్రదాయం.

**ప్ర: ప్రహ్లాదునితో పాటు నలుగురు సోదరులున్నట్లు భాగవతంలో చదివాను, కానీ వారి పేర్లు తెలియలేదు. ఆ పేర్లు ఏమిటి? వారి తల్లి 'లీలావతి'యే కదా!**

**జ:** ప్రహ్లాదుని సోదరుల పేర్లు, తల్లి పేరు విష్ణుపురాణంలో ఉన్నాయి. పోతనగారి భాగవతంలో 'లీలావతిన్ గూడి' అని ఒక పద్యంలో ఉంది. అది కేవలం 'స్త్రీ' అనే

అర్థంలో వాడబడింది తప్ప, హిరణ్యకశిపుని భార్య పేరు అని చెప్పబడలేదు. 'విష్ణుపురాణం' ప్రకారం – ప్రహ్లాదుని తల్లి (హిరణ్య కశిపుని భార్య) పేరు 'కయాధువు'. సోదరుల పేర్లు హ్లాదుడు, సుహ్లాదుడు, సంహ్లాదుడు.

ప్ర: ***ఈ మధ్య మా ప్రాంతంలో క్రైస్తవులు వాళ్లల్లో ఎవరైనా మరణిస్తే వెళ్లి బైబిలు చదవడం చూసి –మన హిందువులు కూడా కొత్త పద్ధతి అవలంబించారు. హిందువుల్లో ఎవరైనా మరణిస్తే కొందరు హిందువులు అక్కడికి వెళ్లి–భగవద్గీతలో కొన్ని శ్లోకాలు చదువు తున్నారు. "భగవద్గీత మన మత గ్రంథం. మనం దీనిలోని శ్లోకాలు చదివితే జీవుడు మంచి లోకాలకు వెళతాడు. క్రైస్తవుల మతమార్పిడి దుశ్చర్యను ఎదుర్కొన డానికి ఇది ఒక మార్గం" అని వాళ్లు వివరణనిచ్చారు. ఈ పద్ధతి సమంజసమేనా?***

**జ:** భారతదేశంలో ఉన్న క్రైస్తవం వేరు – అసలైన క్రైస్తవ దేశాలలోని క్రైస్తవం వేరు. ఏదైనప్పటికీ వాళ్ల పద్ధతిని అనుకరిస్తూ మనం కొత్త పద్ధతులను ప్రవేశపెట్టనవసరం లేదు. మన పద్ధతులు మనకున్నాయి. భగవద్గీత మరణించిన తరువాత చదవాల్సిన గ్రంథం కాదు. బ్రతికుండగా చదివి బాగుపడవలసిన గ్రంథం. అది మరణకర్మల పుస్తకంగా అనుకోవడమే అవివేకం.



మనకి పవిత్ర గ్రంథాలు చదివి ఆత్మశాంతి కలిగించడం సంప్రదాయం కాదు. మరణానంతరం వారి వారి కుటుంబ సంప్రదాయాలను, పరంపరను అనుసరించి మంత్రాదులతో, ధర్మశాస్త్రాలను అనుసరించి మనం కర్మలను జరిపించాలి. అవి ఔర్ధ్వదైహిక క్రియలు. ఈ ధర్మ శాస్త్రాల పరంపర, వైదిక విజ్ఞానం ఆ మతస్థులకు లేవు. ఏం చేయాలో తెలియక, వాళ్లు పవిత్ర గ్రంథమనుకొనే తమ మత గ్రంథాన్ని చదువుకుంటారు. అది వారి పద్ధతి. అది వారికి తగినది.

దానికి ప్రతిధ్వనిలా మనం మనకున్న పద్ధతులను మార్చుకో నవసరం లేదు. భగవద్గీత ఒక్కటే మన మత గ్రంథం అనడానికి లేదు. మన ధర్మాలను బోధించే వేద పురాణ రామాయణ భారతాలన్నీ సనాతన ధర్మాన్ని మన జీవితంలో ప్రసరింప జేయడానికై ఉన్నవి. వీటన్నిటినీ మన మత గ్రంథాలు అనుకున్నా తప్పు లేదు గానీ – 'హైందవ ధర్మం'గా చెప్పబడుతున్న మన ఆర్ష ధర్మం ఒక మత గ్రంథం మీదనో, ఒక ప్రవక్త మీదనో ఆధార పడిలేదు. వారి మత స్వభావాల ననుసరించి ఆ కోణంలోనే ఇతర ధర్మాలను కూడా 'మతం' గాడిన కట్టి, వారికి మాదిరిగానే మనకి కూడా ఒక మత గ్రంథాన్ని చెప్పాలని 'భగవద్గీత' ను చెప్పారు. నిజానికి మన సనాతన

వేదాంత ధర్మాన్ని చాటి చెప్పే గ్రంథం భగవద్గీత, అంతే. నిస్సందేహంగా భగవద్గీత మహోన్నత గ్రంథమే. కానీ వాళ్ల మత గ్రంథాల వంటిది కాదని తెలుసుకోవాలి. వారు చేస్తున్న మత మార్పిడి దుశ్చర్యను ఎదుర్కొనే పద్ధతులు – వాళ్లని అనుకరించడాలు కావు. మనవైన సనాతన పద్ధతులను, ఆచారవ్యవహారాలను చక్కగా ఆచరించాలి. ఇదే పరిష్కారమార్గం, వాళ్ళ మత స్వభావ స్వరూపాలు వేరు. మన ధర్మమార్గాలు వేరు. ఋషులు అతీంద్రియ శక్తితో గ్రహించి ఆవిష్కరించిన విజ్ఞానమయమైన ఆర్ష ధర్మానికి – వారి విశ్వాసాల మతాలతో పోలికే లేదు.

**ప్ర: సముద్ర స్నానానికి నియమాలు ఏమిటి?**

**జ:** సముద్రాన్ని ఎప్పుడుపడితే అప్పుడు తాకరాదు. వినోదార్థమో, విలాసార్థమో సముద్రంతో ఆడుకోవడం తగదు. మంగళ, శుక్రవారాలలో సముద్రస్నానం చేయరాదు. పర్వదినాలలో మాత్రమే సముద్రస్నానం చేయాలి. వైశాఖ, ఆషాఢ, కార్తిక, మాఘ మాసాలలో సముద్రస్నానం మంచిది. సముద్రస్నానానికి వెళ్లే ముందుగానే చన్నీటి స్నానం చేసి వెళ్లాలి. స్నానానంతరం మళ్లీ చన్నీటి స్నానం చేయాలి. పదిహేను నిమిషాలు దాటి సముద్రంలో స్నానం చేయరాదు. సముద్రునికి ముందుగా నమస్కరించి సంకల్పం చెప్పుకొని, బయట మట్టిని లోపల వేసి, తరువాత స్నానం చేయాలి. స్నానం చేసేటప్పుడు మౌనాన్ని పాటించాలి. దైవస్మరణ చేయాలి.



**ప్ర: ద్వైతం – విశిష్టాద్వైతం – అద్వైతం... ఈ మూడింటికి అర్థాలేమిటి? ఈ శబ్దాలు, ఏవో వివాదాలు వినడమే కానీ వీటికి అర్థాలు తెలియవు.**

**జ:** జీవుడు–జగత్తు–ఈశ్వరుడు... ఈ మూడింటి గురించి చర్చించేది వేదాంతం. ఈ మూడు దేనికదే స్వతంత్రమైన ఉనికి కలవిగా భావించి, జీవ ఈశ్వర చైతన్యాలు దేనిపాటికవే విడిగా ఉన్నట్లు దర్శించే సిద్ధాంతం ద్వైతం (రెండూ వేర్వేరని భావించేది). ఈ మూడింటిలో ఈశ్వర చైతన్య మొక్కటే శాశ్వతమైన ఉనికితో భాసిస్తున్నది. కనుక అతడొక్కడే 'శేషి'. (ప్రధానమైనవాడు) మిగిలిన జీవజగత్తులు రెండూ ఈశ్వరుని యొక్క 'శేషములే' (ఆధారపడినవారు) అని భావించే సిద్ధాంతం 'విశిష్టాద్వైతం'.

శైవ, శాక్త, వైష్ణవాది మతాలన్నీ ఈ రెండు విభాగాలలోనూ ఉన్నాయి. ముఖ్యంగా ద్వైత వైష్ణవ సిద్ధాంతం ఒకటి ఉన్నా, శివకేశవాది మతాలలో విశిష్టాద్వైత సంప్రదాయమే ముఖ్యం.

అక్కడ 'ఈశ్వరుని' శైవులు 'శివుడం'టారు. వైష్ణవులు 'విష్ణువ'ంటారు. ఇలా ఈ

ద్వైత విశిష్టాద్వైతాలలో బహు సంప్రదాయ బేధాలు, పరస్పర విరుద్ధాభిప్రాయాలున్నాయి.

ఇక –మూడవది. ఉన్నది ఈశ్వరుడు ఒక్కడే. అదే సత్య, నిత్యతత్త్వం. మరి రెండవది లేదు. జీవుడు, జగము కూడా స్వతంత్ర ఉనికిని కలిగినట్టు కనిపిస్తున్నా అది సత్యం కాదు. ఈశ్వరీయమైన ఉనికి తప్ప, వాటికి వేరు ఉనికి లేదు. ఈ సిద్ధాంతం 'అద్వైతం'. రెండు అన్నది 'ద్వైతం', రెండు కానిది 'అద్వైతం', అంటే 'ఏకం' – ఉన్నది ఒక్కటే.

సాధన స్థాయిలో ద్వైత విశిష్టాద్వైతాలు సహకరించినప్పటికీ, పరమసత్యం అద్వైతమేనని ఉపనిషద్వచనం. మాయాకల్పితమైన జీవభావంగా ఈశ్వర చైతన్యాన్ని ఉపాధి పరిమితులలో ఇమిడ్చి చూడడమే ద్వైతం. ఆ పరిధులకు అతీతమైన సత్యం ఏకం, ఉన్నది అదే. అది ఉంటేనే అన్నీ ఉన్నట్లు. కెరటాలు ఎన్నో ఉన్నా, అన్నిటా ఒకే సముద్రాన్ని చూడగలగడమే అద్వైతం. రెండు కాకుండా మొత్తం ఒకే ఈశ్వర చైతన్యాన్ని చూడగలగడం.

ఈ వేదాంత సిద్ధాంతాలు మూడు కూడా ఆయా సాధకులకు సహాయకారులే. అయితే భిన్న దృష్టులను పోగొట్టి, పరమసత్యంతో తన ఉనికిని తాదాత్మ్యం చెందించే మోక్ష సిద్ధి అద్వైత విచారణతో సాధ్యమౌతుంది. ఆ లక్ష్యశుద్ధితో సనాతనమైన వారి వారి సంప్రదాయ సరళులను అనుసరించడమే క్షేమంకరం.



**ప్ర: కొందరు జున్ను తినరాదని అంటున్నారు. నిజమేనా?**

**జ:** ఆవు ఈనిన పదకొండు రోజుల లోపల పాలను తీయడం కూడదు. దానిని స్వీకరించ రాదు. స్వీకరిస్తే పాతకం. ఈ విషయం ధర్మశాస్త్రాలలో, మహాభారతంలాంటి స్మృతి గ్రంథాలలో ఉన్నదే. అందుకే జున్ను తినరాదంటారు.

**ప్ర: 'పరమాన్నం' అని దేనినంటారు?**

**జ:** పాలలో బియ్యం వేసి వండిన దానినే పరమాన్నం అంటారు. ఆవు పాలతో వండిన పరమాన్నమే దేవతలకు నివేదించాలి. అన్నాలలో అత్యంత శ్రేష్ఠమైనది. అన్ని పదార్థాల కన్నా, ఈ అన్నమే దేవతలకు అత్యంత ప్రీతికరం. కనుక 'పరమాన్నం'.

**ప్ర: రజ్జు సర్పభ్రాంతి – శుక్తి రజత భ్రాంతి అంటే ఏమిటి?**

**జ:** తాడును చూసి పాము అనుకొనే భ్రమ రజ్జు సర్పభ్రాంతి. ముత్యపు చిప్పను వెండి అనుకొనే భ్రమ 'శుక్తి రజత భ్రాంతి'. అదే విధంగా బ్రహ్మమైన జగతిలో బ్రహ్మ

భావనను వదిలి జగముగా జగత్‌దృష్టితో భావించే బుద్ధి ఈ భ్రాంతిలో ఉన్నదని గ్రహించవచ్చు. వెలుగు తేటగా కనబడే సరికి పదార్థం యదార్థంగా కనిపించినట్లు గానే, జ్ఞాన ప్రకాశం చేతనే అజ్ఞానం తొలగి అసలు సత్యం 'నేనవరిని' అనే ప్రశ్న పుడతాయి. అప్పుడు అన్వేషణ, ఆవిష్కరణ సాధ్యమవుతుంది.

**ప్ర: శ్రీవేంకటేశ్వరస్వామిని 'అర్చావతారం' అంటారట. అవతారాలలో ఈ భేదం ఏమిటి?**

**జ:** విశిష్టాద్వైత సిద్ధాంత ప్రకారం నారాయణుడు ఐదు స్వరూపాలతో భాసిస్తున్నాడు. 1. పర, 2.వ్యూహ, 3. విభవ, 4. అంతర్యామి, 5. అర్చావతారం.

**1.పరస్వరూపం:** శుద్ధసత్త్వంతో, అద్భుత తేజస్సుతో వైకుంఠంలో నిత్యమూ భాసించే, భూదేవీ శ్రీదేవీ సమేత మూర్తి. కేవలం నిత్యముక్తులకు ఇది దర్శనమిస్తుంది.

**2.వ్యూహస్వరూపం:** జగత్ సృష్టికి మూలకారణమైన స్వరూపం. నాలుగు వ్యూహాలతో ఉన్నది. అవి – వాసుదేవ, అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ. ఈ వ్యూహాలతో సృష్టి స్థితి లయలను నిర్వహించువాడు. వాసుదేవుడు క్షీరసాగర శయనుడైన మూలమూర్తి. అనిరుద్ధుడు సృష్టికారక చైతన్యం. ప్రద్యుమ్నుడు స్థితి శక్తి. సంకర్షణుడు లయ కారకుడు. అనిరుద్ధాంశ బ్రహ్మ, సంకర్షణాంశం రుద్రుడు, ప్రద్యుమ్న తేజం విష్ణువు.

**3.విభవ స్వరూపం:** ధర్మరక్షణార్థం లీలగా అవతరించే నారాయణుడు. అప్రాకృత దివ్య మంగళస్వరూపంతో, లీలా విభూతితో ఇలకు దిగిన శ్రీరామ, శ్రీకృష్ణాదులు హరి యొక్క విభవస్వరూపులు.

**4. అంతర్యామి:** జీవుల హృదయాలలో భాసించే పరమాత్మ. అందరి ప్రవృత్తులకు కారకమై, సత్కర్మానుష్ఠానాలకు అనుమతించే స్వరూపమే అంతర్యామి.

**5. అర్చావతారం:** అర్చింపబడి అనుగ్రహించేందుకు వివిధ క్షేత్రాలలో వెలసిన భగవద్రూపం. తిరుమలలో శ్రీవేంకటేశ్వరుడు, శ్రీరంగంలో రంగనాథుడు మొదలైన వారు.

**ప్ర: ఆలయాలలో తలనీలాలను ఎందుకిస్తారు? ముఖ్యంగా 'తిరుమలలో' అలా ఇచ్చి తీరాలా? ఇచ్చేటప్పుడు నియమాలేమిటి? స్వయంగా 'షేవింగ్' చేసుకోవచ్చా?**

**జ:** సత్కార్యాలను ఆచరించేటప్పుడు తల, మీసము, గడ్డము గొరిగించుకొనడం మన సంప్రదాయం. ముఖ్యంగా తీర్థయాత్రలలో, పితృకర్మ, యజ్ఞదీక్ష మొదలైన సందర్భా లలో ముండనాన్ని విధించారు. అయితే తీర్థ యాత్రలలో ఇది తప్పనిసరిగా చేయ వలసిన కర్మ కాదు. "క్షురకర్మ, ఉపవాసం వ్యక్తి ఇష్టంపై ఆధారపడి ఉంది. తప్పనిసరి

కాదు. ఇది కామ్య కర్మ మాత్రమే” అని ‘తీర్థేందుశేఖరం’ అనే గ్రంథంలో ఉంది. ‘కామ్యకర్మ’ అనగా ఒక కోరిక కోసం చేసినది అంటే ‘మ్రొక్కుబడి’ వంటిది. అయితే కొన్ని విధాలైన యజ్ఞాలలో, దీక్షలలో ఇది తప్పనిసరి. ధర్మశాస్త్రాల ప్రకారం – పాపాచరణ చేసినప్పుడు అది శిరస్సున కేశాలలో చేరుతుంది. అందుకే వాటిని తొలగించి, స్నానంచేసి శుద్ధుడై కొన్ని పవిత్ర కర్మలకు, తీర్థవిధులకు సిద్ధపడాలి. అయితే పుణ్యస్త్రీలకు ముండనం, క్షురకర్మ నిషిద్ధాలు.

క్షురకర్మ (క్షౌరం) కేవలం శిరస్సుపైని కేశాలను మాత్రమే తొలగించడం. ముండన మంటే తల కేశాలతో పాటు గడ్డం, మీసం గొరిగించడం, అయితే ఆ క్రియలో శిఖను ఉంచడం ఆచారం. ముందు బాహుమూలలు, గడ్డం, తరువాత శిరస్సుపైని కేశాలను తొలగించాలి. దీనిని ‘దైవం’ అంటారు. అలా కాక వ్యతిరేకంగా చేస్తే ‘అసురం’ (రాక్షసం) అంటారు. ఇది అపవిత్రం.

అయితే ‘స్వయంక్షౌరం’ గురించి శాస్త్రప్రకారం చెప్పాలంటే తీర్థాదులలో, సత్కర్మలకు ముందు మాత్రమే కాక, మామూలు జీవనంలో కూడా అది నిషేధమే. స్వయంగా క్షౌరం చేసుకొనరాదనీ, క్షురకుని చేతనే జరపాలని విధి. (దీని ద్వారా వృత్తుల వారికి ఉపాధిని కల్పించడం కూడా లౌకిక ప్రయోజనం.)



**ప్ర: రాధాదేవి శ్రీకృష్ణుని మేనత్త అని కొందరంటారు. రాధా కల్యాణాలు కూడా కొందరు జరిపిస్తారు. కానీ భాగవతంలో ‘రాధ’ పాత్ర లేదని, అది కల్పితమనీ కొందరం టారు! ఏదినిజం?**

**జ:** కృష్ణకథని భాగవతం కృష్ణ ప్రధానంగా చెప్పింది. కానీ ఇతర పురాణాలలో రాధా ప్రస్తావన ఉన్నది. వేదాలలో కూడా పరిపూర్ణ శక్తిగా రాధ గురించి వర్ణించారు. పరమాత్ముని హ్లాదినీ శక్తి (ఆనందశక్తి) రాధ. నిత్యగోలోకంలో శ్రీకృష్ణునిగా ఉన్న నారాయణుని వీడని ఆనందస్వరూపిణి. ఆ కృష్ణుడు గోపకునిగా నందవ్రజంలో అవతరించినప్పుడు, ఆ శక్తి గోపికగా ఆవిర్భవించింది. వృషభానుడు అనే గోపరాజుకి తనయగా ఉద్భవించింది.

రాధాకృష్ణుల బంధం దివ్యమైనది. లౌకికమైనది కాదు. అసలు గోపికా కృష్ణ బాంధ వ్యమే అలౌకికం. అందుకే ఆ బంధాలలో వివాహాల, దాంపత్యాల లక్షణా లుండవు. అది ధర్మానికీ, అధర్మానికీ కూడా అతీతమైన మోక్షభూమికకు చెందిన శుద్ధతత్త్వం. భావశుద్ధి కల ఉపాసకులకు రాధాతత్త్వం అవగతమవుతుంది.

గర్గ భాగవతంలో రాధమ్మ కథ చక్కగా చెప్పబడింది. దేవీ భాగవతం, బ్రహ్మవైవర్త పురాణం, పద్మపురాణం వంటి కొన్ని వ్యాస ప్రోక్త పురాణాలలో రాధాతత్త్వం, వైభవం వివరంగా చెప్పబడ్డాయి. బృందావనవాసులు, యోగులు రాధ గురించి చెప్పగలరు. రాధాకృష్ణ ఆరాధన కల్పితం కాదు.

అయితే భాగవతం గోపికలలో ఏ ఒక్కరి పేరు కూడా చెప్పలేదు. అందుకే గోపికగా అవతరించిన రాధారాణి పేరు కూడా వచించలేదు. కానీ రాధను ప్రధాన శక్తిగా, కృష్ణ ప్రాణశక్తిగా శుకమహర్షి రహస్యంగా రాధాతత్త్వాన్ని భాగవతంలో నిక్షిప్తం చేశారు. భాగవతంలో రాధ గూఢనాయిక. ఇతర పురాణాలలో ప్రకటితం. నేటికీ తపోబలంతో రాధా కృష్ణ దర్శనం చేసుకున్న యోగులున్నారు. బృందావన ధామాన్ని, విశుద్ధాంతరంగంతో ఆశ్రయించి, సద్గురువులను శరణు వేడి తెలుసుకొంటే కొంత మేరకు రాధాతత్త్వం అర్థ మౌతుంది. పూర్తి ప్రాపంచిక విషయాలలో దృష్టి పాతుకున్న వారికి ఆ తల్లి తత్త్వం అర్థం కాదు. రాధ మేనత్త అనే కథలకు పురాణాధారాలు లేవు. అవి ఆయా కవుల బుద్ధిపైత్యాల కల్పన.

సారాంశం – రాధాదేవి కల్పిత పాత్ర కాదు. అలౌకికమైన పరాశక్తి.

**ప్ర: వేంకటేశ్వరస్వామి విగ్రహంలో శంఖ చక్రాలు లేవని కొందరంటారు. అంటే అతడు విష్ణువు కాదా? ఎందుకు లేవు? అలంకారంలో ఎందుకుంచుతున్నారు?**

**జ:** పురాణ శాస్త్ర ప్రకారంగా – నారాయణుడు వేంకటాద్రిపై వేంకటేశ్వరునిగా వెలశాడు. 'సింహాదుడు' అనే రాక్షసుని చేత లోకాలు బాధపడుతుంటే దేవతలు, ఋషులు శ్రీనివాసుని శరణు వేడారు. అప్పుడు రాక్షస సంహార బాధ్యతను తన దాసుడైన తొండమాను చక్రవర్తికి అప్పగించాడు.

విష్ణుశక్తి లేనిదే దనుజసంహారం సాధ్యం కాదు కనుక, చక్రవర్తి ప్రార్థన మేరకు తన చక్ర, శంఖాది పంచాయుధాలను స్వామి నియమించాడు. ఆ పంచాయుధాల శక్తితో చక్రవర్తి దనుజసంహారం చేశాడు.

అటుపై స్వామి (శ్రీనివాసుని) ఆజ్ఞ మేరకు ఆ చక్రాదులు తిరుమల తీర్థాలలో నెల కొన్నాయి. ఆ తీర్థాలను సేవించిన వారికి ఆ ఆయుధ దేవతల అనుగ్రహం లభిస్తుంది.

ఈ గాథను తెలియజేస్తూ తన ఊర్ధ్వబాహువులలో శంఖ చక్రాలను దాల్చకుండా, క్రింది రెండు చేతులలో వరదముద్ర, కట్యవలంబిత ముద్రలను దాల్చి ఉన్నాడు.

అయితే విష్ణువు సహజంగా శంఖ చక్రధారి కనుక ఆ మూర్తి యందు అలంకరణ వేళ శంఖ చక్రాలను ధరింపజేసి, స్వామి సహజ సౌందర్యాన్ని మనకు దర్శింపజేస్తారు. శ్రీవేంకటేశ్వరుడు విష్ణువే. పురాణాది శాస్త్రాలు తేల్చి చెబుతున్న సత్యమిది. అయితే దానిని హరిహర మూర్తిగాను, శక్తిగాను, స్కందునిగాను వివిధ విధాలుగా భావించిన వారున్నారు. అందరి దేవతల సమన్వయ స్వరూపమైన శ్రీమన్నారాయణుడే శ్రీవేంకటేశుడు.

**ప్ర: దేవీ భాగవతంలో అమ్మవారి ఐదుమూర్తులు – దుర్గ, లక్ష్మి, సరస్వతి, గాయత్రి, రాధ.... అని ఉన్నది. ఇందులో మొదటి నాలుగు రూపాల నామాలు లలితా సహస్రనామాలలో ఉన్నాయి. మరి 'రాధ' పేరు ఎందుకు లేదు?**

**జ:** లలితా నామాలలో పరాశక్తి రూపాలన్నీ ఉన్నాయి. "ఆబాలగోపవిదితా" అనే నామం రాధాదేవిని తెలియజేసేదే. నందవ్రజంలో బాలురచే గోపీగోపకులందరిచే ఆరాధింప బడిన కృష్ణతత్త్వస్వరూపిణి రాధ. గోలోక నివాసిని అయిన ఆ పరాశక్తి శ్రీకృష్ణుని ఎడబాయలేక, భూమిపై అవతరించింది. ఇలా అవతరించడం చేతనే ఆమె అందరిచే తెలియబడే ఆరాధనలందుకున్నది.



ఈ 'ఆబాలగోపవిదితా' నామం రాధను తెలియజేస్తుందని విజ్ఞుల మాట. ఈ విషయం ఆ మధ్య కాశీక్షేత్రంలో ఉపన్యసిస్తూ శ్రీబదరీ, ద్వారకా శంకర పీఠాధీశులు శ్రీశ్రీశ్రీ స్వరూపానందేంద్ర సరస్వతి గారు కూడా వచించారు.

ఇంకా–ప్రేమరూపా,రస్యా, రసజ్ఞా... ఈ నామాలు కూడా రాధాతత్త్వానివేనని భావించవచ్చు.

**ప్ర: 'రాహుకాల' పూజలు ఆదివారం, మంగళవారం, శుక్రవారం ఆలయాల్లో చేస్తుంటారు. నిమ్మ డిప్పల్లో దీపం వెలిగిస్తారు. అవి ఇంట్లో వెలిగించవచ్చా? అయితే మంగళవారం నాడు మధ్యాహ్నం రాహుకాలం కనుక ఆ సమయంలో ఆలయాలు తెరవవచ్చా? దీపాలు వెలిగించవచ్చా? రాహు కాలం ఆంధ్రదేశమంతటా పాటించరెందుకు? కేవలం నెల్లూరు పరిసరాలలోనే పాటిస్తారా? తమిళప్రభావమా? ఒకే విజ్ఞానానికి ప్రాంతభేదాలెందుకు?**

**జ:** రాహు సంచార ప్రభావం తిరుమల గిరులకు అటు ప్రక్కనే ఉంటుంది. అందుకే నెల్లూరు, తమిళనాడు అంతా రాహుకాలం పాటించాలి – పాటిస్తున్నారు. ఆ పూజలకు రాహుకాలమే ప్రధానం.

అందుకే మంగళవారం మధ్యాహ్నం రాహుకాలంలోనైనా గుడిలో ఆరాధనలుంటాయి. అయితే నిమ్మడిప్పల్లో దీపాలు వెలిగించడం గుడిలో చేయడం మంచిది. ఇంట్లో రాహుకాలంలో అలా దీపాలు వెలిగించనక్కర్లేదని పెద్దలు చెబుతున్నారు.

**ప్ర: 'విశ్వేదేవతలు' అంటే ఎవరు? వీరి ప్రత్యేకత ఏమిటి? వీరెంతమంది?**

**జ:** విశ్వేదేవతలు పదిమంది. 'విశంతి కర్మసు–ఇతి విశ్వే' – ఆయా కర్మానుష్ఠానాలలో ఆరాధింపబడేవారిగా ప్రవేశమును పొందినవారు. వీరు 'విశ్వా' అనే ఆమెకు పుత్రులు. కర్మానుష్ఠానాలలో వీరిని ఆరాధిస్తారు.

**వసుః సత్యః క్రతుర్దక్షః**
**కాలః కామో ధృతిః కురుః।**
**పురూరవా మాద్రవాశ్చ**
**విశ్వేదేవా దశస్మృతాః॥**

వసువు, సత్యుడు, క్రతువు, దక్షుడు, కాలుడు, కాముడు, ధృతి, కురు, పురూరవుడు, మాద్రవుడు... ఇవీ వారిపేర్లు.

**ప్ర: మూడుకోట్లు, ముప్పైమూడు కోట్లు – అని మన దేవతల సంఖ్య చెబుతుంటారు. ఇందులో మూడు, ముప్పై మూడు కూడా తెలియవు. మరి 'కోట్ల' సంఖ్య ఎలా తెలుస్తుంది?**



**జ:** 'కోటి' అంటే 'సమూహము' అని అర్థం. ప్రధాన దేవతలు ముగ్గురు. వీరు దేవతలకే శాసకులు. బ్రహ్మ, విష్ణు, రుద్రులు– ముగ్గురు దేవదేవులు. వీరి పార్షద గణాలే కోట్లు (అత్యధిక సంఖ్య– అని అర్థం). ఈ గణాలను, ఆ ముగ్గురు దేవతలను కలిపి 'మూడుకోట్లు' అన్నారు. ఇక, విశ్వ నిర్వహణకై ఈశ్వర శక్తి తన విభూతులతో దేవతా వ్యవస్థను ఏర్పరచింది. ద్వాదశాదిత్యులు(12), ఏకాదశ రుద్రులు(11), అష్టవసువులు (8), ఇంద్రుడు (1), ప్రజాపతి (1).....కలిపి 33. వీరి గణములు అసంఖ్యాకం. కనుక 'కోట్లు'.

**"అష్టౌ వసవః ఏకాదశరుద్రాః ద్వాదశాదిత్యాః**
**తే ఏకత్రిగ్ం శత్ (31), ఇంద్రశ్చైవ ప్రజాపతిశ్చైవ**
**త్రయస్త్రిగ్ం శత్"** అని శతపథ బ్రాహ్మణము.

ఈ వేదవచన ప్రకారం పై ముప్పయి ముగ్గురినీ చెప్పడం జరిగింది. అయితే కొన్ని చోట్ల ఇంద్ర, ప్రజాపతుల బదులుగా, అశ్వినీ దేవతలు (ఇద్దరు) చెప్పబడ్డారు.

**ప్ర: సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాత – అని పేరున్న మహర్షులు బ్రహ్మ మనస్సు నుండి ఉద్భవించారని పురాణాల్లో ఉంది. అయితే – ఇందులో 'సన' అనే మాటకు అర్థం ఏమిటి? అలాగే 'సనాతనం' అనే మాటలోని భావం ఏమిటి?**

**జ:** 'సనాత్' అనే మాటకు 'ఎల్లప్పుడు' (సదా) అని అర్థం. సదా ఐదేళ్ళ ప్రాయంతో ఉంటూ, మార్పు చెందనివారు కనుక ఆ నలుగురు సనత్ శబ్దము ద్వారా వ్యవహరింపబడుతున్నారు.

అంతేకాదు– 'ఎల్లవేళలా పరబ్రహ్మతో తాదాత్మ్యం చెందినవారు' అని కూడా గ్రహించవచ్చు. పరిణామము చెందని పరిపూర్ణ బ్రహ్మజ్ఞానులు కనుక ఆ నామంతో వ్యవహరింపబడుతున్నారు.

'సదా' సుస్థిరమైన శాశ్వత ధర్మం కనుక 'సనాతనం'!

**ప్ర. దేవతార్చనలో కొందరు రెండు శివలింగాలుండ కూడదనీ, మూడు సాలగ్రామాలుండ రాదనీ చెప్తున్నారు. అసలు శాస్త్రసిద్ధంగా ఎన్నిటిని అర్చించాలి? సాలగ్రామాలు భగ్నమైనవి కూడా అర్చించవచ్చా?**

**జ.** ఈ విషయమై శాస్త్రాలు స్పష్టమైన వివరణ నిచ్చాయి.



**గృహే లింగద్వయం నార్చ్యం**
**సాలగ్రామ ద్వయం తథా ।**
**ద్వౌచక్రే ద్వారకాయాస్తు**
**నార్చే త్సూర్యద్వయం తథా ॥**
**శక్తి త్రయం త్రివిఘ్నేశం**
**ద్వౌ శంభూనార్చయేత్సుధీః ।**

–"రెండు శివలింగములు కూడదు. రెండు సాలగ్రామాలు కూడదు. మూడు శక్తి అధిష్ఠానాలు కూడదు. అలాగే మూడు గణపతులు కూడదు!

ఇంతేకాక రెండు శంఖాలు దేవతార్చనలో ఉండరాదు. మత్స్యకూర్మాది దశావతారాల సాలగ్రామాలను ఇంట్లో ఏక కాలంలో అర్చించరాదు.

**"నార్చయేచ్చ తథా మత్స్య కూర్మాది దశకం గృహే".**
**అగ్ని దగ్ధాశ్చ భగ్నాశ్చ న పూజ్యాః ప్రతిమా గృహే ॥**

కాలిన, విరిగిన ప్రతిమలను ఇంట్లో పూజించరాదు. అయితే సాలగ్రామశిల మాత్రం భగ్నమైనా, బ్రద్దలైనా పూజించవచ్చు.

ఒక్క సాలగ్రామాన్ని అర్చించవచ్చు. సాలగ్రామాలు సరిసంఖ్యలో పూజించవచ్చును కానీ, వాటిలో రెండు సాలగ్రామాలు పనికిరావు. విషమసంఖ్య (బేసి) కూడదు– అంటే మూడు, అయిదు మొదలైనవి.

**ప్ర. పాదాలు కడుక్కోడానికి కూడా కొన్ని నియమాలు చెప్తారు కదా! అవి ఏమిటి?**

**జ.** కాళ్లు కడిగేటప్పుడు మొత్తం తడవాలి. బొల్లి (ఖాళీ) ఉండరాదు. కాలి మీద కాలుపెట్టి తోమరాదు. చేతితో రాసి తోమవచ్చు. దైవకర్మలు చేసేటప్పుడు – ఉత్తర ముఖంగా ఉండి ముందుగా ఎడమపాదాన్నీ, తరువాత కుడిపాదాన్నీ కడుక్కోవాలి. తడి పాదాలతో నిద్ర పోరాదు. పొడిగా తుడుచుకొని నిద్రించాలి.

**ప్ర. అవభృథస్నానం, అఘమర్షణ స్నానం, అభ్యంగన స్నానం – వీటి తేడాలేమిటి?**

**జ.** యజ్ఞాది దీక్షలకు చివర శాస్త్రోక్తంగా చేసే స్నానం అవభృథస్నానం. 'అఘమర్షణ' మంత్రాలతో చేసే స్నానం అఘమర్షణ స్నానం. ఈ మంత్రాలు తెలియనప్పుడు గంగాది పుణ్యతీర్థాలను, శివకేశవాది నామాలను స్మరిస్తూ స్నానం చేయాలి.
తలకి నూనెనంటి తరువాత స్నానం చేయడం (తలంటు పోసుకొనుట) అభ్యంగ స్నానం.



**ప్ర: దక్షయజ్ఞ సమయంలో తండ్రిచే అవమానింపబడిన సతీదేవి యోగాగ్నిలో దూకి ఆత్మార్పణ చేసుకున్నది కదా! అగ్నిలో దూకినప్పుడు భస్మరాశిగా మారిందని ఎక్కడో చదివాను. మరి శివుడు సతీదేవి మృతదేహాన్ని భుజాన వేసుకొని లోకమంతా తిరిగాడని, అప్పుడు సతీదేవి దేహం విష్ణుచక్రం ద్వారా ఖండింపబడి అష్టాదశ శక్తి పీఠాలు ఏర్పడ్డాయని కథ ఉంది. ఇందులో ఏది నిజం? వివరంగా తెలుప ప్రార్థన.**

**జ:** కొన్ని పురాణాలు యోగాగ్నిలో శరీరత్యాగం చేయడం వరకే చెప్పాయి. శక్తి పీఠాలను గురించి చెప్పిన శాక్తేయ పురాణాలు మరికొంత వివరణను ఇచ్చాయి. వాటినీ వీటినీ సమన్వయించి చూడాలి.
అమ్మవారు అగ్నిగుండంలో పడలేదు. తనలోనే యోగాగ్నిని రగుల్చుకున్నారు. ఆ అగ్నిశిఖ ద్వారా తన ప్రాణ చైతన్యాన్ని శరీరం నుండి వేరుపరచి, అంతర్ధాన మయ్యారు. ఇదే యోగాగ్నిలో దగ్ధమవడం. ఇందులో – శరీరం బూడిద కాదు. అంతవరకు ఆమె ధరించిన లీలా శరీరం అలాగే ఉంది. నిశ్చైతన్యమైన ఆ దేహాన్ని శివుడు భుజాన వేసుకొని, సతీదేహస్పర్శతో పరవశించి తాండవం చేశాడు. అకారణంగా ఆ తాండవం ఉద్ధృతి చెందడంతో విష్ణువు లోకరక్షణకై, జగన్మాతృ

సంకల్పానికి అనుగుణంగా, చక్రం ద్వారా దేవీ దేహాన్ని ఖండించాడు. ఆ పడిన దేహభాగాలే శక్తిపీఠాలు. ఇదీ పౌరాణిక కథ.

అయితే –ఇందులో సంకేతాలు చాలా ఉన్నాయి. దేవీ దేహం నిశ్చైతన్యంగా ఉన్నా, అది శక్తిమయం. ఆ మాటకి వస్తే విశ్వశరీరమే తల్లి శరీరం. అందుకే విశ్వ శక్తులు ఆ దేహమంతా వ్యాపించి ఉన్నాయి. దేహాన్ని విడిచిపెట్టడం లీల మాత్రమే. ఆ దేహం భౌతికం కాదు. దివ్యమైనది.

దక్షుడు చేసిన శివద్రోహ పాతకానికి శిక్షగా, అమ్మవారు 'దాక్షాయణి (దక్షపుత్రిక)' గా కొనసాగరాదని నిశ్చయించుకొని, ఆ దేహాన్ని విడచి, తరువాత హిమవత్పర్వత రాజపుత్రిగా ఆవిర్భవించింది. పరమేశ్వరికి దేహాదుల అవసరమేముంది? అది లీలా రచన. అలా విడచిన దేహం కూడా శక్తిమయం కనుక, పృథ్విని పావనం చేయాలనీ, తద్వారా మనలను తరింప జేయాలనీ ఆ తల్లి తన శక్తిమయ దేహభాగాన్ని, నలు వైపులా విస్తారంగా వ్యాప్తిచెందించాలని సంకల్పించుకున్నది.
అందుకే ఈ దేహఖండన లీల.



మరియొక ఆంతర్యంలో పాంచభౌతికమైన మన దేహంలో పరమాత్మ యొక్క చైతన్యం ప్రతి అణువునా వ్యాపించి ఉంది. ఒక్కొక్క నాడీ కేంద్రానికి ప్రాణశక్తి ద్వారా వ్యాపించిన చైతన్య విశేషాలే "ఆంతరిక(అంతర్గత) శక్తి పీఠాలు". దీనిని వ్యాపింపజేసే శక్తి విష్ణువు. పరమాత్మ శివుడు. నిజానికీ మూడూ ఒక్కటే. పరమాత్మ (శివుని) చైతన్యం వ్యాపించిన వివిధ యోగకేంద్రాలే మనలోని శక్తిపీఠాలు.
అలా వ్యాపింపజేసిన ఈశ్వర సంకల్పమే విష్ణుచక్ర విన్యాసం. ఇది యోగపరంగా చేసే సమన్వయం. 'శివ– శక్తి–విష్ణు' మయమైన ఈశ్వర చైతన్యమే విశ్వమంతా వ్యాపించి ఉన్నది – అన్నదే ఈ కథలోని ఆంతర్యం.

బాహ్యక్షేత్రాలకీ, అంతర్గత యోగభూమికలకీ సమన్వయం సాధించడమే అసలైన ఆధ్యాత్మిక సాధన. అయితే – 'యోగాగ్నిలో దగ్ధమవడం' అనే మాటని సరిగ్గా గమనించక కొందరు కవులు 'బూడిద'గా మారినట్లు వర్ణించారు. అది పొరపాటు.

ప్ర: **రేవానదీ తీరంలో మంత్రజపం చాలా ఎక్కువ ఫలితాన్నిస్తుందని చాలామంది చెప్పగా విన్నాను. ఆ నది ఎక్కడ ఉందో తెలియజేస్తారా? అక్కడ వసతి సౌకర్యాలు లభిస్తాయా?**

జ: 'రేవానది' అనేది నర్మదానదికి ఉన్న మరోపేరు. ఇది ఎక్కువ భాగం మధ్యప్రదేశ్‌లో

ప్రవహిస్తోంది. దీని తీరంలో చాలా పుణ్యక్షేత్రాలున్నాయి. 'ఓంకారమమలేశ్వరం' అని ప్రసిద్ధి చెందిన జ్యోతిర్లింగ క్షేత్రం నర్మదా నది ఒడ్డున ఉంది. ఈ క్షేత్రంలో వసతి సౌకర్యాలు కూడా ఉన్నాయి. నదీ ప్రశస్తి, క్షేత్ర ప్రాధాన్యం ఉన్న చోటు శ్రేష్ఠం.

**ప్ర: 'నాకం' అనే మాట స్వర్గానికి పర్యాయం కదా! ఈ మాటకి అర్థం ఏమిటి?**

**జ:** 'అకం' అంటే దుఃఖం. 'అకం' లేనిది నాకం. (న+అకం). పూర్తిగా ఆనందమయమని అర్థం. ఇహలోకంలో ఉండే శారీరక బాధలు, జరారుజలు లేనిది నాకం.

**ప్ర: అమ్మవారి అష్టోత్తరశతనామాలలో 'భక్త హంసపరీముఖ్య వియోగాయైనమోనమః' అని 83వ నామం. ఈ నామానికి అర్థం ఏమిటి? కొన్ని పుస్తకాలలో 'పరీముఖ్య' బదులుగా 'పరాముఖ్య' అని ఉంది. ఏది సరియైన పాఠం.**

**జ:** 'పరాముఖ్య' అనేదే సరియైన పాఠం. దీని అర్థం–'పరాఙ్ముఖత్వం'. అంటే– 'పెడమొగముతో ఉండుట' (విముఖత్వం). భక్తులైన హంసల (పరమహంసలు–యోగులు) పట్ల అమ్మవిముఖంగా ఉండడంలో వియోగం కలది. అంటే విముఖత్వాన్ని కలిగి ఉండదు. భక్తయోగుల పట్ల సుముఖురాలు. ఈ మాటని ఈ విధంగా చెప్పడంలో ఒక అందముంది. ఏ మాత్రము భక్తుల పట్ల విముఖంగా ఉండని తల్లి. యోగుల హృదయంలో అమ్మయే యోగము. అక్కడ వియోగం లేదు. భక్తవాత్సల్య స్వరూపిణి. పరమహంసలలో భాసించే జ్ఞానానందతత్త్వం.

**ప్ర: ఈ మధ్య ఒక పెద్ద రచయిత, అదీ హిందూ ఆధ్యాత్మిక సాహిత్యవేత్త మాతో మాట్లాడుతూ మతమార్పిడుల గురించి కొన్ని మాటలన్నారు. అవి మాకు వేదన కలిగించాయి. ఆ మాటలకి మీ సమాధానాన్ని కోరుకుంటున్నాం.**

1. **మార్పిడి చేస్తున్న పరమతం వాళ్ళు వారి ధర్మాన్ని వారు అనుసరిస్తున్నారు. వారిని తప్పుపట్టవలసిన పనిలేదు.**
2. **దేవుళ్ళను మార్చడం హిందువులకి కొత్తకాదు. శైవులు వైష్ణవులు ఒకప్పుడు పెద్ద ఉద్యమంతో తమ దేవుళ్ళను మాత్రమే ఆరాధించాలని చెప్పారు. అప్పుడు కొందరు హిందువులే దేవుళ్ళను మార్చుకున్నారు.**
3. **అసలు ముఖ్యమైనది ధ్యానం, తాత్త్వికత, యోగం, అవి మతానికి అతీతం. రమణ మహర్షి తత్త్వవేత్త, దానికి మతంతో నిమిత్తంలేదు. అలాంటి తత్త్వాన్ని గ్రహించాలి. అంతేగానీ మతాలకోసం గొడవేమిటి?**

**జ:** ఈ ప్రశ్నలు చాలా తెలివిగా వేసినట్లుగా కనిపిస్తున్నా, ఆలోచనారాహిత్యం బాగా స్పష్టమౌతుంది.

**1.** మతం మార్చడం వాళ్ళ ధర్మమని వాళ్ళు అనుకున్నప్పుడు, మన ధర్మం నుండి మనం సడలకుండా ఉండడం, మన ధర్మాన్ని అవమానిస్తూ మార్చుతున్న వారికి బుద్ధి నేర్పడం మన ధర్మాలు. కుట్టడం తేలు ధర్మం, కాటువేయడం పాము ధర్మం. నిజమే, కానీ వాటి ధర్మాలను చేయడానికి మన ఒంటిని అప్పగించడం మన ధర్మం కాదు కదా! కుట్టే తేలుకీ, కాటేసే పాముకీ దూరంగా ఉండాలి. అవి మీద పడితే ఎలాగోలా వాటిని దూరం చేయాలి. ఇవి మన ధర్మాలు. వ్యాపారం కోసం మతాన్ని వ్యాప్తి చేస్తున్న వారికి, వారి మతంపై కూడా సరియైన గౌరవం, అసలైన అవగాహన ఎలాగూ ఉండవు.

**2.** హిందువులు హైందవ దేవుళ్ళనే అభీష్ట దైవాలుగా ఆరాధించారు. శైవులు విష్ణువునీ, వైష్ణవులు శివుని ఆరాధించినా ఒకే హైందవ మత ధర్మంలోని భాగాలివి. నిజానికి 'ఇతర దేవతలను ఆరాధించవద్దు. మాదేవతనే ఆరాధించు' అని హిందూమతంలోనే ఉపమార్పిడులకు ఉద్యమిస్తున్నవారు హైందవ వైదిక సనాతన ధర్మానికి విరోధులేనని ఈ మతంలోని విజ్ఞులు సైతం ఖండించారు. అది సిద్ధాంతంలో లోపం కాదు– అనుయాయుల రాద్ధాంతం వల్ల ఏర్పడిన వైషమ్యం. అయితే ఎంత జరిగినా వారు ఇతర దేవతల ఉనికిని కాదనలేదు. మడీతడీ, ఆచమనం, ఆచార వ్యవహారాలు, అగ్నిహోత్రారాధనలు, ఆలయవ్యవస్థ.....అన్నీ హైందవంలో అందరు దేవుళ్ళ ఉపాసనల్లో సంప్రదాయాలే. అవి సంప్రదాయంలోని ధోరణులే కానీ, మతవైషమ్యాలు కావు. హిందూ మతమనే ధర్మవృక్షానికి అవన్నీ శాఖలు మాత్రమే. వేరువేరు చెట్లు కావు. అసలు ఈ దేవతల ఉనికినే అంగీకరించని ఇతర మతస్థులు దీనిలో కలిసి పోదామనీ, తమలో కలుపుకుని, విడదీయాలనీ ఎందుకీ విన్యాసాలు?

**3.** ఇక ధ్యానయోగతత్త్వాలే ముఖ్యమైనప్పుడు,అవి మతాతీతం అయినప్పుడు మరి మతాలను మార్చడం అనవసరం. తాత్త్వికత వ్యక్తిగత బౌద్ధిక పరిణతికి చెందినది. ఆ దశలో మతాల, మతమార్పిడుల గురించి ప్రశ్నించి, చర్చించవలసినదిలేదు.

అయితే – మన అదృష్టవశాత్తు, మన మతసంప్రదాయాలు తాత్త్విక పరిణతికి, యోగపూర్ణతకీ ప్రాధాన్యాన్నిచ్చాయి. యోగం, తత్త్వచింతన, ధ్యాన నిష్ఠ ప్రతి హైందవ సంప్రదాయాలలో ప్రధానంగా ఉన్నాయి. త్రిగుణాతీత స్థితికి చేరుకున్న మహాత్ములకు

విధినిషేధాల్లేవు. వారు సుఖదుఃఖాదులకీ, శీతోష్ణాలకీ కూడా అతీతులు, వీరిని ద్వంద్వాతీతులంటారు. సంప్రదాయపాలనలోనే విచారణ ధారతో ఈ తత్త్వాన్ని అందుకోవాలి. ఇంతటి తాత్త్వికత, యోగ విజ్ఞానం-మన మతంలో ఉన్నంతలోతుగా, విస్తారంగా ఎక్కడాలేవు.

ఆ మేధావి ఉటంకించిన రమణ మహర్షి శివభక్తుల చరిత్రలు(పెరియపురాణం) చదివి, అరుణాచలం చేరుకుని ధ్యాననిష్ఠలో తపస్వియై అచ్చమైన తత్త్వజ్ఞునిగా పరిణమించారు. ఉపనిషత్తత్త్వ ప్రతిపాద్యమైన వేదాంతానికి ఆయనసాకారం. ఈ తత్త్వం వెనుక ఆధారం- హైందవులు కొలుచుకొనే అరుణాచలనాథుడైన శివుడే. అంతటి తత్త్వానికి ఆస్కార మిస్తున్న ఈ మతం నుండి మారవలసిన అవసరమే ముంది? హిందూజన సంఖ్య ఆధిక్యాన్ని తగ్గించి, క్రమంగా హైందవ ధర్మపు పునాదులపైన లేచిన భారతీయ సౌధాన్ని కుప్పకూల్చడానికై చేస్తున్న అమానుషచర్య మతమార్పిడి. తత్త్వస్థాయిలో మతాలేకాదు- ఏసిద్ధాంతమూ నిలవదు.

పరమార్థంగానో, సత్యంగానో దర్శిస్తే భూమి అంతా ఒకటే. అలాగని-ఈదేశాలు, వాటి ప్రయాణాలకు వీసాల వంటి షరతులు, సరిహద్దుల సంరక్షణలు, ప్రత్యేక రాజ్యాంగాలు...ఇవన్నీ ఎందుకు?- అని అనగలమా? వ్యవహారం వేరు-పరమార్థం వేరు. రెండింటినీ కలిపి అయోమయంలో పడి, ఆత్మవంచనకు లోనుకారాదు. మనం ఆక్రమణ చేస్తే పాపం. ఇతరులు చేసే ఆక్రమణలను అడ్డుకోకపోతే మరీ పాపం. **'స్వధర్మేనిధనంశ్రేయః'** అని చెప్పిన ఉదాత్త హిందూ ధర్మానికీ, పరధర్మం వైపులాగే హింసావంచనల ధర్మాలకీ పోలిక ఎక్కడ?

**ప్ర: దేవతార్చనలో దేవునికి ఆచమనం మధ్యమధ్యలో కూడా ఇవ్వాలంటారు కదా! అది ఎప్పుడెప్పుడు ఇవ్వాలి?**

**జ:** దేవునకు అభిషేకానికి (స్నానానికి) ముందు, స్నానం తరువాత, 'వస్త్రం సమర్పయామి' అని వస్త్రమిచ్చిన తరువాత, నైవేద్యం తరువాత తాంబూల సమర్పణ పిదప, నీరాజనం అనంతరం ఆచమనీయాన్ని సమర్పణ చేయాలి.

**ప్ర. ఈ మధ్య ఒకాయన "మేం దేవీ ఉపాసకులం. మాకు కోపం ఎక్కువ ఉంటుంది" అన్నారు. మరొక వ్యక్తి "శ్రీవిద్యో పాసకులకు కోరికలు ఎక్కువ అవుతాయి. అది రాజసవిద్య" అన్నారు. ఈ మాటలు ఏ మేరకు సత్యాలు? దేవీ ఉపాసకులకు కామ క్రోధాలు పెరుగుతాయనడం సమంజసమేనా?**

**జ:** ఆ మాటలు పూర్తిగా అసత్యాలు. అవగాహనారాహిత్యం వలన కలిగేవి. ఏ దేవిని, దేవుని ఉపాసించినా కామక్రోధాలు క్రమక్రమంగా ఉపశమించడమే అసలైన లక్ష్యం. ఉపాసనా సిద్ధికి తార్కాణం కామక్రోధాది దుర్గుణాలు తొలగడమే.

అందునా– శ్రీవిద్య సాత్త్వికమైన, తాత్త్వికమైన బ్రహ్మవిద్య. **“నిష్క్రోధా క్రోధశమనీ– నిర్మోహామోహనాశినీ– నిశ్చింతా నిరహంకారా– నిర్లేపా– నిర్మలా”** అని కీర్తించబడిన దేవి పరబ్రహ్మ స్వరూపిణి. ఆ దేవి ఉపాసన క్రమంగా భక్తి జ్ఞాన వైరాగ్యాలను, చిత్తశుద్ధిని ప్రసాదించి మోక్షాన్నిస్తుంది. అయితే “కామాక్షీ కామదాయినీ” అని నుతించబడిన తల్లి కూడా ఆ దేవియే. జీవుల అభీష్టాలను నెరవేర్చి ధర్మబద్ధమైన వాంఛలను పూర్తి చేసే ‘లోకయాత్రా విధాయిని’ లలితాంబ. భోగమూ మోక్షమూ – రెండింటినీ ప్రదానం చేసేది శ్రీవిద్యోపాసన.

ఏ ఉపాసననైనా పరహింసాదృష్టితో ద్వేషభావనతో సాగిస్తే అది తామసికోపాసన. కేవలం కోరికలను తీర్చుకోడానికే అయితే అది రాజసికోపాసన. చిత్తశుద్ధికై, జగదంబాప్రీతిగా సాగించే ఉపాసన సాత్త్వికోపాసన. కేవలం దేవీ ఉపాసనలోనే కాదు– ఏ దేవతారాధనలోనైనా ఈ మూడు రకాల ఉపాసకులూ ఉంటారు. శ్రేష్ఠ మైనది సాత్త్వికోపాసన. కానీ కోరికలు లేని స్థితి అంత తేలిక కాదు. సామాన్యంగా ఉత్తమ సంస్కారవంతులకు ప్రారంభ దశలో కించిత్ రాజసప్రవృత్తితో మిళితమై, అధికంగా సాత్త్వికదృష్టితో సాగే ‘రజోమిశ్రిత సాత్త్వికోపాసన’ ఉంటుంది. క్రమంగా సాత్త్వికత పెరిగి, రజస్సు కూడా తొలగుతుంది. ఇదే సిద్ధికి హేతువు. ఈ సాత్త్వికత తాత్త్వికతకు దారితీస్తుంది.

ఫలానా దైవాన్ని ఆరాధిస్తే కామక్రోధాది వికారాలు కలుగుతాయనడం మహాప రాధం. మన మనోవికారాలను దైవోపాసన ఫలితాలుగా అంటగట్టి, దేవతాపచారం చేయరాదు. కేవల రాజస తామసోపాసకులు వేరు. వారిని ఉత్తమోపాసకులుగా పరిగణించరాదు.

**ప్ర: జైనమతంలో తీర్థంకరులలో ఒకనిగా ప్రథమంగా ఋషభదేవుని చెబుతారు. ఆ ఋషభదేవుడు, భాగవతంలో ఋషభదేవుడు ఒకరేనా? అసలు ఆయన చరిత్ర ఏమిటి? అటువంటప్పుడు జైనమతం అవైదికమెలా అయింది?**

**జ:** జైన బౌద్ధాలు అవైదికాలుగా కనిపిస్తున్నా, వాటి మూలాలు వేదవేదాంతాలలోనివే. వేదములోని జ్ఞానకాండకి సంబంధించిన తత్త్వాన్ని బోధించినవారే జినుడు, బుద్ధుడు.

కానీ వారు పూర్వరంగమైన వైదిక కర్మను పేర్కొనక పోవడం చేత, వారి అను యాయులు వైదిక కర్మలను నిరసించారు.

వేద, పురాణ భాగవతాదులు కూడా వైదిక కర్మలే జీవిత పరమార్థం కావని బోధించాయి. కానీ చిత్తశుద్ధికి సత్కర్మలైన విధ్యుక్త వైదిక యజ్ఞాల అవసరముంది. లోకక్షేమం కోసం కూడా అవసరం. ఆ రెండింటి సమన్వయం గీతాది గ్రంథాలలో ఉన్నది.

జైనం పేర్కొన్న తీర్థంకరుడు ఋషభదేవుడు, భాగవతం ప్రస్తావించిన ఋషభుడు ఒక్కరే అని భావించాలి. వారి స్థితిని వర్ణించిన వైనం ఒకే లక్షణాలను తెలియజేస్తోంది. స్వాయంభువ మనుపుత్రుడు ప్రియవ్రతుడు. ఆతని తనయుడు అగ్నీధ్రుడు. అతడి కుమారుడు నాభి. నాభికి మేరుదేవి యందు జన్మించినవాడు ఋషభుడు. ఈతడు నారాయణుని అంశావతారంగా భాగవతం పేర్కొంది. ఈయన బహుకాలం రాజ్య పాలన చేసి ధర్మాన్ని ప్రతిష్ఠించి, పుత్రులకు జ్ఞానబోధ చేశాడు. జ్యేష్ఠపుత్రుడైన భరతుని రాజ్యాభిషిక్తుని చేసి, సర్వకర్మలను సన్న్యసించి, కర్మాతీతుడై 'అవధూత'గా వెలుగొందాడు. ఈ కర్మాతీత స్థితినే తరువాత అనుసరించారు జినుదు మొదలైనవారు. ఇది 'అతీతస్థితియే' కానీ పరిత్యజించిన స్థితికాదు. సర్వమునందు బ్రహ్మమును దర్శించగలిగేవారు ఆ విధమైన భూమికలో ఉంటారు.



ఈ ఋషభదేవుడు అనేక యోగసిద్ధులను పొంది యోగ మార్గాన్ని సుష్టుపరచాడు. ఇంద్రుడు కాలానుగుణంగా వర్షాలను కురిపించకపోతే, ఋషభుడే స్వయంగా తానే పర్జన్యరూపుడై వృష్టిని కురిపించాడు. 'అజగర' వ్రతాన్ని (అప్రయ త్నంగా లభించిన దానిని స్వీకరించుట) అవలంబించి 'బాలోన్మత్త పిశాచుల' వలె దిగంబరంగా తిరు గాడిన ఈ అవధూత, చివరకు తనంత తానుగా దావాగ్నిలో ప్రవేశించి దేహత్యాగం చేశాడు. ప్రవృత్తి-నివృత్తి మార్గాలను కూడా అతిక్రమించిన సిద్ధుడతడు. ఈ మహానుభావుని ప్రధానంగా, ప్రథమంగా స్వీకరించి వర్ధిల్లినది జైనమతం. దిగంబరత్వాదుల లక్షణాలు ఆ సిద్ధాంతంలో గోచరించిన కారణమిదే.

ఋషభుని పుత్రుడైన భరతుడే జడభరతుడు. బహుప్రసిద్ధి పొందిన యోగి. ఆ భరతుని పుత్రుడు సుమతి. ఇతడు తాత గారైన ఋషభుని మార్గాన్ని అవలంబించాడు. "భరతస్యాత్మజః సుమతి ర్నామాభిహితో యముహావావకేచిత్ పాషణ్డిన ఋషభ పదవీ మనువర్తమానం చానార్యా అవేదసమామ్నాతాం దేవతాం స్వమనీషయా...

కలౌ కల్పయన్తి' అని భాగవత వాక్యం. "భరతుని పుత్రుడైన సుమతి, ఋషభుని జీవన్ముక్తి మార్గాన్ని అనుసరించుటను చూసి, కొందరు వేదాచార విముఖులు దానిని అవైదిక మతముగా కలిలో కల్పించుతారు" అని భాగవత వచనం.

జైన బౌద్ధాల సిద్ధాంత మూలాలు పూర్ణంగా వైదిక విజ్ఞానం లోనివే. అందుకే అవి భారతీయ మతాలుగా హిందూ మతంలో అంతర్భాగాలైనాయి.

**ప్ర: సాధారణంగా క్షేత్ర, తీర్థయాత్రలు చేసినవారు ఏవైనా నియమాలను పాటించాలా? అవి ఏమిటి? కేవలం శబరి మల యాత్రకు మాత్రమే దీక్షానియమాలున్నాయా?**

**జ:** కొన్ని క్షేత్రాలకు ప్రత్యేక దీక్షలు, మొక్కుబళ్లు ఉండవచ్చు. అటువంటి ప్రత్యేక దీక్ష శబరిమల అయ్యప్పదీక్ష. ఇటువంటి దీక్షలను అనుకరిస్తూ ఇప్పుడు ఇతర ఆలయాలలో కూడా కొత్త దీక్షలు ప్రవేశపెట్టారు. ఇదీ సముచితమే. ప్రత్యేక నియ మాలతో మండలం పాటు ఆ క్షేత్రాధిదేవతలను ఉపాసించి, ఆరాధించడం చేత విశేషఫలం లభిస్తుంది. అందుకు వీటిని ప్రోత్సహించాలి.

అయితే, ఏ క్షేత్రానికి వెళ్ళినా కొన్ని నియమాలను తప్పక పాటించాలి. ఊరకనే చూసిరావడం వల్ల సరియైన ఫలితాలను పొందలేము.



ముఖ్యంగా వివిధ స్మృతి గ్రంథాలు చెప్పిన ప్రకారం ఈ క్రింది నియమాలను స్వీకరించాలి. క్షేత్రంలో ఉన్నంత కాలం క్షురకర్మ, ముఖ క్షౌరం చేయ(చేయించ)రాదు. బ్రాహ్మీ ముహూర్తాన నిద్రలేచి స్నానాదికృత్యాలు ముగించాలి. ఏదో ఒక ఇష్ట దేవతా నామాన్ని లేదా క్షేత్ర దేవతా మంత్రాన్ని లేదా ఉపదేశం పొందిన మంత్రాన్ని యధావిధి జపించాలి. ఒంటిపూట భోజనం– అది కూడా సాత్త్వికమైన, శుచి కలిగిన ఆహారం స్వీకరించాలి. హితమైనది మితంగా తినాలి. వీలైనంత మౌనాన్ని పాటించాలి. అసత్యం, క్రోధం, వాక్పా రుష్యం, అనాచారం పనికిరాదు. భూశయనం శ్రేష్ఠం. సత్సంగం, సద్విషయప్రసంగం మాత్రమే ఉండాలి. లౌకిక విష యాల జోలికి వెళ్లరాదు. డంబము, దర్పము ప్రదర్శించరాదు. దివ్యక్షేత్రాలు యోగులకు, ఋషులకు ఆవాసాలు. వారు ఏ రూపంలో ఉంటారో తెలియదు. అందుకే క్షేత్రవాసుల పట్ల దురుసుగా ప్రవర్తించరాదు. క్షేత్రంలో దాన, జపాది సత్కర్మలను పాత్రత నెరిగి వీలైనంత ఆచరించాలి. పుణ్యక్షేత్రాలలో ఏ కర్మ చేసినా కోటి రెట్ల ఫలం. అందుకే దుష్కర్మలను ఆచరించరాదు. సహనం ముఖ్య నియమం.

నదులలో స్నానం చేస్తున్నా, ఆలయాలను దర్శిస్తున్నా, క్షేత్రాన్ని పరిశీలిస్తున్నా

– ఇతర నదులతో ఆలయాలతో, క్షేత్రాలతో పోల్చరాదు. అలా పోల్చి 'వీటికన్నా అవి మేలు' అనో, 'వాటికన్నా ఇవి మేలు' అనో న్యూనాధికతలను మాట్లాడితే మహాపాపం. ప్రతి క్షేత్రమూ, ప్రతి తీర్థమూ గొప్పవే. అందుకే వాటిని ఎట్టి పరిస్థితుల లోనూ కించపరచరాదు.

పైన చెప్పినవి ముఖ్యమైన నియమాలు. ఇవి కాక ప్రత్యేక దీక్షతో వచ్చిన వారికి, దీక్షా సంప్రదాయం ప్రకారం ప్రత్యేక నియమాలుంటాయి. ఏమైనా– నియమ పాలన వల్ల శీఘ్రంగా సత్ఫలితాలు లభిస్తాయనడం నిర్వివాదాంశం.

**ప్ర. అమ్మవారిని 'మాతంగి', 'మాతంగ కన్య' అని ఎందు కంటారు? ఈ మాతంగుడు ఎవరు? కాళిదాసు 'మాతంగ కన్యాం మనసాస్మరామి' అని స్తోత్రం చేశారు కదా!**

**జ.** అమ్మవారి స్వరూపాలలో శ్యామలాదేవి ఒకటి. ఈ దేవినే మంత్రిణీ, రాజమాతంగి– అని శ్రీవిద్యలో వ్యవహరిస్తారు. శ్రీలలితాదేవి యొక్క జ్ఞానస్వరూపిణి ఈమె. విద్యాధిదేవత.

మతంగుడనే మహర్షిపుత్రుడు మాతంగుడు. ఈతడు శ్యామలాదేవి ఉపాసకుడు. దృఢమైన భక్తిశ్రద్ధలతో శ్యామలాంబను ఉపాసించాడు. దేవి ప్రత్యక్షమై వరాన్ని కోరుకోమంది. "అమ్మా! నా స్నేహితుడు హిమవంతుడు. ఆయన నాతో ప్రసంగ సందర్భాలలో మాటి మాటికి – 'నేను గౌరీదేవి తండ్రినోయ్' అని సగర్వంగా సానందంగా పలుకుతుంటాడు. అది గొప్ప భాగ్యమే. అటువంటి భాగ్యం నాకూ కలుగజేయమ్మా. నీకు తండ్రిననే సౌభాగ్యానికి నన్ను పాత్రుడ్ని చేయి" అని ప్రార్థించాడు మాతంగుడు. జగదంబ సంతోషించి సమ్మతించింది. మాతంగుని భార్య సిద్ధమతీ దేవి. ఆ దంపతులకు శ్యామలాంబ పుత్రికగా జన్మించింది.

ఆ తల్లి పేరే మాతంగి (మాతంగకన్య).

**తత ఏవ సముత్పన్నా మాతంగీతేన కీర్తితా।**
**లఘుశ్యామా మహాశ్యామా మాతంగీ బృంద సంయుతా॥**

–ఈ వృత్తాంతమంతా బ్రహ్మాండపురాణంలో చెప్పబడింది.

**ప్ర. "రుద్రం అసురం" అని ఒక వేదమంత్రంలో ఉంది. రుద్రుని అసురుడు – అని ఎందుకన్నారు? ఒక వైష్ణవుడు ఈ మాటను చెప్పి శివుని గురించి వ్యతిరేకంగా అన్నాడు. చాలా బాధ కలిగింది. 'అసుర' అనే శబ్దానికి అర్థం ఇక్కడ ఏ విధంగా చెప్పుకోవాలి?**

**జ.** వైదిక శబ్దాలకు ప్రత్యేకార్థాలున్నాయి. వాటిని నిరుక్తాది షడంగజ్ఞానం కలిగిన వారే చెప్పాలి. వేదభాష్యం వ్రాసిన యాస్కాదులు ఈ విషయంలో ఏం చెప్పారో చూడాలి. ఒకే శబ్దం వాటి స్థానం బట్టి విభిన్న అర్థాలను అందిస్తుంది.

ఇక్కడ వైదికార్థం–'అసూన్ రాతి' – 'అసువులు' అనగా ప్రాణములు. 'ప్రాణశక్తిని ప్రసాదించువాడు, పుష్టి చెందించువాడు' అని ఇక్కడ 'అసుర' శబ్దానికి అర్థం. దశవిధ ప్రాణములు (ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన అనే పంచ ప్రధాన వాయువులు; నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ – అనే పంచ ఉప వాయువులు), వాటికి మూలమైన ఆత్మ...ఈ పదకొండు ఏకాదశ రుద్ర స్వరూపులు – అని 'శివపురాణం' వర్ణిస్తోంది.

'ప్రాణావావ రుద్రాః' అనే వైదిక మంత్రం కూడా ఈ భావాన్ని స్పష్టపరుస్తోంది. దేవతలకు కూడా నియామకుడైన రుద్రుడు, రాక్షస శక్తులను దునుమాడేవాడు. 'ప్రథమో **దైవ్యో** భిషక్' అనే రుద్రమంత్రం కూడా దేవతలకు అంతర్యామిగా రుద్రుని పేర్కొంది. 'దేవానాం హృదయేభ్యో నమః' అని మరొక వేద మంత్రం. 'దేవతల హృదయశక్తి రుద్రుడే' అని స్పష్టంగా చెబుతోంది ఈ మంత్రం.



**ప్ర. సజాతీయ విజాతీయ స్వగత భేదాలు– అని అంటారు కదా! అవి ఏమిటి? వివరించ ప్రార్థన.**

**జ.** ఒకటే జాతిలో రెండు వస్తువులకు గల భేదము 'సజాతీయ భేదం'. ఉదాహరణకు రెండు రాతి వస్తువులు. ఒక రాతికీ మరో రాతితో గల భేదమిది. వేరు వేరు జాతుల్లో రెండు వస్తువులకున్న భేదం–విజాతీయ భేదం.

ఉదా: ఒక రాతికి ఒక చెట్టుతో గల భేదం.

ఒకే వస్తువులో ఉన్న భేదం విగత భేదం. తనయందే ఉన్న భేదం.

ఉదా: ఒకే చెట్టులో కొమ్మ, రెమ్మ, ఫలం – వంటి భేదాలు. ఈ మూడు రకాల భేదాలు నామరూపాత్మక ప్రపంచంలోని ఉపాధులలో ఉన్నాయి. ఈ భేదాలు లేని అభిన్న స్వరూపుడు సర్వవ్యాపకుడైన పరమాత్మ. వేదాంత శాస్త్రంలో పరమాత్మ తత్త్వాన్ని తేటపరచే సందర్భంలో ఈ మాటలను వివరించారు.

**ప్ర. పట్టువస్త్రాలు మడికి పనికి వస్తాయంటారు. పట్టు పురుగుల నుండి తీసిన పట్టు పనికి వస్తుందా? లేక – కొత్త నూలు బట్టలు కట్టుకోవచ్చా?**

**జ.** పట్టుబట్టలు మడికి పనికి వస్తాయి. అయితే వాటి కంటె 'ధావళీ' 'కాశీపంచె' అని

ప్రసిద్ధి చెందినవి మడికి పనికివస్తాయి. అవి ఒక విధమైన నారతో చేసినవి. కొత్తనూలు బట్టలు కూడా మడికి వాడవచ్చు. అయితే పూజాదికాలయ్యాక మళ్ళీ తడివస్త్రం ధరించి, ఆ మడివస్త్రాన్ని భద్రంగా దాచుకోవాలి. మళ్ళీ దానిని ఉప యోగించవలసి వచ్చినప్పుడు తడిబట్టతోనే మడిబట్టను తీసుకోవాలి.

అయితే నూలుబట్ట (కొత్తది)గానీ, పట్టుబట్టగానీ 15 రోజులు మాత్రమే వాడాలి. తరువాత పట్టుబట్ట మాత్రం మళ్లీ తడిపి ఆరవేసి, పైపద్ధతిలో ఉపయోగించాలి. నూలుబట్ట ఏ రోజుకా రోజు తడిపి ఆరవేస్తేనే మడికి పనికి వస్తుంది.

**ప్ర. పోతనగారు భాగవతంలో ఒక చోట మాత్రమే రాధను అవ్యక్తంగా చూపిస్తారు. వ్యాస కృత మూలభాగవతంలో కూడా రాధ ప్రసక్తి ఇంత వరకే ఉన్నదా? విపులంగా ఉన్నదా? రాధకు సంబంధించిన కథాభాగం తెలుసుకోవాలంటే ఏయే గ్రంథాలు చదవాలి?**

**జ.** వ్యాస మూలంలో కూడా రాధ అవ్యక్తంగానే ఉన్నది. భాగవతంలో రాధ 'గూఢ నాయిక'. ఈమె గురించి విపులంగా తెలియజేసే గ్రంథాలు: బ్రహ్మసంహిత, గర్గ భాగవతం, బ్రహ్మ వైవర్త పురాణం, పద్మపురాణం, దేవీభాగవతం– ఇవి పురాణ రచనలు. ఇవి కాక శ్రీకృష్ణలీలాతరంగిణి, శ్రీకృష్ణ కర్ణామృతం, గీతగోవిందం వంటి కావ్యాలు రాధ ప్రస్తావనతో శోభిస్తున్నాయి.

**ప్ర. శ్రీ రుద్రాభిషేకంలో వచ్చే హంసగాయత్రికి, శ్రీవిశ్వేశ్వరునికి ఉన్న సంబంధమేమిటి? హంస అనగా కైలాసంలో (మానససరోవరం) ఉండే హంసలేనా?**

**జ.** ఆ మంత్రంలోని 'హంస' పక్షి విశేషం కాదు. హంస– అనేది శివశక్తి స్వరూపం. అది మనలో ప్రాణశక్తి. ఈ ప్రాణశక్తిని సదాశివతత్త్వంగా ఆరాధించడమే హంస గాయత్రి భావం. అది కైలాసంలో హంసలనే పక్షులు కావు.

**ప్ర: మంగళవారం వంటి రోజుల్లో తలస్నానం చేయరాదనీ, నూతన వస్త్రాలు ధరించ రాదని అంటారు కదా? మరి పర్వదినాలు ఆ రోజుల్లో పడితే ఏం చేయాలి?**

**జ:** పర్వదినాలు పడిన ఏ రోజైనా ఆ నియమం వర్తించదు. మంగళవారమైనా ఆ రోజు తలస్నానం చేయవచ్చు. నూతన వస్త్రాలు ధరించవచ్చు.

**ప్ర. సీతాదేవి పేరు, గౌరీదేవి పేరు పెట్టుకున్న వారికి కష్టాలెక్కువ ఉంటాయనీ, శ్రీరామ భక్తులకి దుఃఖాలు బాగా కలుగుతాయనీ అంటారు. ఇది నిజమేనా? వీటికి శాస్త్ర ప్రమాణాలు ఏమైనా ఉన్నాయా?**

**జ.** మీరు వ్రాసిన పై మాటలు పూర్తిగా అశాస్త్రీయం. వీటికి ఏ శాస్త్రాల్లోనూ ప్రమాణాలు లేవు. ముఖ్యంగా తెలుసుకోవలసినది-ఏ దేవత కూడా కొత్తగా కష్టాలను కలిగించరు. మనకు రావలసినవే వస్తాయి. దేవతలవల్ల కష్టాలు వస్తాయనడం పాపం కూడా. సీతా, గౌరీ నామాలు మంగళకరాలు. సీతాదేవి రాక్షససంహారం కోసం సిద్ధమైన పరమేశ్వర శక్తి, రావణుని తన శాపంతో భస్మం చేయగలిగి కూడా ఉపేక్షించింది. దానికి కారణం రాముని చేతిలోనే రావణుడు చావాలి కనుక. అంతే కాదు – హనుమంతుడు తన బలంతో సీతను శ్రీరాముని వద్దకు తీసుకు వెళతాననగా నిరాకరించింది. కేవలం రావణవధ కోసం శ్రీరాముని ప్రేరేపించిన శక్తి ఆమె. సీతారామ స్మరణం వలన కష్టాలు తొలగి శుభాలు కలుగుతాయి.

హనుమంతుడు సీతారాములను స్మరించి, తన తోకకు 'నిప్పు అంటినా క్షేమంగా నిలిచాను' అని ప్రకటించాడు. సీతారాముల కృపారక్షణ ఉన్న వారికి పంచభూతాలు సైతం సానుకూలంగా ఉంటాయని ఆంజనేయస్వామి ఋజువు చేశాడు.

'శ్రీరామరక్ష–సర్వజగద్రక్ష' అనే ప్రసిద్ధ వాక్యం రామకృపను చాటుతోంది. **'ఆపదామ పహర్తారం దాతారం సర్వసంపదాం! లోకాభిరామం....'** అని సర్వ సంపత్కరునిగా, ఆపదలను తొలగించే వానిగా శ్రీరాముని ఋషులు కీర్తించారు. శరణాగత వత్సలుడు, సర్వరక్షకుడు శ్రీరాముడు – అని రామాయణమే ప్రకటించింది. శ్రీరాముని ఆశ్రయించిన సుగ్రీవుడు, విభీషణుడు మొదలైన వారందరూ ఉత్తమ స్థితిని పొందారు.



అయితే శ్రీరామోపాసన మోక్షకారకం. కనుక–కేవలం కైవల్యం కోసం శ్రీరాముని ఉపాసించేవారు, తమకు ప్రారబ్ధవశాత్తు వచ్చిన కష్టాలను, జ్ఞానంతో సహన శక్తితో సాక్షిగా వీక్షిస్తూ – తమ పూర్వ కర్మను క్షయం చేసుకుంటారు. ఆ విధంగా సర్వకర్మ క్షయం జరిగి, మరి జన్మలేని మోక్షాన్ని పొందుతారు– అని శాస్త్రాలు వక్కాణిస్తున్నాయి. శ్రీ రామ భక్తుల కొందరి జీవితాలలో ఈ సహన పూర్వకంగా తమ కర్మను క్షీణింపచేసుకోవడం కనబడుతుంది. రాముడి వల్ల వచ్చే కష్టాలు కావు. వారి వారి ప్రారబ్ధం వల్ల కలిగినవి మాత్రమే. శ్రీరాముని దయచేత ఆ కర్మబంధం నుండి బయట పడగలుగుతాము.

ఇక – గౌరీదేవి సర్వ మంగళ కారకం. ఆమె తత్త్వమే సర్వమంగళ. గౌరీ పేరును పలికినంత మాత్రాన అశుభాలు తొలగి, శుభపరంపర కలుగుతుంది.

'నిను నమ్మిన వారికెన్నటికి నాశము లేదు కదమ్మ...' అని రుక్మిణీదేవి గౌరిని స్మరించింది. కనుక నిస్సందేహంగా సీతా, గౌరి పేర్లను చక్కగా పెట్టుకోవచ్చు.

**ప్ర. "సీతమ్మ నుదుటిపై సిందూరాన్ని చూసి, 'ఇదేమిటి?' అని హనుమంతుడు ప్రశ్నించాడు. 'దీనిని సిందూరం అంటారు. ఇది శ్రీరామునికి ఇష్టం' అని సీతమ్మ అంది. శ్రీ రామునికి ఇష్టం కనుక, రామభక్తుడైన హనుమ దానిని ఒంటినిండా పూసుకున్నాడు." -ఈ కథను ఈ మధ్య ఒక చోట చదివాను. ఇది రామాయణంలోనే ఉందా?**

**జ.** ఈ కథ ప్రామాణికమైన ఏ రామాయణంలోనూ లేదు. ఇటు వాల్మీకి రామాయణం కానీ, అటు అధ్యాత్మ రామాయణం గానీ ఇలాంటి కథలను పేర్కొనలేదు.

ఇది ఎవరో పుట్టించిన పిట్టకథ. కొందరు 'ఆనందరామాయణం'లో ఉన్నట్లుగా చెప్పారు. హనుమలోని రామభక్తిని ప్రకటించడానికి కల్పించినది.

అయితే మంత్ర శాస్త్రరీత్యా హనుమను ఆరాధించేటప్పుడు, సిందూరాల పూత రుద్ర స్వరూపుడైన ఆంజనేయుడికి శ్రేష్ఠమని చెప్పబడింది. మంత్ర విజ్ఞానం ప్రకారం ఆంజనేయునికీ, గణపతికీ సిందూరపు పూత చెప్పబడింది.

కొన్ని చోట్ల భైరవ స్వామికి కూడా సిందూరాన్ని అలంకరిస్తారు. వీటికి ఆరాధనా పరంపర, ఆయా దేవతల ఉపాసనా శాస్త్రాలు ప్రమాణాలు. హనుమకు సిందూరంతో అర్చన, హనుమ ధ్భక్తులు సిందూరాన్ని ధరించడం శ్రేష్ఠమే.

దీనికి రామాయణంలో ప్రమాణం కనబడక పోయినా, పూజా శాస్త్రాలలో ఆధారాలున్నాయి. కనుక వీటిని స్వీకరించవచ్చు.

**ప్ర: సుబ్రహ్మణ్యస్వామిని సర్ప స్వరూపంలో ఎందుకు ఆరాధిస్తారు?**

**జ:** సుబ్రహ్మణ్యుడు శివశక్తుల సమైక్య స్వరూపమైన కుండలినీ శక్తి రూపుడు. ప్రాణశక్తి స్వరూపమైన కుండలిని ఆరు చక్రాలలో సంచరించుతూ, సర్పము వలె భాసిస్తున్నందున ఆరు ముఖాల సుబ్రహ్మణ్యుని సర్పరూపంలో భావిస్తున్నాం.

సర్వదేవతమైన వాసుకి సుబ్రహ్మణ్య విభూతి అనీ, సుబ్రహ్మణ్యుడు సర్పరూపంతో తపస్సునాచరించాడనీ, కొన్ని పురాణాలు చెప్తున్నాయి.

అంతేకాకుండా వంశవృద్ధి కారకుడైన సుబ్రహ్మణ్యుడు సర్పదేవగణాలకీ అధిపతి. దేవతా సర్పగణాలు కూడా ఆయనను తమ స్వామిగా స్వీకరించాయి.

స్వామి ఆరాధన చేత సర్ప దోషాలు, గ్రహదోషాలు కూడా నివారింపబడతాయి.

**ప్ర: ఈ మధ్య మా మిత్రుడొకరు – 'ఇంట్లో దీపం ఇల్లాలే వెలిగించాలి. భర్త వెలిగించరాదు' అని చెప్పారు. ఉద్యోగరీత్యా నేను ఒక ఊర్లో, నా భార్యా పిల్లలు ఇంకొక ఊర్లో ఉన్నాము. మరి నేనున్న ఇంట్లో అనుష్ఠానం చేసుకొనేటప్పుడు దీపం వెలిగించుకో వచ్చా? అంతేకాక– ఇద్దరం ఒకే ఊర్లో ఉన్నా, భార్య బహిష్టయినప్పుడు వేరుగా ఉంటుంది కదా – అప్పుడు భర్త ఇంట్లో దేవతామందిరంలో అర్చన చేసేటప్పుడు దీపం వెలిగించకూడదా?**

**జ:** భార్యాభర్తలిద్దరూ ఒకే ఇంట్లో ఉన్నప్పుడు, అదీ ఆమెకు ఏ ఆటంకపు రోజులూ లేనప్పుడు ఆమె దీపం వెలిగించడం శ్రేష్ఠం. అంతేకానీ ఆమె మాత్రమే వెలిగించాలనీ, అతడు వెలిగించరాదనీ నియమం ఎక్కడా లేదు. మీరు ఉద్యోగ రీత్యా వేరేగా ఉంటున్నా ఇంట్లో మీరే దీపం వెలిగించుకొని దేవతారాధన నిస్సంకోచంగా చేసుకోవచ్చు.

అదేవిధంగా – ఆమె బహిష్టు దినాలలో దూరంగా ఉన్నప్పుడు, మీ మానాన మీరు దేవతామందిరంలో పూజలో భాగంగా దీపం వెలిగించుకోవచ్చు. అంతేగానీ మానేయవలసిన అవసరం లేదు.

**ప్ర: హిందూమతంలో అనేకమంది దేవుళ్ళు, సాకారంగా ఉపాసించడాలూ ఉన్నాయి. అందుకే ఏక దేవత, నిరాకార ఉపాసన ఉన్న ఇతర మతాల వైపు వెళితే ఏ గొడవా లేదుకదా! –అని కొందరు విమర్శిస్తారు. మనం ఏం సమాధానం చెప్పాలి?**

54

**జ:** 'ఏకంసత్...' 'నిరాకారః' 'నిర్గుణః', 'నిరంజనః' వంటి తత్త్వాలు మన మతంలోనే ఉన్నాయి. 'ఏకం – అనేకం' – రెండూ విశ్వంలోనివే. అనేకమంతా 'ఏకం' యొక్క వ్యక్తీకరణే అని మన మతం అద్భుతంగా సమన్వయించింది. ఒకే నీటిని వివిధ ప్రయోజనాల కోసం వివిధ విధాలుగా వాడుకుంటాం. అలానే విశ్వంలో వివిధ శక్తులుగా ఒకే పరమాత్మ వ్యక్తమవుతున్నాడనీ, ఆ శక్తులన్నీ మనకు అవసరమే కనుక వాటినన్నిటినీ ఆరాధిస్తున్నాం. అయితే అవన్నీ ఒకే తత్త్వము యొక్క వ్యక్తీకరణలే – అనే చింతన ఉండాలి.

కానీ – ఏక దేవతనే ఆరాధించాలి– అంటే మనకున్న అనేక దైవాలలో ఒక దానిని ఇష్టదైవంగా ఆరాధించవచ్చు. ఆ దైవమే అనేక దేవతలుగా ఉన్నదీ – అనే సత్య స్పృహ ఉంటే దేవతా విభేదాలుండవు. నిరాకారాన్నీ నిర్గుణాన్నీ సగుణ సాకారంగా దర్శించడంలోనూ దోషం లేదు. బంగారం నిరాకారం–కానీ నగలు సాకారాలు. ఎన్ని నగలున్నా అంతటా ఒకే బంగారం అనే సత్యాన్ని మరువరాదు.

నిరాకారుడైన భగవానునే సాకారంతో సమన్వయించాలి. నీటిని ఏ పాత్రలో పెడితే ఆ పాత్రాకారం కనిపించినట్లు ఈశ్వరతత్త్వం విభిన్నాకారాలుగా వ్యక్తమవుతోంది.

సారాంశం–దైవానికి సంబంధించిన ఏ పద్ధతి అయినా అది నిరాకారమో, సాకారమో, ఏకదేవతా సిద్ధాంతమో, బహుదేవతార్చనమో, చివరకు ఆత్మ తత్త్వ జ్ఞానమో ... అన్నీ హిందూమతంలో ఉన్నాయి. వాటికోసం మరో మతంలోకి వెళ్ళి గొడవ పడనక్కర్లేదు. అన్నీ దొరికేచోట ఏదో ఒకటి ఎంచుకోవచ్చు. ఆ స్వేచ్ఛ మన మతంలోనే ఉంది.

**ప్ర: 'ఉత్తరకాండ' రామాయణంలోనిదేనా? ఐనట్లయితే - పట్టాభిషేకం వరకే పారాయణలు, ప్రవచనాలు చేస్తా రెందుకు? 'ఉత్తరకాండ' అన్నా, 'ఉత్తర రామాయణ' మన్నా ఒకటేనా? ఉత్తరకాండను పారాయణ, పఠనం చేయరాదా? తెలుగులో ఎవరైనా వ్రాశారా?**

**జ:** రామాయణ బాలకాండలోనే 'షట్కాండాని తథోత్తరమ్' అని 'అవతారిక'లో వాల్మీకియే చెప్పు కున్నారు. కొన్ని విమర్శలు 'ఉత్తరకాండ'ను రామాయణంలోనిదిగా అంగీకరించలేదు. ఆ మాటకొస్తే బాలకాండను, యుద్ధకాండను కూడా వాల్మీకం లోనివి కావనే అతి మేధావులున్నారు. అవన్నీ ఆవల ఉంచి ఉత్తరకాండను వాల్మీకంగా భావించినంత మాత్రాన తప్పేమీ లేదు. అయితే పట్టాభిషేకం వరకు జరిగిన రామకథను వ్రాసి, జరగనున్న కథను 'ఉత్తరం'లో వ్రాశాడు త్రికాలద్రష్ట అయిన వాల్మీకి. సంప్రదాయబద్ధంగా యుద్ధకాండలో చివరిదైన శ్రీరామపట్టాభిషేకంతో పారాయణం, ప్రవచనం పరిసమాప్తి చెందుతాయి.

ఒకవేళ ఉత్తరకాండ చెప్పవలసి వస్తే, ప్రత్యేకంగా దానిని పురాణం(లేదా–పారా యణం) చెప్పి, చివరకు మళ్ళీ బాలకాండలోని సీతారామ కల్యాణంతో పూర్తి చేయాలని సంప్రదాయజ్ఞులు చెప్తారు. ఉత్తరకాండను చేర్చితేనే– రామాయణం 24,000 శ్లోక సంఖ్య సరిపోతోంది. అయినా, ఉత్తరకాండను ప్రత్యేక గ్రంథంగానే స్వీకరించాలి.

రామాయణంలోని రావణాదుల వృత్తాంతంగానీ, ఇతర వానరవీరుల జన్మగాథలు గానీ ఉత్తరకాండలోనే, స్పష్టంగా సమాధానాన్నిస్తాయి. రామాయణంలో కలిగే కిన్న ప్రశ్నలకు ఈ కాండలో 'ఉత్తరం' (సమాధానం) లభిస్తుంది కనుక 'ఉత్తరకాండ' అన్నారని ఒక నిర్వచనం. ఉత్తరకాండ అన్నా, ఉత్తర రామాయణం అన్నా ఒక్కటే.

దానిని పారాయణ, పఠనం చేయవచ్చు గానీ, పై నియమాన్ని పాటించడం మంచిది. రామకథను చెప్పే భాగవతం లాంటి పురాణాలు కూడా, రామాయణంలోని ఉత్తరకాండను ఆధారం చేసుకున్నవే.

తెలుగులో ఉత్తరకాండను తిక్కనగారు 'నిర్వచనోత్తర రామాయణం' పేరుతో మంచి కావ్యంగా రచించారు. కంకంటి పాపరాజు కూడా అద్భుత కావ్యంగా మలచారు.

**ప్ర: ధ్రువునకు నారదుడు వాసుదేవ మంత్రాన్ని ఉప దేశించాడని భాగవతంలో ఉంది. వసుదేవుడు పుట్టక మునుపే కదా ధ్రువచరిత్ర జరిగింది? వసుదేవుని పుత్రుడైన వాసుదేవుని (కృష్ణుని) మంత్రం, ఏనాడో జరిగిన ధ్రువుని కథలో రావడం సముచితమేనా?**

**జ:** 'వాసుదేవ' నామం నారాయణునికి సిద్ధమైనది. గోవింద, దామోదర, వాసుదేవ, కృష్ణ నామాలు విష్ణునివి. నారాయణపరంగా వీటి అర్థాలు వేరు.

'వాసుదేవ' – వసన్ దీవ్యతే ఇతి వాసుదేవః – సర్వజీవులలోను ఉండి, ప్రకాశించే వాడు. విశ్వవ్యాపక చైతన్యమే వాసుదేవుడు. ఇది విష్ణుపరమైన అర్థం. ఇది మహా మంత్రంలోని నామం. ఈ విష్ణు మంత్రాన్నే ధ్రువునకు నారదుడు ఉపదేశించాడు. విష్ణువు ధరించిన కృష్ణావతారంలో – తనకు మునుపే ఉన్న తన నామాలన్నిటికీ మరియొక అర్థాన్ని చూపిస్తూ అవతరించాడు. అంటే ఆయనతో పాటు ఆయన దివ్యనామాలు కూడా అవతరించాయన్నమాట. విష్ణువు వసుదేవునికి పుత్రుడిగా జన్మించినందున కృష్ణరూపంగా 'వాసుదేవుడు' అనే లీలాపరమైన అర్థం కల్పించాడు.

అలా కృష్ణావతారంలో ప్రతి నామం ఆ అవతారంలోని లీలను ప్రకటిస్తుంది. అదే సమయంలో విష్ణుపరమైన అర్థాన్నీ స్ఫురింపజేస్తుంది.

**ప్ర: యోగాభ్యాసం లాంటివి చేస్తున్నప్పుడు కూడా పూజలు, ధ్యానాలు చేయాలా? యోగం వల్లనే సిద్ధి లభించినప్పుడు, దేవతలకి అర్చనలెందుకు?**

**జ:** యోగాభ్యాసాన్ని ఆరోగ్యం కోసమై చేసే వాళ్ళకి ఆధ్యాత్మిక ప్రయోజనం లభించదు. యోగం ద్వారా దివ్యశాంతిని సాధించదలచుకున్నప్పుడు ఈ 'ఎక్సర్‌సైజుల' యోగా భ్యాసం చాలదు. ప్రత్యేకమైన యోగవిద్య కావాలి. యోగసాధనలో మనలోని యోగ కేంద్రాలన్నీ స్పందించాలి. ఆ యోగ కేంద్ర శక్తులే మన వేదపురాణాలు వర్ణించిన దేవతలు. మూలాధారం మొదలుకొని ప్రధాన యోగచక్రాలు ఆరింటిలోనూ, మిగిలిన

నాడీకేంద్రాలలోను ఉన్న దేవతా శక్తులు అనుకూలించనిదే యోగంలో ముందుకు వెళ్ళలేం. అందువల్ల యోగసాధన సిద్ధి కావాలంటే పూజలు, ధ్యానాలు చాలా సహకరిస్తాయి. అర్చనల ద్వారా తృప్తులైన దేవతలు యోగశక్తిని జాగృతపరుస్తారు. దేవతల అనుగ్రహం లేనిదే యోగమార్గంలో సిద్ధిని పొందలేం.

ప్రాణశక్తిని ఉపాసించే యోగవిద్యకి మంత్ర, తంత్ర శాస్త్రాలతో సమన్వయం ఉంది. దేవత-మంత్రం-యోగరీత్యా ప్రాణోపాసన... మూడూ ఒకదానికొకటి సహకారులు.

**ప్ర: ఇప్పటికీ వేంకటేశ్వరుడు శివుడా, విష్ణువా, శక్తియా - అనే వాదనలు వినవస్తూనే ఉన్నాయి. వీటికి మీ సమాధానం?**

**జ:** వేంకటేశ్వరుడు సర్వదేవతా సమన్వయమూర్తి అయిన నారాయణుడు. అయితే ఈ వివాదాల వెనుక విషయమేమిటంటే – 'ఈయన మన సంప్రదాయానికి చెందినవాడు కాడు' అని ఏ ఒక్కరూ అనడం లేదు. అన్ని సంప్రదాయాల వాళ్ళు "ఈయన మా దైవమే" అని చెప్తున్నారని అర్థమౌతోంది. అంటే ఏ ఒక్కరూ కాదనలేని, అందరివాడు, అఖిల జగన్నాయకుడు శ్రీవేంకటేశ్వరుడు – అనే విషయం స్పష్టమౌతోంది.

**ప్ర: రామాయణంలోని అరణ్యకాండలో శ్రీరాముడు అగస్త్యుని ఆశ్రమానికి వెళ్లినప్పుడు, ఆ ఆశ్రమంలో విష్ణుస్థాన, బ్రహ్మస్థాన, ఇంద్రస్థానాలు మొదలైనవి ఉంటాయి. కానీ శివస్థానం ఉండదు. ఈ విషయాన్ని వ్యాఖ్యానిస్తూ ఒకాయన 'అంటే – శివుడు ఆరాధనీయుడు కాడు' అని రచించాడు. ఇది చాలా వేదన కలిగించింది. సరియైన వివరణను తెలియజేయగోరిక.**

**జ.** ఆ ఘట్టంలో చేసిన ఆ దుర్వ్యాఖ్యానాన్ని శ్రీ అప్పయ్య దీక్షితులు అద్భుతంగా ఖండించారు. అక్కడికి కొన్ని శ్లోకాల తరువాత సర్వదేవతలు అగస్త్యుని ఆశ్రమానికి చేరి, ఆయనను పూజించేవారని ఉన్నది. ఆ ప్రకారంగా గమనిస్తే – "ఆయా దేవతలు అగస్త్యాశ్రమానికి వచ్చినప్పుడు వారు ఆసీనులయ్యే స్థానాలవి.

శివుడు ఆ విధంగా వచ్చి కూర్చొని పూజించేవాడు కాడు. ఆయన ఆగస్త్యునిచే ఆరాధింపబడే దైవం. అందుకే ఆయన అతిథులుగా వచ్చే దేవతాస్థానంగా చెప్పబడలేదు" అని సమన్వయించారు.

మీరు చదివిన వ్యాఖ్యానం కేవలం మతదురభిమానంతో, అప్రస్తుతంగా చేసిన శివద్వేష పూరితుల భావం మాత్రమే. ఇలాంటి కువ్యాఖ్యలు భాగవతంలో కొన్ని సందర్భాలకి కూడా చేశారు.

నిజానికి ప్రధానకథకి సంబంధంలేని 'పిడకలవేట' ఇది. బాగా పరిశీలిస్తే – అత్యంత ప్రాచీన ప్రతులలో ఈ దేవతా స్థానాలకి సంబంధించిన శ్లోకాలే లేవు. అంటే ఆ వాక్యాలన్నీ కల్పితాలేనని తేలింది. కనుక వాటి గురించి ఆలోచించ వలసిన అవసరమే లేదు.

**ప్ర. 'మానసాదేవి' –అన్న దేవత ఎవరు? ఆమె ప్రసక్తి ఏ పురాణంలో ఉంది?**

**జ.** జగదంబ యొక్క ప్రధానాంశరూపాలలో ఈమె ఒకరు. కశ్యపుని కుమార్తె. నాగులకు మాత. నాగరాజైన అనంతునికి సోదరి. శివునకు శిష్యురాలు. తపఃస్వరూపిణి, మంత్ర స్వరూపిణి. ఈమె భర్త పేరు జరత్కారు ముని. తనయుడు ఆస్తీకుడు.

**ప్ర: మంత్రాన్ని బయటకు కాకుండా, మనసులో జపించడం శ్రేష్ఠమంటారు. మరి లలితా సహస్రనామస్తోత్రం కూడా మనసులోనే చదవాలా?**

జ: మంత్ర జపం బాహ్యం, ఉపాంశుపు, మానసికం, సగర్భం – అని నాలుగు విధాలు. బయటకు జపించడం అధమం. అయితే హోమం, అర్చన సమయాల్లో మంత్రాన్ని బయటకు పఠిస్తారు. జపంలోనే బాహ్యం పనికిరాదు. పెదవి కదుపుతూ జపించడం ఉపాంశువు. ఇది మంచిదే. దీనిని మధ్యమం అంటారు. క్రమంగా మానసికంగా మంత్ర జపం చేయగలగాలి. ఇది ఉత్తమం. అదేవిధంగా సగర్భ జపంకూడా ఉత్తమమైనదే. ఉచ్ఛ్వాస నిశ్వాసలతో కలిపి, మౌనంగా మంత్రాన్ని జపించడాన్ని 'సగర్భం' అంటారు. ఇది మహాసిద్ధిని చేకూర్చుతుంది. లలితాసహస్రనామస్తోత్రం బయటకు చదివినా తప్పులేదు. నామం, స్తోత్రం–వీటిని ఎలా చదివితే మనకు తృప్తికలుగుతుందో అలా చదువుకోవచ్చు. అది బాహ్యమైనా, మానసికమైనా కావచ్చు.

**ప్ర: సంధ్యావందనం జీవితాంతమూ చేయవలసిందేనా?**

**జ:** అహరహమూ సంధ్యను ఉపాసించాలని ఉపనిషత్తులే శాసించాయి. ఉపనయన సంస్కారమైనది మొదలు యావజ్జీవితం సంధ్యను ఆచరించితీరాలి. కేవలం సన్యాసాశ్రమాన్ని స్వీకరించిన వారికే ఈ నియమం చెల్లదు. అయినా సన్యాసంలో కూడా చాలా విధులున్నాయి. బ్రహ్మచారులు, గృహస్థులు చివరికి వానప్రస్థులతో సహా సంధ్యావందనం చేయవలసిందే. జాతాశౌచ మృతాశౌచాలలో కూడా సంధ్యను మానరాదు. అశౌచకాలంలో అర్ఘ్య ప్రదానం వరకు నిత్యహోమాదులు, దేవతార్చన వంటివి ఉంటే ఈ అశౌచకాలంలో ప్రతినిధిగా వేరొక ఋత్విక్కును (అశౌచంలేని వారిని) నియమించి జరిపించాలి.

కనుక జీవితకాలం సంధ్యను ఉపాసించవలసిందే. జ్ఞానమార్గంలో ఉన్నవాళ్ళు సంధ్య వంటి నిత్యకర్మను వీడరాదు. నిజంగా నిష్కామ స్థితిలో ఉన్నట్లయితే కామ్య కర్మలు మానివేయవచ్చుగానీ, నిత్యనైమిత్తిక కర్మలను మానరాదు.

ఎంతజ్ఞాన మార్గంలో ఉన్నామనుకున్నా యజ్ఞ, దాన, తపస్సులను మానరాదని భగవద్గీతలో శ్రీకృష్ణుని వచనం. ఇవి మనలను పవిత్రులను చేస్తాయి. నిత్యకర్మాను ష్ఠానం చిత్తశుద్ధిని కలిగిస్తుంది. చిత్తశుద్ధి జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది.

ప్ర: **గ్రహశాంతి కోసం, లోకక్షేమంకోసం 'సుబ్రహ్మణ్య పట్టాభిషేకాన్ని' పారాయణ చేయ మనీ; సత్ సంతాన ప్రాప్తికోసం 'సుబ్రహ్మణ్యజననగాధ'ని పారాయణ చేయాలనీ ఒక చోట ఒక పెద్దవారు చెప్పారు. అవి ఏ గ్రంథాలలో దొరుకుతాయి?**

**జ:** చాలా పురాణాల్లో సుబ్రహ్మణ్య జననగాథ ఉంది. దేనిలోనిదైనా పారాయణ చేయవచ్చు. రామాయణం బాలకాండలో విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు కుమారస్వామి జనన గాథను చెప్పాడు.

'కుమారసంభవశ్చైవ ధన్యః పుణ్యఃతథైవచ" అని వాల్మీకి వచనం, 'మహాభారతం అరణ్యపర్వంలో' కూడా స్కందజనన ఘట్టం ఉంది. పారాయణకుగాను, వాల్మీకి రామాయణంలోని కుమార జన్మవృత్తాంతం చాలు.

ఇక సుబ్రహ్మణ్య పట్టాభిషేక ఘట్టం 'మహాభారతం శల్యపర్వం'లో ఉంది. దానిని పారాయణ చేస్తే అద్భుత ఫలితాలు వస్తాయని మహాభారతమే సెలవిస్తోంది.

ప్ర: **స్త్రీ సంతానం వల్ల అనర్థాలు కలుగుతాయనీ, పుత్రసంతానం పున్నామనరకాన్ని తొలగిస్తుందనీ అందరూ పుత్ర సంతానం పైనే మమకారం చూపిస్తున్నారు. స్త్రీ శిశువులను గర్భంలోనే సంహరిస్తున్నారు. మన సంస్కృతిలో స్త్రీపట్ల ఇంతటి అమానుషత్వాన్ని ఎందుకు బోధించారు.**

**జ:** ఇది సంస్కృతి చేసిన బోధకాదు. స్వార్థపరులైన వారి ద్రోహం మాత్రమే. స్త్రీ సంతానం కలిగితే 'మహాలక్ష్మి' పుట్టిందనుకొనే సంప్రదాయం మనది. స్త్రీని బాలగా, సువాసినిగా అర్చించే దివ్యత్వం మనది. స్త్రీ పట్ల గౌరవం, భక్తి ఈ దేశంలో ఉన్నట్లుగా ప్రపంచంలో ఎక్కడా లేదని పాశ్చాత్య చరిత్రకారులే లిఖించారు.

స్త్రీని అవమానించిన చోట, హింసించిన చోట దరిద్రం తాండవిస్తుందని మన పురాణాలు స్పష్టపరచాయి. స్త్రీ శిశుహత్య కుటుంబానికీ, సమాజానికీ, దేశానికీ శ్రేయస్సుకాదు.

**'పుత్రాత్ శతగుణం పుత్రీ"** – 'కొడుకు కంటె వందరెట్లు కూతురే మేలు' అని ప్రాచీనుల మాట. అలాగే తండ్రి కంటే తల్లికే ఉదాత్త స్థానాన్నిచ్చారు. కొడుకు కొడుకు కంటే కూతురు కొడుకుకే (దౌహిత్రునకు) ప్రాధాన్యం.

**ప్ర: గణపతి పూజలు, కుమారస్వామి పూజలు వైదికమైనవి కావనీ, తంత్రాలలో, ద్రావిడులలో ఉన్న పూజలనీ, అవి క్రమంగా హిందూమతంలో చేరిపోయాయని కొందరు వ్రాశారు. వివరించ కోరిక.**

**జ:** వైదికమూలంలేని హిందూ మత సంప్రదాయాలు లేవు. ఆర్యులు, ద్రావిడులు అనే తెగలు లేవు. పరమాత్మను కొన్ని దేవతల రూపాలలో కొన్ని చోట్ల విశేషంగా ఆరాధిస్తారు. ఇవన్నీ ఏకవేద సంస్కృతితోనే ముడిపడి ఉన్నాయి.

వైదిక యజ్ఞాలలోని వివిధ దేవతలే క్రమంగా మంత్రతంత్ర శాస్త్రాలలో, పురాణాలలోసామాన్యులకు సైతం అందుబాటులో వివిధ ఆరాధనా పద్ధతులతో విస్తృతమయ్యాయి.వేదాలలోని యజ్ఞాగ్నితత్త్వమే సుబ్రహ్మణ్యుడు, యోగపరంగా కుండలినీ స్వరూపుడు. సేనానీ, కుమార, సుబ్రహ్మణ్య శబ్దాలు వేదాలలోనే ఉన్నాయి. గణపతి,వినాయక, జ్యేష్ఠరాజ మొదలైన నామాలతో ప్రణవ స్వరూపుడైన పరమాత్మను వేదం పేర్కొంది.



వేద సంప్రదాయాలలోని హోమ ప్రక్రియలు తంత్రహోమాలలో కూడా స్వీకరించారు. హిందూమతం వేదపురాణ తంత్రశాస్త్రాల సమన్వయం మాత్రమే. అన్నీ ఒకదానితో ఒకటి అనుబంధం ఉన్నవి.

ఈ దేశంలో జన్మించి వర్ధిల్లిన సత్సంప్రదాయాలివి.

**ప్ర: జన్మనక్షత్రంలో ఏం చేయాలి? ఏం చేయకూడదు?**

**జ:** జన్మనక్షత్రంలో యాగం, చౌలకర్మ, అన్నప్రాశన, వ్యవసాయం, ఉపనయనం, భూసంపాదన, అక్షరాభ్యాసం చేయవచ్చు. శుభకరం. సీమంతం, గర్భాధానం, క్షౌరకర్మ, ఔషధసేవారంభం, ప్రయాణం చేయరాదు. అశుభం. స్త్రీలకు జన్మనక్షత్రంలో వివాహం చేయడం మంచిదే. పురుషులకు జన్మనక్షత్రాన వివాహం పనికిరాదు.

**ప్ర: నాకు పీడకలలు ఎక్కువ వస్తుంటాయి. అవి రాకుండా ఉండాలంటే, వాటి ప్రభావం లేకుండా చేయాలంటే ఏం చేయాలి? అసలు కలలు నిజమౌతాయా? పగటి నిద్రలో కలలు నిజమౌతాయంటారు కదా!**

జ: "దుస్స్వప్నే స్మర గోవిన్దం" అంటారు. గోవింద నామస్మరణ చేసి, నిద్రపోతే పీడకలలు

రావు. వచ్చినా వాటి ప్రభావం ఉండదు. గజేన్ద్రమోక్ష ఘట్టాన్ని, త్రిమూర్తులనీ తలచుకొని నిద్రించడం, తిరిగి లేస్తూనే వాటిని స్మరించడం చేస్తే దుస్స్వప్న ప్రభావం ఉండదు. ఉదయానే దూర్వాలతో గణేషుని అర్చించినా మేలుకలుగుతుంది.

**"పుణ్యో దుస్స్వప్న నాశనః"** నారాయణుడు దుస్స్వప్ననాశకుడని విష్ణు సహస్రనామా లలోనే పేర్కొన్నారు. పగటి నిద్రలో, వాతప్రకోపాలలో వచ్చే కలల వల్ల ప్రయోజనం లేదు.

**ప్ర: 'వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా' అని ప్రసిద్ధ శ్లోకం ఉంది. 'ప్రాచేత సుని ద్వారా వేదమే రామాయణంగా వ్రాయబడింది' అని దాని అర్థం కదా! రామా యణాన్ని వ్రాసిన వాల్మీకి, ఈ ప్రాచేతసుడు ఒకరేనా? వాల్మీకికి ఈ పేరెందుకు వచ్చింది? అతడు గతంలో బందిపోటు దొంగ అనే కథ ఎక్కడ ఉంది? రామాయణం లోనిదేనా?**

**జ:** వాల్మీకినే 'ప్రాచేతసుడు' అంటారు. వాల్మీకి రామాయణం మేరకు ప్రచేతసుని పదియవ పుత్రుడు వాల్మీకి. ఈ మాట తానే స్వయంగా చాటుకున్నారు. ప్రచేతస మహర్షి పుత్రుడు కనుక ప్రాచేతసుడు. తపస్సు ద్వారా సమాధిస్థితిలో ఉన్నప్పుడు తన శరీరం చుట్టూ పుట్ట (వల్మీకం) కట్టింది. తపస్సు ఫలించాక ఆ పుట్ట నుండి వెలికి వచ్చాడు కనుక 'వాల్మీకి'.



అయితే అతడు 'బందిపోటు దొంగ' అనే కథ అధ్యాత్మ రామాయణంలోనిది. ప్రాచేత సుడే శైశవంలో ఇంటినుండి తప్పిపోయి, ఒక బందిపోటు కుటుంబంచే పెంచబడి తాను కూడా ఆ వృత్తిని చేపట్టాడనీ! కానీ సప్తర్షుల ద్వారా రామ మంత్రోపాసన చేసి సిద్ధిపొందాడనీ పురాణాల ఆధారంగా కొందరు చెబుతున్నారు. రాముడు పుట్టక ముందే రామతారక మంత్రం ఉంది. ఆ తారకమంత్ర స్వరూపుడైన నారాయణుడే రామునిగా అవతరించాడు. అందుకే రామ జననానికి పూర్వమే వాల్మీకి 'రామ తారక మంత్రజపం' చేయడంలో ఆశ్చర్యం లేదు. ఈ బందిపోటు కథ వాల్మీకి రామాయణంలో లేదు కనుక కొందరు ప్రమాణంగా స్వీకరించరు.

వేదాలలో వాల్మీకి అనే ఋషి పేరు కనబడుతోంది. అతడి అసలు పేరు 'ఋభువు' అని ఉన్నది. ఎందరో ఋషులు తపస్సమాధిలో వల్మీకంలో ఉన్నవైనం మన కథల్లో ఉన్నదే. కనుక ఎందరో వాల్మీకులు ఉండవచ్చు. అయితే ప్రచేతస పుత్రుడు (ప్రాచేతసుడు) వాల్మీకి అనడంలో ఏ సందేహమూ లేదు.

**ప్ర: వేడి నీటితో స్నానం చేయవచ్చా?**

**జ:** బ్రహ్మాండపురాణంలో వేడినీటి స్నానం శుచికరం అని చెప్పబడింది. నదీస్నానం మంచిది. లేని పక్షంలో వేడినీళ్ళ స్నానం చేయవచ్చు. ఆరోగ్యరీత్యా చన్నీళ్ళు పడనివారు నిరభ్యంతరంగా వేడినీళ్ళు స్నానం చేయవచ్చు. ఆరోగ్యం అనుకూలిస్తే జాతాశౌచ మృతాశౌచ సందర్భాలలో, సంక్రాంతి సమయాలలో, శ్రాద్ధం పెట్టే రోజులలో, పుట్టినరోజున, తాకకూడని వారిని (అశౌచాదులలో ఉన్నవారిని) తాకిన సందర్భాలలో, సప్తమి, పూర్ణిమ, అమావాస్యలలో వేడినీళ్ళ స్నానం చేయరాదు. (అయితే పుట్టినరోజున అభ్యంగస్నానంలో వేడినీళ్ళను పోసుకోవచ్చని కొన్ని శాస్త్రాలు చెప్తున్నాయి).

**ప్ర: స్వయంపాకం-అంటే ఏమిటి?**

**జ:** ఆహార నియమాలు పాటించేవారికి ఇది ఒక నియమం.

**స్వయం హిపాకః పచన ఏవ సద్బంధుశ్రోత్రియ విప్రముఖ్యైః।**
**దారైస్సుపుత్రై రథవా సుశిష్యైః కృతోహి పాక స్వయమేవపాకః॥**

తాను వండుకున్నది స్వయంపాకం. లేదా – భార్య, కొడుకు, దగ్గరి బంధువులు, శ్రోత్రియులు, ప్రియశిష్యులు వండింది కూడా స్వయంపాకమే.



**ప్ర: దీపం పెట్టేటప్పుడు వత్తి ఏ ముఖంగా ఉండాలి. రాత్రి దీపం ఎంత వరకు ఉండాలి?**

**జ:** దీపం తూర్పుముఖంగా ఉంటే ఆయుష్షు. ఉత్తరముఖంగా వెలిగిస్తే ధనం లభిస్తుంది. పడమర ముఖంగా, దక్షిణముఖంగా వెలిగించరాదు. పడమర ముఖం దుఃఖాన్నీ, దక్షిణముఖం కీడును కలిగిస్తాయి.

**రవేరస్తం సమారభ్యయావత్ సూర్యోదయా భవేత్ ।**
**యస్య తిష్ఠేత్ గృహే దీపస్తస్య నాస్తి దరిద్రతా ॥**

సూర్యుడు అస్తమించినది మొదలు, మళ్ళీ సూర్యోదయం వరకు ఇంట్లో దీపం వెలుగుతుండాలి. అలా దీపం వెలిగే ఇంట్లో దరిద్రం ఉండదు.

**ప్ర: వడ్డించేటప్పుడు కూడా మనవాళ్ళు పదార్థాలు ఏ వైపున వడ్డించాలో ఎలా వడ్డించాలో చెపుతుంటారు. ఆ నియమాలేమిటి? ఎందుకా నియమాలు?**

**జ:** మన ప్రాచీనుల దృష్టిలో అన్నం తినడం కేవలం కడుపు నింపుకోవడం కాదు. అనేక మంది దేవతాశక్తుల ప్రభావం అన్నంపై ఉంటుంది.

జీవకోటికి దేహ, మనః, ప్రాణాలను సమకూర్చే అన్నాన్ని పవిత్రం చేసుకోవడం

వల్ల జీవితం శుద్ధమై సిద్ధులను పొందగలదు. అందుకే నియమాలు.

అరటి ఆకును వేసేటప్పుడు ఈనె తీయకూడదు. ఆకు చివరి భాగం ఎడమవైపుగా ఉండేటట్లు పెట్టుకోవాలి. విస్తరిలో మొదట ఎదురుగా కూరలు, కూరల వడ్డన అయిన తరువాత విస్తరి మధ్యలో అన్నం, ఆ పిమ్మట విస్తరిలో కుడివైపున పాయసం, పప్పు–ఎడమవైపున పిండివంటలు, చారు, చివరకు పెరుగు వడ్డించాలి.

భోజనం ప్రారంభించక ముందే ఉప్పును వడ్డించకూడదు. ఉప్పు ఒక్కదానిని ప్రత్యేకించి వడ్డించరాదు. తినడానికి ముందే ఉప్పునూ, తినడం ప్రారంభమయిన తరువాత నేతినీ, పాయసాన్నీ వడ్డించరాదు. పాయసాన్నీ, నేతినీ ముందుగానే వడ్డించాలి. పూర్ణిమ, అమావాస్యలలో రాత్రిపూట భోజనం చేయరాదు.

వడ్డన అయిన పిమ్మట అన్నాన్నీ, పిండివంటలనూ, పాయసాన్నీ ఘృతంతో అభిఘరించాలి. కూరలు, పచ్చళ్ళను అభిఘరించనవసరం లేదు.

ప్ర: **రావణుడి నాభిలో అమృతభాండం ఉందనీ, దానిని కొడితేనే అతడు మరణిస్తాడని విభీషణుడు ఇంటిగుట్టు చెప్పి లంకకు చేటు తేవడం న్యాయమా? రాముడు ఆ మాట వినడం ధర్మమా?**

జ: అసలు రామాయణమంటే తెలియని వాళ్ళు నమ్మేకథ ఇది. ఏ హరికథల కాలక్షేపం లోనో పుట్టిన పిట్టకథ. నిజానికి రామాయణంలో ఈ ఘట్టమే లేదు.

రావణుడితో రాముడు నేరుగా యుద్ధం చేశాడు. బ్రహ్మాస్త్రంతో రావణ సంహారం చేశాడు. అంతే. అతడి నాభిలో ఏ భాండమూ లేదు. విభీషణుడు ఏ ఇంటిగుట్టూ చెప్పలేదు. కాబట్టి విభీషణుడి న్యాయానికీ, రాముడి ధర్మానికీ వచ్చిన లోటేమీ లేదు.

ప్ర: **ఎన్నో రామాయణాలున్నాయి. దేనిని నమ్మాలి? ఏది పారాయణం చేయాలి?**

జ: రామాయణం ఒక్కటే. జరిగిన కథని యథాతథంగా దర్శించి అందించినవాడు వాల్మీకి. ఆయన రచించిన రామాయణాన్నే ప్రమాణంగా స్వీకరించాలి. రామకథని తమ శక్తికొలది భావించి తరించాలని, ఆ తరువాత అన్ని భాషల కవులు యథాశక్తి తమకు తోచిన వాటితో చాలా రామయణాలు వ్రాశారు. అవి చదువుకోవచ్చు. వారి భావాలకు ఆనందించవచ్చు. కానీ ప్రమాణం విషయానికొచ్చేటప్పటికి వాల్మీకుల వారే దిక్కు. అయితే–పురాణాల్లో కూడా రామాయణం చెప్పబడింది. అవి ఆయా కల్పాలలో జరిగిన రామావతార గాథలు కనుక, కథకీ కథకీ మార్పులు కనబడతాయి.

ఇప్పటికి పూర్వం జరిగిన రామకథే వాల్మీకి రామాయణం. పారాయణం చేయాల్సినది కూడా వాల్మీకి రామాయణమే. అదే విధంగా– ఆధ్యాత్మ రామాయణం కూడా పారాయణ యోగ్యమే.

**ప్ర: శ్రీరాముడిగా పాటించిన ధర్మం, శ్రీకృష్ణుడిగా పాటించలేదేమి? రెండు అవతారాలలో తేడా ఎందుకు?**

**జ:** అవతారాలలో తేడా ఉందేమోగానీ, ధర్మాచరణలో లేదు. శ్రీకృష్ణుడు కూడా శ్రీరాముని లాగే పితృవాక్య పాలకుడు, సత్యవ్రతుడు, ధర్మజ్ఞుడు, ధర్మప్రతిష్ఠాత. రెండింటి లీలలు వేరు. లక్ష్యం, లక్షణం ఒకటే. ధర్మస్థాపన లక్ష్యం, ధర్మమయ జీవనం లక్షణం. అందుకు కృష్ణకథ మూల భాగవతం, భారతం చదివితే అంతా స్పష్టమౌతుంది.

**ప్ర: కొన్ని మంత్రాలలో వ్యాకరణ దోషాలుంటాయి. వాటిని దిద్దుకొని చదవాలా? అలాగే జపించవచ్చా? ఉదాహరణకి – 'ఆత్మాయ నమః ఆత్మలింగాయ నమః' అని ఉంది. కానీ వ్యాకరణ ప్రకారం 'ఆత్మనే నమః' అని ఉండాలి కదా! అలాగే 'కాత్యాయనాయ విద్మహే' అని ఉంది. నిజానికి 'కాత్యయన్యై' అని ఉండాలి కదా! ఇవి సవరించుకొని పఠించాలా?**



**జ:** మంత్రాలలో, వేదవాక్యాలలో కొన్ని చోట్ల మనమనుకొనే వ్యాకరణానికి సరిపోని శబ్దాలుంటాయి. కానీ వాటిని సవరించరాదు. గురుముఖతః ఎలా గ్రహించామో, పరంపరగా ఎలా వస్తున్నదో అలాగే పఠించాలి. అయితే ఈ నియమం మామూలు స్తోత్రాలకు వర్తించదు. వేద మంత్రాలకు, మంత్రశాస్త్రానికి మాత్రమే అన్వయిస్తాము. 'భద్రం కర్ణేభిః' అన్నమంత్రంలో 'కర్ణేభిః' వ్యాకరణ ప్రకారం తగిన పదం కాదు. కానీ మార్చరాదు.వేదవ్యాకరణం వేరు. నవవ్యాకరణాలలో ఇప్పుడు ప్రసిద్ధిలో ఉన్న వ్యాకరణాల సంఖ్య తక్కువే. వేదశబ్దాలు అన్నీ మన వ్యాకరణ సూత్రాలలో ఇమడవు. 'ఆత్మాయ నమః' 'కాత్యాయనాయ విద్మహే' అనే సంప్రదాయ శబ్దాలనే ఉచ్చరించాలి గానీ, వాటిని మార్చరాదు.

అలాగే కొన్ని మంత్రాలలో 'హనుమన్తాయ' అని ఉంది. దానిని 'హనుమతే' అని మార్చరాదు. కొన్ని చోట్ల 'హనుమతే' శబ్దం ఉంది. దానిని అలాగే పఠించాలి. సంప్రదాయ పాఠాలలో మంత్రశక్తి ఉంది. అది వ్యాకరణం కంటే అతీతమైంది. అనూచానంగా దీని విషయమై ఒక కథ కూడా ప్రసిద్ధిలో ఉంది. ఒకసారి కాళిదాసు

వేదమంత్రాలలోని వాక్యాలను సవరించబోయాడట, అప్పుడు వ్యాసుడు చిలుక రూపంలో వచ్చి గుణపాఠం చెప్పాడని ప్రతీతి.

ప్ర. **ఈ మధ్య ఒక ప్రసిద్ధ పండితుడు రచించిన పుస్తకాన్ని చదివాను. అందులో రామాయణం, గురించి వ్యాసాలున్నాయి. అవి చదివాక చాలా ఆందోళన, అయోమయం కలిగాయి. రాముడు మానవుడేనని ఒకచోట, ఇంద్రుడు పరదైవమని రామాయణం ప్రతిపాదిస్తోందని మరొకచోట వ్రాశారు. 'నమోస్తు రామాయ స లక్ష్మణాయ, దేవ్యైచ తస్యై జనాకాత్మాజాయై, నమోస్తు రుద్రేన్ద్ర యమానిలేభ్యో, నమోస్తు చన్ద్రార్కమరుద్గణేభ్యః' శ్లోకంలో కూడా విష్ణు శబ్దం లేదని వ్రాశారు. బాలకాండలో, యుద్ధకాండలో మాత్రమే 'విష్ణువు' అని ఉందని–అది 'కల్పితం' అని కూడా అన్నారు. సరియైన వివరణ ఇవ్వవలసిందిగా ప్రార్థన. ఇంత పెద్ద ఉత్తరం వ్రాసినందుకు మన్నించి, పూర్తి వివరణను తెలియజేసి, నా ఆందోళనను, అయోమయాన్నీ తొలగించవలసిందిగా మనవి.**

**జ:** సంప్రదాయసిద్ధంగా, పరంపరాగతంగా వస్తున్న అభిప్రాయాలని కాదని, కొత్త సిద్ధాంతం ప్రతిపాదించి తద్వారా ప్రసిద్ధి చెందాలనే తాపత్రయంలో వ్రాసే వ్రాతలవి. శ్రీరాముడు నూటికి నూరుపాళ్ళు నారాయణుడు. ఆయన సర్వదేవతాత్మకుడైన విష్ణు బ్రహ్మము. అయితే రావణుని సంహరించడానికి నరుని వలె సంచరించి మానవ ధర్మాలను చాటిన దైవం. అందుకే మానవునిగానే ఆయనను ఆదర్శంగా అను సరించాలి. అదే సమయంలో 'రామచన్ద్ర పరబ్రహ్మగా' ఆయనను ఆరాధించాలి. అందుకే రాముడు అవతరించక ముందు 'బాలకాండ'లోను, రావణవధ తర్వాత 'యుద్ధకాండ'లోను నేరుగా 'ఈతడు నారాయణుడే' అని స్పష్టం చేశాడు వాల్మీకి. మధ్యలోనంతా నరుని వలె తిరుగాడిన ధర్మవిగ్రహుడైన రామునిగాథను రచించాడు. అందులో ధ్వనిగా ఈతడు 'విష్ణువు' అని పలుచోట్ల పరమరణీయంగా ప్రతిపాదించాడు. **'అర్థితో మానుషేలోకే జజ్ఞే విష్ణుః సనాతనః'** అనే మాట 'అయోధ్యకాండ'లో స్పష్టంగా ఉంది.

ఇక 'నమోస్తు రామాయ' శ్లోకంలో 'రామ'నామంతోనే విష్ణువును స్తుతించాడు కనుక, తరువాతి వాక్యాలలో విష్ణునామం మరి ప్రస్తావించలేదు.

ఆ రామనారాయణునే, సర్వదేవాత్మకుడు కనుక, 'ఇంద్రుడు' అని భావించినా సమంజసమే.

**ప్ర: తిథులకు అధినేతలు ఉన్నారని అంటారు. ఏ తిథికి ఎవరు అధిపతో తెలియజేస్తారా?**

**జ:** పాడ్యమి–అగ్నిదేవుడు, విదియ–బ్రహ్మ, తదియ–పార్వతి, చవితి–విఘ్నేశ్వరుడు, పంచమి–ఆదిశేషుడు, షష్ఠి–కుమారస్వామి, సప్తమి–అష్టవసువులు, దశమి–దిగ్గజాలు, ఏకాదశి–యముడు, ద్వాదశి–విష్ణువు, త్రయోదశి–మన్మథుడు, చతుర్దశి–శివుడు, పౌర్ణమి–చంద్రుడు, అమావాస్య –పితృదేవతలు.

**ప్ర. 'సగర్భప్రాణాయామం,' 'సగర్భజపం' – అని ఒకచోట చదివాను. అంటే ఏమిటి. రెండు ఒకటేనా?**

**జ.** ప్రాణాయమం చేసేటప్పుడు ఉచ్ఛ్వాసనిశ్వాసలతో మంత్రాన్ని కలిపి మౌనంగా జపించడమే సగర్భ ప్రాణాయామం. సగర్భ జపమన్నా అదే.

ఉచ్ఛ్వాసతో ఒకమారు, నిశ్వాసతో ఒకమారు మంత్రాన్ని మౌనంగా జపించాలి. శ్వాస, మంత్రం ఏకమవడమే గొప్ప సాధన. రేచక, పూరకల్లోనే కాక కుంభకంలో మంత్రాన్ని జపించడాన్ని కూడా సగర్భ జపమనే అంటారు.

మంత్రాన్ని బయటకు ఉచ్చరిస్తే అధమం, పైకి వినబడకుండా పెదవి కదుపుతూ చేయడం మధ్యమం, మనస్సుతో జపించడం ఉత్తమం. సగర్భ జపం ఉత్తమోత్తమం.



**ప్ర. శంకరాచార్యులు 'నారాయణ' నామస్మరణనే చేసేవారనీ, వారి పరంపరలో ఆచార్యులు కూడా అదే చెస్తారనీ, శంకరులు శైవశాక్తేయాలకు చెందినవారు కారనీ, కేవలం విష్ణుభక్తులేననీ ఈ మధ్య ఒక వైష్ణవస్వామి టివీలో వివరించారు. ఆ తరువాతి వారెవరో ఏవో 'లహరులు' రాసి, శంకరాచార్యులు వ్రాసినట్లు ప్రచారం చేశారని కూడా చెప్పారు. విష్ణువును పూజించనివారు, శివ భక్తులను పూజించేవారు 'పాషండులని' కూడా అన్నారు. ఇవి సమంజసమేనా? ఈ మాటలు వినగానే చాలా వేదనకు గురి అయ్యాము. దీనికి తోడు ఈ మధ్య ఒక సినిమాలో శైవరాజులు ఒక వైష్ణవుని హింసించినట్లు చూపించారు. ఇలాంటివి జరిగాయా?**

**జ.** ఇలాంటి వేదనను వ్యక్తీకరిస్తూ అధికసంఖ్యలో ఉత్తరాలు ఋషిపీఠానికి చాలా మంది వ్రాస్తున్నారు. అనేక చోట్ల అటువంటి వైష్ణవస్వాములు శివద్వేషాన్నీ, శక్తి ద్వేషాన్నీ వ్యాప్తి చేస్తూనే ఉన్నారు. ఎన్నో స్మార్త కుటుంబాలనీ, ఆరాధ్య కుటుంబాలనీ వారి మతంలోకి మార్చుతూ, వారి ఇళ్లలోంచి శివశక్తి గణపతి స్కందాది దేవతలను తొలగించుతున్నారు. అయితే ఈ వైనాలు ఎన్నో ఉత్తరాల ద్వారా తెలియవస్తున్నా, మన హైందవమతంలోనే సిగ్గు చేటైన ఈ వైషమ్యాల గురించి ప్రసక్తి తేవడం

తగదని– వాటిని ప్రస్తావించడం లేదు. కానీ అధికసంఖ్యలో ఇలాంటివి వినవస్తుండడంతో మీ ప్రశ్నలోని వేదనని కొంత భాగం ప్రచురించాం.

నిజానికి ఆ భేదవాదులైన స్వాములకు శంకరాచార్యుడన్నా పడదు. వారిని నిందించడం కూడా వారి మత ప్రచారంలో ఒక భాగం. అంతేకాదు, నిన్న మొన్నటి దాకా 'శంకరులు శైవులు' అని ప్రచారం చేసిన వారు కూడా వీరే. హఠాత్తుగా శంకరుల్ని వైష్ణవ ముద్రలో చూపించాలని ఎందుకు తాపత్రయ పడుతున్నారో!

శంకరాచార్యులు 'నారాయణ' స్మరణ చేసేవారు. వారి పరంపరలో ఆచార్యులు అదే చేస్తున్నారు. నిజమే. కానీ అదే ఆచార్యులు వారి వారి పీఠాలలో శంకరులకాలం నుండీ పరంపరంగా వస్తున్న చన్ద్రమౌళీశ్వరారాధన చేస్తున్నారు. శ్రీ చక్రార్చన సాగిస్తున్నారు. మరి ఇది శివభక్తుల ఆరాధన కదా! శంకరులు సమన్వయ వాది. శుద్ధవైదిక సంప్రదాయ ప్రతిష్ఠాత. పంచాయతన పూజను ప్రవేశపెట్టిన సమైక్యమూర్తి. శివకేశవ శక్తి సూర్య గణపతి స్కంద మతాలను సుప్రతిష్ఠితం చేసిన షణ్మతస్థాపనా చార్యులు. వారి దృష్టిలో హరిహర భేదం లేదు. శంకరులు వ్రాసారని ప్రసిద్ధి చెందిన లహరులు– శివానందలహరి, సౌందర్యలహరి. ఇవి వారే వ్రాశారని శంకర విజయ గ్రంథాలు స్పష్టపరుస్తున్నాయి. శంకర పీఠాధి పతులు కూడా బోధిస్తున్నారు. ఒకవేళ శంకరులు వ్రాయలేదని మొండివాదన చేసినా, ఆ గ్రంథాల విలువ ఏమీ తరిగిపోదు. అవి పవిత్రమైన మధుర రసమయ స్తుతులు. భారతీయ స్తోత్ర సాహిత్యంలో మేరు శిఖరాలు.

ఆ మాటకొస్తే భగవద్గీత శ్రీకృష్ణుడు చెప్పలేదని వాదించే వారున్నారు. అటువంటివి స్వీకరిస్తామా! అసలు శివకేశవ శక్త్యాదులెవ్వరూ వేదాల్లో ప్రధానం కాదనీ, నిరాకార ఈశ్వరుడే ప్రధానమనే మరొక సంప్రదాయం వాళ్ళూ ఉన్నారు. నిజానికి ఇన్ద్రుడే ప్రధానదైవం– అని సిద్ధాంతీకరించిన వాళ్లూ ఉన్నారు. వారి బలమైన వాదాల ముందు ఈ వైష్ణవ స్వాముల సిద్ధాంతాలు కూడా ఎగిరిపోతాయి.

ఇలాంటి భేదవాదుల దురాగతాలను ఆనాడు అప్పయ్య దీక్షితుల వంటి వారే సతార్కికంగా ఖండించారు. శివార్కమణి దీపిక, శివతత్త్వవివేకం, శివాద్వైత దర్శనం వంటి గ్రంథాలు దీనికి తార్కాణం. మార్కండేయ, గౌతమ,దధీచి, ఉపమన్యు వంటి మహర్షులు, కాళిదాసాది కవులు కూడా శివభక్తులే. వారిని పాషండులు అని నిందించడం పాపం కదా! శివుని కాదని నిర్వాకం చేసిన దక్షుడి గతి అందరికీ తెలిసిందే!

**పవిత్ర కీర్తిం తమల్లంఘ్య శాసనం**
**భవాన హో ద్వేష్టి శివం శివేతరః** (భాగవతం)

"పవిత్ర కీర్తి కలిగినవాడు, దాటలేని శాసనంతో జగతిని శాసించేవాడు అయిన మంగళ స్వరూపుడైన శివుని అహో! అమంగళుడవైన నువ్వు ద్వేషిస్తున్నావు" అని సతీదేవి దక్షునితో అన్న మాటలు ఇక్కడ ఈ స్వాములకు కూడా విన్నవించుకోవాలి. ఒకే పరతత్త్వాన్ని విభిన్న పద్ధతుల్లో ఉపాసించడమే మన సంప్రదాయాలలోని సౌందర్యము.

వైష్ణవ, శైవ, సౌర, శాక్తేయ, గాణపత్యాలు మన వేదమతంలో విభిన్న సంప్రదాయాలు. ఇవన్నీ శ్రేష్ఠమైనవే. వీటిలో వచ్చిన ఆచార్యులు ఆ సంప్రదాయాలని పరిష్కరించడమూ అవసరమే. కానీ ఇతర సంప్రదాయాలని నిందించడం క్షమించ రాని నేరం. ఇది సంఘద్రోహచర్య కూడా. ఒకవైపు పరాయి మతాల దాడులలో అతలాకుతల మవుతున్న సనాతన ధర్మానికి, ఈ రకమైన అల్పబుద్ధుల అవహేళనలు ప్రమాదకరం. వీటిని హిందువులందరూ ఖండించాలి. మనకి శైవ వైష్ణవ శాక్తేయా దులన్నీ పూజార్హాలే. ఆయా ఆచార్యులందరూ వందనీయులే. ఈ సమయంలో శైవ పీఠాధి పతులు, శంకర పీఠాధిపతులు కూడా ఇటువంటి భేదవాదుల్ని మందలించాలి. ఒక సంప్రదాయపు లోతులు సంప్రదాయంలోని వారికే తెలిస్తాయి. వాటి గురించి ఏమీ తెలియని వారు తమ సిద్ధాంతపు రంగుటద్దాలలోంచి మరో సిద్ధాంతం గురించి తీర్మానించరాదు కదా!

ఇక సినిమా సంగతి! గత చరిత్రలో శైవులూ, వైష్ణవులు కూడా మత దురభి మానంలో కొట్టుకున్నారు. కానీ మరీ సినిమాలో చూపించినంత ఘోరంగా కాదు. ఈ సినిమా తీసిన నాస్తికుడు పుట్టుకతో శివద్వేషుల సంప్రదాయానికి చెందినవాడు కావడం గమనార్హం. పరస్పర వైషమ్యాలు రెండు వైపులా సమానంగా ఉండేవి. అయితే విశాల దృక్పథం కల అసలైన సనాతన ధర్మవాదుల చొరవ వల్ల, చలువ వల్ల అలాంటి దుష్కాలాలనుండి బయటపడ్డాం. మళ్ళీ బరి తెగించి, ఇప్పుడీ శివ నిందలు, కేశవ దూషణలు, జగదంబా తిరస్కారాలు వంటి అవాంఛనీయ సంఘట నల్ని ప్రేరేపిస్తూ, ప్రబోధిస్తున్న వారిని హిందువులంతా సంఘటితంగా ఎదుర్కోవాలి.

'శివాయ విష్ణురూపాయ' అని అనవలసిన పరిస్థితులు ఆనాడు ఎందుకొచ్చాయో ఆలోచించాలి! మళ్ళీ హైందవ మతాన్ని ముక్కలు చేసే ఈ చీలిక వాదుల్ని స్వీకరించ

రాదు. "శివమచ్యుతం" అని పలికిన వేదవాక్యం, తిక్కనాది మహాకవుల తపన... మనందరం గుర్తు తెచ్చుకోవాలి.

**ప్ర. ఆబ్దికంలో కూడని పదార్థాలు ఏమిటి? భస్మ, తిలక ధారణలతో అబ్దికం పెట్టవచ్చా?**

**జ.** గుమ్మడికాయ, గేదెపాలు, కందిపప్పు, బొబ్బర్లు, శనగలు, ఉలవలు, కొబ్బరి, ఖర్జూరం, పొట్లకాయ, శొంఠి ఆబ్దికానికి పనికిరావు.

**కూష్మాండం మహిషీక్షీరమాఢకం రాజమాషకమ్ ।**
**చణకంచ కుళుత్థంచ షడేతే శ్రాద్ధఘాతుకాః ।**
**నారికేళం చ ఖర్జూరం పటోలీనాగరం తథా ।**
**కూష్మాండం మాహిషీ క్షీరం షడేతే శ్రాద్ధఘాతుకాః ॥**

ఎరుపు వస్త్రాలు ధరించడం, ఉన్ని వస్త్రాలు దాల్చడం, రుద్రాక్ష విభూతి ధరించడం, బొట్టుపెట్టుకోవడం ఆబ్దికంలో చేయరాదు. వాటిని వాడితే పితృదేవతలు నిరాశతో వెళ్ళిపోతారు.

**కాషాయం కంబళం కాంస్యం**
**భూతి రుద్రాక్ష ధారణమ్**
**లలాటే తిలకం కుర్యాత్ నిరాశాః పితరో గతాః ॥**

కొన్ని సంప్రదాయాలలో భస్మధారణకు అనుమతి ఉంది.

**ప్ర. ఈ మధ్య క్రైస్తవులు వారి మతం 'స్వదేశీమతమే'నని చెబుతూ, కరపత్రాలూ వేశారు. దానిలో వారి ఏసుయే ప్రజాపతి అని, తనని తాను త్యాగం చేసుకున్న ప్రజానాథుని గురించి వేదంలో వర్ణించారని పేర్కొన్నారు. నిజమేనా?**

**జ:** ఇది ఒక దుష్టవ్యూహం. 'వేదవాక్కు' మీద విశ్వాసం ఉన్న భారతీయులనీ, దేశాభిమానం కలవారినీ మార్చడానికి వాళ్ళు చేస్తున్న కుత్సితాల్లో ఇది ఒకటి.

ఈ దేశంలో వారికి ఇది చెబితే మొగ్గుచూపుతారని ఆశ. వీరికీ మధ్య కోతికి కొబ్బరికాయ దొరికినట్లు తెలుగుఅనువాదం చేసిన వేదం పుస్తకాలు కొన్ని దొరికాయి. వాటిని అక్కడక్కడా చదివి, తలా తోక లేని పిచ్చి అన్వయాలు చేసుకుంటున్నారు. తనని తాను త్యాగం చేసుకున్న శిబిచక్రవర్తి, రంతిదేవుడు, దధీచి మహర్షి వంటి ఎందరో త్యాగధనుల గురించి మన వైదిక సాహిత్యం చెబుతోంది. వాళ్ళందరూ ప్రజాపతులేనా? తమ మతం భారతీయ మతమేనని నమ్మించడానికి భారతీయగ్రంథాలలోని ఉట్టంకింపులతో భారతీయ కట్టూ బొట్టులతో కొత్త 'ఇండియన్ బైబిల్'ని

తయారు చేసారు కూడా. అయితే అది ఇండియాకి మాత్రమే పరిమితం సుమా! వారిది వైదిక మతమే అనీ, వారి మతమూలాలు భారతదేశానివేననీ ప్రపంచవ్యాప్తంగా వారి పోప్‌గారినీ ప్రకటించమనండి.

బట్టతలకీ మోకాలికీ ముడివేసి మనల్ని వంచించడం మెందుకు? వారిది కూడా వైదికమతమే అయితే మరి మార్చే ప్రయత్నాలెందుకు? వారే వైదిక (హిందూ) మతంలోకి మారిపోవచ్చు కదా! పేర్లు, పద్ధతులు, మత వ్యవహారాల్లో మార్పు లెందుకు? విదేశాల నుండి వచ్చే నిధుల కోసం వెంపర్లాటలెందుకు? విదేశాల్లో పుట్టి, పెరిగిన మతాన్ని ఎక్కడో ఒక వేదవాక్యంతో ముడిపెట్టే ప్రయత్నమెందుకు? అతి తెలివితో చూస్తే నాస్తిక మత వాక్యాలు కూడా వేదాల్లో దొరుకుతాయి. అంత మాత్రాన వైదిక మతాన్ని నాస్తికమతం అని పాపం మూటకట్టుకుంటామా?

గత కొన్నేళ్లుగా జరుగుతున్న తీవ్ర మతమార్పిడి పరిణామాలివి. క్రైస్తవులుగా మారిన వారి జాబితాని పెంచుకుపోతున్నారు. వేదమతమే వారిదైనప్పుడు బాప్టిజా లెందుకు? ఎలాగూ మనందరం పుట్టుకతోనే వేద (హిందూ) మతస్థులం కదా?



మనదేవతలతోపాటూ, బాబాలవలెనే వారిదూతగారి పటం కూడా కలిపి వేసి మనం మతం మారకుండానే వారిని గౌరవిస్తే ఒప్పుకుంటారా? వారికి కావలసింది మార్పిడియే. నిన్నటి వరకు హిందూమతాన్ని నానా దుర్భాషలతో నిందించి, ఇప్పుడు 'మీలో వాడ్నే నేను' అని పంచన చేరి వంచన చేయడం సిగ్గుమాలినతనం.

నేనూ మీ వాడినే అని ఇంట్లో దూరి, కొల్లగొట్టే దొంగ పద్ధతి ఇది. వీటిని తెలివిగా త్రిప్పికొట్టాలి. మనకి క్రైస్తవ మతం అంటే గౌరవం ఉంది. కానీ దానిని గౌరవించడానికి మన మతాన్ని- వదలనక్కర్లేదు దీనితో కలపనక్కర్లేదు.

ప్ర. **'సేతుబంధేతు రామేశం' అనే మాట శివపురాణంలో ఉంది. కానీ రామాయణంలో లేదు. పురాణాల ప్రకారం అయినా రావణవధకు ముందు లింగప్రతిష్ఠ జరిగిందా? లేక ఆ తరువాతనా? రాముడు శివుని ప్రతిష్ఠించలేదు - అని ఒక వైష్ణవస్వామి చెప్పారు. ఏది ప్రమాణం?**

జ. ఆయన వైష్ణవస్వామి కనుక అలాగే చెప్తారు. కానీ వాల్మీకి రామాయణంలో సీతాదేవితో సహా శ్రీరాముడు పుష్పక విమానంపై వస్తూ, త్రోవలో వివిధ ప్రాంతాలను చూపిస్తూ వివరించినట్లుగా యుద్ధకాండ 124వ సర్గ, 19,20,21 శ్లోకాలలో - సేతుబంధ శివుని ప్రసక్తి స్పష్టంగా కనిపిస్తుంది. పురాణాలు చెప్పిన ప్రకారంగా

సేతు బంధానికి ముందే శ్రీరాముడు శివలింగ ప్రతిష్ఠ చేశాడు.

**ఏతత్ కుక్షౌ సముద్రస్య స్కన్ధా వార నివేశనమ్ ।**
**అత్రపూర్వం మహాదేవః ప్రసాద మకరోత్ ప్రభుః ॥**
**ఏతత్తు దృశ్యతే తీర్థం సాగరస్య మహాత్మనః ।**
**సేతుబంధ ఇతిఖ్యాతం త్రైలోక్యేనాభి పూజితం ॥**
**ఏతత్ పవిత్ర మనఘం మహాపాతక నాశనం ।**

(వాల్మీకి రామాయణం, యుద్ధకాండ)

“ఈ కనుపించునదే త్రిభువన విఖ్యాతమై మూడులోకాలలోను పూజనీయమైన, సాగరగర్భంలో గల సేతుబంధమనే పుణ్యతీర్థం. ఇది పరమపవిత్రమైనది. సకల మహాపాతక నాశనకరమైనది. ఇచటనే పూర్వం మహాదేవుడైన శివుడు ప్రసన్నుడైనాడు” అని శ్లోకాల భావం.

అయితే ప్రతిష్ఠ చేసిన సన్నివేశాన్ని వాల్మీకి రచించకుండా, తరువాత మాత్రమే ఈ ప్రస్తావన చేశాడు. పురాణ సంప్రదాయంలో రచించిన గ్రంథంలోనే క్షేత్రాదుల గురించి విశేష ప్రసక్తి ఉంటుంది. కావ్య సంప్రదాయంలో ఉండదు.



కొందరు శివద్వేషులైన వైష్ణవులు ఈ శ్లోకాలకు వ్యాఖ్యరాస్తూ ‘మహాదేవ’ అనే చోట ‘సముద్రుడు’ అని అర్థం చెబుతూ దూరాన్వయం, దురన్వయం చేశారు. అది ఔచిత్యానికి పొసగదు. శివపురాణం, కూర్మపురాణం మరికొన్ని పురాణాలలో చారిత్రక గ్రంథాలలో రామేశ్వర ప్రశస్తి చాలా ఉంది. అవి ప్రమాణాలు కావనడానికి లేదు. ఆ మాట కొస్తే వాల్మీకి రామాయణంలో రామనామం తారకమంత్రమనిగానీ, భద్రాద్రి వంటి రామక్షేత్రాల గురించిగానీ ఏమాత్రం కూడా ప్రస్తావన లేదు. అయినా వాటిని కాదనలేము. రామమంత్రాన్ని గానీ, రామక్షేత్రాలని గానీ శంకించినా మహాపాపం. వాటి గురించి పురాణాది తదితర గ్రంథాలే ప్రమాణాలు. అలాగే రామేశ్వరం గురించి కూడా.

**సేతుమధ్యే మహాదేవమీశానం కృత్తివాససం ।**
**సామిసోకుల సత్ఫాలం స్థాపయామాస రాఘవః ॥**
**తస్యదేవో మహాదేవః పార్వత్యా సహశంకరః ।**
**ప్రత్యక్ష ఏవ భగవన్ దత్తవాన్ వరముత్తమమ్ ॥**
**యావత్ సేతుశ్చ తావచ్చ స్థాస్యామ్యత్ర తిరోహితః ।**

**స్నానం దానం తపశ్శ్రాద్ధం భవిష్యత్యక్షయం ఫలమ్ ॥**
**స్మరణా దేవలింగస్య దినపాపం వినశ్యతి"**

"చంద్రార్థ శేఖరుడు, గజచర్మధార్మి, జగదీశ్వరుడు, సకల దేవతాధికుడు – అయిన పరమశివుని సేతుమధ్యంలో రాఘవుడు స్థాపించాడు. పార్వతీ సహితుడైన మహాదేవుడు, భగవంతుడైన శంకరుడు ప్రత్యక్షమై వరమిచ్చాడు.

పర్వతాలు, పృథివి, నదీనదాలు స్థిరములై నిలిచి ఉన్నంతకాలం నేను (శివుడు) ఈ సేతువునందు, సామాన్యులకంటికి కనబడకుండా స్థిరంగా నివసిస్తాను. ఈ సేతువులో చేయబడిన స్నానం, దానం, శ్రాద్ధకర్మ, జపం, తపస్సు మొదలైనవి అక్షయమైన ఫలాలనిస్తాయి. శ్రీరామప్రతిష్ఠితమైన లింగాన్ని స్మరించినంత మాత్రాన, జనులకు ఆ దినాన చేసిన పాపలన్నీ నశిస్తాయి."

రాముడు శివుని ఆరాధించినంత మాత్రాన రామపారమ్యానికి తక్కువ కాదు. వారిరువురూ ఒకే తత్త్వం. ఒకరికొకరు భక్తులు.

ప్ర: **గణపతి విగ్రహానికి పూజ చేసి, ఎంతోచక్కగా అలంకరించి తిరిగి నీటిలో కలిపేయడం ఎందుకు? పైగా నీటిలో కరగని పెద్దపెద్ద విగ్రహాలను అలా కలపడం కాలుష్యమే కదా? అలాగే అమ్మవారి నవరాత్రులయ్యాక కూడా నిమజ్జనం చేస్తారు కదా! మరో ప్రక్క గణపతికి నవరాత్రులు లేవని, బాలగంగాధర్ తిలక్ దీనిని ప్రవేశపెట్టాడని ఒక పెద్దాయన ఒక పత్రికలో వ్రాశారు? అది నిజమేనా?**

**జ:** గణపతి విగ్రహాన్ని పూజించి తిరిగి నీటిలో కలపడంలోనే– మన విగ్రహారాధన తత్త్వం అర్థమౌతుంది. విగ్రహాన్ని మాత్రమే దేవుడనుకోరు హిందువులు.

ఇంట్లో నిత్యం పూజించే ఇత్తడి, వెండి, బంగారు ప్రతిమలు నిమజ్జన చేయనవసరం లేదు. కానీ, వినాయక, దేవీ మొదలైన విగ్రహాలకు ఆయా పర్వదినాలలో ప్రత్యేకించి– మట్టితో చేసి అందులో మంత్ర సహితంగా సంస్కారం చేసి, 'ఆవాహన' మొదలైనవి ఆచరించి, ఆరాధిస్తారు. విశ్వవ్యాపకమైన భగవత్ చైతన్యాన్ని ఆ విధంగా కేంద్రీకృతం చేసి, ఆరాధించి, ఆ తరువాత యధావిధి పూజలన్నీ సమాప్తమయ్యాక, తిరిగి 'ఉద్వాసన' చేస్తాం. అంటే ఆరాధింపబడిన మహాశక్తిని మన అంతరంగంలో నిక్షిప్తం చేసుకోవాలి. తద్వారా ఆ దేవతా శక్తి మనల్ని అనుగ్రహిస్తుంది.

ఈ విగ్రహాన్నే కలకాలం ఉంచితే నిత్యమూ తగిన శాంతి జరపడం సాధ్యం కాదు. అలా ఉద్వాసన చేసిన తరువాత ఆ విగ్రహం కేవలం మృణ్మయమే. దానిని

తిరిగి జలతత్త్వంలో లీనం చేయాలి. పృథ్వీతత్వాన్ని జలతత్త్వంలో లయింపజేయడం ఒక యోగప్రక్రియ కూడా.

అయితే కరగని విధంగా విగ్రహాల్ని చేయడం శాస్త్రం కాదు. కేవలం నీటిలో కరిగే మట్టితోనే ప్రతిమను చేసి, దానిని పత్రాలతో అర్చించడం సంప్రదాయం. తిలక్ మహాశయుడు సామూహికంగా గణపతి పూజల్ని ప్రాచుర్యం చేసిన మాట వాస్తవమే. కానీ గణపతి నవరాత్రులు ఆయన కల్పితం కాదు. గాణపత్యంలో నవరాత్రి విధానం ఉంది. గణపతినే పరదైవంగా భావించి కొలిచే మతం గాణపత్యం.

శక్తి నవరాత్రులు, రామ నవరాత్రులు వలె గణపతి ఉపాసకులకు నవరాత్ర దీక్ష ఉంది. ఆ దీక్షతో గణపతిని పూజించడం సంప్రదాయ సిద్ధమే. మహారాష్ట్రలో గాణపత్యం ఎక్కువగా వ్యాప్తిలో ఉంది కనుక, అక్కడ అధికంగా ఈ నవరాత్రులు కనిపిస్తాయి. గణపతి ఉపాసకులు, భక్తులు ఎక్కడివారైనా, శాస్త్ర సిద్ధంగా భాద్రపద నవరాత్రులు చేయవచ్చు.

ప్ర. **హైందవమతంలో శాకాహారం గొప్పది అంటారు. మరి హిందువుల్లో కూడా మాంసాహారులు ఉన్నారు కదా! ఆ రోజుల్లో అగస్త్యుడు వంటివారు మాంసం తిన్నారంటారు. పితృకార్యాల్లో మాంసంవాడే వారుట. అసలు మనిషికి మాంసామారం స్వాభావికం అని కూడా కొందరు వాదిస్తున్నారు. సందేహాలు తీర్చండి.**

**జ.** మాంసాహారాన్ని వదిలివేయడం గొప్పదే. కానీ హిందువుల్లో మాంసాహారం తినేవారు ఉన్నారు. మాంసం అందరికీ నిషేధం కాదు. వారి వారి జీవనవిధాలు, వారు పుట్టిన వర్ణం, ఉన్న ఆశ్రమం–వీటి ననుసరించి మాంస, శాకాహారాలు విధింపబడ్డాయి. పరంపరగా మాంసం తినకూడని నియమం కలవారు ఆ నియమాన్నే పాటించాలి. తద్వారా వారు వారి సదాచారాన్ని కాపాడుకుంటారు. దానిని తప్పితే మహాపాపమే. పరంపరగా మాంసం తినే కుటుంబాలకు, వర్ణాలకు మాంసాహారం దోషంకాదు. వారికి కూడా కొన్ని పర్వదినాలలో, ఆదివారం, పవిత్ర తిథులలో, చాతుర్మాస్యాలలో మాంసం తినరాదని శాస్త్రం చెబుతోంది. వారు వాటిని పాటించాలి. అసలు వారు కూడా మాంసాన్ని విడిచిపెడితే గొప్ప విషయమే.

'మాంసాన్ని తినను' అని నియమాన్ని స్వీకరించినవానికి గొప్ప యజ్ఞఫలాలు లభిస్తాయని శాస్త్రవాక్యం. మహాభారతంలో ఈ విషయంలో భీష్మాచార్యులు స్పష్టంగా వివరించారు.

అయితే పూర్వయుగాలలో పితృకార్యాలలో మాంసాన్ని వినియోగించడం ఉంది. కాని కలియుగంలో అది నిషేధం. అలాగే అగస్త్యుడు నిత్య మాంసాహారి కాదు. లోకరక్షణ కోసం వాతాపి ఇల్వలులను వధించినప్పుడు మాంసఖాదనం చేయవలసి వచ్చింది. సముద్రజలాన్నే ఆపోశన పట్టిన మానుషాతీతుడైన అయోనిజుడు అగస్త్యుడు. ఏళ్ళ తరబడి ఏ ఆహారమూ స్వీకరించనక్కర లేని మహాయోగి కూడా. అటువంటివారు లోకకల్యాణం కోసం చేసిన చర్య ఆహారాచారాల క్రిందికి రాదు. అంత మాత్రాన వారికి దోషమూ అంటదు. అవి మనకు అనుసరించ తగవు.

**ప్ర. ఇప్పుడు నడుస్తున్న వైవస్వతమన్వంతరం సంఖ్య ఏమిటి? ఇంకా ఎన్ని మన్వంతరాలున్నాయి?**

**జ.** పదునాలుగు మన్వంతరాలలో ఇది ఏడవది. దీని తరువాత సావర్ణి మన్వంతరం. 1. స్వాయంభువ, 2.స్వారోచిష, 3.ఉత్తమ, 4. తామస, 5. రైవత, 6. చాక్షుష, 7. వైవస్వత, 8. సావర్ణి, 9.దక్షసావర్ణి, 10. బ్రహ్మసావర్ణి, 11. ధర్మసావర్ణి, 12. రుద్రసావర్ణి, 13. దేవసావర్ణి, 14. ఇంద్రసావర్ణి.

**ప్ర. 'పురాణం పంచ లక్షణం' అంటారు కదా! ఆ ఐదు లక్షణాలు ఏమిటి?**



**జ.** **సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణం ॥**

సర్గము, ప్రతిసర్గము వంశం, మన్వంతరం, వంశానుచరితం అని ఐదు లక్షణాలు కలది పురాణం. 'సర్గ' అనగా బ్రహ్మాండోత్పత్తి. కల్ప, కల్పాంతరాలలో జరిగే సృష్టిని 'ప్రతిసర్గం' అంటారు.

దేవతల, బ్రహ్మర్షుల, దేవయోనుల ఆవిర్భావం, వంశ వివరాలు – 'వంశం'. స్వాయంభువాది చతుర్దశ మనువుల చరిత్రలు 'మన్వంతరం'. సూర్యచంద్రాది వంశాలలోని చక్రవర్తుల చరిత్రలు 'వంశానుచరితం'. ఈ అంశాలను వివరించే గ్రంథరాశి పురాణం.

**ప్ర. చూపుడువేలుతో దేవతలను చూపించరాదంటారు. దానిలో ఇంకేమైనా నిషేధాలున్నాయా?**

**జ.** చూపుడువేలును 'తర్జనీ' అంటారు. దీనితో చెట్లను, దేవతలను, మందిరాలను, చూపించరాదు. పెద్దవారివైపు, గురుదేవులవైపు దానిని చూపించరాదు. తమలపాకుకు సున్నం చూపుడువేలుతో రాయకూడదు. ఔషధాలను, పాలను తదితర పానీయాలను

చూపుడువేలు ఒక్కదానితో కలుపరాదు. గంధం అరగదీశాక చూపుడువేలుతో తీయరాదు. బొట్టుకూడా చూపుడు వేలుతో పెట్టకూడదు. మొత్తంగా కేవలం చూపుడువేలును, చిటికెన మాత్రమే పూజాదికాలలో వినియోగించకూడదు.

**ప్ర. తడిబట్టతో కొందరు మడిగా పనులు చేస్తారు. ఆ తడిబట్టలు అనారోగ్యం కదా? ఇలాంటి అనారోగ్యకర చర్యలు ఆచారాలవుతాయా?**

జ శుభకార్యాల్లో తడిబట్ట కట్టుకొంటే అపచారం. అది ఆచారం కాదు. అజ్ఞానం చేత కొందరు చేస్తారు. వారికి బోధించాలి. శాస్త్ర ప్రకారం తడి బట్టతో శుభకార్యాలు, క్షురకర్మ పనికిరావు. అపర కర్మల్లో కూడా తడిపి ఆరవేసే వస్త్రాలే వాడాలి.

**ప్ర. మహాభారతం గ్రంథాన్ని సంపూర్ణంగా ఇంట్లో ఉంచుకోకూడదని కొందరంటున్నారు. నిజమేనా?**

**జ.** అది కేవలం అపోహ. గ్రంథమంతా చదవాలనే వ్యాసుని ఉద్దేశం. సంపూర్ణ గ్రంథాన్ని ఇంట్లో ఉంచినా ఏం ఫరవాలేదు. భారతం పాపసంహారకమైన పవిత్ర గ్రంథం కూడా. అంతేకాదు 'పంచమవేదం'గా ప్రసిద్ధి చెందిన ఈ మహాగ్రంథం ఇంట్లో ఉండడం వల్ల ఇంటికి క్షేమకరం.



**ప్ర. ద్యూతవ్యసనం చేతనే ధర్మరాజు ఉత్సాహంతో జూదంలో పాల్గొన్నాడనీ, శకుని మాయలేదనీ, వ్యసనం వల్లనే ధర్మరాజు నశించాడనీ – కొందరు రాసినది చదివాను? ధర్మరాజు పాత్ర అటువంటిదా?**

**జ.** ధర్మరాజు వ్యసనపరుడు కాడు. మహాభారతాన్ని క్షుణ్ణంగా చదివితే ఈ విషయం స్పష్టమౌతుంది. పాండవుల బాగును చూసి ఓర్వలేని అసూయాపరుడు దుర్యోధనుడు. అతని ప్రీతికై 'ద్యూతం' అనే నెపంతో పిలిపించమనీ, తాను అతడిని మాయతో జయించుతాననీ శకుని అంటాడు. పైగా శకుని ఉద్దేశంలో – ధర్మజునికి ద్యూత మందు ప్రీతి. కానీ ధర్మరాజు మాటలు చాలా సముచితంగా ఉంటాయి. దుర్యోధనుడు తెలివిగా ధృతరాష్ట్రుని ఒప్పించి, ధృతరాష్ట్రుని చేత ధర్మరాజుకు విదురుని ద్వారా ఆహ్వానం పంపించాడు. విదురుడు స్వయంగా వెళ్ళి –

**'తస్యాం సుహృద్ద్యూతం క్రియతామ్"** – అన్నదమ్ములతో 'సుహృద్ద్యూతం' (స్నేహ పూర్వకమైన జూదం) ఆడాలి – అని విదురుడు చెప్తాడు. విదురునకు దుర్యోధనుని దుర్మార్గం తెలియలేదు.

**'ద్యూతం కలహ హేతువు'** అని అనాసక్తిని తెలియజేసినప్పటికీ, తండ్రి, తరువాత

తండ్రి అయిన ధృతరాష్ట్రుని మాటను 'పిత్రాజ్ఞ'గా భావించి ధర్మరాజు ద్యూతానికి వెళ్ళాడు. పైగా అన్నదమ్ములతో ఆటకి, అందునా తండ్రి పిలవగా వెళ్ళడం తప్పేమీ కాదు. కానీ శకుని మాయోపాయం వల్ల ఓటమి ఎదురయింది. దానికి తోడు – బలీయమైన విధి. ఇందులో ధర్మజుని దోషమేమీ లేదు. వ్యసనమూ, అధర్మమూ రెండూ యుధిష్ఠిరునిలో లేవు.

**ప్ర. కర్ణుని కని నదిలో పారవేయడం కుంతికి తగిన పనేనా? ఒకసారి తల్లి అయిన ఆమె మళ్ళీ వివాహమాడడం తగునా?**

**జ.** కుంతీ పాత్రను సరిగ్గా తెలుసుకోకుండా, నేటి లౌకికుల స్థాయిలో ఆలోచించడంలోనే దోషం ఉంది. కుంతీదేవి దుర్వాసుడిచ్చిన వరాన్ని, బాల్యంలోనే కుతూహలం కొద్దీ జపించింది. అప్పుడు సూర్యుని వలన ఆమెకు మంత్రానుష్ఠాన ఫలంగా కర్ణుడు "సద్యోగర్భం"గా కలిగాడు. ఇది మంత్రఫలంగా కలిగిన అతిమానుష (మానవతీత) ప్రక్రియ. పైగా ఆదిత్యుని శక్తి చేత ఆమెకు కన్యాత్వం భంగం కాలేదు.

సూర్యుని ఉపదేశం మేరకు ఆయన చెప్పిన విధంగా నర సర్వభద్రంగా పేటికలో పెట్టి అశ్వనదిలో విడిచిపెట్టింది. ఇది 'పారవేయడం' కాదు. ఈ బిడ్డకు సూర్యరక్ష ఉంది. సహజ కవచకుండలాలతో పుట్టినవాడు కర్ణుడు.

కన్యాత్వం భంగంకాని కుంతి వివాహానికి యోగ్యురాలే. అలౌకికమైన ఒక దైవిక ప్రయోజనంగా మంత్రబలంతో సంతానాన్ని కనడం లౌకికమైనది కాదు. వివాహం లౌకిక ధర్మం. కుంతీ సూర్యులది లౌకిక, స్త్రీ పురుష వివాహ సంబంధం కాదు.

**ప్ర. సాధ్యులు, వసువులు అంటే వేరు వేరా?**

**జ.** సాధ్యులు పండ్రెండు మంది. వీరు బ్రహ్మముఖం నుండి వచ్చినవారు. మంత్ర శరీరులు. మంత్రానికి శక్తినిచ్చే దేవతలుగా భావించవచ్చు. వీరి పేర్లు – 1. మను, 2. మంత్ర, 3. ప్రాణద, 4. చేతయాన 5. వీర్యవాన్, 6. విత్తి, 7, జయ, 8. నయ, 9. హంస, 10. నారాయణ, 11,ప్రభవ, 12. విదు.

'సాధనేనప్రాప్యః' సాధన ద్వారా లభించే శక్తులివి.

వసువులంటే 'ఉండేవారు'. నిత్యమూ ఉండే శాశ్వత సంపత్‌శక్తులు.

అగ్ని, భూమి, వాయువు, అంతరిక్షం, ఆదిత్యుడు, దివి, చంద్రుడు, నక్షత్రాలు – వీటిని వసువులంటారు. ఇవి విశ్వంలో ఉండే వసువులు.

ఇక దేవతలుగా ప్రసిద్ధి చెందిన వసువులు ఎనిమిది మంది.

1. ధ్రువ, 2. ధర, 3. సోమ, 4. అప, 5. వైశ్వానర, 6. అనిల, 7. ప్రత్యూష, 8. ప్రభా.

**ప్ర. భార్యాభర్తలు కలసి ఏ వ్రతమైనా చేస్తారంటారు కదా! మరి సత్యభామ భర్తనే దానం చేసిన వ్రతం చేయడం సరియైనదేనా? తులాభారం కథలో ఔచిత్యం ఎంత మటుకు?**

**జ.** భార్య భర్తృ క్షేమం కోరి చేసే వ్రతాలు, నోములు ఉన్న మాట వాస్తవమే. అయితే భర్తనే దానం చేసే వ్రతాలు ఎక్కడాలేవు. సత్యభామ తన భర్తయైన శ్రీకృష్ణుని దానం చేయలేదు. తులాభారం కూడా ప్రామాణిక గ్రంథాలలో చెప్పబడలేదు. భాగవతం, భారతం, విష్ణుపురాణం, బ్రహ్మవైవర్తం... వంటి కృష్ణకథా గ్రంథాలలో ఈ తులాభార ఘట్టం ఎక్కడా లేదు. ఇది కల్పిత కథ.

అయినప్పటికీ ఇందులో ఉద్దేశం – గొప్ప సందేశం. "అహంకారాలకీ, సంపదలకీ భగవంతుడు లభించడు. నిష్కపటమైన భక్తికి, సర్వసమర్పణకీ మాత్రమే భగవంతుడు లభిస్తాడు." దీనిని చెప్పడానికై చక్కని కల్పనగా ఈ కథను ఏ మహానుభావుడో రచించాడు. ఒక కల్పనగా దీనిని ఆనందించవచ్చు, కానీ ప్రమాణంగా స్వీకరించరాదు.

**ప్ర. ఒక వ్యక్తి మరణించాక అతడి సంబంధీకులు (ఇంట్లోవారు) దీపారాధన, నిత్యపూజ చేయవచ్చా?**

**జ.** మరణించిన పన్నెండు రోజుల తరువాత – ఇంట్లోవారు దీపారాధన, నిత్యపూజ చేయవచ్చు. కర్మ చేసిన వ్యక్తి కూడా నిత్యపూజనీ, దీపారాధననీ కొనసాగించవచ్చు. అయితే ప్రత్యేక పూజలు, పండగలు, తీర్థయాత్రలు చేయరాదు. సంవత్సరీకాలయ్యే వరకు పితృయజ్ఞంలోనే దీక్షవలె ఉండాలి.

**ప్ర. దశావతారాలు–డార్విన్ పరిణామ సిద్ధాంతానికి సరిపోయే విషయాలు...అని కొందరు వివరిస్తూంటారు? మనిషి జలచర దశ నుండి సంపూర్ణ మానవదశ వరకు పరిణామాన్ని పొందడమే దశావతారాల మర్మమనే మాట ఎంతవరకు సమంజసం?**

**జ.** మన సిద్ధాంతాలలో వైజ్ఞానికంశాలున్న మాట వాస్తవమే. కానీ పరిణామం జగత్సహజం. ఏ జాతికి ఆ జాతి క్రమక్రమ పరిణామం చెందాయి అనే మాట హేతుబద్ధంగా ఉంటుంది. అంతేకానీ ఒక జాతి నుండి మరొక జాతి పరిణామక్రమంలో ఏర్పడడం పూర్తిగా హేతుబద్ధం కాదు. అయితే కొన్ని అంశాలలో భిన్న భిన్న జంతు జాతుల

మధ్య ఏవో కొన్ని సారూప్యాలుండవచ్చు. అంతమాత్రం ఒక జాతి నుండి మరొకజాతి ఏర్పడిందని చెప్పడం సరిపోదు.

మత్స్యావతార సమయంలో కానీ, అలాగే నరసింహాది అవతారాలలో కానీ సంపూర్ణమైన మానవజాతి అప్పటికే ఉంది. అందుకే ఆ అవతారాలకు పరిణామ సిద్ధాంతాన్ని అంటగట్టడం అసమంజసం. పైగా అవతారాల క్రమం మత్స్యం నుండే అని చెప్పడానికీ లేదు. విభిన్న కాలాల్లో వివిధ విధాలుగా అవతారక్రమాలున్నాయి.

డార్విన్ సిద్ధాంతాన్ని అంగీకరింపజేయడానికి దశావతారాలతో అన్వయించనక్కర లేదు. అదే విధంగా దశావతారాలపై ఆమోదం కోసం డార్విన్‌ని జతనేయనవసరం లేదు. దేని దారి దానిది.

**ప్ర. పంచాంగాలలో 'వేధ' అంటారు అంటే ఏమిటి ?**

**జ.** 'విద్ధతిథి'ని వేధ అంటారు. ఒక తిథి మరో తిథితో కలిసినప్పుడు 'వేధ' అంటారు. ఇది మళ్ళీ రెండు రకాలుగా ఉండే అవకాశముంది.

సూర్యోదయం తరువాత ఆరు ఘడియల వరకు ఇంకొక తిథి కలిసి ఉండడం 'ప్రాతర్వేధ'. సూర్యాస్తమయానికి ఆరు ఘడియల ముందు ఒక తిథితో మరో తిథి కలిస్తే 'సాయంవేధ'. కొన్ని పర్వదినాలకు సంబంధిత తిథి ఆ కాలంలో వ్యాపిస్తే చాలు. కొన్నింటికి వేధ అధికంగా ఉండి తీరాలి.



**ప్ర. ధనుర్మాసాన్ని 'పీడనెల' అని, ఏ శుభకార్యాలు తలపెట్టరు కదా! మరి ఈ మాసంలో పిల్లలు పుడితే వారికి దోషం అంటుతుందా?**

**జ.** ఏ మాసమూ 'పీడనెల' కాదు. ప్రతి మాసము, ప్రతి తిథీ, ప్రతి వారం, ప్రతి నక్షత్రం దేవతా స్వరూపాలే. ఐతే నీటిని నిప్పుగా వాడలేం. నిప్పుని నీటిగా వాడలేం. అలాగే ఏ మాసం ప్రయోజనం దానికి ఉంటుంది. అప్పటి సూర్యచన్ద్రాదుల ప్రభావాన్ని అనుసరించి ఆయా మాసాలలో కొన్ని చేయవచ్చు - కొన్ని చేయరాదు. కొన్నిటికి అనుకూలం. కొన్నిటికి ప్రతికూలం.

పిల్లల పుట్టుకకీ మాసాల ప్రభావానికీ సంబంధం లేదు. పిల్లల పుట్టుకపై మాసాల నిషేధాలు లేవు. అయితే నక్షత్రానుగుణంగా కొన్ని నక్షత్రాలలో జన్మించిన వారికి కొన్ని శాంతులుంటాయి. అంత మాత్రం జాగ్రత్త పడితే చాలు.

**ప్ర. నిగమానికీ, ఆగమానికీ తేడా ఏమిటి? రెండింటికీ 'వేదాలు' అనే అర్థమే చెప్పుకోవాలా?**

**జ.** నిగమం – అంటే వేదాలు. ఆగమం – అంటే 'మంత్ర శాస్త్రం' అని చెప్పుకోవచ్చు. లేదా – 'తంత్రం' అని కూడా అనవచ్చు. రెండింటికీ శబ్దపరంగా పరిశీలిస్తే – 'పరమేశ్వరుని నుండి వచ్చినవి' అని అర్థం. అయితే భారతీయ సంస్కృతికి ఈ రెండూ ప్రధానమైనవి. రెండూ అనాది నుండి వస్తున్నవే. రెండింటినీ అపౌరుషేయాలు (మానవ సృష్టికావు) అనే భావిస్తారు.

వేదాలకు – ఆగమాలకు సంబంధం ఉంది. రెండింటిలోనూ సామాన్యాంశాలు చాలా ఉన్నాయి. శివ, విష్ణు, శక్తి, సూర్య, గణపతి, స్కంద–ఇత్యాది దేవతారూపాలు వేదంలో ఉన్నవే. వాటి ఉపాసనా పద్ధతులు, సాధనా విధానాలు ఆగమాలు వివరించాయి. యోగానికీ, ఆరాధనకీ ఆలయాది విధానాలకీ ఆగమాలు చాలా గొప్పగా ఉపకరిస్తాయి. ఇవి శాక్తేయ, వైష్ణవ, శైవ– భేదాలతో చాలా ఉన్నాయి. ఆయా సంప్రదాయ వాదులు వారి ఆగమాలు వారి అభీష్ట దేవతల ద్వారా వ్యక్త మయ్యాయని చెప్తారు.

**'నిజాజ్ఞారూప నిగమా' 'సకలాగమసందోహ శుక్తి సంపుట మౌక్తికా'–** వంటి నామాలతో నిగమాగమ సమన్వయాన్ని చెప్పింది లలితా సహస్రనామస్తోత్రం. సంప్ర దాయజ్ఞులు వేద విరుద్ధమైన ఘోర పద్ధతులతో ఉన్న ఆగమాలను వామాచార పరంగాను, వేద సమ్మతమై సాత్త్విక విధానాలతో ఉన్నవాటిని శుభాగమాలుగా దక్షిణాచారంగా పేర్కొంటారు.

**ప్ర. మన హిందూమతంలో 'అంటరానితనం' నిజంగా ఉందా? ఇలాంటి అమానుషమైన ఆచారం ఎందుకు వచ్చింది?**

**జ.** స్థూలంగా ఆలోచిస్తే కొన్ని సదాచారాలు దురాచారాలుగానూ, అమానుషంగానూ కనిపించవచ్చు. కానీ సూక్ష్మంగా పరిశీలించాలి. ఆర్థిక అసమానతల వల్ల ఏర్పడిన దురాచారాలకు, మత (ధర్మ) పరమైన ఆచారాలకు సంబంధం లేదు.

ధర్మంలో ఏ ఉద్దేశంతో సదాచారం పెట్టబడిందో దానిని అర్థం చేసుకోక, తమ ఆధిక్యాన్ని నిరూపించుకోడానికి ఆచారాన్ని అడ్డం పెట్టుకోవడం వల్లనే అమానుషంగా మార్పు చెందాయి.

సృష్టిలో అందరూ ఒకే విధంగా జీవించడం సాధ్యంకాదు. అందునా సామాజిక జీవులైన మానవులు పరస్పరావసరాలను పరస్పర సహకారంతో తీర్చుకుంటారు. ఒక బట్టల వ్యాపారి రోజులో అధిక భాగం వస్త్ర వ్యాపారానికే కేటాయిస్తాడు. కానీ

బట్ట అవసరమైనవాడు అంత సమయం వస్త్రాల కోసం వినియోగించనక్కర్లేదు. అందుకే ఇద్దరి జీవిత విధానంలో తేడా ఉంటుంది. రోజంతా వ్యవసాయం చేసే రైతు, పూజా పునస్కారాలు చేసే వానిలా రోజంతా మడీ తడీ– జపం తపం చేయడం సాధ్యం కాదు. అతడు కొద్దిసేపు భగవంతుడ్ని ప్రార్థించి తన పనిలో తాను పడిపోతాడు. అందుకే ఇద్దరి ఆచార వ్యవహారాలు ఒకేలా ఉండడం సాధ్యం కాదు. ఇవి విభిన్నతలే తప్ప, విరుద్ధాలు కావు. ఇవి వృత్తిపరమైన వ్యత్యాసాలు.

అలాగే అనుష్ఠానంలో కొన్ని నియమాలుంటాయి. శుచిగా వండిన వంటను, జలాన్ని అభిమంత్రించి తినడం ఒకరి ఆచారం. ఆ స్థితిలో శుచిలేనివాడు తన జాతివాడైనా అస్పృశ్యుడే. మడి కట్టిన తల్లికి తన బిడ్డ కూడా అస్పృశ్యుడే.

అసలు సర్వసాధారణంగా లోక వ్యవహారంలో కూడా ఎవరి దూరాలు, పరిధులు వారికుంటాయి. అంతే కానీ ఒక వ్యక్తిని తక్కువగా చూచి కులం పేరుతోనో, వర్గం పేరుతోనో కించ పరచి దూరం చేయడం ఆచారం కాదు. అది అహంకారం. దానిని మన మతధర్మం అంగీకరించదు.



ప్ర. **వైష్ణవంలో ఆళ్వారులు దివ్యప్రబంధాన్ని పవిత్రంగా భావిస్తారు. అవన్నీ తమిళం నుండే వచ్చాయి. మరో భాషలో ఎందుకు లేవు? మరి–శైవంలో అలాంటి సాహిత్యాలు లేవా? వారిని ఆళ్వారులే అంటారా?**

**జ.** ఏ భాషలో వచ్చినా గొప్ప విషయాలను గ్రహించడం తప్పు కాదు. దివ్యపురుషులు ఏ భాషలోనైనా పుట్టవచ్చు. మన సంస్కృతికి మూలాలైన వేద పురాణాలలో ఎన్నో విష్ణు మంత్రాలు, శ్లోకాలు ఉన్నాయి. ఆగమాలు కూడా సంస్కృ తంలో ఉన్నాయి. అయితే మన దక్షిణాపథంలో తమిళభాషలో పుట్టిన వైష్ణవ మహాత్ములు ఎక్కువ సంచరించడం చేత వారి భాషలో వచ్చిన దివ్య ప్రబంధాలను, భాషను వ్యాప్తి చేశారు. అది నెమ్మదిగా సంప్రదాయంగా నిలదొక్కుకుంది. ఆ సత్సంప్రదాయాన్ని మనం అనుసరిస్తున్నాం. ఇతర భాషల్లో లేకకాదు, కర్ణాటకలో మధ్వాదుల సంప్రదాయంలో వేరే విధమైన సాహిత్యం ఉంది. దాస సాహిత్యం పేరుతో అది ప్రసిద్ధి.

ఇలా ఉత్తరాదిలో పారాయణలు, భాషలు వేరు. మరాఠా అభంగాలు వంటివి కూడా పారాయణ చేస్తున్నారు. అయితే తమిళ ప్రాంతంలో ఒక మంచి సంప్రదాయంగా బలపడిన వైష్ణవం, 'నాలాయిరం' అనబడే దివ్య ప్రబంధాన్ని విష్ణు ఆలయాల లోను, వారి అనుష్ఠానాలలోను విధులుగా స్వీకరించి వ్యాప్తి చెందించింది. భగవదను

గ్రహ ప్రాప్తికి సహకరించే మంచి విధానాలివి. అదేవిధంగా శైవంలో కూడా దివ్య ప్రబంధాలున్నాయి. వీటిని అందించిన భక్తులను 'నాయనార్లు' అంటారు. వారి ప్రబంధం పేరు 'తేవారం'. అయితే శైవులు తమిళనాడు నుండి ఒక ప్రచారోద్యమం చేయలేదు. కానీ ఇప్పటికీ అక్కడి ఆలయాలలో తేవారాన్ని, తిరువాచకాన్ని అనుసరిస్తు న్నారు. కర్ణాటక వీరశైవులకి వేరే సాహిత్యం ఉంది.

ప్రతి భాషలోను వివిధ దేవతలపై ఋషి కల్పులైన వారందించిన సాహిత్యాలు న్నాయి. అన్నీ మనకి శిరోధార్యమే.

**ప్ర: క్రౌంచ పర్వతాన్ని కుమారస్వామి భేదించాడంటారు. ఈ పర్వతం కథ ఏమిటి? సుబ్రహ్మణ్యుడు తారకాసురుని సంహరించినట్లు విన్నాము, మరి ఈ క్రౌంచం ఏమిటి? ఇంకా స్వామి సంహరించిన రాక్షసులున్నారా?**

**జ:** సురస (సుందరకాండలో కనిపించిన దక్షపుత్రి కాదు) అనబడే రాక్షసికి ముగ్గురు తనయులు – శూరపద్ముడు, తారకాసురుడు, సింహముఖుడు. వీరు లోక కంటకులైన కారణంగా సుబ్రహ్మణ్యుడు వీరిని సంహరించాడు.

క్రౌంచుడు అనే రాక్షసుడు అగస్త్య మహర్షిని అటకాయించడానికి పర్వత రూపం ధరించాడు. అసురమాయను గ్రహించిన అగస్త్యుడు అతడిని పర్వతంగానే మిగిలి పొమ్మని శపించాడు. ఈ పర్వతాన్ని అడ్డుపెట్టుకొని రాక్షసులు కుమార స్వామిని ఎదుర్కొన్నారు. స్వామి ఆ కొండను ఛేదించి దనుజుల్ని పరిమార్చాడు. ఈ ఇతివృత్తం– సంహితలుగా చెప్ప బడిన స్కాందపురాణంలో ఉంది.



**ప్ర: 'సాకేతం' అనే మాటకి అర్థం ఏమిటి? అయోధ్యకు ఈ పేరెందుకు వచ్చింది? మోక్ష పట్టణాల్లో ఒకటిగా దీన్ని పేర్కొనడంలో కారణం ఏమిటి?**

**జ:** 'సాకేతం' అంటే 'సంపూర్ణ జ్ఞానంతో కూడినది' అని అర్థం. అలాగే 'అయోధ్య' అంటే 'ఇతరులు యుద్ధం (దాడి) చేయలేనిది' అని అర్థం. 'కిత' ధాతువు జ్ఞానార్థకం. దాని నుండి జనించిన 'కేత' శబ్దం, 'అజ్' పూర్వకమై సంపూర్ణ జ్ఞానాన్ని తెలియ జేస్తుంది. ఆకేతం = సంపూర్ణ జ్ఞానం. అటువంటి జ్ఞానంతో కూడినది– స+ఆకేతం – సాకేతం. నిజానికి ఈ రెండింటికీ వైకుంఠ పరమైన అర్థం ఉంది. ప్రకృతి వికారాలకు లోనుకానిది 'అయోధ్య'. కేవల చిన్మాత్ర భూమిక కనుక 'సాకేతం.' మాయాతీతమైన బ్రహ్మజ్ఞాన స్థితి. భూమిపై వైకుంఠ విభూతి కలిగిన పట్టణం అయోధ్య. ఈ మన్వంతరారంభం నుండి సూర్యవంశీయులైన మనువు మొదలుకొని

దివ్య చక్రవర్తులు ఈ ప్రాంతాన్నే రాజధానిగా చేసుకొని భూమండలాన్ని పరిపాలించారు. ఇలాంటి వైకుంఠ విభూతి కల ప్రాంతంలోనే వైకుంఠవాసుడు అవతరించాడు. అసలే వైకుంఠ కళ అక్కడ ఉంది. ఆపై-శాంతి, జ్ఞానము విలసిల్లే ఆ దివ్య నగరంలో తారక బ్రహ్మమైన శ్రీరాముడు జన్మించి, పాలించిన కారణంగా అది మోక్ష పట్టణం అయింది.

**ప్ర: ఇంటి ద్వారానికి ఎదురుగా శ్రీ వేంకటేశ్వరస్వామి పటం ఉండకూడదని మా మిత్రుడొకరు అన్నారు. అలా ఉంటే - డబ్బంతా ఖర్చయిపోతుందనీ, వడ్డీకాసుల వాడు కనుక అప్పులపాలైపోతారనీ చెప్పారు. ఇది ఎంతవరకు సమంజసం? అదే విధంగా ధ్యానభంగిమలో ఉన్న శివుని పటం ఇంట్లో ఉండకూడదన్నారు. వీటికి శాస్త్ర ప్రమా ణాలు ఉన్నాయా?**

**జ:** శ్రీ వేంకటేశ్వరుడు శ్రీనివాసుడు. ఆయన పటం ఇంట్లో ఉంటే ఐశ్వర్యాలు చక్కగా వర్ధిల్లుతాయి. అంతేకాని ఆయన పటం, విగ్రహం ఉంటే డబ్బు ఖర్చయిపోతుందనీ, అప్పులపాలైపోతారనీ అనడం అజ్ఞానజనితమైన మాట. ఎవరో తోచింది చెప్పగానే, దాన్నే మోసుకు పోయేవాళ్ళు కొందరు తయారవుతున్నారు.

ఏ దేవతా విగ్రహమైనా మేలు కలిగించడమే వాటి స్వభావం. ఆ పటాలుండ కూడదని చెప్పడానికి ఏ శాస్త్ర ప్రమాణమూ లేదు. ఇలాగే కొందరు - పార్థసారథి పటం ఉండకూడదనీ, వేణువూదే కృష్ణుడి పటం కానీ, బొమ్మ కానీ ఉండరాదనీ అంటుం టారు. ఇవన్నీ నోటికి వచ్చిన మాటలే తప్ప శాస్త్ర వాక్యాలు కావు. నిరభ్యంతరంగా శ్రీనివాసుని పటాన్ని ఉంచవచ్చు.

ఐతే ధర్మశాస్త్ర ప్రకారంగా లోహవిగ్రహాలు (వెండి, బంగారము, ఇత్తడి, పంచ లోహాలు), శిలావిగ్రహాలు ఇంట్లో ఉంచి పూజించేటట్లయితే ఎక్కువ పరిమాణంలో ఉండరాదు. అరచేతి నిడివిని (వితస్తి) మించరాదు. ప్లాస్టర్ ఆఫ్ పారిస్, పేపర్ పల్ప్ ...వంటి వాటితో చేసిన విగ్రహాలు పెద్ద పరిమాణం లో ఉన్నా ఫరవాలేదు.

అయితే వాటిని పూజా విగ్రహాలుగా కాక, అలంకారాకృతులుగా ఉంచి నమస్కరించుకోవచ్చు.

అదేవిధంగా - ధ్యానభంగిమలో ఉన్న శివుని పటాన్ని నిరభ్యంతరంగా ఇంట్లో ఉంచవచ్చు.ధ్యానసాధనకు, జ్ఞానానికీ, శివత్వానికీ (మంగళానికి) హేతువు శివుని తపోమూర్తి.

**ప్ర: 'కామకోటి' అనే మాటకు అర్థం ఏమిటి? అమ్మవారికి 'కామకోటికా' అనే నామం ఉందికదా?**

**జ:** 'కోటి' అంటే 'అంచు', 'అవధి' అని అర్థం. కోరికలకు అంచు – కామకోటి. 'జగన్మాతను నమ్మినవారు అన్ని కోరికలను సంపూర్ణంగా పొందుతారు' – అని ఒక అర్థం. మరియొక అర్థం – కోరికల అవధిని, అనగా 'అంతాన్ని' పొందుతారు. అంటే 'నిష్కామస్థితి' లభిస్తుంది.

కామానికి అంచు మోక్షమే. మోక్షదాయిని, కైవల్య స్వరూపి – అని అర్థం.

**కామానాం వర్ణతాత్పర్యాత్ తత్కోటి గుణసంఖ్యయా ।**
**కామకోటీతి విఖ్యాతం కామకోష్ఠ ధరాతలమ్ ॥**
**అథకామస్తృతీయోర్థం పురుషార్థేషు విశ్రుతః ।**
**తత్పరస్తాత్ శ్రుతో మోక్షః కోటిశబ్దేన శబ్దితః ।**
**కామకోటిస్మృతో మోక్షః పురుషార్థః తురీయకః ॥**

– అని పురాణాలలో స్పష్టంగా నిర్వచించారు.

**ప్ర: ఎన్నో దేవతా స్తోత్రాలున్నాయి. ప్రతిదీ నిత్యం పారాయణ చేయాలని చెప్తారు. కానీ రోజూ అన్ని పారాయణ చేయడం సాధ్యం కావడం లేదు. మరి వాటిని నిత్య పారాయణ చేయకపోవడం పాపం కదా? పైగా ఇన్నిన్ని స్తోత్రాలు ఎందుకు?**

**జ:** అన్ని స్తోత్రాలు పారాయణ చేయడం నిత్యమూ సాధ్యం కాదు. అలాగని అవి ఎందుకు? అని ప్రశ్నించరాదు. బజారులో బోలెడన్ని కూరగాయలుంటాయి. అన్నీ రోజూ తినలేం. అలాగని ఇన్నిన్ని ఎందుకు? అంటామా?

ఎవరి అవకాశం, అభీష్టం బట్టి నిత్యం సాధ్యమైన వాటినే అనుష్ఠించవచ్చు. రోజూ విందు భోజనం చేయలేం కదా! ఏ పండగకో పబ్బానికో విందునారగించినట్టు తీరిక దొరికిన వేళ సావకాశంగా స్తోత్రాలు పారాయణ చేసు కోవచ్చు. ఏదేమైనా – ఆనందంగా భక్తిగా వాటిని పఠించాలి తప్ప, తప్పనిసరి కృత్యంగా మొక్కుబడి వ్యవహారంగా తలచరాదు.

నిత్యం మన అవకాశం బట్టి ఆహారం తిన్నట్లే, స్తోత్రమో, జపమో పరిమితమైన అనుష్ఠానం అవసరం. ఆయా దేవతలకి నిర్దేశించిన వారాలలో, తిథులలో, పర్వదినాలలో ఆయా స్తోత్రాలను నిదానంగా పఠించుకోవచ్చు.

ఔషధశాలలో మందుల వలె వివిధ ప్రయోజనాల కోసం, వివిధ స్తోత్రా

లుంటాయి. కొన్ని ఆరోగ్యం కోసం, కొన్ని దారిద్ర్య నివారణ కోసం... ఇలా! వాటిని ఆయా లక్ష్యాల సిద్ధికోసం వినియోగించుకోవచ్చు.

ప్ర. **దేవతల్ని ఆరాధించడం అవసరమే. కానీ అవతారం ధరించారని పేరుతో మానవుల్ని ఆరాధించవచ్చా? శ్రీరాముడు, శ్రీకృష్ణుడు – అవతార పురుషులే. కానీ వారి ఆరాధన దేవతారాధన అవుతుందా?**

**జ:** దేవత – అనే మాటకి 'తేజః స్వరూపుడు' అని అర్థమే. శాస్త్ర ప్రకారంగా –'మంత్రం ద్వారా ప్రతి పాదింపబడేవారు దేవతలు'. మంత్రంలో శబ్దంగా ఉండే స్వరూపమే, సూక్ష్మంగా తేజోరూపంగా భాసిస్తుంది. ఆ తేజఃస్వరూపమే దేవత.

అయితే దివ్య గుణాలతో లోకోపకారంగా ప్రవర్తించిన యోగులు, మహాత్ములు, ఋషులు పూజ్యులే. వారిని దేవతలతో 'సమానం'గానే అనుకోవచ్చు. పూజించవచ్చు. ఆదర్శంగా ఆరాధించవచ్చు.కానీ దేవతారాధన వేరు. అయితే శ్రీరాముడు, శ్రీకృష్ణుడు... అవతరించకముందే, మంత్రాధిదేవతలు.

విష్ణు స్వరూపులైన ఈ మంత్రాధి దేవతల్ని ధర్మరక్షణ కోసం ఋషులు, ఇంద్రాది దేవతలు ఆరాధించి ప్రార్థించడం చేత – వారు భూమిపై అవతరించారు. కనుక వారి ఆరాధన దేవతారాధనే అవుతుంది. స్థితికారకుడైన శ్రీమన్నారాయణుడు తన మంత్ర లక్షణాలనే అవతారాలలో వ్యక్తం చేశాడు. అందుకే శ్రీరామకృష్ణాదులను ఉపాసించేవారు ఐహిక ఫలాలతోపాటు, కైవల్యాన్ని కూడా పొందుతారు. దానికి కొన్ని వేల ఏళ్ళ నుండి వారిని ఉపాసించిన సిద్ధులే సాక్షులు.



ప్ర: **సుభద్రాదేవి శ్రీకృష్ణుని చెల్లెలు కాదనీ, అర్జునుడు తీర్థయాత్రా సమయంలో వచ్చినప్పుడు శ్రీకృష్ణుడు పార్థునికోసం నియోగించిన దాసి అనీ, ఆ దాసినే అర్జునుడు వివాహమాడాడనీ, ఈ మధ్య ఒక ఆధ్యాత్మిక పత్రికలో చదివి ఆశ్చర్య పోయాను. ఇది నిజమేనా?**

**జ:** ఇవి సరిగ్గా గ్రంథాలను చదవకుండా వ్రాసిన వ్రాతలు. బాధ్యతలేని రచయితల తొందరపాటు తనం. భాగవతంలో స్పష్టంగా 'బలరామకృష్ణుల సోదరి సుభద్ర' అని వ్రాసి ఉంది. బలరామకృష్ణుల అనంతరం దేవకీ వసుదేవులకు జనించిన కుమార్తె. పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రులతో ప్రశ్నించిన ప్రశ్న:

**బ్రహ్మన్! వేదితు మిచ్ఛామః।**
**స్వసారం రామ కృష్ణయోః॥**

**యథోపయే మే విజయో।**

**యామయాసీత్పితామహీ॥**

(శ్రీమద్భాగవతం, దశమస్కంధం, 86 అధ్యాయం, 1వ శ్లోకం)

"మహాత్మా! శ్రీ బలరామ కృష్ణుల చెల్లెలు, నాకు పితామహి (నానమ్మ) అయిన సుభద్రాదేవిని అర్జునుడు ఏవిధంగా వివాహమాడాడో వినాలనుకుంటున్నాను."

"మునినాథ! పార్థుండు వనజనాభుని సహోదరి సుభద్రను ఏవిధమున పెండ్లి యయ్యే?" అని పోతనగారు కూడా అనువదించారు. సుభద్రకృష్ణుని సహోదరి అనడంలో సందేహం లేదు.

ప్ర: **శ్రీరాముడు మాంసం తిన్నట్టు, మద్యపానం చేసినట్లు, రామాయణంలో కొందరు విమర్శించారు కదా! అది నిజమేనా? మరి శ్రీరాముని పూజలో 'మాంసం' మద్యం వినియోగించవచ్చా?**

జ: శ్రీరాముడు నారాయణావతారం. కానీ క్షత్రియునిగా జన్మించాడు. క్షత్రియులకు మాంసభక్షణం నిషేధం కాదు. మంత్ర దీక్షితులకు, విప్రులకు, మాంసాదులను, మద్యపానాన్ని సంపూర్ణంగా నిషేదించారు.

అయితే క్షత్రియాదులు కూడా నియమబద్ధంగానే మాంసాన్ని స్వీకరించాలి. మన ధర్మంలో మాంస భక్షణ నిషేధంలేని జాతులవారు కూడా నియమాలను పాటిస్తారు. ఆదివారం, పర్వదినాలు (పూర్ణిమ, అమవాస్య, ఏకాదశి, ద్వాదశి, చదుర్దశి తిథులు, పండుగలు, దీక్షాదినాలు, వ్రతదినాలు – మొదలైన రోజుల్లో ఏ ఒక్కరు మాంసాన్ని తినరు– తినరాదు.)

శ్రీరాముడు క్షత్రియ జన్మ స్వీకరించాడు కనుక వారికి ఉచిత ఆహారాన్నే స్వీకరించాడు. ఇక మధుపానం చేసినట్లు కూడా ఉంది. కానీ మనమనుకునే నీచమద్యం కాదు. ద్రాక్షాసవం వంటి మధువులు క్షత్రియులకు ఉచితం. నీచ వృత్తులలో ఉన్నవారు తాగే మద్యాదులు క్షత్రీయులు స్వీకరించరు.

తమ కులానికి ఉచితమైన మధువునే రాముడు స్వీకరించాడు. అది నియమ రహితంగా, వ్యసనంగా గ్రహించినవి కావు.

**నమాంసం రాఘవో భుంక్తే నచాపి మధుసేవతే।**

"అమ్మా! నీ విరహంలో రాముడు మాంసాన్ని తినడం లేదు. మధువుని తాగడం లేదు." అని హనుమంతుడు సీతతో చెప్పినట్లుగా సుందరకాండలో ఉంది.

ఇంతమాత్రాన రాముని ఉదాత్తత ఏమీ తగ్గిపోదు. మాంసం కొందరికి నిషేధం - కొందరికి దోషంలేదు. నిషేధించిన వర్ణాలవారు మాంసాన్ని తినడం పాతకం. దోషంలేని వారు దీనిని వదిలి వేస్తే పుణ్యమే. ఈ విషయం మహాభారతమే చెబుతుంది.

శ్రీరాముని ఉపాసన విషయంలో రాముడు నారాయణావతారంగా అరాధిస్తున్నాం. ఉపాసనలో దేవతా స్వభావాన్నే స్వీకరించాలి. దేవతలు వర్ణాశ్రమాతీతులు. సాత్విక దేవతలను మద్యమాంసములతో ఆర్జించరాదు. ఉత్తమ పూజలలో అవి నిషేధం. శ్రీరాముని విష్ణుమూర్తిగా ఆరాధించాలి కనుక, విష్ణు ఆరాధనలో వలె సాత్త్వికారాధనే జరపాలి. శ్రీరామారాధనలో మద్య మాంసాదులను వినియోగిస్తే అది ఘోరమైన పాపం. అవతారమూర్తిగా క్షత్రియోపాధికి తగినట్లు ప్రవర్తించినా, ఆరాధ్యతత్త్వంగా విష్ణుస్వరూపమే మనకు గ్రాహ్యం.

**ప్ర: సప్తస్వరాలకు ఆధిదేవతలు ఉంటారని విన్నాను. వారెవరు? అలాగే సప్తస్వరాలు ఏ ఏ ధ్వనులనుండి స్వీకరించారు? వాటి పేర్లను కూడా వివరించండి. సప్తస్వరాలను దేవతలుగా భావిస్తే వారి స్వరూపాలేమిటి?**

**జ:** సప్తస్వరాలకీ పేర్లు:- షడ్జ(స), ఋషభ(రి), గాంధార(గ), మధ్య(మ), పంచమ(ప), దైవరం(ద), నిషాదం(ని).



వీటికి అధిదేవతలు స-అగ్ని, రి-బ్రహ్మ, గ-సరస్వతి, మ-శివుడు, ప-విష్ణువు, ద-గణపతి, ని-సూర్యుడు. వీరి ఆయుధాలు వరుసగా - కత్తి, చాకు, గద, చక్రం, భిండివాలం, బాణం, అంకుశం.

స-స్థూలంగానూ, రి-సూక్ష్మంగానూ, గ-స్థూలంగానూ, మ-పొడగరిగా, ప-సమా నుష్టిగా, ద-పొడుగుగా, ని-అతి స్థూలంగా ఆకారాలు ధరించి ఉంటారు.

నెమలికేక షడ్జము, వృషభస్వరం ఋషభం, మేక అరుపు గాంధారం, క్రౌంచపక్షి నౌక మధ్యమం, కోయిలకూత పంచమం, గుఱ్ఱపు సకిలింత దైవత్వం, ఏనుగు ఘీంకారం నిషాదం. ఇవి సప్తస్వరాల ధ్వనులు.

సప్తస్వరాలుగా రత్నాలు వరుసగా-ముత్యం, నీలం, వజ్రం, వైడూర్యం, మరకతము, గోమేధికము,పుష్యరాగము. సప్తస్వరముల భార్యలు- గంధర్వస్త్రీ, కిన్నరకాంత, యక్షవనిత, కింపురుషస్త్రీ, నాగవనిత, సురకాంత, రాక్షసస్త్రీ.

**ప్ర: ఇంద్రుని నగరం 'అమరావతి' అంటారు. అలాగే మిగిలిన దిక్పాలకులకు కూడా ప్రధాన నగరాలు- రాజధానులు ఉన్నాయా?**

**జ:** దేవేంద్రునికి అమరావతి ఉన్నట్లుగానే మిగిలినవారికి కూడా చెప్పారు. అగ్ని రాజధాని తేజోవతి. యముని పట్టణం సంయమని, నిరుతి నగరం కృష్ణాంగని, వరుణుని పాలకనగరం శ్రద్ధావతి, వాయువు రాజధాని గంధవతి.

**ప్ర: నవబ్రహ్మలు అంటే ఎవరో వివరిస్తారా?**

**జ:** బ్రహ్మదేవుని నుండి ఉద్భవించిన ప్రజాపతులు తొమ్మిది మంది. వీరు సృష్టివిస్తరణకై బ్రహ్మద్వారా కలిగినవారు. వీరినే ప్రజాపతులు అంటారు. మరీచి, అత్రి, అంగీరస, పులస్త్య, పులహ, క్రతు, భృగు, వసిష్ఠ, దక్ష.

**ప్ర: జాతాశౌచమృతాశౌచాలలో సంధ్యావందనం చేయవచ్చా? కూడదా? ఒక వేళ చేయవలసి వస్తే ఏలా చేయాలి?**

**జ:** సంధ్యావందనం ఆశౌచాలలో కూడా చేయాలని శాస్త్రం. కానీ నిత్యవిధిలోవలె చేయరాదు. మంత్రాన్ని ఉచ్చరించకుండానే ప్రాణాయమం చేయాలి. మార్జన మంత్రాన్ని సైతం మనస్సులోనే తలచుకొని మార్జన చేసుకోవాలి. అర్ఘ్యమిచ్చేటప్పుడు మాత్రం గాయత్రిని ఉచ్చరించాలి. ఉపస్థానమంత్రం ఉచ్చరించకూడదు. సూర్యుని ధ్యానించి నమస్క రించాలి. గాయత్రి మంత్రజపం కూడదు.

**'అర్ఘ్యాంతా మానస సంధ్యా'**అని శాస్త్రప్రమాణం. అర్ఘ్యంతోనే పూర్తిచేయాలి. అయితే కొందరు గాయత్రి జపం మానసికంగా చేయవచ్చు అని చెబుతున్నప్పటికీ, సరియైన ప్రమాణంలేదు. ఇక వేదధ్యాయనాలు కూడదు.

**సూతకే మృతకే కుర్యాత్ ప్రాణాయామం అమంత్రకం।**
**తథా మార్జన మంత్రాంశ్చ మనసోచ్చార్య మార్జయేత్॥**
**గాయత్రీం సమ్యగుచ్చార్య సూర్యాయార్ఘ్యం నివేదయేత్।**
**ఉపస్థానం నైవకార్యం మార్జనంతు కృతాకృతం॥**
**సూర్యం ధ్యాయన్నమస్కుర్యాత్॥** అని ధర్మశాస్త్రాలలోని ప్రమాణవాక్యాలు.

**ప్ర: పూరీ జగన్నాథక్షేత్రంలోనూ, గురువాయూరు శ్రీ కృష్ణ క్షేత్రంలోనూ హైందవేతరులకు ఆలయాల్లో ప్రవేశం లేదు. వారెంతటి పెద్దవారైనా, ఎంతటి నాయకులైనా సరే లోనికి రానివ్వరు. ఇది తగిన పనేనా? లౌకికవాద రాజ్యంలో సరియైనదేనా? మరి- మనవైపు ఆలయాల్లో అలాంటి నియమాలు లేవు. ఆలయాలన్నీ ఒకే నియమంతో ఉండాలి కదా! మన గుడులలో ఇతర మతాలకి చెందిన నాయకుల్ని పూర్ణకుంభాలతో స్వాగతించడం, లోపల ప్రత్యేక దర్శనాలేర్పాటు చేయడం జరుగు**

**తోంది! మనవైపు గుడులలో ఉదార వాదం, అక్కడి మందిరాలలో సంకుచిత వాదం సమంజసమేనా? పరమతస్థులకు ఇటువంటి నియమాల్లేవు కదా!**

**జ:** వీటికి సంకుచితం, ఉదారవాదం - వంటి పెద్దపెద్ద రాజకీయ పరిభాషలు వాడనవసరం లేదు. ఏ ఆలయాల నియమాలు వాటికి ఉంటాయి. సంప్రదాయానుగతంగా వచ్చే పద్ధతుల్ని పాటించడమే ఆలయాచారం.

ఇతర మతస్థులను రానివ్వకపోవడం అనేది పరమతాలను గౌరవించడమే. మన ఆలోచన ప్రకారం-'ప్రతి మతము గొప్పదే. ఎవరి మతంలో వారు బ్రతకాలి'. ఒకవేళ వారు మన గుడికి వస్తే వారి మతదైవాల కంటే మన దేవుడు గొప్ప అని అంగీకరించినట్టే అవుతుంది. ఇది వారి మతాన్ని అగౌరవించడమే. అందుకే రారాదు. తాము ఏ మతంలో తరించాలని నిర్దేశింపబడిందో ఆ మతంలో పుడతారు మానవులు- అని మన విశ్వాసం. ఎందులో పుట్టామో అందులోనే కడవరకు ఉండాలి. ఒకవేళ ఏ ఒకరిద్దరికో ఇవాళ పరివర్తన జరిగి మన మతమే మంచిదని అనిపించినా, రేపు మరో పరివర్తన రాదని హామీ ఏమిటి? అంతగా మన దైవంపై కూడా విశ్వాసముంటే ధ్వజస్తంభానికి ఆవలివైపునే నిలచి అక్కడి నుండే దైవాన్ని నమస్కరించుకొని వెళ్లే పద్ధతులు ఏర్పాటు చేశారు. ఆ పద్ధతిని అనుసరిస్తూనే మన దేవతల్ని పూజించే ముస్లిం, క్రైస్తవ భక్తులు కూడా ఉన్నారు.



అయితే కొన్నేళ్ళ క్రితం జాతివిభేదాలతో కొందరిని లోనికి రానిచ్చేవారు కారు. అలాంటి ధోరణి ఇప్పుడు దాదాపుగా సన్నగిల్లింది. ఇది ఆమోదయోగ్యమే. ఎక్కడో మారుమూల ప్రాంతాల్లో ఒకటో అరా అలాంటివి ఉన్నా వాటినీ నిరసిస్తున్నాం.

మరో కోణంలో ఆలోచించితే- శౌచం, సదాచారం వంటివి పాటించే అలవాటు, అవకాశం లేని కొన్ని జాతుల వారికి, ప్రవేశం నిషేధించడం, ఆలయ పవిత్రతను కాపాడాలనే ఉద్దేశం మాత్రమే. అటువంటివారి కోసం రథోత్సవాలను నిర్వహించి, సాక్షాత్తు దేవుళ్లే వారికోసం వెళ్లే ఏర్పాట్లు చేశారు. ఇలాంటి జాతిపరమైన నిషేధాలు ప్రస్తుతకాలంలో ఏనాడో సడలించారు.

కొన్ని ఆలయాల్లో అన్ని వర్ణాలవారు బోనాలు పెట్టడం వంటివి ఉన్నాయి. పురీ క్షేత్రంలో వర్ణాదివివక్ష లేకుండా అన్నప్రసాదాన్ని స్వీకరించడం కనిపిస్తుంది. అటువంటి విశాల దృక్పథాలనీ గమనించాలి.

కానీ ఇతర మతాలవారు 'కుతూహలం'తో, టూరిస్టు దృష్టితో మన గుళ్ళలో

ప్రవేశించడం తగని పనే. మతమార్పిడి జరిపినప్పుడు మన దేవతల పటాల్ని అవమానించి, వాటిపై ఉమ్మి, చించి, నడచి వెళ్ళే క్రూరకృత్యాలు చేసి, ఆ తరువాతనే మతం మారుతారు. ఎక్కడో ఒకరిద్దరు ఉదారవాదులున్నా వారి మనఃస్థితిని బాహ్యంగా ఎలా నిర్ధారించగలం.

హిందువులందరికీ జన్మతః కొన్ని సాధారణ సంస్కారాలు ఉంటాయి. వాటి చేతనే ఆలయాల్లోకి ప్రవేశించగలరు. ఇంట్లో కూడా తమ హైందవ పరంపరనే పాటిస్తారు. రాజకీయ కారణాలతో మన ఆలయాల్లోకి ఆహ్వానాలు పలుకుతున్నాం. వారికి నిజంగా హిందూమతంపై విశ్వాసం ఉందా? తమ ఇంట్లో పండుగలూ పబ్బాలూ పాటిస్తారా? తమ ఇంటి కార్యకలాపాలు (పెళ్ళిళ్ళు, గృహప్రవేశాలు వగైరా) హిందూ పద్ధతిలో చేస్తారా? శ్రద్ధ, గౌరవం లేనివారు ఆలయాల్లో ప్రవేశిస్తే వారి దృష్టి వేరుగా ఉంటుంది.

లౌకికవాదాల్లాంటి రాజకీయ శబ్దాలు మత సంప్రదాయంలో ప్రవేశపెట్టనక్కర్లేదు. ఆలయాలు రాజకీయ భవంతులు కావు కదా! మన మతదేవతలపై విశ్వాసంలేని అన్యమతస్థులు లోనికి రారాదు. ఆలయప్రవేశానికి విశ్వాసం ప్రధానార్హత. హిందువుల మెప్పుకోసం ఆలయాల్లోకి దూరుతున్నా, వారికి మన దైవాలపై చులకన దృష్టి ఉంటుంది. ఈ సంప్రదాయపు లోతులు వారికి తెలియవు.



స్థూలంగా ఆలోచిస్తే, తప్పుగా అనిపించకపోయినా, సూక్ష్మ దృష్టితో గమనిస్తే హైందవేతరుల ప్రవేశం తగనిదే. ఇతర మతస్థులు కూడా వారిమతం కాని వారిని తమ ప్రార్థనా మందిరాల్లోకి రానివ్వరు- మతం మారితే తప్ప. ఎక్కడో కొన్ని మత సంస్థలు అందరినీ రానిస్తున్నా, అవి కూడా మతమార్పిడులకు సహకరించడానికే. విదేశాల్లో ముస్లిం, క్రైస్తవ మతవిశ్వాస స్థలాల్లోకి (వారి అత్యంత పవిత్ర శ్రద్ధా కేంద్రాలలోకి) హిందువుల్ని రానివ్వరు. హిందూ వేషధారణలో ఉన్నవారు ఆ పరిసరాల్లో కనిపించినా శిక్షిస్తారు. వారి పద్ధతులు వారికున్నాయి.

అయితే మనలో కొన్ని ఆలయాలు పాటించడం, కొన్ని పాటించకపోవడం జరుగుతున్నా అవి వారివారి పద్ధతులు అని మన్నించాలి. కానీ హైందవమతంపై విశ్వాసం లేనివారు, ఎవరైనా సరే, లోనికి రానివ్వడం క్షేమంకాదు- అనేది అన్ని ఆలయాలకీ ఏక నియమం.

ఒకవేళ రాజకీయ నాయకులు అన్యమతస్థులైతే, ప్రభుత్వం తరఫున హిందువు

నెవరినైనా ఆలయ కైంకర్యాలకి పంపించి తమ సర్వమత సమభావాన్ని ప్రకటించ వచ్చు. అంతేకానీ విశ్వాసంలేని తాము లోనికి వెళ్లి ఆలయాన్ని అపవిత్రం చేయడం, దర్శనార్థం పడిగాపులు పడుతున్న ఎందరో భక్తుల్ని ఇబ్బందికి గురిచేయడం అమానుషం.

ప్ర: **శ్రీకృష్ణుని నిర్యాణం తరువాత రుక్మిణి మొదలైనవారు (అష్టమహిషులు) కృష్ణ వియోగాన్ని భరించలేక అగ్నిలో ప్రవేశించారు. మిగిలిన కృష్ణుని భార్యలను అర్జునుడు సురక్షితంగా ఇంద్రప్రస్థానికి తీసుకువెళుతుండగా, తోవలో బందిపోటు దొంగలు అడ్డుకున్నారనీ, ఆ స్త్రీలను తమతో తీసుకు పోయారనీ, కొందరు పారిపోయారనీ, ఎదిరించిన అర్జునుని ధనుర్బాణాలు, భుజబలం కూడా పనిచేయలేదనీ విన్నాము. భీష్మద్రోణ కర్ణాదులనే గడగడలాడించిన విజయుడు, కేవలం బందిపోటు దొంగలను గెలవలేకపోవడంలో అంతరార్థం ఏమిటి?**

జ: ఒకప్పుడు కొందరు అప్సరసలు మేరుపర్వతంవైపు వెళుతుండగా, తోవలో అష్టావక్ర మహర్షిని దర్శించారు. భక్తితో ఆయనను నమస్కరించారు. అప్పుడు వారిని ఏదైనా వరం కోరుకొమ్మని అనుగ్రహించాడు మహర్షి.



వారు శ్రీహరి తమకు పతి కావాలని కోరుకున్నారు. సరేనని మహర్షి వరమిచ్చిన ఫలితంగా వారు కృష్ణ భార్యలు కాగలిగారు. కానీ ఆ సమయంలో వారు అష్టావక్రుని ఎనిమిది వంకల స్వరూపాన్ని చూసి పరిహసించారు. ఆ ఫలితంగా అతడి శాపానికి గురై, బందిపోట్ల చేజిక్కారు. మునిశాప ఫలంగా అర్జునుని బలం పనిచేయలేదు.

పైగా–శ్రీకృష్ణుడే పాండవుల బలం. కృష్ణ నిర్యాణం తర్వాత, నిమిత్తమాత్రుడైన అర్జును నికి శ్రీకృష్ణుని బలం స్ఫురింపజేశాడు. ఈ విషయాన్నంతటినీ అర్జునునకు వ్యాసదేవుడు చెప్పినట్లుగా 'విష్ణుపురాణం' చెబుతోంది.

ప్ర: **స్త్రీలు శివలింగార్చన చేయవచ్చని కొందరు, చేయరాదని కొందరు అంటున్నారు. చేయవచ్చు అనడానికి ప్రమాణమేదైనా ఉందా? నేను వెండిలింగాన్ని అర్చించు కొంటుంటాను. కానీ వెండి శివవీర్యోద్భవం కనుక దానిని పూజించరాదని ఒకర న్నారు. దయచేసి స్పష్టమైన సమాధానాన్ని ఇవ్వండి.**

జ: శివలింగార్చన అందరు చేయవచ్చు. వారివారి సంప్రదాయాలతో శివలింగ పూజ చేయవచ్చు. కేవలం 'శివాయ నమః' అనే నామంతో మొత్తం అర్చన చేసినా చాలు, ధన్యులమవుతాం.

**బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రో వా ప్రతిలోమజః।**
**పూజయేత్సతతం లింగం తత్తన్మంత్రేణ సాదరమ్॥**
**కింబహూక్తేన మునయః స్త్రీణామపి తథాన్యతః।**
**అధికారోస్తి సర్వేషాం శివలింగార్చనే ద్విజాః॥**

"బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది సర్వులూ శివలింగాన్ని, వారి వారి విధానాలతో ఆదరంగా పూజించాలి. ఓ మునులారా! ఇన్ని మాటలెందుకు? (పురుషులేకాక) స్త్రీలు కూడా శివారాధనకు అధికారులే. శివలింగార్చనలో అందరూ అధికారులే" – ఈ వాక్యాలు శ్రీశివపురాణం, విద్యేశ్వర సంహితలోని 38,39,40 శ్లోకాలలోనివి. అయితే కొన్ని గ్రంథాలను పరిశీలిస్తే బాణలింగాన్ని మాత్రం అత్యంత నియమాలతో అర్చించాలి అని చెప్తున్నారు.

బాణలింగం, సాలగ్రామం స్త్రీలు ఆరాధించరాదని కొన్ని గ్రంథాలలో ఉంది. 'పూర్వసువాసినులు స్ఫటికలింగాన్ని పూజించవచ్చు'– అని శివపురాణంలో ఉంది.

**విధవానాం ప్రవృత్తానాం స్ఫాటికం పరికీర్తితమ్।**

(విద్యేశ్వర సంహిత, 51వ శ్లోకం)



పార్థివలింగ పూజ అందరికీ శ్రేష్ఠమని చేప్పారు. వెండిలింగం నిషేధం కాదు. రజత లింగార్చన ఐశ్వర్య ప్రదం. వెండి, బంగారం వంటి ధాతువులు శివవీర్యోద్భవాలు– అని కొన్ని పురాణాల్లో ఉంది.

కాని వాటిని ఆభరణాలుగా ధరించడం లేదా? కనుక లింగార్చనగా స్త్రీలకు వెండి నిషేధం– అనడానికి ప్రమాణం లేదు.

శివలింగార్చన చేసిన స్త్రీ భక్తులు చాలామంది పురాణాల్లోనే కనిపిస్తున్నారు. ఘుశ్మ అనే భక్తురాలు ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావానికి కారణమైన మహాత్మురాలు. అక్క మహాదేవి మొదలైన శివలింగార్చకులు చరిత్రలో ప్రసిద్ధి. అయితే పాదరస లింగాన్ని మాత్రం ద్విజులు ఆరాధించాలని శివపురాణం చెబుతోంది.

ప్ర: **పూజ అనే మాటకు అర్థం ఏమిటి?**

జ: **'పూః యేనజాయతే ఇతి పూజా'** అని పురాణాల్లో నిర్వచనమిచ్చారు. పూః– అంటే ఇష్టసిద్ధి, భోగం అని అర్థాలు. ఏ కర్మవలన ఇష్టసిద్ధి లభిస్తుందో దానికి 'పూజా' అని అర్థం. భగవదర్చన వల్ల అభీష్ట సిద్ధి లభిస్తుంది కనుక అర్చనకు 'పూజ' అనే శబ్దాన్ని వాడుతారు.

**ప్ర: 'ఊపిరి మీద ధ్యాస ఉంచితే చాలు- మరే మంత్రతంత్రాలు, పూజలు అక్కర్లేద'ని కొందరు చెబుతున్నారు. ఇది సంప్రదాయ పద్ధతులకు విరుద్ధంగా గోచరించటం చేత ఆచరణీయమా, కాదా? అనే సందేహం కలుగుతోంది.**

**ప్ర: యోగాభ్యాసం చేస్తేచాలు- ఏ దేవతలను పూజించనక్కర్లేదు అని కొందరంటున్నారు నిజమేనా?**

**జ:** ఊపిరిపై ధ్యాస ఉంచడం- ప్రాణయామ విద్యలో ఒకభాగం. అదేవిధంగా యోగం కూడా ఆధ్యాత్మిక సాధనలో గొప్పమార్గమే. కానీ అవిచేస్తే చాలు ఇంకేవీ చేయనక్కర్లేదు అనడం మాత్రం సమంజసం కాదు.

ఊపిరి మీద దృష్టి ఉంటే చాలు అని భోజనం చేయడం, నిద్రపోవడం మానివేస్తు న్నామా?

యోగమార్గంలో వివిధ దశలలో ఉండే శక్తి కేంద్రాలే దేవతలు. ఉదాహరణకి మూలా ధారం- గణపతిస్థానం. ఇలా సుషుమ్నా మార్గంలో వివిధ యోగకేంద్ర శక్తులే దేవతలు. వారిని ప్రసన్నం చేసుకుంటే యోగమార్గంలో పురోగమించవచ్చు. మంత్రం, యోగం కలిసినప్పుడు మరింత శక్తిమంతంగా సాధన ఫలిస్తుంది. మంత్ర శాస్త్రాలలో, సంప్రదాయ మార్గాలలో ప్రాణాయామాది యోగవిద్యలు కూడా అంగంగా స్వీకరిం చారు. ప్రాచీన మార్గాలలోని ఒకదానిని తీసుకొని కొత్తమార్గం అనే పేరుతో ప్రచారం చేస్తూ, సంప్రదాయ ధర్మమార్గాల్ని నిరసించడం సంస్కృతిని దెబ్బతీయడమే. వాటిని ప్రోత్సహించరాదు. లేదా సంప్రదాయ మార్గాలను నిరసించవద్దని బోధించాలి.

**ప్ర: నేను 'నారాయణీయం' చదువుతున్నాను. అందులో 89, 90 సర్గలలో 'ఒక్క శ్రీమహా విష్ణు ఉపాసన మాత్రమే శ్రేష్ఠం. మిగిలిన దేవతల ఉపాసనలు శ్రేష్ఠం కావ'న్న అర్థం స్ఫురిస్తోంది. దయచేసి విడమరచి చెప్పగలరు.**

**జ:** ఒక దేవతనే ప్రధానంగా గ్రహించి రచించే గ్రంథాలలో, 'ఏకనిష్ఠ' కుదరడానికై అటువంటి మాటలను రచిస్తారు. ఇలాంటి భావాలు శివగ్రంథాల్లో, శక్తి గ్రంథాల్లో, గణపతి, సూర్య గ్రంథాల్లో కూడా ఉంటాయి.

వీటి అర్థం, ఆయాదేవత ఉపాసకులు ఏకాగ్రంగా ఆరాధించడమే. ఇందులో ఇతర దేవతల శ్రేష్ఠతను కాదనడం ఉద్దేశం కాదు. కొన్నిచోట్ల భక్త్యుద్రేకంగా కవులు రచించవచ్చు. అది వారి భక్తి పారవశ్యంగా గౌరవించాలే తప్ప, ఇతర దేవతలను తగ్గించడంగా గానీ, ప్రమాణంగా గానీ స్వీకరించరాదు.

**ప్ర: ఈ మధ్య వచ్చిన సూర్యగ్రహణ సమయంలో అనేక మంది మన శాస్త్రాలు అబద్ధాలని ఋజువు చేయడానికి, గ్రహణకాలంలో తిన్నారు. 'ఈ గ్రహణంవల్ల ఉత్పాతాలు జరుగుతాయని' జ్యోతిష శాస్త్రవేత్తలు చెప్పినవి అబద్ధాలన్నారు. మన జ్యోతిర్విజ్ఞానం అసత్యమన్నారు. మరి వీరి వాదనలకి, చేతలకి సంప్రదాయవాదుల సమాధానం ఏమిటి? గ్రహణం ఎందుకు చెడు కాలమయింది?**

**జ:** భౌతిక విజ్ఞానం వేరు. మన సూక్ష్మమైన జ్యోతిర్విజ్ఞానం వేరు. వేటి కొలబద్దలు వాటికున్నాయి. గ్రహణం చెడుకాలమని ఎక్కడా లేదు. గ్రహణం పర్వకాలం. ఆ సమయంలో మంత్రదీక్షలు స్వీకరించడం, జపాలు చేయడం ఆచారం. అయితే గ్రహణచ్ఛాయలోని తీవ్రప్రభావం వలన కొన్ని తీక్షణపరిణామాలు ఏర్పడతాయన్నది వాస్తవం. అవి వెంటనే కనబడేవి కావు.

గ్రహణకాలంలో అన్నంతింటే విషాన్నం తిన్నట్లు హఠాత్తుగా చచ్చిపోరు. దాని ప్రభావం సూక్ష్మంగా ఉంటుంది. మనస్సుపై, తమనుండి కలిగే సంతానం యొక్క అవయవ నిర్మాణంపై, ఆరోగ్యంపై, బుద్ధులపై కాలక్రమేణ ప్రభావం చూపిస్తుంది. అధర్మపరమైన ఆలోచనలు చేసేవారు, అనాచార దురాచారవంతులువంటి దుష్ట సంతానం కలుగవచ్చు. పైగా దీనివలన కాలక్రమంలో ఆరోగ్యం దెబ్బతింటే, "దాని వలననే జరిగింద"ని నమ్ముతారా? అప్పుడు ఇంకేదో భౌతిక కారణాన్నే వెతుకుతారు. గ్రహణకాలంలో ఖాళీకడుపుతో ఉండి సాధన చేసుకోవాలి. అయితే వృద్ధులకు, బాలురకు, రోగార్తులకు మినహాయింపు ఉంది. సాధనచేసుకునే వారికే ఈ పట్టింపు కానీ, కేవలం తిని తిరిగే వారికి కాదు.

గ్రహణాన్ని చూడరాదు– అని జ్యోతిషశాస్త్రమే కాదు, భౌతిక ఖగోళ శాస్త్రం కూడా చెబుతోంది. ఏ దుష్ప్రభావం లేనప్పుడు "నేరుగా గ్రహణాన్ని చూడవద్దు. ప్రత్యేకమైన అద్దాలను ధరించి చూడాలి." అంటూ భౌతికవిజ్ఞానులు చెప్పడ మెందుకు? కంటి సూక్ష్మాంశాలపై వాటి ప్రభావం ఉందని అంగీకరిస్తున్నారు కదా!

ఆధ్యాత్మిక పరమైన నియమాలను విజ్ఞానశాస్త్రం పేరుతో అవమానించడం కొందరి మనోభావాలను దెబ్బతీయడం కాదా?

'రంజాన్ ఉపవాసం చేయకపోయినా ప్రమాదం రాదు, గుడ్‌ఫ్రైడేనాడు ఆరాధన చేయకపోయినా బాధలేదు' లాంటి మాటలను ఈ శాస్త్రవేత్తలు ఎందుకు అనరు? కేవలం హిందూమతంపైననే వీరి దాడులెందుకు? ఇతర మతాలను నిందించమని

చెప్పడం కాదు. వారిని గౌరవించినట్లే అందరినీ ఎందుకు గౌరవించరు? వీరి 'జనవిజ్ఞానానికి'హిందూమతమే ప్రశ్న అయిందా?

గ్రహణ సమయాలలో పవిత్రస్నానాలు, ధ్యాన, యోగ, జపసాధనలు శక్తిమంతమైన ఫలితాలివ్వడం వాటి సాధకులకు అనుభవ విషయం. ఏ సాధనాలేని శుద్ధ భౌతికులకు అది తెలియదు.

గ్రహణంవల్ల ఉత్పాతాలు రావు. కొన్ని గ్రహణాల సమయ సందర్భాలు రాబోయే ఉత్పాతాలకి సూచికలు మాత్రమే. కారణాలు కావు. ఈ గ్రహణం తరువాత పెచ్చు పెరిగిన ప్రాణాంతక విషజ్వరాలు, దుర్భిక్షం, భూకంపాలు... వీటి మాటేమిటి? మరి వాతావరణ విజ్ఞానవేత్తలు కొన్నిచోట్ల సునామీ హెచ్చరికలను ప్రకటించి, మళ్ళీ ఉపసంహరించుకున్నారు కదా! మరివారి విజ్ఞానం ఏమయ్యింది? ముందుగా ఎందుకు హెచ్చరించినట్లు?

అయితే సూచించిన ఉత్పాతాలను ఉపసంహరించే పరిహారాలుగా జపఉపవాసాది సాధనలను కూడా మనవారు చెప్పారు. వాటి ద్వారా అరిష్టాల తీవ్రతను తగ్గించవచ్చు. గ్రహణకాలాన్ని క్షణాలతో సహా చెప్పగలిగే మన జ్యోతిర్విజ్ఞానాన్ని అసత్యమనడం అవివేకం. వాటి గురించి పరిశోధించి తేల్చుకోవాలి.



నాటి పారిభాషిక పదాలను, తెలియజేసే విధానాన్ని నేటి తీరులో అన్వయించుకొని గ్రహించగలిగితే ప్రపంచానికి పనికి వచ్చే ఎన్నో విషయాలను ఆవిష్కరించుకోవచ్చు.

**ప్ర: వరుణయాగాలు, మరేవోయాగాలు చేసినా ఫలితాలు కనబడకపోవడానికి కారణం ఏమిటి? వాటివలన ప్రయోజనం లేదా?**

**జ:** యజ్ఞయాగాలు ఎన్నడూ వృథాపోవు. అయితే ఒక అభీష్టసిద్ధి కోసం చేసే క్రతువులకు సదాచారం, శ్రద్ధ, నియమపాలన అవసరాలు. వాటిలో లోపం జరిగితే క్రతుఫలం లభించదు. యాగాలకు ఫలం లభించడం అనేక సందర్భాలలో చాలా మందికి ప్రత్యాక్షానుభవమే, కొన్నివేళల్లో జరగకపోవచ్చు. ఒకవైపు క్రియాలోపం– మరొకవైపు అనుభవించవలసిన ప్రారబ్ధం బలీయంగా ఉండడం... ఈ రెండూ కారణాలు కావచ్చు. గొప్ప ప్రతిభగల వైద్యుడు కూడా ఒక్కొక్క సందర్భంలో రోగాన్ని కుదర్చలేకపోవచ్చు. అంతమాత్రాన వైద్యశాస్త్రానికి ప్రయోజనం లేదంటామా?

సదాచారం లేకుండా నియమరహితంగా చేసే యాగాలు ఫలించవు. ఒకనాడు

వర్షంకోసం ఒక వైదిక ఇష్టిని జరిపించారు. ప్రత్యేక ఇష్టికి లవణరహిత భోజనం చేసినవారు మాత్రమే ఋత్విజులుగా అర్హులు. కానీ వారు జిహ్వాచాపల్యంతో లవణసహితాన్నాన్ని భుజించి యజ్ఞం చేయడం చేత వర్షం పడలేదు. అది గ్రహించిన ఒక యతీంద్రులు తిరిగి యధావిధిగా యాగం చేయించారు. దానితో వెంటనే సువృష్టి కురిసింది. ఇది కాంచీపురంలో చాలా కాలం క్రితం జరిగిన సంగతి. ఆ యతీంద్రులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వామి. ఇది ఒక ఉదాహరణ.

'ఆచారహీనం నపునంతి వేదాః' అని శాస్త్రోక్తి. ఆచారంలేని వానిని వేదాలు కూడా ఉద్ధరించలేవు.

అయితే సమిష్టిఫలాలను దేశవాసులు అనుభవించవలసి ఉన్నప్పుడు, కొన్ని యజ్ఞ యాగాలు వెంటనే ఫలితాన్ని ఇవ్వలేకపోవచ్చు. కానీ... అవి కొన్ని దోషాలనైనా తొలగిస్తాయనడంలో సందేహంలేదు.

**ప్ర: సద్గ్రంథాలు పారాయణ చేయడానికై నియమాలేమిటి? ఉదాహరణకు సుందరకాండ, దేవీమాహాత్మ్యం– మొదలైన గ్రంథాలు చదివేటప్పుడు.**

**జ:** ముందుగా గ్రంథాన్ని ఎంతకాలంలో పూర్తిచేస్తామో నిర్ణయించుకొని దానికి తగినట్లుగా సర్గలని, అధ్యాయాలని విభజించుకోవాలి. ప్రారంభంలో గణపతి పూజ, పారాయణ గ్రంథోద్దేశ దేవతను (ఉదా॥ రామాయణానికి సీతారాములు, సుందర కాండకి హనుమత్సమేత మూర్తులు) అర్చనచేసి ఆ తరువాత పారాయణ చేయాలి. పారాయణ పుస్తకాన్ని చేతిలో ధరించకూడదు. ఒక పీఠంపై ఉంచి, ముందుగా గ్రంథాన్ని కూడా కుసుమాక్షతలతో పూజించి, అపై పఠించడం ప్రారంభించాలి. అధ్యాయమంతా పూర్తి చేసాకే ఆపడం, లేవడం (విరామం) చేయాలి. అధ్యాయ మధ్యంలో విరామం కూడదు. ఒకవేళ తప్పనిసరి విరామమైతే తిరిగి ఆ అధ్యాయాన్ని మొదటినుంచి పఠించాలి. గ్రంథార్థాన్ని అవగాహన చేసుకుంటూ, ఉచ్చారణ లోపాలు లేకుండా స్పష్టంగా చదవాలి. అతివేగంగా, అతిమందంగా కాకుండా, రసభావాను కూలమైన స్వరంతో చదవాలి.



పారాయణ పూర్తయ్యాక మళ్ళీ సంక్షిప్త పూజ, హారతి ఇచ్చి లేవాలి. పారాయణ కాలం ముగిసేవరకు ఒకే ప్రాంతంలో ఉండడం మంచిది. ఆ కాలంలో క్షురకర్మ చేయరాదు. భూశయనం, ఏకభుక్తం వంటి నియమాలు పాటించాలి. మౌనంగా ఉండాలి. తప్పనిసరైతే మితంగా మాట్లాడాలి. క్రోధ పరుష అశ్లీలాలు పలుకరాదు.

దీక్షాకాలమంతా ఆ దేవతానామాన్ని స్మరిస్తూ ఉండాలి. సంధ్యావందనాది నిత్యకర్మలను మానకుండా చేయాలి. ఇవి సాధారణ నియమాలు.

**ప్ర: ధనుర్మాసంలో విష్ణుక్షేత్రాల్లో 'తిరుప్పావై' గానం చేయడం మామూలే. కానీ శివక్షేత్రాల్లో అలాంటి గ్రంథం ఏదైనా ఉందా? 'తిరుప్పావై' వలెనే 'తిరువెంబావై' కూడా ఉందని – ఈ రెండూ చాలా గొప్పవి అని కంచి పెద్దలు శ్రీ చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీస్వామివారు అనేవారు. 'తిరువెంబావై' అంటే ఏమిటి? దాన్ని ఎవరు రాశారు?**

**జ:** ధనుర్మాసవ్రతం వైష్ణవులకీ, శైవులకీ ఉంది. హిందువులందరికీ ధనుర్మాసం పవిత్రమే. ద్రవిడదేశంలో శైవులు శైవసంప్రదాయం ప్రకారం తిరువెంబావై గానం చేస్తారు. వైష్ణవులు 'తిరుప్పావై' చేస్తారు. మనబోటివారు (అభేదవాదులు) రెండింటినీ శిరసా వహిస్తారు.

'తిరుప్పావై' గోదాదేవి (కోదై) గానం చేసి తరించిన దివ్యప్రబంధము. దీనికి 'శ్రీవ్రతం' (పవిత్రవ్రతం) అని అర్థం. దీని గానం, శ్రవణం సర్వపాపహరం. పుణ్యప్రదం. అలాగే 'తిరువెంబావై' అన్నా శ్రీ వ్రతమనే అర్థం. దీనిని రచించిన వారు మాణిక్య వాచకుడు. అరుణాచలంలో ఆయన దీనిని గానం చేశారు.



వైష్ణవుల దివ్యప్రబంధాలకు 'నాలాయిరం' అని పేరు. శైవుల దివ్య ప్రబంధానికి 'తేవారం' అని పేరు. అనేక భక్తుల భక్తిగానాలు ఇందులో ఉంటాయి.

'తిరువెంబావై'లో కూడా 30 కృతులున్నాయి. మంచి భావాలతో భక్తిని గుప్పించిన ఆ రచనలు గానం చేసినవారికీ, విన్నవారికీ, భుక్తిముక్తి ప్రదం.

**ప్ర: యోగంలో ఎనిమిది అంగాలున్నాయి కదా! వాటి వివరణతో పాటు యమ, నియమాలను కూడా వివరించండి. 'యోగా' చేసేవారు భగవదారాధన చేయనక్కర్లేదా?**

**జ:** అష్టాంగయోగం గురించి పతంజలి యోగ సూత్రాలలోనే కాక అనేక ఆధ్యాత్మిక గ్రంథాలలో ఉన్నది. భగవద్గీతలో కూడా వీటి ప్రస్తావన ఉంది. భాగవతం, పురాణాలు కూడా ఆధ్యాత్మిక సాధనలో అష్టాంగయోగాన్ని బోధించాయి.

యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు– అష్టాంగాలు.

వివిధ శాస్త్రాల ఆధారంగా సమన్వయించి చూస్తే –

**యమం:** పది విధాలు. అహింస, సత్యం, బ్రహ్మచర్యం, అస్తేయం, ఋజుత, దయ,

క్షమ, ధృతి, మితాహారం, శౌచం.

మనోవాక్కాయాదులతో ఎవరినీ నొప్పించకపోవడం అహింస. భూతహిత భాషణ సత్యం. పర స్త్రీవ్యామోహం లేకుండుట, స్వస్త్రీయందు నియమపాలన బ్రహ్మ చర్యం. పరద్రవ్యాన్ని మనసా కూడా వాంఛించక పోవడం అస్తేయం. కపటంలేని జీవితం ఋజుత. పరదుఃఖాన్ని సహించలేక పోవడం దయ. సహనమునకు క్షమం. ధర్మ పాలన యందు చెక్కుచెదరని స్థితి ధృతి. యోగజీవనానికి భంగకరంకాని విధంగా ఇంద్రియ సుఖాలను మితంగా స్వీకరించడమే మితాహారం. సదాచారం ద్వారా అంతఃశుద్ధి, బహిఃశుద్ధి అవలంబించడమే శౌచం.

**ఇక నియమం:** పది విధాలు. తపస్సు, సంతోషం, దానం, శ్రద్ధ, ఈశ్వరపూజ, వేదాంత శ్రవణం, లజ్జ, మతి, జపం, హోమం (వ్రతం).

నియమపాలన, ఉపవాసాదులు, తపస్సు. సంతృప్తిగా జీవించడమే సంతోషం. (స్వధర్మంగా లభించినదానితో సంతృప్తి చెందుట) పాత్రులకు విద్యా, ధన, ధాన్య, భూ, గో, అన్నాదులను సమర్పించుట దానం. శాస్త్ర వాక్యాలపై, గురువాక్యాలపై విశ్వాసమే శ్రద్ధ. నిత్యం ఈశ్వరారాధన పూజ. వేదాంత వాక్యాలను వినుటయే శ్రవణం. అధర్మానికి వెనుకాడుటయే లజ్జ. ధర్మమందు ఆసక్తియే మతి. గురూప దేశంతో స్వీకరించిన మంత్రాన్ని జపించడమే జపం. గురూపదిష్ట పద్ధతిననుసరించి చేసే సాధన వ్రతం. హోమాదులు దీనిలోని అంగాలు. ఈ యమనియమాలతో మిగిలిన ఆరు కలిసినప్పుడు సమగ్రయోగం అవుతుంది. పతంజలి కూడా "ఈశ్వర ప్రణిధానం" అని నియమాన్ని చెప్పాడు. భగవత్ స్మరణ, సంకీర్తన, శరణాగతి ఈ మాట క్రింద చెప్పబడినాయి.

ఈ యమనియమాలు జీవనవిధానంతో కూడినవాడు చేసే ఆసన ప్రాణాయా మాదులు ఫలవంతమవుతాయి. స్థిరమైన యోగంలో సుఖవంతమైన ఆసనాన్ని స్వీక రించాలి. పద్మాసన, వజ్రాసన, వీరాసనాదులను శాస్త్రం చెబుతుంది. ఏ ఆసనంలో కూర్చుంటే యోగం సుకరంగా ఉంటుందో దానిని ఎంచుకోవాలి.

ఆపై సరియైన ప్రాణాయామం చేయాలి. మనోదృష్టిని బాహ్యావిషయాల నుండి మరల్చడమే ప్రత్యాహారం. శ్వాసనునిలిపి, దృష్టిని పరమాత్మ యందు నిలిపే ప్రయ త్నమే ధారణ. సగుణంగానైనా, నిర్గుణంగానైనా బుద్ధిని ఏకాగ్రంగా ఈశ్వరునియందు నిలపడమే ధ్యానం. జీవబ్రహ్మైక్యాన్ని (పరమాత్మతో తాదాత్మ్యాన్ని) పొందడమే

సమాధి. పురాణ, ధర్మశాస్త్ర, యోగశాస్త్రాల ఆధారంగా సమీకరించి స్థూలంగా చెప్పుకుంటే ఇదీ అష్టాంగయోగం.

**ప్ర: వేదాలలో విగ్రహారాధన లేదనీ, 'న తస్య ప్రతిమా అస్తి'- భగవంతునికి ప్రతిమ లేదనే వేదవాక్యాన్ని ఉటంకిస్తూ కొందరు చెప్తున్నారు. విగ్రహారాధన వేదమతానికి విరుద్ధమా?**

**జ:** విగ్రహారాధనపై చాలా చర్చలు జరిగాయి. వేదాలు మూలంగా కలిగిన మతం హిందూ మతం. విగ్రహాల ద్వారా మనం ఆరాధించే శివ, విష్ణు, దుర్గాది దేవతలు వైదిక దేవతలే. వేదాలలో సూత్రప్రాయంగా ఉన్న అంశాలే ఆగమాలలో, పురాణాలలో విస్తారంగా చెప్పబడినాయి.

**'న తస్య ప్రతిమా అస్తి**

**యస్యనామ మహద్యశః'**- అని వేదవాక్యం. ఇక్కడ 'ప్రతిమా' అనే మాటకి 'సాటి' అని అర్థం. "అతనికి (ఈశ్వరునికి) సాటి (సమానమైనది) లేదు. గొప్ప యశస్సు కలవాడు ఆతడే" అని ఈ మంత్రానికి అర్థం. దీనికి 'విగ్రహం' అనే అర్థం తీయనక్కర్లేదు. అన్ని చోట్లా 'ప్రతిమా' అంటే విగ్రహం అనే అర్థం లేదు.



అసలు విగ్రహాన్ని దైవంగా ఆరాధించడం లేదు మనం. విగ్రహం ద్వారా దైవాన్ని ఆరాధిస్తున్నాం. "ఆధ్యాత్మిక సాధనలో విగ్రహా రాధన ప్రాథమిక దశలోనిది" అని శాస్త్రాలు చెబుతున్నాయి. హృదయంలో, అగ్నిహోత్రంలో, సూర్యమండలంలో, చంద్ర మండలంలో, పవిత్రమైన శాస్త్రబద్ధ ఉత్తమ లోహ, మృత్తికా విగ్రహాలలో భగవంతుని ఆరాధించాలని శాస్త్రనిర్దేశం. దీనిని బట్టి కేవలం విగ్రహాల్లోనే దేవుడుంటాడనే భావం మన ఋషులకి లేదు అని స్పష్టమౌతుంది. భగవద్రూపాన్ని మనకు స్ఫురింపజేసేది విగ్రహం.

ఇంట్లో పెట్టుకున్న ఒక జలపాతపు చిత్రపటం మనకు ప్రశాంతతని కలిగిస్తున్నది. ఒక విగ్రహాన్నీ, పటాన్నీ చూసి భావతాదాత్మ్యం చెందడం మానవ నైజం. ఒక దేశపు జెండాని చూసి దేశభక్తిని చూపిస్తాం. అలాగే నాస్తిక పార్టీల వారికి కూడా జెండాలను చూడగానే తమ సిద్ధాంతాలు గుర్తుకు వస్తాయి.

అయితే భారతీయ విగ్రహాల వెనుక- కేవలం చూసి నమస్కరించే పద్ధతి మాత్రమే కాదు; యంత్రం ద్వారా, మంత్రం ద్వారా, హోమాది ప్రక్రియల ద్వారా విగ్రహంలో కళలను న్యాసం చేసి దేవతను ప్రతిష్ఠిస్తారు. ఈ 'ప్రతిష్ఠ' అనే కల్పం కూడా వేద

మంత్రాలతో కూడినదే. వేదం అనే చెట్టుకి ఫలవంతమైన శాఖగా విస్తరిల్లింది విగ్రహారాధన.

విగ్రహంలో శక్తికి మన విశ్వాసంతో పనిలేదు. శాస్త్రీయ ప్రక్రియలతో ప్రతిష్ఠాదులు, అర్చనాదులు జరిగే విగ్రహంలో మన విశ్వాసాలతో నిమిత్తం లేకుండా దేవతాశక్తి ప్రోదిచేయబడుతుంది. అది ఆరాధించేవారిని అనుగ్రహిస్తుంది. దేవశక్తిని విశేషంగా గ్రహించేది విగ్రహం. అసలు విగ్రహాలతో పనిలేకుండా ధ్యానంతో ఇష్ట దేవతామూర్తిని ఆరాధించే విధానాలను కూడా మన పురాణాలు వర్ణిస్తాయి.

నిరాకారం, సాకారం, విగ్రహారాధన, హృదయంలో ధ్యానం... ఇలా అన్ని విధానాలూ వైదికమతంలోనే ఉన్నాయి.

**'యతోవీరః కర్మణ్యస్సుదక్షో**

**యుక్తోగ్రావా జాయతే దేవకామః'**

**'అశ్మాణమాఘుం ప్రపద్యే'**

మొదలైన వేదమంత్రాల్లో 'అశ్మానం', 'గ్రావా' మొదలైన శబ్దాలు శిలారూపంలో కల్పించబడే పరమేశ్వరుని పేర్కొన్నాయని వేదజ్ఞుల మాట.

**'సురూపాం ప్రతిమాం విష్ణోః... తామర్చయేత్'**– అని తైత్తిరీయారణ్యక సంహితలోని మంత్రం.

యజుర్వేద సంహితలో **"పాషాణలోహ మణిమృణ్మయ విగ్రహేషు..."** అనే వాక్యం ఉంది. వివిధ మానసిక స్థాయిల వారికి వివిధ పద్ధతులలో భగవదనుసంధానం– అనే సౌలభ్యం కల విస్తారమైన హిందూమతం వేదం పునాదిగానే నిలబడింది. అరకొర, మిడిమిడి జ్ఞానంతో 'విగ్రహారాధన'లాంటి అద్భుతవిజ్ఞానాన్ని తూలనాడడం మూర్ఖత్వం. విగ్రహారాధన వెనుక మనస్తత్వ శాస్త్రం, శిల్పశాస్త్రం, మంత్రశాస్త్రం, సూక్ష్మ దైవీశక్తుల రహస్యం దాగి ఉన్నాయి. వాటి శాస్త్రాలను పరిశీలించి వాటి గురించి మాట్లాడాలి. పూజ పొందే ఒక చిన్నపాటి పటం నుండి ఒక దివ్యశక్తి ప్రసరణ ఉంటుంది. అది సూక్ష్మ ప్రపంచ విజ్ఞానం.

ప్ర: **గోవును వధించరాదనే భావం వచ్చే మంత్రాలు వేదాల్లో ఉన్నాయా? గోమేథం' ఏమిటి? గోమాంసం తినేవారిని నిమ్నజాతుల క్రింద జమకట్టారని, తరువాత వచ్చిన పురాణాల్లోనే గోవును చంపరాదని చెప్పారని... కొందరు చెప్తున్నారు. గోవును పవి త్రంగా చూడడం ఎప్పటి నుండి ఉంది?**

**జ:** భారతదేశంలో గోవును అనాదిగా దేవతగానే ఆరాధిస్తున్నారు. ఋగ్వేదంలోనే 'అఘ్న్యాఇయం...' 'గోవు చంపదగనిది' అని స్పష్టంగా ఉంది. 'మా... అదితిం వధిష్ఠం' "ఛేదించకూడని, గోవును వధింపరాదు" అని మరొక చోట మంత్రం. "గోవు జీవులను బలిష్ఠునిగా చేసి, తేజోవంతునిగా నుంచుతుందని, తన 'అంభా' రావమనే మంగళ శబ్దంతో గృహాలను మంగళమయం చేస్తోంద"ని ఋగ్వేద మంత్రాలలో చెప్పబడింది.

**"గోస్తుమాత్రా న విద్యతే"**- గోవులకు సమానమైనది భూమియందు లేదనీ, **"అంతకాయ గోఘాతమ్"** గోహంతకులను హతమార్చమనీ యజుర్వేదంలోని మంత్రాలు. కొన్ని చోట్ల 'గో' శబ్దానికి 'ఇంద్రియాలు' అని అర్థం చెప్పినపుడు 'ఇంద్రియాలను నిగ్రహించేవారి'ని 'గోవులను శిక్షించేవారి'గా భావుకంగా చెప్పిన సందర్భాలున్నాయి. ఏ సందర్భంలో 'గో' శబ్దం ప్రయోగింపబడిందో తెలియాలి. 'ఇంద్రియ నిగ్రహణతో, విషయవాంఛల నుండి బుద్ధిని మరల్చి, పరమాత్మకు సమర్పించడమే' తాత్త్వికంగా 'గోమేధా'నికి అర్థం.

యుగాల క్రితం 'గోమేధ'యాగం గురించి చేసిన ప్రస్తావనలు ఒక ముఖ్య ప్రయోజనం కోసం చేసిన అరుదైన ప్రక్రియ. దానిని, అశ్వమేధాన్ని కూడా కలి యుగంలో ఋషులు నిషేధించారు. సర్వయుగాలలోను గోమాంసభక్షణ, గోవధ పాపకృత్యంగానే శ్రుతులు, స్మృతులు ఉద్ఘాటించాయి. ధర్మబుద్ధిలేని పాపాత్ములు ఈ నియమాన్ని తప్పితే వారిని భ్రష్టులుగా పేర్కొన్నాయి. అంతేగానీ భారతదేశంలో నిమ్నజాతులవారు సైతం గోవును భక్షించరు.

అసలు గోపంచకం వలన అన్ని మతాలవారికి ప్రయోజనముంది. గోవును భక్షించా లని ఏ మతంలోనూ లేదు. ఖురాన్‌లో కూడా 'గోవును తినరాదు' అనే ఉందని చెబుతారు. కేవలం హిందువుల మనోభావాలను దెబ్బతీయడానికే, ఇక్కడ గోవును హింసిస్తున్నారు. అసలు గోహింస మానవజాతికే మచ్చ. గోహింస, గోవధ జరిగేచోట ఉపద్రవాలు, దరిద్రాలు వస్తాయి. ముఖ్యంగా భారతజాతికి చెందిన గోవులలో ప్రత్యేక లక్షణాలున్నాయి. వీటి ఉనికి, వీటి నుండి వచ్చే పాడికీ, మల మూత్రాలకీ వైజ్ఞానిక, ఔషధీయ విలువలున్నాయి. విజ్ఞానం కలిగిన నాగరక జాతి లక్షణం గోవును కాపాడుకోవడం.

ఆధ్యాత్మికంగా ఉన్న దేవతాదృష్టి ఎలాగూ అంగీకరించవలసినదే. అదిగాక,

గోవుల వలన వ్యవసాయానికీ, ఆరోగ్యానికీ జరిగే ప్రయోజనాల దృష్ట్యా కూడ గోవును కాపాడాలి. పురాణాల్లో ఉందా? వేదాల్లో ఉందా? ప్రాచీన కాలంలో ఉండేదా? మధ్యయుగాల్లో జరిగేదా?... ఇలాంటి పనికిమాలిన ప్రశ్నలు అనవసరం. ప్రయోజన కరమైన అంశం ఎక్కడున్నా అమలు పరచవలసిందే. తర్కాలకి పోతే ఏ మతమూ నిలవదు. అన్ని మతాల ఉనికినీ తీసిపారేయవచ్చు. వృథాతర్కం ప్రమాదకరం.

భారతదేశంలో అనాదిగా ఉన్న నాగరికతను కాపాడుకోవడం ఈ దేశపు ధర్మం. ఈ నాగరికతలో గోపూజ, గోరక్షణ– ప్రధాన భాగం. ఈ దేశవాసులైన హిందువు లందరూ గోవును దేవతగా భావిస్తారు. అధిక సంఖ్యాకుల మనోభావ రక్షణ కోసమైనా గోవుల పరిరక్షణలో, భారతీయ గోసంతతి వృద్ధిలో విస్తృతస్థాయిలో ప్రతినిత్యమూ కృషి చేయాలి. భారతీయ గోవులు ప్రత్యేకం. ఇక్కడి గోవిజ్ఞానం, గోభావన విశిష్టం. వీటిని అందరం కాపాడుకోవాలి.

**ప్ర: కాంచీపురంలో ఏకాంబరేశ్వరునిఆలయం ఉంది. 'ఏకాంబరం' అంటే అర్థం ఏమిటి?**

**జ:** అది 'ఏకాంబరేశ్వరుడు' కాదు. 'ఏకామ్రేశ్వరుడు'.

'ఒకే మామిడి చెట్టు'. వివిధ రుచుల ఫలాలు కలిగిన ఒకే మామిడి కనుక 'ఏకా మ్రము'. 'ఆమ్రం'– అంటే 'మామిడి' అని అర్థం. కామాక్షీదేవి ఈ వృక్షము క్రింద తపస్సు చేసి ఆరాధించిందని పురాణగాథ. ఆమె తపస్సుకి ఫలితంగా శివుడు అక్కడ వెలసినందుకు 'ఏకామ్రేశ్వరుడు' అనే పేరున ప్రసిద్ధి చెందాడు.

**ప్ర: మహిషాసుర మర్దనం చేసినది మహాలక్ష్మి అనీ, 'దుర్గ'కాదనీ, ఈమె విష్ణుపత్ని అనీ, శైవులు ఈమెను శివపత్ని అయిన దుర్గగా చిత్రించారనీ ఒక వైష్ణవ పండితుడు పుస్తకాన్ని వ్రాశారు. ఇది ఎంత మేరకు నిజం? వివరణను కోరుతున్నాను.**

**జ:** మహిషాసుర మర్దనం చేసినది మహాలక్ష్మి. నిజమే. కానీ ఈమె విష్ణుపత్ని అయిన లక్ష్మిగా చెప్పబడలేదు. దేవీ మాహాత్మ్యం, దేవీ భాగవతం, కొన్ని తంత్రశాస్త్రాలలో మహిషాసురమర్దిని రూపం చెప్పబడింది.

బ్రహ్మవిష్ణు రుద్రేంద్రాది దేవతలందరి నుండి లోకరక్షణార్థం వెలికివచ్చిన, సర్వదేవతా త్మక తేజఃస్వరూపిణి దుర్గ. ఈమెయే మహిషాసురమర్దనం చేసిందని స్పష్టంగా ఆ గ్రంథాలలో చెప్పబడింది. ఈమెకే 'మహాలక్ష్మి' అని పేరు కూడా ఉంది.

మహాలక్ష్మి, ఆద్యాలక్ష్మి– అని శాస్త్రాలలో వర్ణించబడిన జగదంబ ముగ్గుర మ్మలకూ మూలపుటమ్మ. ఈమెయే కాళిగా, లక్ష్మిగా, సరస్వతిగా, గాయత్రిగా

పలురూపాలలో వ్యక్తమయింది. ఈ ఆద్యాలక్ష్మి ముగురమ్మలకీ, ముగురయ్యలకీ మూలమైన పరాశక్తి.

ఈమె పరమశివుని శక్తి– అని పురాణాలు, తంత్రశాస్త్రాలు వర్ణించాయి. లక్ష్మీ సహితుడైన శివుని గురించి పేర్కొన్నాయి. ఇక్కడ 'లక్ష్మి' అన్నది శక్తివాచక శబ్దం మాత్రమే.

మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి– ఈ మూడు స్వరూపాలు వేరు. విష్ణుపత్ని అయిన లక్ష్మి, బ్రహ్మపత్ని అయిన సరస్వతి వేరు. అసురశక్తుల వినాశనం కోసం ఉద్భవించిన ఈ మూడు రూపాల సమాహార స్వరూపమే దుర్గ.

మహిషాసుర మర్దనం చేశాక తల్లిని దేవతలు, ఋషులు 'దుర్గా'నామంతో పలు మార్లు కీర్తించారు. (దేవీమాహాత్మ్యం– మార్కండేయపురాణం).

**మేధాసి దేవి విదితాఖిల శాస్త్రసారా**
**దుర్గాసి దుర్గభవసాగర నౌరసంగా,**
**శ్రీః కైటభారి హృదయైక కృతాధివాసా**
**గౌరీ త్వమేవ శశిమౌళి కృతప్రతిష్ఠా॥**



ఆ తల్లియే విద్యాస్వరూపిణియైన సరస్వతిగా బ్రహ్మపత్ని అయినది. ఆ తల్లియే విష్ణు హృదయవాసినియైన లక్ష్మి. ఆమెయే చంద్రశేఖరుని శరీరమందున్న గౌరీదేవి. అసలు మన శాస్త్రాలలో ఒకే పరమేశ్వరుడు, ఒకే శక్తి ప్రధానం. ఆ పరమేశ్వరుడే బ్రహ్మవిష్ణురుద్రాది రూపాలలో ఉన్నప్పుడు, ఆ శక్తియే సరస్వతి లక్ష్మిదుర్గాది రూపాలతో ఉన్నదని చెప్పబడింది.

ఈ 'దుర్గా'దేవి విష్ణువు యొక్క యోగమాయా శక్తియే. ఈమెనే, 'విష్ణు సహోదరి' అన్నారు. ఈ విష్ణుసోదరి శివుని పత్ని. భాగవతంలో కూడా 'దుర్గా, కాళి' ఇత్యాది నామాలు ఈ 'పద్మనాభ సహోదరికి ఉన్నట్లుగా వివరించారు.

మహిషాసుర మర్దనం చేసిన దుర్గాదేవి ఆలయాలలో ఆమెకు పతిగా శివుని ఆలయాలే ఉండడం గమనించదగిన మరో విషయం.

'గణేశజననీ దుర్గా' 'శివరూపా శివప్రియా శంభుపత్నీ'– అంటూ దేవీ భాగవతంలో స్పష్టంగా ఉంది. 'మహాలక్ష్మి' అనే మాట సర్వశక్తులకు మూలమైన పరాశక్తి పరంగా గ్రహించాలి. ఆమెయే పరాక్రమ స్వరూపిణి దుర్గ. విష్ణుని యోగనిద్రా శక్తి మహాకాళి. (ఈమె విష్ణుసోదరిగా వ్యవహారం). మధుకైటభ నాశనానికి సహకరించిన శక్తి.

ఈమె మొదటి శక్తి. రెండవది సర్వదేవతల తేజస్సుల సమాహార రూపిణియైన మహిషాసురమర్దిని మహాలక్ష్మి. మూడవది గౌరీదేవి శరీరంనుండి వినిర్గమించిన కౌశికి. ఈమెనే మహాసరస్వతి అంటారు. ఈమె శుంభనిశుంభ సంహారిణి.

వీరి ముగ్గురినీ కలిపి ఏకస్వరూపంగా ఆరాధించాలి. ఇందులో గౌరి నుండి ఉద్భవించిన తల్లిని వర్ణించారు. కానీ ఇంక ఏ స్త్రీ దేవతనుండి వచ్చిన దేవిగా వర్ణనలేదు. దీనిబట్టి గౌరియే దుర్గ అని స్పష్టమౌతుంది. అయినా ఒకే జగదంబ లక్ష్మ్యాది రూపాలలో ఉన్నది కనుక విష్ణుపత్ని అయిన లక్ష్మినే అసురసంహారిణిగా భావించినా, ఉపాసనా పరంగా దోషంరాదు. ఇవన్నీ ఒకే దేవియొక్క రూపాలేకదా! కానీ గౌరీ స్వరూపిణి అనే శాస్త్రాధారాలను తిరస్కరించడం పాపమే.

శైవవైష్ణవ ద్వేషభావాలు స్వీకార్యాలు కావు. ఆ ద్వేషంలో జనించిన పుస్తకాలు ప్రమా ణాలు కావు. హిందువులు సమైక్యంగా ఉద్యమించవలసిన తరుణంలో విభేదవాదాలు సృష్టించి, భక్తుల్ని అయోమయంలో పెట్టడం దోషం.

**ప్ర: 'శ్రౌతం, స్మార్తం' అంటే ఏమిటి? శ్రౌతస్మార్త కర్మానుష్ఠానం అని కొన్ని సంకల్పాలలో అంటుంటారు కదా!**

**జ:** శ్రుతిని (వేదాన్ని) అనుసరించి చేసే కర్మలు శ్రౌతం. స్మృతులను (పురాణాలను, ధర్మశాస్త్రాలను) అనుసరించి చేసేవి స్మార్త కర్మలు, బోధాయన, ఆపస్తంబ గృహ్య సూత్రాల ప్రకారం చేసే కర్మలను కూడా 'స్మార్త కర్మలు' అంటారు.



**ప్ర: రుద్రుని ఆవిర్భావం ఎలా జరిగింది? బ్రహ్మనుండి జనించిన రుద్రుడు ఆతని తలనే ఖండించడం అధర్మం కదా? ఏకాదశ రుద్రులు ఎలా కలిగారు?**

**జ:** సృష్టికి పూర్వంలోనే బ్రహ్మదేవుడు శివపరమాత్మ విషయంలో అజ్ఞానంతో అసత్య మాడాడు. అగ్నిలింగంగా వ్యక్తమైన పరమేశ్వరుని తుదిని తెలియలేని బ్రహ్మ తాను తెలుసుకున్నానని అబద్ధమాడిన కారణంగా శివుని ఫాలభాగం నుండి కాలభైరవుడు ఉద్భవించి కల్లలాడిన బ్రహ్మశిరస్సును ఖండించాడు. ఈ సదాశివస్వరూపం బ్రహ్మ నుండి జనించినది కాదు.

జనన మరణాలు లేని పరతత్వం సదాశివరుద్రుడు. ఆయన శాశ్వతుడు. అధర్మంపట్ల తను చూపించిన క్రోధమే శిక్షాస్వరూపుడైన భైరవుడు.

తరువాత బ్రహ్మ పశ్చాత్తాపంతో శరణువేడాడు. మన్నించిన పరమశివుడు అను గ్రహించాడు. అటు తరువాత బ్రహ్మసృష్టిని చేయబోగా అనేక విచ్ఛిన్నాలు ఏర్పడ్డాయి.

అప్పుడు వేదనతో శివుని ధ్యానించాడు. ఆ సమయంలో బ్రహ్మప్రార్థనను మన్నించి, అతని కనుబొమ్మల నడిమి ప్రాంతం(ఆజ్ఞాచక్ర స్థానం) నుండి రుద్రరూపంలో శివుడు ప్రకటమయ్యాడు. తన నుంచి అనేక రుద్రులను ప్రభవింపజేశాడు. వారు జగద్రక్షకులై విశ్వవ్యాపకులయ్యారు.

**ఇక ఏకాదశ రుద్రుల చరిత్ర...**

ఒకప్పుడు దైత్యుల ఉద్ధతికి దేవతల శక్తి క్షీణించింది. ఆ సమయంలో దేవతల తల్లి అయిన అదితీదేవి ప్రార్థన మేరకు, కశ్యప ప్రజాపతి శివునికై తపస్సు చేశాడు. ఆ తపస్సుకి ఫలంగా కశ్యపునకు సురభిద్వారా శివుడు పదకొండు రూపాలలో అవతరించాడు. వారే ఏకాదశ రుద్రులు. వీరు దైత్యుల్ని శిక్షించి, దేవతలను రక్షించిన వారు. ఈశాన్యదిశకు అధిపతులు. వీరిలోకం కూడా ఈశానలోకం. వీరిపేర్లు: కపాలి, పింగళుడు, భీముడు, విరూపాక్షుడు, విలోహితుడు, శాస్త, అజపాత్, అహిర్బుధ్న్యుడు, శంభుడు, చండుడు, భవుడు (ప్రమాణం: శివపురాణం)

శివునికి సంబంధించిన విశేషాలను శివసంబంధ పురాణాల్లో చూడాలి. అలాగే విష్ణువిషయాలను విష్ణు పురాణాలలో పరిశీలించాలి.



ప్ర: **అయ్యప్పస్వామి చరిత్ర ఏ పురాణాల్లో లభ్యమవుతుంది? శివకేశవుల తనయుడన డానికి ఆధారాలున్నాయా?**

**జ:** స్కందపురాణంలో, బ్రహ్మాండ పురాణంలో అయ్యప్ప చరిత్ర ఉంది. ఈతనికి 'శాస్త' అనే పేరును ఆ పురాణాలు తెలిపాయి. అందులో హరిహర పుత్రునిగా వర్ణించారు. ఇక్కడ పుత్రత్వమనే కథలో 'హరిహరాత్మకమైన ఏకస్వరూపం' అనే సంకేతాన్ని గ్రహించాలి. ఇది గురుస్వరూపమనీ, ద్వైతశక్తులను దునుమాడడానికి అవతరించిన రూపమనీ స్పష్టం చేశారు.

అయితే "భూతనాథోపాఖ్యానం" అనే మరొక ప్రత్యేక గ్రంథముంది. ఈ గ్రంథంలో కేరళరాజైన రాజశేఖరునకు హరిహరపుత్రుడు లభించి పెరిగి, 'మహిషి' అనే రాక్షసుని సంహరించిన కథను వివరించారు. ఈ గ్రంథంలో అయ్యప్పకు సంబంధించిన క్షేత్రమహిమ, ఉపాసనా విషయాలు చక్కగా చెప్పబడినాయి.

ప్ర: **శ్రీదేవీఖడ్గమాలా స్తోత్రంలోని ధ్యానశ్లోకంలో 'ఆరక్తాభాం త్రినేత్రాం అరుణిమ వసనాం' అని మొదటి పాదంలో ఉంది. మళ్ళీ నాలుగో పాదంలో 'ధ్యాయేదంభో రుహస్థాం అరుణిమవసనాం' అని ఉంది. ఒకే శ్లోకంలో రెండుమార్లు 'అరుణిమ**

**వసనాం' అని రావడం పునరుక్తి కదా? ఇది సరియైనదేనా? లేక వేరే పాఠం ఉందా? పూర్తి శ్లోకాన్ని అందించండి.**

**జ:** చాలా గ్రంథాలలో మీరు వ్రాసిన ప్రకారం ఉంది. కానీ కొన్ని ప్రాచీన ప్రతుల్లో మొదటిపాదంలో 'మణిమకుటవతీం' అని ఉంది. చివరి పాదంలో 'అరుణసువసనాం' అని ఉంది. పూర్తి శ్లోకం:

**ఆరక్తాభాం త్రిణేత్రాం మణిముకుటవతీం**
**రత్నతాటంకరమ్యాం ।**
**హస్తాంభోజైః సపాశాంకుశ మదనధను-**
**స్సాయకైర్విస్ఫురంతీం ।**
**ఆపీనోత్తుంగ వక్షోరుహకలశలుఠత్**
**తారహారోజ్జ్వలాంగీం ।**
**ధ్యాయేదంభోరుహస్థామరుణ సువసనాం**
**ఈశ్వరీ మీశ్వరాణామ్ ॥**

(ఆధారం: శ్రీ పాతూరి సీతారామాంజనేయులు గారి పరిష్కరణలో వెలువడిన గ్రంథం)

ప్ర: **'ఐతిహాసిక పాత్రలకు దైవత్వాన్ని ఆపాదించి సామాన్యజనులకు దూరంగా ఉంచారు'- అని ఈ మధ్య ఒక పండితుడు, ఒక నవలలో పేర్కొన్నాడు. భారతంలోని ఒక పాత్రపై వచ్చిన గ్రంథం అది. ఇది ఎంతమేరకు సమంజసం?**

**జ:** మహాభారత ఇతిహాసంలోని పాత్రపైననే అతడు గ్రంథాన్ని రచించాడు కదా! అది జనసామాన్యానికి దగ్గరగా ఉంది కనుకనే అతడు ఆ ఇతిహాసంలోని పాత్రనే స్వీకరించాడు. దైవత్వం ఆపాదించారనడానికి ఏది ఆధారం? ఇతిహాసంలోని పాత్రకి, దైవత్వాన్ని ఆపాదించిన వారెవరు?

ఇతిహాస కర్తలే అవి దివ్యపాత్రలుగా చెప్పారు. పాత్రల్ని చిత్రించిన ఆ కవులే వాటిలోని దైవత్వాన్ని ప్రకటించారు. తర్వాత ఎవరో ఆపాదించినది కాదు.

అన్ని పాత్రల్ని దివ్యంగా చెప్పలేదెందుకు? శ్రీరాముడు, శ్రీకృష్ణుడు ప్రధానంగా దైవత్వమున్న పాత్రలు. మరి ధర్మస్వరూపులైన శిబిచక్రవర్తిని, నలచక్రవర్తిని, జడభరతుని... దేవతాపాత్రలుగా ఎందుకు చెప్పలేదు? గొప్పపాత్రల్ని అవతారాలుగా పేర్కొనలేదు. అంటే-వీరు దైవత్వముందని చెప్పిన పాత్రలు కొన్ని మాత్రమే కదా!

ఇతిహాసకర్త చిత్రించిన వాటిని యథాతథంగా గ్రహించవలసిందే. మనం అంగీ కరించనంత మాత్రాన వాటిని మార్చలేము. వాటికి దైవత్వం ఆపాదితమో, స్వాభా వికమో నిర్ణయించడానికి మనమెవరం?

ఋషులు రచించిన గ్రంథాలను, అందునా నాటి యుగాల జీవుల రీతులను నేటి నవలాకారుల భౌతికదృష్టి విశ్లేషించగలదా? అంతేకాదు, దైవత్వం కలిగిన ఆ పాత్రలు మాత్రమే సామాన్య జనులకు దగ్గరగా ఉన్నాయి. ఆ గ్రంథాలను ప్రమా ణంగా తీసుకున్నప్పుడు ప్రత్యంశాన్ని ప్రమాణమేననాలి. వాటిలోని దైవత్వాన్ని మనం పరి హరించలేము. లేదా వాటిని 'కల్పన' అని అయినా, వాటి జోలికి వెళ్లకుండా ఉండాలి.

**ప్ర: దర్భలు, నువ్వులు ఇంట్లో ఉంచుకోకూడదని, కేవలం పితృకర్మలో, గ్రహణమో వచ్చినప్పుడే తీసుకురావాలని అంటారు కదా! నిజమేనా?**

**జ:** అలా తిలలు, దర్భలు ఇంట్లో ఉంచరాదని ఎక్కడా నియమం లేదు. అవి పితృకర్మలకి సంబంధించినవి మాత్రమే కావు. ఎల్లవేళలా ఇంట్లో ఉండవచ్చు. శుచి కలిగించే పవిత్రశక్తి దర్భలకి ఉంది. తిలలతో వివిధ దేవతల్ని ఆరాధించే ప్రక్రియలు కూడా ఉన్నాయి. సంక్రమణం, నాగులచవితి వంటి దేవతా పర్వాలలో కూడా వినియోగి స్తారు. కొన్ని చోట్ల స్నేహసంకేతంగా నువ్వుల్ని పంచుకుంటారు. నువ్వులు మంగళ ద్రవ్యాల క్రిందనే చెప్పారు. నిరభ్యంతరంగా ఎల్లకాలాలలో ఇంట్లో ఉంచవచ్చు. వాటిని చూడగానే ఎవరికో పితృకర్మలు మాత్రమే గుర్తుకువచ్చి, భయపడి ఉంటారు. వారే భ్రమపడి "కూడదు" అని ఉంటారు.

**ప్ర: యుగాంతంలో అన్నీ నశించి పోతాయనీ, అంతా జలమయమైపోతుందనీ పురాణా లలో చెప్తారు కదా! మరి త్రేతాయుగం నాటి ఆనవాళ్ళు, ద్వాపరయుగం నాటి జ్ఞాపకాలు ఇప్పటికీ ఉన్నాయంటారు కదా! మరి ఆ యుగాలు అంతమయ్యాక అవి ఎందుకు నశించలేదు? ఆ అయోధ్య, మధుర, ద్వారక... వంటివి ఎలా మిగిలాయి?**

**జ:** యుగాంతంలో అంతా నశించిపోవడం, జలమయమవడం జరగదు. పురాణాల్లో అటువంటి వర్ణన కల్పాంతానికి సంబంధించినది. ఒక కల్పంలో ప్రారంభమైన సృష్టి కల్పం చివరి వరకు ఉంటుంది. మధ్యలో కొన్ని చిన్నచిన్న మార్పులు జరుగు తాయి. మనకి అవి పెద్దగా అనిపించినా, కల్పాంతంతో పోల్చితే చిన్నదే.

ఒక కల్పంలో ఎన్నో యుగాలు జరుగుతాయి. యుగసంధిలో కొన్ని పరిణామాలు సంభవి స్తాయి. రూపురేఖలు మారుతాయి. అంతేగానీ, సృష్టి అంతా నశించి, జలమయం కాదు. సంవత్సరం గడిచి మరో సంవత్సరంలోకి వెళ్ళినట్లుగానే, యుగం నుండి యుగంలోకి ప్రవేశిస్తాం. కృత త్రేత ద్వాపర కలియుగాలు కలిపి ఒక మహాయుగం. ఇలాంటి మహాయుగాలు 71 అయితే ఒక మన్వంతరం. ఇటువంటి మన్వంతరాలు 14 జరిగితే ఒక కల్పం. ఇది బ్రహ్మ యొక్క ఒక పగలు. ఆ పగటి అంతంలో సృష్టి అంతా లయిస్తుంది. తిరిగి కల్పంలో మునుపటి కల్పపు బీజాలు సృష్టిగా వ్యక్తమవుతాయి. ఈ కారణం చేత ఒక కల్పంలో ఒక యుగంలో జరిగిన ఆనవాళ్ళు తరువాతి యుగాలలో లభ్యమవడం ఆశ్చర్యమేమీ కాదు.

ప్ర: **బ్రహ్మదేవుని నుండి స్వాయంభువ మనువు, శతరూప ఉద్భవించారని పురాణంలో చదివాను. వారే భార్యాభర్తలయ్యారు. అలాగే వేనరాజు భుజాలను మథనం చేయగా పృధుచక్రవర్తి, అర్చి పుట్టారని భాగవతంలో ఉంది. కానీ ఒకేసారి ఒకే చోట నుండి పుట్టిన ఆ స్త్రీపురుషులు సోదరీసోదరులవ్వాలి కదా! మరి భార్యాభర్తలు కావడం అధర్మం కదా!**

జ: స్వాయంభువు, శతరూప మిథునసృష్టి. ఇది మానవసృష్టి కాదు. అలాగే పృధు, అర్చి కూడా. వీరు అయోనిజులు. శైశవ, బాల్యాదులు లేనివారు. అందుకే మానవ శరీరధర్మాలు వీరికి వర్తించవు. వీరి సృష్టి వైఖరి వేరు. జనన, బాల్య, యౌవనాది అవస్థలు కలిగిన కర్మదేహులైన మానవులు ఈ దేవతలవలె ప్రవర్తించలేరు.

పైన పేర్కొన్న దివ్యదంపతులు సోదరీ సోదరులు కాజాలరు. కనుక వారి దాంపత్యంలో అధర్మం లేదు.



ప్ర: **విఘ్నేశ్వర పూజ అంటే, శివపార్వతుల పుత్రుని పూజ కాదని, అది విష్ణుపూజ అని ఒక వైష్ణవ పండితుడు టీవీలో చెప్పారు. పైగా, శివపార్వతుల పెళ్ళిలో విఘ్నేశ్వరుని పూజించినట్లు ఉంది కనుక, గణపతి శివపార్వతులకు ముందే లేదు కనుక, విఘ్నేశ్వర పూజ శివతనయుని పూజ కాదు, అని వివరించారు. ధర్మసందేహాలకు సమాధానాలు చెబుతూ ఆయన ఈ విషయాలు చెప్పారు. దానిలోని నిజాలు వివరించండి.**

జ: అలా చెప్పడం ఆయన తప్పుకాదు. ఆయనను అడగడమే తప్పు. కేవలం వైష్ణవ సిద్ధాంతంలో ఉన్నవారు అలాగే ఆలోచిస్తారు.

శివ, శక్తి, గాణాపత్యాలవంటి విషయాల గురించి వాటిలో పండితుల్ని మాత్రమే

అడగాలి. ఏ సంప్రదాయం వారికి ఆ సాంప్రదాయం మీదనే అవగాహన ఉంటుంది. వారికి చెందని సాంప్రదాయం గురించి అడిగితే వారేమి చెప్తారు? ఒకవేళ సహృదయం ఉంటే "ఆ సంప్రదాయం నాకు తెలియదు. నేను దానికి చెందినవాడిని కాను కనుక చెప్పలేను." అని చెప్పగలగాలి. లేదా, ఆ సంప్రదాయాన్ని కూడా తెలుసుకొని సానుభూతితో చెప్పాలి. ఇంత సంస్కారం, సుహృదయం లేనప్పుడు, ఇతర సంప్రదాయాలను తూలనాడే బుద్ధి ఉంటుంది. దానికి పాండిత్యం తోడైతే చమత్కారాలతో, ఊహాగానాలతో తమదికాని సిద్ధాంతాలను తూలనాడుతారు. అదే చేశారు ఆ పండితులు.

విఘ్నేశ్వరుడు విష్ణువే– అనటంలో పొరపాటు లేదు. గాణాపత్యశాస్త్రాల ప్రకారం, బ్రహ్మవిష్ణుశివాదులకు మూలమైన పరబ్రహ్మయే గణపతి. అంటే సృష్టిస్థితిలయలను బ్రహ్మవిష్ణురుద్ర రూపాలలో నిర్వహించేది ఒకే పరమేశ్వరుడు... అనేది హిందూమత ప్రధాన సూత్రం. ఆ పరమేశ్వరుని గణపతిగా, ఓంకార స్వరూపంగా ఉపాసించే మతం గాణపత్యం.



ఆ గణపతి అన్ని ప్రతికూలతలనీ తొలగించి భుక్తినీ ముక్తినీ అనుగ్రహిస్తాడు కనుక విఘ్ననాశకుడు. అలాగే కార్యాలకు విఘ్నం కలిగించడం కూడా జీవుల కర్మానుగుణంగా ఆ పరమేశ్వరుడు చేసే పని. ఆయనను శివుడన్నా, విష్ణువన్నా, గణపతి అన్నా దోషం రాదు.

ఈశ్వరుడు ఎన్ని దేవతల రూపాలు ధరించినా, విశ్వమర్యాదలను తానూ పాటిస్తాడు. ఏ రూపమూలేని శివపరమాత్మ లీలగా రూపం ధరించినప్పుడు, విఘ్ననాశనం కోసం తన పరమేశ్వరతత్త్వాన్ని తానే పూజించాడు. అదే విధంగా సృష్టికి పూర్వం బ్రహ్మదేవుడు వక్రతుండుని ఉపాసించాడని పురాణాలు, ఆగమాలు చెబుతున్నాయి. అంటే విఘ్నాలను తొలగించే ఓంకార స్వరూపాన్ని ఉపాసించారని అర్థం. ముందుగా పలికే ఓంకారమే, తొలి పూజలందే గణపతి.

ఆ గణపతినే శివపార్వతులు వివాహంలో, లోకమర్యాదను అభినయిస్తూ, పూజించారు. ఆ గణపతి మళ్ళీ శివపార్వతులకు తనయుడిగా ఆవిర్భవించాడు. విష్ణువు నరసింహుడైనట్టు, రాముడైనట్టుగానే గణపతి విఘ్నేశ్వరుడై పార్వతీ పరమేశ్వరులకు కుమారుడిగా ఆవిర్భవించాడు.

విఘ్ననాశకమైన పరబ్రహ్మ స్వరూపమే గణపతి. ఆయన శివశక్తుల ఏక

స్వరూపమైన ఓంకారమే. అది ఎప్పుడూ ఉంటుంది. అదే మళ్ళీ శివకుమారునిగా వ్యక్తమయింది. గణపతి తత్త్వాన్ని కొద్దిగా తేటపరిచేందుకు, అదే సమయంలో సంప్రదాయాలు పరస్పరం కలహించుకోరాదని చెప్పేందుకు ఇంత వివరణాత్మక సమాధానం ఇవ్వవలసి వచ్చింది.

ప్ర: **దశావతారాల గురించి చెబితే, శ్రీ తిరుమల వేంకటేశ్వరస్వామి ఏ అవతారమౌతాడు? గోవిందరాజస్వామి అవతార వివరాలు తెలపండి?**

**జ:** ధర్మరక్షణకై భగవంతుడు ధరించిన అవతారాలు వ్యూహావతారాలు. భక్తుల ఉపాసన కోసం క్షేత్రాదులలో అవతరించినది అర్చావతారం. వేంకటేశ్వరుడు దశావతారంలో ఒకటి కాదు. వేంకటేశ్వరుడు అనగా నారాయణుడు, దశావతారాలే కాదు. ఇంకా ఎన్నో అవతారాలు ధరించాడని భాగవతాది పురాణాలు చెబుతున్నాయి.

వేంకటేశ్వరుడు అర్చావతారం. గోవిందరాజు అవతారం కాదు. 'గోవింద' నామంతో ఆరాధింపబడుతున్న విష్ణురూపం.

ప్ర: **పురాణాల నిండా అటు సముద్ర తీరవాసులు, ఇటు గిరిప్రాంత వాసులు దైవస్వరూపులుగా గుర్తింపబడ్డారు. అప్పుడు ఇంకెక్కడ జనవాసాలు లేవా?**

**జ:** ఇది పురాణాల పై అవగాహన లేని ప్రశ్న. 'పురాణాల నిండా...' అలా ఎక్కడా వర్ణించబడి లేదు. నదీతీరాలు, అరణ్యాలు, మహానగరాలు, గ్రామాలు... ఇలా ఎన్నో జీవనవాసాల గురించి పురాణాలు వర్ణించాయి. వాటిలో మహాత్ములు, ధర్మ మూర్తులతో పాటు దైవస్వరూపులైన మహర్షులు, అవతార పురుషులు ఉన్న కథల్ని కూడా వివరించాయి. పృథుచక్రవర్తి కథలో వివిధ జనావాసాల వివరాలే ఇందుకు ఒక ఉదాహరణ. అయోధ్యా, కాశీ, మధుర, పాండ్య, కేరళ... మొదలైన ఎన్నో నగరాలు, ప్రాంతాలు అవతార పురుషులకు ఆవాసాలు.

ప్ర: **నేను కొంతకాలం క్రితం ఉజ్జయినీ క్షేత్రానికి వెళ్ళాను. అక్కడ మహాకాళేశ్వర జ్యోతిర్లింగానికి చితాభస్మంతో అభిషేకం చేయడం విశేషం. సాధారణంగా శ్మశానానికి వెళ్ళి వస్తేనే అశుభంగా భావిస్తుంటారు. అపవిత్రమైన చితాభస్మంతో అర్చించడం ఎంతవరకు సమర్థనీయం? అలా చేయడంలో విశేషమేమిటో తెలుపగలరు.**

**జ:** మనకి అమంగళమైన శ్మశానం, మహాదేవునికి అమంగళం కాదు. మన శరీరోపాధుల దృష్టిలో అది అమంగళం. కానీ పరాత్పరునికి మంగళామంగళాలు లేవు. ఆయన పేరే 'శివుడు'– అంటే పరమ మంగళస్వరూపుడు.

మహాకాలతత్వం సర్వజగతినీ లయం చేసే పరమేశ్వర స్వరూపం. ప్రళయకాలంలో సర్వజగతినీ భస్మంచేసి దానిలోని సారాన్నీ, బీజశక్తినీ తనలో భద్రపరచి తిరిగి సృష్టికాలంలో విశ్వాన్ని బహిర్గతపరచే భగవంతుడు రుద్రుడు.

అన్నీ లయించినా, తాను శాశ్వతంగా ఉండే పరతత్త్వం కనుక తనలో లయం (లీనం) చేసుకొనే అంతరార్థాన్ని ఈ భస్మధారణ ద్వారా వ్యక్తపరుస్తున్నాడు. అయితే యజ్ఞసారాన్ని, యజ్ఞ ప్రసాదమైన భస్మంగానే ధరించడం సంప్రదాయం. ఉజ్జయినిలో చాలాకాలంగా అగ్నిహోత్రం ద్వారా లభించిన భస్మాన్నే స్వామి ఆరాధనకు వినియోగిస్తున్నారు. చితాభస్మాన్ని కాదు. కేవలం యజ్ఞంద్వారా లభించే భస్మాన్నే మహాకాలుని అభిషేకానికి వినియోగిస్తున్నారు. ఇది అక్కడి క్షేత్రంలో స్పష్టంగా తెలుసుకున్న సమాచారం. చితాభస్మం మాట కేవలం కల్పితం.

అయితే ఎప్పుడో పాతకాలంలో ఆ ఆచారం ఉండేదేమో తెలియదు. ఆ ఆచారంలో కూడా అంతరార్థం తెలియాలి. శవభస్మం స్వామిని చేరి 'శివం' (శుభం) అవుతుంది. ఎవరి మృతదేహ భస్మం అలా వినియోగించబడిందో ఆ దేహికి సద్గతి లభిస్తుంది.



ప్ర: **ఈ మధ్య గంగాకుంభమేళాలో అనేక నాగా సాధువులు, అఘోరీలు వచ్చారని వార్తలు టీవీల్లో, పత్రికల్లో వచ్చాయి. వీరి ప్రవర్తన జుగుప్సాకరంగా ఉందనీ, నాగాలు నగ్నంగా ఉంటారనీ, అఘోరీలు అంటే పరమఘోరంగా ప్రవర్తిస్తారనీ 'హల్‌చల్', 'హంగామా' లాంటి పదాలతో వారిని వర్ణిస్తూ హిందూమతం పట్ల గౌరవం తగ్గేలా టీవీలు ప్రచారం చేశాయి. ఇలాంటి భయంకరాచారాలు మన మతంలో ఎందుకున్నాయి?**

**జ:** హిందూధర్మం చాలా విశాలమైనది. ఇందులో ఎన్నో పంథాలు ఉన్నాయి. వారి వారి మనఃస్థితి బట్టి ఆ పంథాలను అనుసరిస్తారు. అఘోరీలు, నాగాలు ఇప్పుడు కొత్తగా వచ్చినవారు కారు. వీరు ఎప్పుడూ ఉంటారు. కుంభమేళాలాంటి పవిత్ర పర్వాలలో పుణ్యనదులకు స్నానార్థం వచ్చినప్పుడు కనబడతారు.

మన దృష్టిలో పడేందుకు వారు రారు. మీడియా రభసలవల్ల ఇప్పుడు కొంత మనకు వార్తలుగా తెలిసింది.

నాగాల నగ్నత్వంగానీ, అఘోరీల ప్రవర్తనగానీ మనం అనుసరించవలసినవి కావు. అలాగని వాటిని 'జుగుప్స' అని నిందించ వలసినవీ కావు. అవి మనం

జీవిస్తున్న సమాజానికి అతీతమైనవి. అందుకే వారు మనకు సాధారణ సామాజిక జీవితంలో గోచరించరు. వారి తత్త్వస్థాయి వేరు. వారి సాధనాపథం మన భౌతిక సామాజిక కోణాలలో ఇమిడేది కాదు. శరీరంతో తాదాత్మ్యంలేని ఎందరో యోగులు న్నారు. ఆ యోగుల తత్త్వం మనకు అంతుపట్టదు.

ఇక– 'అఘోరీలు' అంటేనే 'ఘోరంలేని వారు' అని అర్థం. వీరు క్షుద్రోపాసకులు కారు. మనకి ఈ సృష్టిలో కొన్ని ఘోరాలు– కొన్ని అఘోరాలు. కానీ వారికి 'ఘోరం' అనేదే లేదు. అంతా అఘోరమే. 'అఘోరం' అంటే 'పరమఘోరం' అని అర్థం లేదు. 'ఘోరము కానిది– అఘోరం'. వారు ఎవరినీ హింసించరు. మనతో వారికి సంబంధం లేదు. మన దృష్టిలో పడినప్పుడు వారు మనకు జుగుప్స కలిగేలా ప్రవర్తిస్తారు. అయితే మనం వృథా అనుకున్నవీ, ఈసడించుకొనేవీ వారు స్వీకరిస్తారు. వారు ఎలాంటి పదార్థాన్నైనా పవిత్రంగా మార్చగలిగే శక్తి సంపన్నులు. వారు మనకు జుగుప్స అనిపించే వాటినే గ్రహించుతారు. అందులో హింస ఉండదు. వారి సాధనలు మనం అనుసరించలేము. అనుసరించాల్సిన ఆవశ్యకత కూడా లేదు. వారు కనిపిస్తే నమస్కరించవచ్చు. ఇంకా ఇలాంటి యోగులు, అతీంద్రియ శక్తి సంపన్నులు మన జనావాసాలకి దూరంగా, ఎక్కడుంటారో కూడా తెలియకుండా పవిత్ర పర్వత, అరణ్య, నదీతీర ప్రాంతాలలో సంచరిస్తుంటారు. ఎప్పుడో కొన్ని పర్వవేళల్లో వారు కనబడినా వారు మన ప్రపంచాన్ని పట్టించుకోరు.

సామాన్య హిందువు వారివలె ప్రవర్తించనవసరం లేదు. అలాంటి తరహా యోగ సంప్రదాయాల సిద్ధులెందరో, మనకు దూరంగా, దుర్గమంగా ఉంటారు. వారి ధర్మసరణి వేరు. లౌకిక జీవితం, కుటుంబ జీవనం కలవారి ధర్మసంగతి వేరు. ఎందరో అవధూతలు, యోగులు ఇప్పటికీ మనకి అంతుపట్టకుండా జీవిస్తుంటారు. వారి గురించి పరిమిత జ్ఞానంతో కూడిన మనం వ్యాఖ్యానించడమే దోషం. ఇలాంటి వారు ఉండడం ఒక ఘనత. యోగులు, సిద్ధులు ఉన్న మతం హిందూమతం.

ప్ర: **భాగవతంలో పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రుల వద్ద భాగవతం విని ముక్తి పొందాడని ఉంది. మరి భారతంలో ఒంటి స్తంభం మేడపై ప్రాణరక్షణ కోసం భద్రత ఏర్పాటు చేసుకున్నాడనీ, తక్షకనాగు వేరే రూపంలో వచ్చి కాటువేసి చంపాడనీ ఉంది. ముక్తి పొందేవాడు దేహరక్షణ కోసం అంత ఏర్పాటెందుకు చేసుకోవడం? పరస్పర విరుద్ధంగా ఉన్న ఈ రెండు కథల్లో ఏది సరియైనది?**

**జ:** ఈ రెండూ సరియైనవే. భారతంలో చెప్పనిది భాగవతంలో చెప్పారని గ్రహించాలి. ఈ రెండింటినీ సరిగ్గా కలుపుకోవాలి. తక్షకుని చేత మరణం నిర్ణయింపబడ్డాక, మోక్షోపాయం కోసం పరీక్షిత్తు భాగవతం శ్రవణం చేశాడు. దాని వలన మోక్షానికి యోగ్యత సిద్ధించింది.

కానీ అతడు రాజు. అతడిని కాపాడుకోవలసిన ధర్మం ప్రజలది, మంత్రి సామంతాదులది. అందుకు వారంతా రక్షణ ఏర్పాటు చేశారు. పైగా– మృత్యువు అనివార్యమైనా, ఆత్మరక్షణకై ఉద్యమించడం ధర్మం. అది ప్రాణాలపై తీపి అనో, మోక్షానికి చెందిన జ్ఞానం లేకపోవడమో కాదు. వ్యవహారపరంగా ఆ కట్టుదిట్టం అవసరమే.

భౌతికదేహాన్ని తక్షకుడు కాటు వేశాడు– శాప ఫలంగా. కానీ అతని బుద్ధి ఆత్మజ్ఞానంతో ఉంది కనుక, ముక్తిని పొందాడు.

**ప్ర: రోడ్లకు మధ్యలో చిన్నాచితకా దేవాలయాలు నిర్మాణం చేయడం, రోడ్లు అభివృద్ధి చేసేటప్పుడు ఆటంకంగా ఉండడం జరుగుతోంది. వాటిని తొలగించబోతే గొడవలు చేస్తున్నారు. ఇది ధర్మానికి విరుద్ధమని వాదిస్తుంటారు. అభివృద్ధికి ఆటంకంగా ఉన్నప్పుడు, అడ్డుగా ఉన్న వాటిని తొలగించడం దోషమా?**

**జ:** ఒక కాలంలో శ్రద్ధగా నిర్మించుకున్న ఆలయం, కాలక్రమేణా జరిగే మార్పులవల్ల తొలగించవలసి రావచ్చు. మనం ప్రతిష్ఠించుకున్న గుడులను, ఒక మంచి పని కోసం తొలగించవచ్చు. 'కళాన్యాసం' వంటి ప్రక్రియలతో అక్కడ ప్రతిష్ఠించిన దేవతాస్థానాన్ని మరొక భద్రమైనచోట ఆలయనిర్మాణం చేసి, అందులో పునఃప్రతిష్ఠ చేయవచ్చు.

'వాటిని తొలగించము' అనే మొండితనం శాస్త్రసమ్మతం కాదు. అసలు ఆగమ శాస్త్రం, విగ్రహారాధన విజ్ఞానం వంటి అంశాలు ఏ మాత్రమూలేని ఇతర మతాల ప్రార్థనా స్థలాలు వారు నిరభ్యంతరంగా తొలగించాలి. అయితే విగ్రహారాధన విశ్వాసం కల్గిన వారికి మాత్రం తప్పనిసరిగా మరొక చోటు చూపించాలి.

ఇక్కడ మరో విషయం గుర్తించాలి. చారిత్రక ప్రాధాన్యం ఉన్నవీ, స్వయం భూక్షేత్రాలుగా తరతరాలుగా ఆరాధింపబడుతున్నవీ మాత్రం తొలగించరాదు. అభి వృద్ధి నిర్మాణాలకు వేరే ప్రత్యామ్నాయాలు చూసుకోవాలి. అక్కడ కట్టడం కన్నా, క్షేత్రానికి ప్రాధాన్యం ఉంది కనుక, వాటిని కాపాడుకోవాలి.

**ప్ర: ఋషులందరూ మగవారే కనిపిస్తున్నారు. ఆడవాళ్ళలో ఋషులు లేరా? ఇక్కడ కూడా పురుషాధిక్యమా? దేవతల్లో కూడా పురుషుల్నే ఆరాధిస్తున్నాము కదా!**

**జ:** ఋషులలో స్త్రీలు కూడా ఉన్నారు. స్త్రీ ఋషిత్వం పొందితే 'ఋషిక' అంటారు. ఇలాంటి ఋషికలు చాలా మంది ఉన్నారు. ఎందరో బ్రహ్మవాదినులు ఉన్నారు. 'వచక్ను' అనే మహానుభావుని పుత్రిక గార్గి. ఈమెను 'వాచక్నవీ గార్గి' అంటారు. ఉపనిష ద్వాఙ్మయంలో ఆమెకు ప్రాధాన్యం ఉంది. మమత, విశ్వవారా, ఘోషా, సూర్యా, వాక్ (అంభృణ ఋషి పుత్రిక)... మొదలైన ఎందరో ఋషికలు వేదవాఙ్మయం లో కనిపిస్తారు. త్రిపురారహస్యంలో హేమలేఖ భర్తకే బ్రహ్మజ్ఞానాన్ని బోధించి గురుస్థానంలో భాసించింది. అనసూయ, అరుంధతి వంటి తపస్వినులు ఉన్నారు. ఇక దేవతలలో కూడా స్త్రీ దేవతల్ని ఆరాధించే గొప్ప ధర్మం హిందూధర్మమే. దుర్గ, లక్ష్మి, సరస్వతి, శచీ, కాళీ, త్రిపుర సుందరి... ఇలా ఎన్నో దేవతలను అనాదిగా ఆరాధిస్తూనే ఉన్నాం.

**ప్ర: 'అనాయాసేన మరణం- వినాదైన్యేన జీవితం' మిగతాశ్లోకం తెలియపరుస్తూ, దాని అర్థం తెలియజేయవలసిందిగా కోరిక.**

**జ:** ఈ శ్లోకం యొక్క పూర్తిపాఠం **'అనాయాసేన మరణం, వినాదైన్యేన జీవనం, దేహాంతే తవ సాయుజ్యం దేహిమే పార్వతీపతే॥'** అనాయాసేన మరణం, వినాదైన్యేన జీవనం- దేహం చాలించిన తరువాత నీలో లీనమయ్యే మోక్షం నాకు ప్రసాదించు పార్వతీ పతీ! అని దీని అర్థం. దిగులులేని జీవితం, వేదనలేని మరణం, చివరకు కైవల్యం. జీవితానికి కావలసిన ముఖ్యమైనవన్నీ ఈ మూడింటిలోనే ఉన్నాయి.

**ప్ర: తిన్నని మూఢభక్తి ద్వారా మోక్షమా? నిరంతరము సకల పూజల ద్వారా మోక్షం సిద్ధిస్తుందా?**

**జ:** తిన్ననిది మూఢభక్తి కాదు, గాఢభక్తి. అచంచలమైన విశ్వాసం, ఏ కోరికాలేని అఖండ ప్రేమ, ఆత్మ సమర్పణ కలిసిన నిండైన భక్తి. దాని వలన తప్పక మోక్షం లభిస్తుంది. నిరంతరము సకల పూజల ద్వారా పాపక్షయం, చిత్తశుద్ధి ఏర్పడుతాయి. అప్పుడు భక్తిజ్ఞానాలు సిద్ధించి, వాటిద్వారా మోక్షం లభిస్తుంది.

**ప్ర: సంకల్పం చెప్పుకునేటప్పుడు 'ఆద్యబ్రాహ్మణః' అంటారు కదా! అంటే ఏమిటి? ఆది బ్రహ్మ అని ఉద్దేశమా?**

**జ:** అది 'ఆద్యబ్రహ్మణః' కాదు, 'అద్యబ్రహ్మణః' అనాలి. నేటి బ్రహ్మ. అనగా ఈ కల్పానికి

చెందిన బ్రహ్మదేవుడు అని అర్థం.

ప్ర: **యజ్ఞం చేసినప్పుడు జయాది హోమాలలో 'రుద్రాయ పశూనాం పతయే ఇదం నమమ' అని అంటారు. అన్న తరువాత 'అపాముస్పృశ్య' అని నీటిని ముట్టుకుంటారు. అంటే రుద్రునికి ఆహుతి ఇవ్వడం వల్ల అపవిత్రమయిందని, అందుకే నీటిని ముట్టుకుంటారని ఒకాయన అన్నాడు. దీనివల్ల రుద్రుని తక్కువగా చేసినట్లు కాదా? ఎందుకలా నీటిని ముట్టుకుంటారు?**

జ: యజ్ఞంలో రుద్రునిది ప్రధాన స్థానం. ఇతర దేవతలకి మరొక దేవతతో కలిపి ఆహుతిలివ్వడం ఉంది. ఉదాహరణకి మిత్రవరుణులు, ఇంద్రవాయువులు ఇలా స్వాహాకారాలతో ఆహుతులిస్తారు. కానీ రుద్రునికి మాత్రం ప్రత్యేకంగా ఆహుతినివ్వాలి. అంటే ఈయన ఒక్కరికే ఆహుతిని ప్రసాదించాలి. 'సాక్షాత్తు పరమేశ్వరుడు' అనే భావం ఇందులో ఉంది. ఈ ప్రత్యేకతను సూచిస్తూ, ఈయనకు ఆహుతి ఇచ్చిన వెంటనే, జలాన్ని స్పర్శించడం జరుగుతుంది. రుద్రుని ఎక్కువతనాన్నీ, పవిత్రతనీ, ప్రత్యేకతనీ చెప్పడమే ఇందులో ఉద్దేశం.

ప్ర: **మాది అనాదిగా శాకాహార కుటుంబము. నేనూ శాకాహారినే. కానీ ఇక్కడ (లండన్) చదువుకుంటున్నాను. నాతోటి మిత్రులు, అదే విధంగా ఇక్కడ స్థిరపడ్డ మన భారతీయులు కూడా ఇక్కడి కొచ్చాక మాంసాహారులుగా మారుతున్నారు. పైగా వారి వాదన 'మాంసాహారం లేకపోతే, వయసు పెరుగుతున్న కొద్దీ సరియైన పోషకాలు లేక శరీరం పుష్టిని కోల్పోతుంది' అని. దీనిని బలపరుస్తూ అనేక ఉదాహరణలు చూపిస్తూ, ఒత్తిడి చేస్తున్న మన భారతీయులు చాలా మంది ఇక్కడ ఉన్నారు. వీరికి సమాధాన మేమిటి?**

జ: ఎక్కడున్నా, ఎలా ఉన్నా మనదైన సంస్కృతినీ, మూలాలను కాపాడుకుంటూ, అక్కడి మన ఉనికిని కాపాడుకుంటూ ఎదగడం ప్రధానం. మన భారతీయులలో (హిందువులలో) శాకాహారులు, మాంసాహారులు కూడా ఉన్నారు. అది వారి పరంపర, కులపద్ధతుల ప్రకారం ఉంటుంది. మాంసాహార కుటుంబాలు మాంస స్వీకారం చేస్తే తప్పులేదు. అయితే హిందువుల కుటుంబాలు కూడా కొన్ని నియమాలకి కట్టుబడి ఉన్నాయి. గోమాసం వంటివి ఏ హిందువు కూడా తినడు తినకూడదు. అంతేకాదు కొన్ని పవిత్ర దినాల్లో, ఆదివారం మాంసం తినరాదు. ఈ నియమాలు ప్రతి హిందువూ ఏ దేశంలోనైనా పాటించవలసిందే. చూడడానికి అందరూ ఒకేలా

కనబడుతున్నా మన శరీరంలోని సూక్ష్మదేహంలో మన కులమతాది లక్షణాలు సూక్ష్మశక్తితో దాగి ఉంటాయి.

వాటిని పరిరక్షించుకోవలసిన బాధ్యత అందరిదీ. అది తమ పరంపరను, సంప్రదాయాన్నీ అనుసరించడం మీద ఆధారపడి ఉంటుంది.

మాంసాహారం తప్పులేని కుటుంబాలు కూడా క్రమేపీ దానిని విసర్జిస్తే, అది గొప్ప తపస్సేనని మన శాస్త్రాలు చెబుతున్నాయి.

ముఖ్యంగా మనువు చెప్పిన పవిత్రదినాలే కాక, చాతుర్మాస్యాలలో మాంసభక్షణ మానివేయాలని కూడా 'మహాభారతం' చెబుతుంది. అయితే మంత్ర దీక్షవంటివి స్వీకరించినవారు ఆ దీక్షానియమాలను అనుసరించి, మాంసభక్షణ వదిలివేయడమే కాక, శాకాహారంలో కూడా సాత్త్వికాహారాన్ని మాత్రమే స్వీకరించాలి.

ఇంకా, అనాదిగా శాకాహార కుటుంబాలు శాకాహారులుగానే ఉండాలి. తమ పూర్వీకుల పరంపరను కాపాడుకున్నప్పుడు, ఆ సంప్రదాయం తప్పకుండా రక్షిస్తుంది. దానిని అతిక్రమిస్తే స్థూలంగా దోషం వెంటనే కనబడకపోయినా, జీవ సంస్కారంలో సూక్ష్మంగా దోషాలు సంక్రమిస్తాయి. అవి జీవుని దుర్గతికి లోను చేస్తాయి. ఎంతో తపస్సుతో సంపాదించిన జ్ఞానాన్ని ఆచార వ్యవహారాలుగా, ఆహార విహారాలుగా మన పెద్దలు ఏర్పరిచారు. మనం దానిని అనుసరించాలి. ఎందుకు? అంటే 'అది మన పరంపర' అనేదే సమాధానం. ఇవి భౌతికంగా ఋజువు చేసే అంశాలు కావు.

అయితే మాంసాహారం లేకపోతే పుష్టికోల్పోతారనే వాదన అర్థరహితం. కేవలం శాకాహారంలో ఎన్నో పోషకాలు పొంది వందేళ్ళకు పైగా జీవించిన వారు ఎందరో ఉన్నారు. పవిత్రమైన భగవదనుష్ఠానం వల్ల, పుష్టికరమైన శాకాహారం వచ్చే పోషకశక్తి శరీరంలో పుష్టినీ ఆయువునీ కలిగిస్తుంది.

కఠిన ఉపవాసాలతో, దీక్షగా జీవించిన యోగులు, జీవిస్తున్న మహాత్ములు ఇప్పటికీ ఉన్నారు. పశుసంబంధమైన శారీరక పుష్టికన్నా, యోగసంబంధ మైన ఆధ్యాత్మిక పుష్టీ, తపశ్శక్తీ, దివ్యతేజస్సు సంపాదించడం ఉత్కృష్టం.

**ప్ర: ఈ మధ్య ఒకరు 'ఇంట్లో శివపూజ చేయకూడదు. ఇది నా స్వానుభవం' అని చెప్పారు. కొంచెం ఆశ్చర్యం కలిగింది. నిజమేనా?**

**జ:** ఇది చాలా తప్పు మాట. నిత్యం శివాభిషేకం చేసుకోవడం మన సంప్రదాయం.

సనాతనంగా దేవతార్చన, పార్థివలింగార్చన, బాణస్ఫటిక లింగాలపూజ భారతీయుల గృహాలలో సంప్రదాయం.

ఏ ఇంట్లో శివలింగం పూజింపబడుతుందో ఆ ఇంట ఐశ్వర్యం లభిస్తుందని దేవీ భాగవతం చెబుతోంది. (దేవీభాగవతం 41వ అధ్యాయం) శివపురాణంలో ఇంట్లో శివలింగార్చన చేసినట్లు చెప్పబడింది. నియమబద్ధంగా శివ పూజ ఇంట్లో చేయడం శ్రేష్ఠం. ఇవి శాస్త్రప్రమాణాలు. స్వానుభవాలకి వేటినోముడి పెట్టడం తగదు.

ప్ర: **శ్రీకృష్ణునకు, ఉద్ధవునకు ఉన్న అనుబంధం ఏమిటి? ఉద్ధవుడు స్నేహితుడు అని విన్నాను. బంధుత్వం ఏమిటి? అక్రూరుడు ఎవరు?**

జ: వసుదేవుని సోదరుడు దేవభాగుడు. అతని పుత్రుడు ఉద్ధవుడు. అంటే శ్రీకృష్ణునకు పినతండ్రి కుమారుడే ఉద్ధవుడు. అయితే కృష్ణునికి ప్రియమైన భక్తుడు. అందుకే తన నిర్యాణానికి ముందు బ్రహ్మవిద్యని గోవిందుడు ఇతనికే బోధించాడు. పైగా, ఉద్ధవుని ఉత్తమ భాగవతునిగా అనేక మార్లు పేర్కొన్నాడు. సఖ్యధర్మంతో పాటు, శరణాగతిభావం కలిగిన శ్రేష్ఠభక్తుడు ఉద్ధవుడు. కొందరు ఈతనిని 'జిజ్ఞాస భక్తుని'గా చెబుతారు. యదువంశానికి చెందిన ఒక శాఖ వృష్ణివంశం. దానికి చెందిన శ్వాఫల్గుడు అనేవాని పుత్రుడు అక్రూరుడు. అందుకే ఈతనిని 'శ్వాఫల్గుడు' అని భాగవతంలో అన్నారు. శ్రీకృష్ణుడు కూడా యాదవ వంశీయుడే కనుక, ఈతనికి బంధువు. అక్రూరుని కూడా భగవద్భక్తునిగానే శాస్త్రాలు వర్ణించాయి. భాగవతంలో ఈతని భక్తిని కూడా అభివర్ణించారు. బలరామకృష్ణులను బృందావనం నుండి మధురకు తోడ్కొని వచ్చినది ఈతడే. ఆ సమయంలో యమునానదీ జలాలలో శేషపర్యంకంపై శ్రీకృష్ణుని విష్ణుస్వరూపాన్ని దర్శించిన భాగ్యశాలి.

ప్ర: **పంచాయతన పూజ అంటే ఏమిటి? అది ఏర్పాటు చేయవలసిన పద్ధతి ఏదైనా ఉందా? శివపంచాయతనం అనే మాట విన్నాము. అలాగే విష్ణుపంచాయతనం వంటి మాటలు కూడా ఉన్నాయా?**

జ: పంచాయతన పూజ వైదిక పద్ధతిలో ఉంటుంది. శివుడు, శక్తి, విష్ణువు, గణపతి, సూర్యుడు... వీరిని పూజించడమే పంచాయతనం. ఈ సంప్రదాయంలో ఏదో ఒక దేవతని కాకుండా, అయిదుగురినీ కలిపి పూజిస్తారు.

కానీ శైవ, వైష్ణవాది మతస్థులు విడివిడిగా తమ దైవాన్నే పూజిస్తారు. ఇవి వారి

సంప్రదాయం. అభేదాన్ని ప్రతిపాదించే పద్ధతిలో మాత్రం అందరినీ కలిపి ఆరాధిస్తారు. ఇది భేదం లేకపోవడాన్ని చెప్పడమే కాక, పంచభూతాలలో ఉన్న పరమేశ్వర చైతన్యాన్ని ఆరాధించడం. నిజానికి వేదమతం బహుదేవతారాధనలతో కూడినదే. కానీ వారందరిలోనూ ఒకే పరబ్రహ్మ చైతన్యం ఉన్నదనే ఏక దృష్టి కూడా వేదమతమే. విశ్వనిర్వహణ కోసం ఉపాసకులను అనుగ్రహించడం కోసం ఒకే పరమాత్మ బహు దేవతా రూపాలను ధరించాడు.

**"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా"** అనే ప్రసిద్ధ శాస్త్రవాక్యం ఎలాగూ ఉంది. అయితే ఇదే సమయంలో జీవలక్షణానుసారం ఒక్కొక్కరికీ ఒక్కొక్క ఇష్ట దేవతానిష్ఠ ఉండడం సహజం.

ఆ ఇష్టదేవతను మధ్యస్థానంలో ఉంచి, మిగిలిన నలుగురినీ నాలుగు స్థానాలలో ఉంచడం పంచాయతనం. శివుని అభీష్టదైవంగా కలవారు శివుని మధ్యన ఉంచుతారు. అప్పుడు ఈశాన్యంలో విష్ణువు, ఆగ్నేయంలో సూర్యుడు, నైఋతిలో గణపతి, వాయవ్యంలో అంబిక ఉంచాలి. ఇది శివపంచాయతనం.

అలాగే విష్ణువును మధ్యలో ఉంచి ఈశాన్యంలో శివునీ, ఆగ్నేయంలో గణపతినీ, నైఋతిలో రవినీ, వాయవ్యంలో అంబికను ఆరాధిస్తే విష్ణు పంచాయతనం.

మధ్యలో రవి, ఈశాన్యంలో విష్ణువు, ఆగ్నేయంలో గణపతి, నైఋతిలో శివుడు, వాయవ్యంలో అంబిక ఉంటే సూర్య పంచాయతనం.

మధ్యలో అంబిక, ఈశాన్యంలో విష్ణువు, ఆగ్నేయంలో శివుడు, నైఋతిలో గణపతి, వాయవ్యంలో రవి ఉంటే శక్తి పంచాయతనం.

మధ్య గణపతి, ఈశాన్యం విష్ణువు, ఆగ్నేయం శివుడు, నైఋతి రవి, వాయవ్యం అంబిక ఉంటే గణపతి పంచాయతనం.

ఇందులో ఎవరి అభీష్టం ప్రకారం వారి ఇష్టదేవతా పంచాయతానాన్ని అమర్చుకోవచ్చు. తన ఇష్టదేవతయే మిగిలిన నలుగురు దేవతలు అనే సత్యం స్ఫురించడం కోసమే, కేంద్రంలో ఇష్టదైవాన్ని, చుట్టూ ఇతరులను ఏర్పాటు చేయడం.

వాటి లింగాలు (ప్రతీకలు) వివిధ నదులనుంచి గ్రహిస్తారు. నర్మద నుండి బాణలింగము (శివరూపం), గండకీ (నేపాల్) నది నుండి సాలగ్రామం (విష్ణువు), సౌరాష్ట్రకు చెందిన స్ఫటికం (సూర్యబింబం), శోణానది (బీహార్ – ఉత్తరప్రదేశ్)కి చెందిన ఎఱ్ఱశిల (గణపతి), సువర్ణముఖీ నదికి చెందిన ధాతుశిల (అంబిక)...

వీటిని ఈ అర్చనలో వినియోగిస్తారు. వీటియందు స్వతస్సిద్ధంగా ఆయా దేవతా తేజాలు ఉంటాయి. అందుకే నిత్యం పూజ జరగాలి. ఎంతో మహిమాన్వితమైన స్వ రూపాలివి. ఈ పంచాయతన పూజనే 'దేవతార్చన' అంటారు. ఉపనయన సంస్కార మైన వారందరూ సంధ్యావందనంతో పాటు, తప్పనిసరిగా చేయవలసిన నిత్య కర్మ ఇది. అయితే ఈ సంస్కారం లేకపోయినా హిందువులు ఆ దేవతల విగ్రహాలను, పైన చెప్పిన పద్ధతుల్లో అమర్చుకుని, మంచిగా పూజించవచ్చు. విగ్రహాలను బంగారు, వెండి, ఇత్తడి, పంచలోహాలు... ఇలాంటి శ్రేష్ఠలోహాలతో చేయించాలి.

కొన్ని శాస్త్రాల ప్రకారం ఒకే పరమేశ్వరుని అయిదు రూపాలతో పూజిస్తున్నాం కనుక పృథ్విలో ఉండే పరమేశ్వర తేజమే గణపతి, జలంలోని పరమేశ్వర రూపం విష్ణువు, అలాగే అగ్నిలోనిది సూర్యుడు, వాయువులోనిది శివుడు, ఆకాశంలోనిది శక్తి (ఈ వరుసలో కొద్దిపాటి భిన్న అభిప్రాయాలు ఉండవచ్చు.)

**దీని భావం:** ఈశ్వర చైతన్యం పంచభూతాలలో ఉన్నది. పంచభూతముల మయమైన విశ్వమే పంచాయతనం. విశ్వమంతా పరబ్రహ్మమయం, మనలోని వ్యష్టి విశ్వం (పిండాండం), విశ్వంలోని సమిష్టి (బ్రహ్మాండం) రెండూ పంచాయతనమే. ఈ పంచతత్త్వాలు ఒకే పరమేశ్వరుని ఐదు రూపాలు... అని చెప్పడమే ఇందులోని అంతరార్థం.



ప్ర: **పంచాయతనంలో స్కందుని చెప్పలేదేమి? సుబ్రహ్మణ్యుని ఎలా కలుపుకోవడం?**

**జ:** దేవతార్చనతో పాటు, పూర్వపురోజుల్లో నిత్యాగ్నిహోత్రం చేసేవారు. ఆ యాగాగ్నియే సుబ్రహ్మణ్య స్వరూపం కనుక విడిగా పంచాయతనంలో చేర్చలేదు. అయితే ఇప్పుడు నిత్యాగ్ని హోత్రాలు కరువయ్యాయి కనుక, సుబ్రహ్మణ్య ప్రతిమను పంచాయతనంలో కలుపుకోవచ్చు. ఆ ప్రతిమను శివసన్నిధిలోగానీ, శక్తి సమీపంలో గానీ, లేదా గణపతి ప్రక్కన ఉంచిగానీ పూజించవచ్చు. కంచి మహాస్వామి శ్రీశ్రీశ్రీ చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ స్వామివారి మాటల్లో పూజకు పూర్వం వెలిగించే దీపం అగ్నిహోత్రానికీ, సుబ్రహ్మణ్యునికీ ప్రతీకయే.

ప్ర: **శంఖంలోని జలాన్ని తీర్థంగా పుచ్చుకోవచ్చా? మరి 'శంఖంలో పోస్తేనే తీర్థం' అంటారు కదా! అసలు తీర్థం పుచ్చుకునేటప్పుడు నియమాలేమిటి?**

**జ:** శంఖంలో పూజకు పూర్వం నీరు నింపి, శంఖదేవతను పూజించాలి. తరువాత పూజ పూర్తయ్యాక ఆ శంఖాన్ని దేవతచుట్టూ తిప్పి శంఖజలాన్ని తనపై, తన పరి

వారంపై జల్లుకోవాలి. శంఖోదకాన్ని తాగరాదు. శంఖంలో పోసిన జలం తీర్థం, అది చల్లుకునే తీర్థమే. దానిని స్థాపించడం చేత ఇతర జలాలకు శుద్ధి వస్తుంది. భగవంతుని అభిషేకించిన జలాన్ని తీర్థమంటారు. ఒక్క బిందువు కూడా నేలపై పడకుండా తీర్థం పుచ్చుకోవాలి. వస్త్రాన్ని నాలుగు మడతలుగా ఎడమచేతిలో ఉంచుకొని, దానిపై కుడిచేయి పెట్టి, భూమిపై పడకుండా తీర్థాన్ని స్వీకరించాలి. తీర్థం తాగాక చేయి కడుక్కోకూడదు. తీర్థసేవనం వెంటనే నీరు తాగకూడదు. తీర్థం పుచ్చుకోకుండానే నెత్తిన జల్లుకోకూడదు.

**శంఖపాదోదకంతీర్థం పీత్వా న క్షాళయేత్కరః।**
**క్షాళయేత్ యదిమోహేన స మహాపాతకీ భవేత్॥**
**సాలగ్రామశిలాతీర్థం పిబేత్ యదికరేణతు।**
**అజ్ఞానాద్ఐందవం ప్రోక్తం జ్ఞానాతబ్దం సమాచరేత్॥**
**అనంతరం పిబేత్ తోయం రౌరవం నరకం వ్రజేత్॥**

– ఈ శాస్త్రవాక్యాలే ప్రమాణాలు.

**ప్ర. 'ఆబ్రహ్మస్తంభ పర్యంతం' అని అంటారు కదా! దీని అర్థమేమిటి? అదేవిధంగా 'పిపీలికాది బ్రహ్మపర్యంతం' అనే మాట కూడా విన్నాము. దీని అర్థం స్పష్టమే. 'చీమ మొదలుకొని బ్రహ్మ వరకు' అని తెలుస్తోంది. 'బ్రహ్మ మొదలు స్తంభము వరకు' అని ఎందుకన్నారో తెలియడం లేదు.**

**జ.** ఆ పదం 'ఆబ్రహ్మస్తంబ పర్యన్తం' ఇందులో 'స్తంభము' కాదు. 'స్తంబము'– సరియైన పదం. ఈ పదానికి "తొడిమ, వరిలోనున్న గంట, చిన్న కాడ" అని అర్థం. అతి చిన్న పరిమాణాన్ని చెప్పడానికి గాను ఈ పదాన్ని ఉపయోగిస్తారు. "బ్రహ్మదేవుని మొదలుకొని, ఒక చిన్న తొడిమ (కాడ) వరకు" అని అర్థం చెప్పుకోవచ్చు. అతి పెద్దదాని మొదలుకొని అతి చిన్న పదార్థం వరకు బ్రహ్మాండమంతా... అనే భావానికై దీనిని ఉపయోగిస్తారు.

**ప్ర. శివుని గురించి చెప్పేటప్పుడు 'అతడే సర్వం' అని చెబుతారు. అలాగే విష్ణువు గురించి ప్రస్తావనలో 'విష్ణువే సర్వం' అంటారు. ఈ విధంగానే అమ్మవారు, కృష్ణుడు, రాముడు, హనుమంతుడు... ఇలా ఎవరి గురించిన మాటల్లో వారినే గొప్పగా అంటారు. సంతోషమే... కానీ ఇందులో ఎవరిని కొలుచుకోవాలో తేల్చుకోవడం కష్టం. ఇంతమందిని చెప్పడం వల్ల ఈ 'అయోమయం' ఏర్పడుతుంది. ఏదో ఒక్కర్నే చెబితే సరిపోతుంది కదా!**

**జ.** ఒకర్నే చెప్పినవారూ ఉన్నారు కదా! ఏ దేవతాభక్తుడు ఆ దేవతను ఎక్కువగా చెప్ప వచ్చు. ఉపాసనాపరంగా, ఇష్టదేవతానిష్ఠతో ఒక్కదేవుని ప్రధానంగా ఆరాధించవచ్చు. ఇందులో అయోమయానికి ఆస్కారమే లేదు. ఒక స్వీటు దుకాణానికి వెళ్ళినప్పుడు అనేక రకాల తీపి పదార్థాలుంటాయి. 'తీపి' అనే ప్రత్యేక పదార్థం ఉండదు. అవన్నీ తీపివస్తువులే. తీపి కోసం ఏది తిన్నా ఒకటే. కాని ఏ పదార్థపు ప్రత్యేకత దానిదే. మాధుర్యం కోసం ఏది కొని తిన్నా సరిపోతుంది. అంతేగానీ, "ఇన్ని పదార్థాలు ఇక్కడ పెట్టడం ఎందుకు? అయోమయం కలిగించదా? ఏ ఒక్కటో పెడితే సరి పోతుంది కదా?" అనరాదు కదా!

రకానికొకటి తినవచ్చు. రోజుకోరకం తినవచ్చు. లేదా ఏదో ఒకరకం కొని తెచ్చు కోవచ్చు. ఎన్నో రకాలు కలిగి ఉండడం వల్ల కలిగే ప్రయోజనం అది. విభిన్న అభి రుచుల కోసం విభిన్న పదార్థాలు. సామాన్యం: ఏకంగా ఉన్న మధురమే.

అదే విధంగా మన ధర్మంలో ఒకే బ్రహ్మమును (భగవంతుని) భిన్న నామ రూపాలతో ఉపాసిస్తున్నాం. ఎవరి జీవలక్షణాన్ని అనుసరించి వారికో ఇష్టదైవం ఉంటుంది. దానిని ప్రధానంగా ఆరాధించేవారు కొందరుంటారు. అలాగే మిగిలిన దేవతల్ని వారి వారి పర్వదినాలలో ప్రత్యేకించి ఆరాధించుకోవచ్చు. ఈ తీరు ఇతర ధర్మాలలో కనబడదు. మన హిందూధర్మం ప్రత్యేకత అది. దైవానుభూతి వివిధ విధాలుగా దర్శించిన విజ్ఞానం హైందవధర్మంలోనే ఉంది.



ఎవరు ఏ ఇష్టదేవతానిష్ఠ కలిగి ఉంటారో, వారికి దానియందు సంపూర్ణ ప్రీతి కలిగించడం కోసం, ఆ దేవతాప్రస్తావనలో దానినే 'సర్వం'గా చెబుతారు. ఈ ధోరణితోనే వ్యాసుడు వివిధ పురాణాలు రచించాడు. వారి ఇష్టదేవతలకి సంబంధిం చిన పురాణం వారికి ప్రమాణం. ఇలాగే ఇతరులకు వారి దైవాల ఎడల నిష్ఠ ఉం టుందని తెలుసుకొని గౌరవించాలి. 'ఏదో ఒక్కర్నే చెబి'తే నిజంగా సరిపుచ్చుకో గలరా? ఇతరుల గురించి చెప్పరెందుకు? అని కూడా ప్రశ్నించవచ్చు.

చక్కని దేవతా విజ్ఞానం మన ధర్మంలో మాత్రమే ఉంది. ఈ విషయంలో డేవిడ్ ఫ్రాలే చెప్పిన ఒక వివరణ ఇలా ఉంది. "సామాన్యుల దృష్టికి మంచు అంతా ఒకేలా కనబడుతుంది. కానీ ధ్రువప్రాంతాల వద్ద నివసించే ఎస్కిమోలు మాత్రమే మంచులో 48రకాలు ఉన్నాయని తెలుసుకున్నారు. వివరించగలరు. వారికి మంచుతో ఉన్న నిత్య సాన్నిహిత్యం, ప్రగాఢానుబంధం వల్లనే ఆ వైవిధ్యజ్ఞానం ఏర్పడింది.

అలాగే భగవంతునితో నిజమైన సాన్నిహిత్యం, సంపూర్ణజ్ఞానం ఉన్న కారణంగానే హిందూధర్మంలో ఇన్ని రకాల దేవతా తత్త్వాలని దర్శించగలిగారు. కనుక సంపూర్ణ దైవ విజ్ఞానం కలిగినవారు హిందువులే".

పాశ్చాత్యదేశంలో జన్మించి, హిందూమతంపై నిశితపరిశోధన చేసిన ఆ విదేశీ మేధావి చెప్పిన ఈ విషయం మనకళ్ళు తెరిపించాలి. ఎవరి గురించి విన్నప్పుడు వారితో తాదాత్మ్యం చెందడం కూడా మంచి పద్ధతే. ఏ పరతత్త్వం ఏకమై సర్వోన్నతమై ఉన్నదో దానినే ఈ రూపంలో దర్శిస్తున్నాం... అనుకుంటే సరి.

కొద్దిగా ఆలోచిస్తే చాలు. అయోమయం అవలీలగా తొలగిపోతుంది. 'ఏదో ఒకటి' అని తేల్చడం మహాకష్టం. ఏకాగ్రత కుదరక పోతే– "అన్నీ గొప్పవే కనుక, ఏదో ఒకదానిని" ఆరాధించవచ్చు. లేదా– అందరూ ఏకేశ్వరుని బహురూపాలే అని దర్శించవచ్చు. మీరు అడిగిన ప్రశ్ననే, వివిధ ప్రవచనాల సందర్భాలలో కొందరు అడుగుతున్న కారణంగా ఇంత వివరణ ఇవ్వవలసి వచ్చింది.

ఏ దేవత గురించి చెప్పినా– అన్ని రకాల సంప్రదాయాలు ఒకే హిందూ వైదిక సనాతన భారతీయ ధర్మవృక్షానికి చెందిన శాఖలే అని మరచిపోరాదు. ప్రతి సంప్ర దాయంలోనూ సామాన్యంగా ఉన్న అంశాలు ఒకటే. ఓంకారం, వేద ప్రమాణం, నుదుట బొట్టు, ఆచారం, హోమాలు, గంటానాదం, ధూపదీప నైవేద్యాలు, అర్చన... ఇలాంటి విషయాలు అన్ని సంప్రదాయాల్లోనూ ఒకేవిధంగా ఉంటాయి... కొద్ది భేదాలతో. అందుకే హిందూధర్మానికి చెందిన అన్ని సంప్రదాయాలవారు సౌమ నస్యంగా మసలి, నిన్నమొన్నటి తరాలవారు లేవనెత్తిన భేద, వైరుధ్య వాదాలను వదలి ఎవరి సంప్రదాయాల్ని వారు రక్షిస్తూ, ఇతరుల్ని కూడా గౌరవిస్తూ ఆదరిస్తూ మెలగాలి. ఇందులో సంప్రదాయాల్ని మార్పిడులు చేయడం మానుకోవాలి. మనం దరం ప్రతి సిద్ధాంతపు గురువులకీ మనవి చేసుకోవలసిన వేడుకోలు ఇదే. ప్రస్తుత ఆవశ్యక విషయం కనుక ఇంత విస్తారంగా చెప్పవలసి వచ్చింది.

**ప్ర. గోవునకు మేతపెట్టేటప్పుడు ఏదైనా మంత్రం చదువుతూ, అందించాలా? అలాంటి మంత్రాలున్నాయా? గోగ్రాసంలో ఏమేమి పెట్టవచ్చు?**

**జ.** గోవులకు ఆరోగ్యపరంగా ఏది హితమో దానిని పెట్టవచ్చు. మిగిలిన అన్నాలు, ఉచ్ఛిష్టాలు, బహిష్టు స్పర్శించినవి గోవునకు పెట్టరాదు. బహిష్టువారి గాలి కూడా సోకరాదు. గోవుకు గ్రాసం పెట్టేటప్పుడు చదవవలసిన మంత్రం–

**సౌరభేయా స్సర్వహితాః, సర్వపాపప్రణాశనాః।**
**ప్రతిగృహ్ణంతు మే గ్రాసం గావస్త్రైలోక్యమాతరః॥**

–ఈ మంత్రం మార్కండేయ మహాముని చెప్పినది. దీనితో పాటు ఇష్టదేవతా మంత్రాన్ని మనస్సులో జపిస్తూ మేత పెట్టడం మంచిది. తన భోజనానికి ముందు గోవునకు గడ్డిమొదలైనవి ఇచ్చి, భుజించువాడు సద్గతిని పొందుతాడని శాస్త్రాలు చెబుతున్నాయి.

ప్ర: **ఉత్తరం వైపు తలపెట్టి పడుకోకూడదంటారు. ఇక మిగిలిన దిక్కులు ఫరవాలేదా? నిద్రకు కూడా నియమాలున్నాయా?**

జ. మన స్మృతులలో నిద్రాసమయంలో, మేల్కొను వేళలో కూడా నియమాలు చెప్పారు. ఎప్పుడూ ఉత్తరం వైపు తలపెట్టి పడుకోకూడదు. స్వగృహంలో తూర్పువైపు, మామ గారి గృహంలో దక్షిణం వైపు, ప్రవాసంలో పడమరవైపు తలపెట్టుకోవాలి... అని శాస్త్రం చెప్తున్న సదాచారం.

తడి వస్త్రంతో నిద్రించరాదు. కాళ్ళు కడుకుంటే, పొడిగా తుడుచుకొని నిద్రపోవాలి. తడి పాదాలతో నిద్రించరాదు. మోదుగ, మఱ్ఱి, నేరేడు, జువ్వి, రావి, మేడి – ఈ వృక్షాల కఱ్ఱతో చేసిన మంచంపై నిద్రించరాదు. జలమధ్యంలో, శత్రుమధ్యంలో, ధాన్యంలో నిద్రించరాదు. గోవులు, దేవతామూర్తులు, గురువులు వీరికి ఉన్నతంగా ఉన్న స్థలంలో నిద్రించరాదు. ఏదైనా పదార్థాన్ని నోటిలో ఉంచుకొని నిద్రించరాదు.



ప్ర: **పూజలో ఘంటానాదం ఎందుకు చేస్తారు? దేవత ను నిద్రమేల్కొలపడానికా? దైవం నిద్రపోదు కదా? ఆలయంలో గంట ఎందుకు? కొన్ని ఆలయాల్లో భక్తులు కొట్టేం దుకు వీలుగా గంట ఉండదు. ఏ కారణం చేత? పూజలో ఘంట ఏఏ సందర్భాల్లో కొట్టాలి.**

జ: దేవతను నిద్రమేల్కొలిపేందుకు గంట కొట్టాలని ఏ శాస్త్రమూ చెప్పలేదు. పూజా రంభంలో, అభిషేక సమయంలో, హారతి సమయంలో ఘంట మ్రోగిస్తారు. నాదం, వెలుగు– ఈ రెండు దేవతాశక్తిని జాగృతం చేస్తాయి. శంఖం, గంట నాదాన్ని ఆవిష్కరిస్తే, దీపం వెలుగును కలిగిస్తుంది. అందుకే పూజారంభంలో గంట మ్రోగిం చడం, దీపం వెలిగించడం ప్రధానం.

**ఆగమార్థంతు దేవానాం**
**గమనార్థంతు రక్షసాం।**
**తత్ర ఘంటారవం కుర్యాత్**

**దేవతాహ్వాన లాంఛనమ్။**

"దేవతలు రావడానికి, రాక్షసులు తొలగడానికి దేవతలను ఆహ్వానించే లాంఛనంగా ఘంటను ధ్వనింపజేయాలి" అని శాస్త్రవచనం. ఘంటానాదంలో ప్రణవం ధ్వనిస్తుంది. పరిసరాలలో పవిత్రత ప్రసరిస్తుంది. బాధాకరశక్తులు వైదొలగుతాయి.

ఆలయాల్లో ఘంట భక్తులు మ్రోగించడానికి కాదు. కొన్ని ప్రత్యేక సేవల్లో మాత్రమే ఘంటానాదాలను వినిపిస్తారు. ఏ వేళలోనైనా ఘంటను మ్రోగించరాదు. అవి ఆలయ నియమాలు.

అందుకే భక్తులు కొట్టేందుకు వీలుగా ఘంట ఉండదు. ప్రాచీన ఆలయాల్లో అలాంటి ఏర్పాటే ఉంటుంది.

ప్ర. **ఈ మధ్య ఒక ఆటోలో వెళుతూ "లలితా సహస్ర పారాయణకి గుడికి వెళ్లాలి. తొందరగా పోనీయి. నీకూ పుణ్యమొస్తుంది"– అన్నాను. కానీ అతడు మతం మార్చుకున్న డ్రైవర్ కావడంతో, "మీ పారాయణల్లో చదివేవి మీకే అర్థం కావు. మా ప్రార్థనలు మా భాషలోనే ఉంటాయి. అర్థంకాని పారాయణ వల్ల మీకేం పుణ్య మొస్తుంది? దానికోసం తొందరగా పోనిస్తే నాకేం పుణ్యమొస్తుంది?" అన్నాడు. నేను కాస్త ఆలోచనలో పడ్డాను. అర్థంకాని సంస్కృత శ్లోకాల పఠనం కంటె, అర్థ మయ్యే భాషలో ప్రార్థనలే సమంజసమంటారా?**



**జ.** లలితా సహస్రనామాల వంటివి మంత్రాలు. అవి మనకి అర్థం కావడం కాదు. ఆ శబ్దంలో శక్తి ఉంది. దాని ఉచ్చారణవల్ల మంత్రవాచ్యులైన దేవతలు స్పందిస్తారు. అసలు దేవత అంటేనే 'మంత్ర చైతన్యం'. ఏ మంత్రంలో, ఏ నామంలో ఏ దివ్య చైతన్యం ఉంటుందో దానిని ఆ మంత్రాధిదేవతగా పేర్కొంటారు. ఆ చైతన్యం యొక్క ప్రకటన స్వరూపమే (Manifested Form) దేవతాకారం.

ఈ విజ్ఞానం మన ధర్మంలోనే ఉంది. మంత్రం మనకి అర్థం కానక్కర్లేదు. మన అర్థానికి అందేది కాదు దేవత. అయితే అర్థం తెలిసి పఠిస్తే మంచిదే. అది మరింత బలవత్తరమవుతుంది. కానీ అనువదించి పఠించితే అంతటి శక్తి రాదు. కానీ అనువదించి చదివే తేట తెలుగు పద్యాలు, వచనాలు, కీర్తనలు మనకు కోకొల్లలు. వాటికి కూడా ప్రభావం ఉంది. వాటిని అనుకరించే ప్రయత్నాలు చేస్తూ కృత్రిమత్వం పులుముకుంటున్నారు ఈ మార్పిడికుట్రదార్లు.

ఇక్కడ ఒక విషయం గమనించాలి– ఇతర మతాలలోకి మారడం వల్ల పూర్వమత

దూషణ జరుగుతోందన్నది దీనిబట్టి తేలుతున్న అంశం. అసలు ఆ మతంలోనే పుట్టిపెరిగేవాడు అన్యమతాన్ని దూషించడం. మార్పిడితో పాటు మాతృధర్మద్వేషం కూడా పుడుతోంది. ఇది క్రమంగా పరస్పర దూషణలకు, ఫలితంగా హింసకు, చీలికలకు, దేశభద్రతకు ప్రమాదకరం. ఇది దేశశాంతిని కోరుకునే ప్రతి సోదర మతస్థుడు తెలుసుకొని, అన్ని మతాలవారు తమ మాతృమతాలతో పాటు అన్యమతాల వారిని గౌరవించడం అలవరుచుకోవాలి.

ఏ మత ప్రత్యేకత దానిదే. సంస్కృతభాషలోని పారాయణ ప్రార్థనల వలననే అన్ని భాషల వారి సమైక్య సంస్కృతిగా భారతీయ ధార్మికత వృద్ధి చెందింది. మంత్రభాష అయిన సంస్కృత శబ్దాలలోని స్పందనశక్తి అమోఘమైనది. అయినప్పటికీ ప్రతి దేశభాషల్లోనూ ఎన్నో దివ్యగ్రంథాలు ఉన్నాయి.

పుణ్యం తేగలిగే మంత్రశక్తి కలిగిన పారాయణలు మన మతంలోనే ఉన్నాయని సగర్వంగా చెప్పి ఉండవలసింది.

**ప్ర. గణపతి నామాల్లో 'ధూమకేతువు' అని ఉందికదా! ఈ పదానికి అర్థం 'తోకచుక్క' అంటారు. అశుభానికి సూచన అయిన ఈ శబ్దం దేవుని పేరుగా ఎందుకుంది?**



**జ.** ధూమకేతు శబ్దం తోకచుక్కకే కాదు. అగ్నికి కూడా ఉంది. పొగనే జెండావలె కలిగిన అగ్నిహోత్రుడు– ధూమకేతువు. ఇది యజ్ఞాగ్ని స్వరూపంగా, సర్వదేవగణాధీశుడైన గణపతిని సంభావించిన వైదిక సంస్కృతికి చెందినమాట.

అంతేకాకుండా– విఘ్నాలకు, అసురశక్తులకు గణపతి తోకచుక్కవంటి వాడు– అనగా వారిని దెబ్బతీయువాడు– దుష్టశిక్షకుడు అని కూడా భావించవచ్చు.

**ప్ర. 'హిందువులకు ఇంతమంది దేవతలున్నారు. మిగిలిన వారికి ఒక్కరే– కనుక వారి ఆరాధనలు సులభం' అనే విమర్శ ఉంది. దీనికి ఏ సమాధానం చెప్పాలి?**

**జ:** ఎప్పుడైనా దేని ప్రత్యేకత దానిదే– అని తెలుసుకోవాలి. మిగిలిన వారితో పోల్చి చూసుకోరాదు. ఎవరి తల్లి వారిదే. మరొకరి తల్లితో పోల్చి, మన తల్లి సుగుణాన్ని లోపంగా దర్శించడం ఎంతటి దౌర్భాగ్యమో, తన మతాన్ని శంకించడం అంతే దోషం. 'హిందువులకు ఎక్కువ దేవతలున్నారు'– అనే మాట సరియైనది కాదు. "ఎక్కువ దేవతలు ఈ విశ్వంలో ఉన్నారు. వారిని హిందువులు తెలుసుకున్నారు" అనడం సమంజసం. ఒక చెట్టుకి ఎన్నో కొమ్మలు, వాటికి ఎన్నో రెమ్మలు, పువ్వులు, పళ్లు... ఇలా అనేకం ఉన్నాయి. ఏకంగా ఉన్న చెట్టులోనే అనేకమైన భాగాలున్నాయి.

అన్నీ ప్రయోజనకరాలే. దేని లక్షణం దానిదే. అలాగే దేవతలందరూ ఎవరికి వారు ప్రత్యేకంగా ఉన్నా, అందరి ప్రయోజనం మనకి ఉంది. అదే సమయంలో ఒకే చెట్టుశక్తే అన్నింటిలో ఉంది– అనే స్ఫృహ ఉన్నట్లే... ఏకమైన పరమేశ్వరుడే వివిధ రూపాలలో ఉన్నాడు– అని స్పష్టంగా హిందూమతం చెప్పింది.

**'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి'** లాంటి వేదవాక్యాలను స్వామి వివేకానంద వంటివారు పలుమార్లు ఉటంకించి చెప్పారు కదా! ఎందరు సమాధానాలిచ్చినా, అవి అందుకోకుండా, ప్రశ్నించేవారుంటూనే ఉంటారు. వారికి చెబుతూనే ఉండాలి. అర్థంలేని విధానం ఏ ధర్మంలోనూ ఉండదు. అర్థం చేసుకునే వివేకం మనకిఉండాలి.

ప్ర. **ఇంట్లో శుభకార్యాలు జరిగిన తరువాత ఆరు నెలల వరకు తద్దినం పెట్టరాదు అంటారు. ఇది ఎంతవరకు సమంజసం?**

**జ.** 'పెట్టరాదు' అనడానికి ఏ శాస్త్రంలోనూ ప్రమాణం లేదు. పితృకర్మలు చేసితీరాలి. పితృ దేవతల కృపవలన అంతా శుభమే జరుగుతుంది కనుక, తద్దినం పెట్టి తీర వలసిందే. మానరాదు. కానీ శుభకార్యాలు జరిగిన చోట పెట్టరాదు.

ప్ర. **'శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతర్భుజం' అనే మాట గణపతికే అన్వయిస్తుందని ఎలా చెప్పగలం? దానికేమైనా శాస్త్రప్రమాణం ఉందా?**



**జ.** ఇది స్పష్టంగా గణేశునికే అన్వయిస్తుంది. అథర్వవేదీయమైన శ్రీగణేశపూర్వ తాపిన్యు పనిషత్‌లోని మంత్రం ఆధారంగా దీనిని చెప్పారు.

**'అథాతో బ్రహ్మోపనిషదం వ్యాఖ్యాస్యామః...'** అని ప్రారంభమైన మంత్రం తరువాత, రెండో భాగంలో **"సోఽ పశ్య దాత్మనాఽ త్మానం గజరూపధరందేవం శశివర్ణం చతుర్భుజం... తదేతదక్షరం పరంబ్రహ్మ"** అని స్పష్టంగా మంత్రం ఉంది. ఆ మంత్ర శబ్దం ద్వారా పై శ్లోకం నిర్మితమయింది.

ప్ర. **ఆలయంలో కూర్చొని తీర్థం సేవించడం సాధ్యంకాదు కదా! నిలబడి తాగవచ్చా?**

**జ.** ఆలయంలో నిలబడి పుచ్చుకుంటే దోషం రాదు. ఇంట్లో మాత్రం నిలబడి తీసుకో రాదు. కూర్చొని భక్తిగా సేవించాలి.

ప్ర. **కొత్త తులసి మొక్కను పాతడానికిగానీ, మార్చి వేయడానికి గానీ మంచి రోజులు చూడాలా?**

**జ.** శాస్త్రరీత్యా ఆషాఢ శుద్ధ ఏకాదశి నుండి, కార్తిక శుద్ధ ఏకాదశి వరకు చాతుర్మా స్యాలంటారు. ఆ రోజుల్లో కొత్తగా తులసి మొక్కను మార్చి పాతడం కూడదు.

ఏకాదశి, ద్వాదశి, పూర్ణిమ, అమావాస్య, శుక్రవారాలలో తులసిని కోయరాదు.

**ప్ర. 'చండీ ప్రదక్షిణం' అంటే ఏమిటి? ఎలా చేయాలి?**

**జ.** 'చండేశ్వరుడు' అని శివుని గణాలలో ఒక ముఖ్యుడు. తన నిర్మాల్యంపై అధికారాన్ని ఈయనకు ప్రసాదించాడు శివుడు. అందుకే చండేశ్వర ప్రతిష్ఠ ఉన్న శివాలయంలోని ప్రసాదాన్ని, నిర్మాల్యాన్ని గ్రహించరాదంటారు. అయితే కొన్ని శైవాగమాల ప్రకారం, మహా నైవేద్యంలో 'చండభాగం' అని విభజిస్తారు. ఆ చోట్ల ఇచ్చే ప్రసాదాన్ని స్వీకరించ వచ్చు. స్ఫటిక, బాణ, స్వయంభూ లింగాలున్న గుడిలో చండేశ్వరునికి నిర్మాల్యాధి కారం లేదు కనుక– అక్కడ నిర్మాల్య ప్రసాద స్వీకారం చేయవచ్చు. అయితే చండేశ్వ రుడున్న ఆలయంలో ప్రదక్షిణ చేసే విధానాన్ని 'చండీప్రదక్షిణం' అంటారు.

**చండస్థానేతు సంకల్ప్య వృషభాదౌప్రదక్షిణం।**
**వృషం చండం వృషం చైవ, సోమసూత్రం పునర్వృషం॥**
**చండం చ సోమసూత్రం చ, పునశ్చండం పునర్వృషం।**
**నవప్రదక్షిణోపేతం, యః కుర్యాచ్చ ప్రదక్షిణం॥**
**త్రింశత్సహస్ర సంఖ్యాక ప్రదక్షిణ ఫలం లభేత్॥**



సాధారణంగా శివాభిషేక తీర్థం వెలుపలికి వచ్చే సోమసూత్రం వద్ద చండేశ్వర ప్రతిష్ఠ చేస్తారు.

**1.** ఆ సోమసూత్రం నుండి ప్రారంభించి ధ్వజ స్తంభం వద్దకు, ధ్వజం నుండి తిరిగి ప్రదక్షిణంగా సోమసూత్రం దగ్గరకు, **2.** అటునుంచి వెనక్కి తిరిగి ధ్వజం దగ్గరకు, **3.** ధ్వజం నుండి ముందుకు సోమసూత్రం దగ్గరకు, **4.** తిరిగి వెనుకకు ధ్వజం వద్దకు, **5.** ధ్వజస్తంభం నుండి ముందుకు సోమసూత్రం దగ్గరకు, **6.** తిరిగి సోమసూత్రం నుండి వెనుకకు ధ్వజం వద్దకు, **7.** ధ్వజస్తంభం నుండి ముందుకు సోమసూత్రం వద్దకు, **8.** సోమసూత్రం నుండి ధ్వజం దగ్గరకు, **9.** అటునుంచి శివాలయంలోకి ధ్వజస్తంభపు ఎడమవైపునుండి వెళ్లాలి. దీనిని చండప్రదక్షిణం అంటారు. ఇది నవప్రదక్షిణాలతో కూడిన ప్రదక్షిణం. ఇది ఒక్కటి చేస్తే శివునకు ముప్ఫైవేల ప్రదక్షిణలు చేసినంత పుణ్యం. రెండవ ప్రదక్షిణంలో ధ్వజాన్ని తాకరాదు. రెండు సోమసూత్రాలుంటే ఈ ప్రదక్షిణ పనికిరాదంటారు.

**ప్ర. మరణం తర్వాత ఏడాదిలోపున గయాశ్రాద్ధం చేయవచ్చా?**

**జ.** మరణించిన ఏడాది లోపల గయాశ్రాద్ధం కానీ, తీర్థశ్రాద్ధంకానీ చేయరాదు. నిజంగా

గయాశ్రాద్ధం చేయాలనే శ్రద్ధ ఉంటే సంవత్సరం తరువాత చేయాలి. దీనికి ప్రమాణం:

**తీర్థశ్రాద్ధం, గయాశ్రాద్ధం... చ పైతృకమ్।**
**అబ్దమధ్యే న కుర్వీత గ్రహణే న యుగాదిషు॥**
**యదాపుత్రేణవైకార్యం గయాశ్రాద్ధ ఖగేశ్వర।**
**తదా సంవత్సరాదూర్ధ్వం కర్తవ్యం పితృభక్తితః॥** – గరుడపురాణం

'అబ్దమధ్యేన కుర్వీత' (సంవత్సర మధ్యంలో చేయరాదు) 'సంవత్సరాదూర్ధ్వం కర్తవ్యం' (సంవత్సరం దాటిన తరువాత చేయాలి.) ఇవే వాక్యాలు మరికొన్ని స్మృతులలో కూడా ఉన్నాయి.

ప్ర: **ఎవరైనా పోయినపుడు వారి ఆత్మశాంతి కోసం లలితా సహస్రం చదవవచ్చా?**

జ: మరణించే ముందు ఘడియల్లో ఏ సహస్రమైనా చదవవచ్చు. అంత్యకాలంలో అమ్మవారి నామమో, విష్ణునామమో, శివనామమో, ఏదైనా స్తోత్రమో, భగవద్గీతో చదవవచ్చు, వినవచ్చు. అది సద్గతికి హేతువౌతుంది.

కానీ మరణించిన తరువాత కూడదు. కేవల భగవన్నామం మనస్సులో చేసుకోవచ్చు. కానీ సహస్రనామాలు, మంత్రాలు, స్తోత్రాలు, పారాయణాలు చేయరాదు. అప్పుడు చేయవలసిన 'అంత్యేష్టి' క్రియ శాస్త్రోక్తంగా జరపాలి. ఇలాంటి శాస్త్ర విజ్ఞానం లేని ధర్మాలలోని వారు అన్నిటికీ ఒకటే గ్రంథాన్ని చదవక తప్పదు. కానీ హిందూధర్మంలో ఆ పరిస్థితి లేదు. ఆ సందర్భంలో వేరే క్రియ మనకు ఉన్నది. దానికి సంబంధించిన మంత్రకర్మను జరపాలి.

ప్ర: **ఈ మధ్య ఒక సభలో గీతాశ్లోకాలు చదివితే, ఒక రాజకీయనాయకుడు "శుభమా అని అభినందన సభ చేస్తుంటే, సంతాప సభలాగ గీతాశ్లోకాలేమిటి?" అన్నాడు. ఆశ్చర్యపోయాను. అలాగే ఈ మధ్య ఇంట్లో భగవద్గీత వింటుంటే ఒకాయన వచ్చి, "ఎవరైనా పోయినప్పుడు మాత్రమే కదా గీత వినాలి. మీరు శుభంగా ఉన్నప్పుడు కూడా ఈ కేసెట్ వింటున్నారేమిటి?" అన్నాడు. ఇంకా విడ్డూరం అనిపించింది. ఇలాంటి మాటలకి ఏదైనా శాస్త్రప్రమాణాలున్నాయా? లేక అపోహలేనా?**

జ. ఇది వారి మూర్ఖత్వమే తప్ప, శాస్త్రవాక్యం కాదు. సాధారణంగా సంతాపసూచకంగా భగవద్గీత రికార్డు వేయడం రేడియోలో, టీ.వి.ల్లో అలవాటు చేశారు. అలాగే శ్మశానాలని కూడా అలంకరించి, శవ వాహనాల్లో కూడా ఈ గీతపాట పెట్టడం చేస్తున్నారు.

ఇది ఒక పొరపాటైన అలవాటు. అలవాటు వల్ల జరిగిన పొరపాటు. దీనితో అజ్ఞానం పెరిగి ఇలాంటి పనికిమాలిన అపోహలు ఏర్పడ్డాయి.

పండుగ రోజుల్లో, సరదా వేళల్లో మీడియా భగవద్గీత రికార్డును వినిపించడం అలవాటు చేయాలి. గీత జ్ఞానగ్రంథం, మంగళకరమైన తత్త్వశాస్త్రం. అంతేకానీ, 'చావు పాట' కాదు. మనవారిలో మూర్ఖత్వం ఎంతగా పేరుకుపోతోందో దీనిని బట్టి స్పష్టమవుతుంది. ఇటువంటి సందర్భాలు తారసపడినప్పుడు మీ వంటివారు వెంటనే చీవాట్లు పెట్టి, అపోహలు తొలగించాలి. మంగళకరమైన గీతాచార్యుని వాక్యాలు అనునిత్యం పఠించాలి, వినాలి, పారాయణ చేయాలి. అనుసరించాలి.

**ప్ర. భగవంతునికి మహానైవేద్యం పెట్టేటప్పుడు వండిన పాత్రలు తెచ్చిపెట్టాలా? లేక వేరే పళ్లెంలోకి తీసి తెచ్చిపెట్టాలా? ఆబ్దిక సమయంలో వండిన పాత్రలన్నిటిపై నీరు ప్రోక్షణ చేయించుతారు కనుక, దేవతా నివేదనలో కేవలం వేరే పళ్లెంలోకి తీయాలని కొందరన్నారు.**

**జ.** మహానివేదనను వండిన పాత్రలతోనే పెట్టాలి. వేరే పళ్లెంలోకో, ఆకులోకో తీసి పెట్టరాదు. నైవేద్యంతో పాటు మంచినీళ్ళు కూడా పెట్టాలి. నైవేద్యాన్ని మనకి కుడివైపు ఉంచాలి.



ఆబ్దికంలో కూడా వండిన పాత్రలతో పెట్టడమే ఉంది. వేరే పళ్లెంలోకి తీయరాదు. అయితే ఆ కర్మకి ఇలా చేశాం కనుక, దీనికి అలా చేయరాదు అనడం అపోహ. శాస్త్ర ప్రకారం– దేవతలకైనా పితృదేవతలకైనా ఈ పద్ధతి ఇలాగే ఉంటుంది.

**ప్ర. తాంబూలం ఇచ్చేటప్పుడు కూడా పద్ధతులున్నాయా? అమ్మవారి 'కర్పూరవీటికా'కి ఏ సామగ్రియో, ఇతర తాంబూలానికి కూడా అదే వాడాలా?**

**జ.** దేవతలకిగానీ, మానవులకి గానీ తాంబూలం ఇచ్చేటప్పుడు కాడలు మనవైపు, కొసలు పుచ్చుకొనే వారివైపు ఉండాలి. మూడు, ఐదు, పది, పన్నెండు ఈ సంఖ్యలో తమల పాకులుండాలి. ఒక వక్క, లేదా మూడు వక్కలు పెట్టడం శ్రేష్ఠం. రెండు వక్కలు కూడదు. ఇక అమ్మవారి 'కర్పూరవీటికా' పద్ధతి వేరు. ఇది కేవల తాంబూలం కాదు. అది 'కిళ్ళీ' మాదిరి ఒక తాంబూల విధానం.

**ప్ర. ఆదివారం సప్తమీ తిథితో కలిస్తే గొప్పయోగం అంటారు. అలాంటి యోగాలు ఇంకా ఏమైనా ఉన్నాయా?**

**జ.** తిథివార, నక్షత్రయోగ కరణాలు అప్పుడప్పుడు కలియడం వల్ల పుణ్యకాలాలుగా

చెప్తారు. వీటిని 'అలభ్య యోగాలు' అంటారు. అంటే 'అరుదైన' యోగాలు అని భావం. వీటిని వినియోగించుకొని, ఆ సమయాల్లో ఆయా దేవతల్ని ఆరాధించి, సత్ఫలితాలను పొందవచ్చు.

శనివారం త్రయోదశి ఏర్పడితే 'శనిత్రయోదశి' అంటారు. ఈ రోజున స్నాన దానాదులు, రుద్రాభిషేకాలు శని దోషాల్ని పోగొట్టి, ఆయురారోగ్యాలను ప్రసాదిస్తాయి. ఇలాగే మంగళవారం చవితి కలిస్తే 'భౌమచతుర్థి' అంటారు. ఈ రోజున గణపతి పూజ, నాగపూజ వంటివి శ్రేష్ఠం. గంగాగోదావరి లాంటి నదుల్లో స్నానం, దానం అక్షయఫలాలనిస్తాయి. అలభ్యయోగాలన్నిటిలోనూ తీర్థ స్నానం, దానం, జప పూజాదులు శ్రేష్ఠఫలితాలను అనుగ్రహిస్తాయి.

గురువారం ఏకాదశి, మంగళవారం కృష్ణపక్షం చతుర్దశి –ఇవి గొప్ప యోగాలు.

**అమావాస్యా తు సోమేన సప్తమీ భానుసంయుతా।**
**చతుర్థీ భౌమవారేణ బుధవారేణ చాష్టమీ॥**
**చతస్రస్తిథ యస్త్వేతా స్సూర్యగ్రహణ సన్నిభాః**
**స్నానం దానం తథా శ్రాద్ధ సర్వత్రాక్షయో భవేత్॥**



"అమావాస్యతో కూడిన సోమవారం, ఆదివారంతో కలిసిన సప్తమీ, బుధవారంనాడు అష్టమీ, మంగళవారం చవితి–ఈ నాలుగు తిథులు సూర్యగ్రహణంతో సమానమైన పుణ్యకాలాలు. వీటియందు స్నాన, దాన, పితృకార్యాలు అక్షయ ఫలప్రదాలు" అని శాస్త్రోక్తి.

**కృష్ణాంగారక చతుర్దశ్యాం మహానద్యవగాహనాత్।**
**గోమయేనానులిప్తాంగో గోసహస్ర ఫలం లభేత్॥**
**కృష్ణపక్షౌ చతుర్దశ్యాం అంగారక దినం యధా।**
**తదాస్నాత్వా శుభేతోయే తర్పణం యమనామభిః॥**
**కృష్ణాంగారక చతుర్దశ్యాం యమం భానుం ప్రపూజయేత్**
**శోణాధకాన్ మాష యవాన్ దద్యాద్విప్రాయవై నృప।**
**తయోశ్చ ప్రీతయే దద్యాద్యమలోకం నపశ్యతి॥**

కృష్ణాంగారక చతుర్దశీ వ్రతదినాన యమునీ, సూర్యుని పూజించాలి. యమ తర్పణలు చేయడం మంచిది.

ఈ రోజున యమునీ, భానునీ అర్చించాక, మినుగులను, యవలను దానం

చేస్తే నరకాన్ని పొందరు. స్వర్గం లభి స్తుంది.

ప్ర. **మన స్తోత్ర సాహిత్యంలో దేవతల అంగాంగ సౌందర్యాన్ని వర్ణిస్తారు. "అవన్నీ బూతులే" అని కొందరు నాస్తికులు వెక్కిరిస్తున్నారు. మన దేవుళ్ళ సుప్రభాతాల్లో కూడా అటువంటి అశ్లీలాలను ఎందుకు చేశారు? 'కమలాకుచ...' వంటివి ఎందుకు రచించారు?**

జ. దేవతా సౌందర్య వర్ణన ధ్యానం కోసమే. అది అశ్లీలం ఎలా అవుతుంది. నాస్తికులకు ఆస్తికత అన్నా, ఉపాసన అన్నా ఏం తెలుస్తుంది? వాటికి సంబంధించిన శాస్త్రాలతో పరిచయం లేనివారు వాటిగురించి ఏం చెప్పగలరు?

దేవదూషణ, ధర్మదూషణలే పనిగా పెట్టుకున్న పాపబుద్ధులకు దేవతత్వం ఎలా అర్థమవుతుంది?

ఇన్నాళ్ళు ఆ స్తోత్రాన్ని పారాయణ చేస్తున్న వారెవ్వరికీ భక్తిభావం తప్ప అశ్లీల భావం కలగలేదు. సంస్కృతం తెలిసిన వారుకూడా ఆ శ్లోకాలను భక్తితో పఠిస్తున్నారు తప్ప, మరో దృష్టిలేదు.



దేవతా శరీరాలు మంత్రతేజోమయాలు. మన దేహాలు మాంసమృన్మయాలు. దేవతల దేహాలను ధ్యానించడం వల్ల ఆ మంత్ర చైతన్యం సాధకునిలో దివ్యశక్తిని ప్రవేశింప జేస్తుంది. ఒక్కొక్క అంగం ఒక్కొక్క మంత్ర శక్తి స్వరూపం. ఇది స్తోత్రకర్తలు, పఠితలు, సాధకుల విశ్వాస విషయం.

విశ్వాసానికి సంబంధించిన అంశాన్ని అవిశ్వాసులు మాట్లాడ్డమే దోషం. ఒకరి నమ్మకాన్ని అవమానించడం మానవత్వానికే విరుద్ధం. అనాగరికం. ఇలాంటి అనాగరికతను ప్రోత్సహిస్తున్న విమర్శకులు, మీడియాలు ఇతర మతాలలోని అంశాల గురించి విమర్శలు, చర్చలు చేయగలరా?

పనికట్టుకొని అండంపై కేశాలేరడంలాంటి పనులతో హిందూధర్మాన్ని అవమానిస్తున్న వారిని క్షమించరాదు. అంత సుప్రభాతంలో పూర్వపదాలు వదలి కేవలం 'కమలాకుచ...' అనే మాట గురించే మాట్లాడ్డం వారి అవివేకం. ఏ సందర్భంలోనిదది? నాటి భక్తకవికాలంలోని సాహిత్య నియమాలు, సామాజిక దృక్కోణం గురించి ఆలోచించాలి.

జగన్మాతృభావనతో లక్ష్మీదేవిని ఆరాధించే భక్తుని పవిత్రభావం ఈ నాస్తికులకు అవగతమవుతుందా?

ఒక శరీరవిషయాన్ని భౌతికదృష్టి, శిశుదృష్టి, వైద్యదృష్టి, కాముకదృష్టి... ఇలా అనేక కోణాలతో చూడవచ్చు. ఇది ఆలంకారిక దృష్టి- సాహిత్యపరంగా.

ఇక భక్తిపరంగా- అమ్మహృదయంలోని అనురాగ సంకేతమే 'కుచకుంకుమ'. అది అయ్యవారి హృదయంతో మమైకమయిందనే భావన- ఆ భక్తాచార్యుని దృష్టి. ఇటువంటి వర్ణనలు అన్నమయ్య కృతుల్లో ఉన్నాయి. ఇతర ఉపాసనా శాస్త్రాల్లో ఉన్నాయి. ఏ భాషలో, ఏ సందర్భంలో, ఏ దృష్టిలో చెప్పారు? అనే సంస్కార విచక్షణలు వదలి పెడార్థాలు తీసే వారి మాటలు పట్టించుకోరాదు. వాటి ప్రభావంలోపడి, మన స్తోత్రసాహిత్యాన్ని అపార్థం చేసుకోరాదు. తమకు నమ్మకంలేని విషయాల్లోని మంచి చెడులను చర్చించడమే ఒక అజ్ఞానం. వారి దృష్టిలో లేని దేవుడి సౌందర్యం గురించి వారికెందుకు? 'గగనకుసుమం' అనుకునేటప్పుడు దాని రంగు, వాసనల గురించి చర్చిస్తామా!

**ప్ర. ఇప్పుడు మారుతున్న పరిస్థితుల్లో ఆలయాల్లో, క్షేత్రాల్లో దర్శన సమయాల్లో మార్పులు జరుగుతున్నాయి. కట్టడాల్లో పెను మార్పులు చేస్తున్నారు. ఇవి అంగీకరించదగినవేనా? పవిత్రస్థలాల్లో కూడా ప్రమాదాలు, ఉత్పాతాలు జరగడం ఆశ్చర్యం కాదా?**



**జ.** మన కోసం వెలసిన దేవుని కోసం మనం వెళుతున్నాం. దైవం ఒక శక్తి. అది వెలసిన చోట, ప్రతిష్ఠించిన చోట ఆ శక్తికి తగ్గ నియమాలు ఉంటాయి. వాటిని ఆగమ శాస్త్రం నిర్దేశిస్తుంది. అలాగే ఆ ఆలయానికీ, క్షేత్రానికీ ప్రాచీన కాలంనుండి కొన్ని కట్టుబాట్లు, సంప్రదాయ నియమాలుంటాయి. వాటిని అతిక్రమించరాదు. క్షేత్రాలకున్న పరంపరాగత నియమాలను ఉల్లంఘించినట్లయితే ఉపద్రవాలు, ఉత్పాతాలు తప్పవు. ఇప్పటి పరిస్థితులకు అనుగుణంగా నాటి పద్ధతులను తప్పినట్లయితే ఆ శక్తిని మరి పొందలేము.

అయితే పెరుగుతున్న రద్దీలను దృష్టిలో పెట్టుకొని సౌకర్యాలు, దారులు, కొన్ని సమయాల్లో మార్పులు చేయవచ్చు. కానీ అవి ఆగమశాస్త్రాలకు విరుద్ధంగానూ, పరంపరలను పక్కన పెట్టి చేయరాదు. ఈ విషయంలో న్యాయస్థానాలకు కూడా హక్కులేదు. ఆలయ శాస్త్ర నియమాలే ఆలయాలకు న్యాయాలు.

క్షేత్రాదులను విహారకేంద్రాలుగా, వైభోగాల వసతులతో, 'పార్కు'లవలె తీర్చిదిద్దడం అభివృద్ధి కాదు. శుచి, శుభ్రత, సదాచారం, అర్చనల పద్ధతులు సంప్రదాయ బద్ధంగా జరగాలి. వాటి కోసం ఆధునిక సదుపాయాలు వాడవచ్చు. అంతేకానీ మార్పుల

పేరుతో, ప్రజాకర్షణల ఉద్దేశంతో పవిత్రస్థలాల్లో పెనుమార్పులు చేస్తే వాటి దుష్ఫలితం ప్రజాజీవనాన్ని కకావికలు చేస్తుంది.

**ప్ర. అరుంధతీదేవి అంత్యజురాలు– అని అంటారు కదా? నిజమేనా? ఆమె తల్లిదండ్రు లెవరు?**

**జ.** అరుంధతీ దేవి కర్దమ ప్రజాపతి యొక్క కుమార్తె. కర్దముని భార్య దేవహూతి. ఈమె స్వాయంభువ మనువు కూతురు. ఈ దేవహూతీ కర్దముల కుమార్తెలలో అరున్ధతి ఒకరు.

**మరీచయే కలాం ప్రాదాదనసూయామథాత్రయే।**
**ఖ్యాతిం స భృగవేఽ యచ్ఛ ద్వసిష్ఠాయాప్యరున్ధతీమ్॥**

"కర్దముని పుత్రికలలో కళను మరీచికి, అనసూయను అత్రి మహర్షికి, ఖ్యాతిని భృగుమహర్షికి, అరున్ధతిని వసిష్ఠ మహర్షికి ఇచ్చి వివాహం జరిపాడు" అని భాగవతం లోని మాట. ఇదే మాట శివపురాణంలోని 'రుద్రసంహిత'లో కూడా చెప్పారు.

**ప్రజాపతేః కర్దమస్య దేవహూత్యమభూత్సుతా।**
**అరున్ధతీ వసిష్ఠస్య పత్నీ భూలోక పూజితా॥**



అయితే శివపురాణంలో ఒక కథ ఉంది. బ్రహ్మ తపస్సు వలన జనించిన సంధ్యాదేవి, కారణాంతరాల వల్ల మేధాతిథి అనే మహర్షి చేసే యజ్ఞమందు అగ్ని కుండంలో తన శరీరాన్ని పరిత్యజించింది. ఆమె తిరిగి కర్దమ పుత్రికగా ఉద్భవించి వసిష్ఠుని చేపట్టినట్లుగా అన్వయం చేసుకోవాలి. స్కాన్దపురాణంలో వసిష్ఠుడు అక్షమాలా అనే మరో కన్యను వివాహమాడినట్లు ఒక కథ ఉంది. ఇది కల్పభేదాల బట్టి కథాభేదంగా గ్రహించవచ్చు కూడా.

**ఆసీత్పురా మహాదేవీ సతీ చాధమయోనిజా।**
**అక్షమాలేతి వై నామ్నా సతీధర్మ పరాయణా॥**

ఈ కథ ప్రకారం– ఒక క్షామకాలంలో, లోకరక్షణ కోసం ఒక అంత్యజుని కుమార్తె అయిన అక్షమాలను ఆమె తండ్రి కోరిక మేరకు వసిష్ఠుడు చేపట్టవలసింది. ఈ విధంగా స్వీకరించిన ఆమెను 'అభ్యర్థణీయురాలు' అంటారు.

బ్రహ్మ మనస్సం భూతుడైన మహాతేజస్వి తత్సాంగత్య దోషాన్ని పరిహరించగలిగిన తపశ్శక్తి కలవాడు. పైగా ఆ అక్షమాల కూడా మహాత్మురాలు. సాంకర్యాన్ని మన సంస్కృతి అంగీ కరించదు. అదే సమయంలో–ఏ వర్ణం గొప్పదనం దానిదే. ఎక్కువ

తక్కువలు లేవు. దేని స్థానం దానిదే. అక్షమాల తన తేజస్సుతో సూర్యబింబాన్ని 'అను రోధించుట' (కప్పుట)చే 'అరున్ధతి' పేరు పొందినట్లు కథ. ఈ అరున్ధతీ కర్దమపుత్రిక, అరున్ధతీ వేర్వేరు.

**1.** అయోనిజారున్ధతీ (కర్దమపుత్రిక)

**2.** అక్షమాలారుంధతి.

ఈ కర్దమ పుత్రిక ద్వారా వసిష్ఠునికి కలిగిన సంతానం శక్తి. ఈ శక్తి తనయుడు పరాశరుడు. పరాశరుని పుత్రుడు వ్యాసుడు.

**ప్ర: చార్వాక మతానికి బృహస్పతియే కర్త– అని అంటారు కదా! నాస్తికమతాన్ని దేవ గురువు వ్యాప్తి చేయడమేమిటి? ఈ బృహస్పతి వేరా?**

**జ:** చార్వాకుడు రాక్షసుడు– అని భారతం చెబుతోంది. "పాపం, పుణ్యం లేవు. ప్రత్యక్షమే ప్రమాణం. సుఖపడడమే స్వర్గం. దుఃఖమే నరకం. యజ్ఞయాగాదులు, దేవతా రాధనలు, దానధర్మాదులు, పితృకర్మలు... ఇవన్నీ వ్యర్థం. దేహం తప్ప, 'జీవుడు, దేవుడు' మొదలైనవి కల్పనలు" ఇవీ చార్వాక మతంలోని ప్రధాన సూత్రాలు. ఇవి వినడానికి బాగుంటాయి– 'చారు... వాకం'. అయితే దీనికి బృహస్పతి ప్రవర్తకుడు– అనే కథ 'దేవీ భాగవతం' నాలుగవ స్కంధంలో ఉంది.



రాక్షసులు యజ్ఞాల ద్వారా శక్తిని పొంది, దేవతలను హింసించడం మొదలు పెట్టారు. శుక్రాచార్యుడు వారిచే వివిధ యజ్ఞాలు చేయించేవాడు. రాక్షసులకు యజ్ఞా లపై, తపస్సులపై, దాన ధర్మాలపై శ్రద్ధను పోగొట్టడానికై బృహస్పతి 'చార్వాక సిద్ధాంతాల'ను గ్రంథంగా ఏర్పరచాడు. శుక్రాచార్యుని రూపంలో వెళ్ళి దేవతలకు ఆ విషయాలను బోధించాడు.

యుక్తి చమత్కారాలతో నాస్తికధర్మాన్ని పరమ జ్ఞానంగా బోధించగానే, దనుజులు మోహితులయ్యారు. క్రమంగా యజ్ఞయాగాదుల్ని, ధర్మాలను విడిచారు. తపోబలం, ధర్మబలం క్షీణించగానే భ్రష్టులై, శక్తి హీనులయ్యారు. అసలైన శుక్రాచార్యుడు వచ్చి "బృహస్పతి వంచన ఇది" అని వివరించినా, రాక్షసులు నమ్మలేదు.

ఇది లోకక్షేమం కోసం చేసిన వంచన కనుక, దోషం కాదు. దేవరక్షణ, తద్వారా లోకక్షేమం స్థాపించడానికై బృహస్పతి చేసిన సత్కార్యమిది. స్థితికారకుడైన విష్ణుని సంకల్పం చేత జరిగిన కృత్యమిది. ఇది కేవలం అసురులలో అధర్మ ప్రవృత్తికై అప్పటి ప్రచారం కోసం కల్పించారు. ఇది బృహస్పతి హృదయం కాదు.

**ప్ర: రామాయణంలో 'తథాగత బుద్ధునివలె' నాస్తికంగా మాట్లాడకు- అని రాముడు జాబాలితో అన్నట్లుగా ఉన్నది. అంటే బుద్ధుని తరువాత వ్రాసినదా రామాయణం? స్పష్టం చేయగలరు.**

**జ:** వాల్మీకి రామాయణంలో శ్రీరాముడు వనవాసం చేస్తున్న సమయంలో, భరతుడు 'తిరిగి రాజ్యానికి వచ్చి ఏలుకోమ'ని ప్రార్థిస్తాడు. ఆయనతో పాటు వెళ్ళిన వారిలో జాబాలి- "మాట ఎవరికిచ్చావో వారు మరణించారు. లేనివారి కిచ్చిన మాటని పట్టించుకోవడం ఎందుకు? ప్రత్యక్షమే ప్రమాణంగా తీసుకోవాలి" అని, రామునిపై ప్రేమతో కొంత మేరకు నాస్తికంగా మాట్లాడాడు. దానితో రాముడు మందలించాడు.

**"... తథాహి బుద్ధః।**
**తథాగతం నాస్తిక మత్రవిధి।**
**... న నాస్తికేనాఽభిముఖో బుధస్స్యాత్"** (అయోధ్యకాండ)

'అవైదిక మార్గానికి చెందిన ఇట్టి బుద్ధితో వ్యవహరించు వాడు నిరాకరింపదగిన వాడు. వివేకి వేదబాహ్యుడైన నాస్తికునితో అభిముఖంగా వ్యవహరించరాదు" అని శ్రీరామ వచనం. ఈ తథాగత బుద్ధుడు గౌతమ బుద్ధుడు కాడు.

రామకథకు పూర్వమే త్రిపురాసుర సంహార సమయంలోనూ, దివోదాస వృత్తాంతం లోనూ వేదవిరోధియైన తథాగత బుద్ధావతార ప్రస్తావన ఉంది. ఇది నారాయణుని అవతారమే అయినప్పటికీ, బృహస్పతి చార్వాక మతంవలె, తత్కాలానికి అసుర బుద్ధుల్ని మోహింపజేయడమే దాని ప్రయోజనం. ఈ తథాగత బుద్ధునే పురాణాలు కూడా అవతారంగా చెప్పాయి. ఈ బుద్ధుడు పౌరాణిక బుద్ధుడు. గౌతముడు సిద్ధార్థుడు చారిత్రకం.

బౌద్ధంలో కూడా జాతకకథలు కొన్ని జన్మల నుండి వస్తున్న తథాగతుని పేర్కొన్నాయి. అంటే- గౌతమునేకాక, ప్రాచీన బుద్ధుని బౌద్ధం అంగీకరించింది. నాస్తికం, వేద విరోధం ఎన్నో యుగాల నుండి ఉన్నదే. వెలుగూ, నీడా ఉన్నట్లే. అయితే రాముని కాలంలో అది ప్రబలంగా లేదు. ధర్మపాలన ప్రభావం వలన. జాబాలి నాస్తికాన్ని ప్రస్తావించినందుకే రాముడు మందలించాడు. దీనిని బట్టి గౌతమ బుద్ధునికాలం తరువాతే 'రామాయణం' అనడానికి లేదు.

**ప్ర: 'తిరుప్పావై'లో చెప్పిన నీలాదేవి ఎవరు? రాధ, రుక్మిణీ మొదలైన వారిని విన్నాంగానీ, ఈమె ఎవరు? తాత్వికంగా ఏదైనా సమన్వయముందా?**

**జ:** నీలాదేవి శ్రీకృష్ణునకు మేనమామ కూతురు. యశోద సోదరుడు కుంభుడు. ఆయనకు నగ్నజిత్ అనే పేరు కూడా ఉంది. ఆయనకు శ్రీదాముడు, నీల అని ఇద్దరు సంతానం. వరపరీక్షగా ఏడు వృషభాలను నియంత్రించి కలిపి కట్టే యోధునకు తన కుమార్తెనిచ్చి వివాహం చేస్తానని తండ్రి మాట. దాని ప్రకారంగా, శ్రీకృష్ణుడు ఆ సప్తవృషభాలను నియంత్రించి విజయుడై నీలమ్మను చేపట్టాడు.

తాత్త్వికంగా చూస్తే - శ్రీకృష్ణునికి, అభిన్నయైన విభూతి శక్తి నీల. లేదా- ప్రకృతిగా భావించవచ్చు. శ్రీకృష్ణుని దేహకాంతి నీలం. పరబ్రహ్మ అయిన ఆయన నుండి వెలువడే బ్రహ్మవిద్యా స్వరూపిణిగానూ అభివర్ణించవచ్చు.

ఏడు ఆవరణలను (పంచభూతాలు, మనోబుద్ధులు) అధిగమించి బ్రహ్మైక్యం చెందా లనేది సప్తవృషభాల నియంత్రణలోని అంతరార్థం. ఈ బ్రహ్మవిద్య ద్వారానే బ్రహ్మము తెలియబడతాడు. ముముక్షువులకు బ్రహ్మవిద్యగా, కర్మబంధితులకు మాయగా (విద్యావిద్యలుగా) ఉన్న తల్లి నీల. ఈమె ద్వారానే శ్రీకృష్ణ పరబ్రహ్మ ప్రాప్తి. ఇదే నీలాదేవి తత్త్వంగా సంభావించవచ్చు.

**ప్ర: పిల్లలకు ఏడవ సంవత్సరంలో (గర్భాష్టమంలో)ఉపనయనం చేయాలంటారు. అప్పుడుగానీ చేయకపోతే తరువాత ఏ సంవత్సరంలో చేయాలి? బేసి సంఖ్య, సరిసంఖ్యల్లో ఏది చూడాలి?**



**జ:** సకాలంలో చేయనప్పుడు, ఆ తరువాత వీలైనంత తొందరగా చేయడం శ్రేష్ఠం. సరియైన ముహూర్తం చూసుకొని చేస్తే చాలు. సరిసంఖ్య, బేసిసంఖ్యలాంటి నియమా ల్లేవు. కాలనియమం దాటాక ఏ కాలమైనా ఒకటే. కానీ శీఘ్రంగా చేయడం ముఖ్యం. సకాలంలో సంధ్యావందనం చేయలేనప్పుడు, ఆ సమయానికి వీలైనంత దగ్గరి సమయంలో సంధ్య చేయాలి. కానీ మానరాదు. అదే విధంగా ఇదీను.

**ప్ర: కృష్ణ చవితికి 'సంకష్ట చతుర్థి' అంటారు. వ్రతం చేస్తారు. మరి శుక్ల చవితికి ప్రాధాన్యం లేదా? ఆ రోజుకి ప్రత్యేకమైన పేరు ఏదైనా ఉందా? 'సంకష్ట చతుర్థు'లలో ఏ మాసం ప్రసిద్ధి?**

**జ:** 'సంకష్ట చతుర్థి' అనకూడదు. 'సంకష్టహరచతుర్థి' అనాలి. కష్టాలను పోగొట్టే చవితి. ఇది కృష్ణ చవితి. ప్రధానమైనది మాఘకృష్ణ చతుర్థి.

ఈ రోజున గణపతి బ్రహ్మదేవుని తపస్సుకి ఫలంగా ప్రత్యక్షమై, సృష్టికి దాపు రించిన విఘ్నాలను పరిహరించాడు. కనుక దీనికి ప్రాధాన్యం.

శుక్లచవితికి కూడా ప్రాముఖ్యముంది. ఈ రోజున శివ పార్వతుల తనయునిగా గణేశుడు ఆవిర్భవించాడు. ఇది భాద్రపదశుద్ధ చవితి. అయితే ఈ రెండు చతుర్థీ తిథులూ గణేశ ప్రీతికరాలు. గణపతి భక్తులు ఈ తిథులలో వ్రతాచరణ చేస్తారు. శుక్లపక్షచవితికి 'వరదాచతుర్థి' అనిపేరు. వరదమూర్తిగా గణపతిని ఈ చవితినాడు పూజించినవారికి అభీష్టాలను ప్రసాదిస్తాడు.

ప్ర: **శ్మశాన వైరాగ్యం, పురాణ వైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం –అంటారు. మొదటి రెండు అర్థమయ్యాయి. ఎవరైనా మరణించినప్పుడు శ్మశానానికి వెళితే అప్పుడు కలిగే వైరాగ్యభావన. అలాగే పురాణాలు వినేటప్పుడు కలిగే వైరాగ్యం తీరా ఇవతలికి వచ్చేశాక పోతాయి. మరి ప్రసూతి వైరాగ్యం ఏమిటి? ప్రసవసమయంలో స్త్రీకి కలిగే వైరాగ్యమా? అప్పుడేం వైరాగ్యం కలుగుతుంది? పురుటినొప్పులు పడి, 'ఇకపై ఈ నొప్పులు భరించలేను కనుక, మరి సంతానాన్ని కనకూడదు' అనుకుంటుందా? ఇది స్పష్టంగా లేదు. సరియైన అర్థం చెప్పగలరు?**

**జ.** ప్రసూతి వైరాగ్యానికి మీరు చెప్పినది కొంత వరకు సరిపోయినా, మరో భావాల్ని గ్రహించవచ్చు. జీవుడు మాతృగర్భం ప్రవేశించిన తరువాత, ఏడు నుండి తొమ్మిది నెలల వరకు పూర్వ (జన్మ) స్మృతుల స్ఫురణ ఉంటుంది. ప్రస్తుతం అనుభవిస్తున్న జఠరవేదన తాళలేక, 'ఇకపై ఈ జఠరనరకం అనుభవించకూడదు. జననం మరణం, పునః జననం – అనే ఈ సంసారాన్ని అధిగమించాలి' అని ఆ స్థితిలో గర్భస్థ శిశువు అనుకుంటాడు. కానీ తిరిగి ప్రసవం జరిగాక –ఆ వైరాగ్యాన్ని, నాటి వేదనని విస్మరిస్తాడు. ఆ వైరాగ్యానికి (ప్రసవానికి ముందు కలిగినది కనుక) 'ప్రసూతివైరాగ్యం' అంటారు. శాస్త్రాలలో ఈ భావమే చెప్పబడింది.



ప్ర. **పురాణాల్లో రాజస, సాత్త్విక, తామస పురాణాలు అనే మూడు భాగాలున్నాయంటారు. శివాది పురాణాలు తామసాలనీ, విష్ణ్వాదిపురాణాలు సాత్త్వికాలనీ వివరించారు. ఇది నిజమేనా?**

**జ.** ఈ విభజన అశాస్త్రీయం. వ్యాసుడు తన పురాణ రచనలన్నీ ప్రత్యేక సంప్రదాయ బద్ధంగా రచించాడు. సర్గ, ప్రతిసర్గ, మన్వంతర, వంశ, వంశానుచరితం – అనే ఐదు లక్షణాలతో పురాణాలను రచించాడు. ప్రతి పురాణం ఈ ఐదులక్షణాలతో ఉంటుంది.

అయితే వీటిని శివపారమ్యంతో అన్వయిస్తే శివాది పురాణాలు, విష్ణు పారమ్యంతో

చెబితే విష్ణ్వాది పురాణాలు, అలాగే శక్తి, గణేశ, సౌరప్రాధాన్యాలతో ఏర్పడ్డాయి. ఇవి ఆయా దేవతాభక్తులకు వారి ఇష్టదేవతలపై భక్తి ప్రపత్తుల నేర్పరచి, క్రమంగా చిత్తశుద్ధినీ త్రిగుణాతీత స్థితినీ సాధించాలనే ప్రయోజనంతో వ్యాసుడు రచించాడు. త్రిగుణాతీత పరమాత్మనే శివ విష్ణ్వాదుల పరంగా పేర్కొ న్నాడు. అంతేగానీ ఈ సాత్త్విక రాజస తామస పురాణ భాగాలు – భేదదృష్టి కలిగిన ద్వేషవాదులు కల్పించిన కుత్సితం. ఇది ప్రమాణం కాదు. ఈ విషయాన్ని చక్కగా ఏనాడో అప్పయ్య దీక్షితుల వంటి మహాత్ములు వివిధ ఆధారాలతో ప్రతిపాదించారు.

**ప్ర. 'రామ పంచాయతనం' అంటే ఏమిటి? శివ పంచాయతనం, శక్తి పంచాయతనం వలెనే అది కూడానా? రామ పంచాయతనంలో ఎవరెవరుంటారు? త్యాగరాజస్వామి వారు రామపంచాయతనాన్ని పూజించే వారంటారు కదా?**

**జ.** దేవతార్చనలో సంప్రదాయంగా వాడేవి సాలగ్రామాలు, బాణలింగం, శోణశిల, స్ఫటిక బింబం, సువర్ణముఖీ శిల– వీటిని పంచాయతనం అంటారు.

రామ పంచాయతనం వేరు. ఇవి విగ్రహాలు. మధ్యలో సీతారాములు, ప్రక్కన భరత శత్రుఘ్నులు, పాదాల వద్ద ఒక వైపు హనుమ, మరొకవైపు లక్ష్మణుడు ఉంటారు. ఇలా లక్ష్మణ, ఆంజనేయ, భరత, శత్రుఘ్నుల నడుమ సీతారామమూర్తి– ఐదుగా ఉన్న రూపాలు కనుక 'పంచాయతనం' అంటారు. త్యాగయ్య ఈ పంచాయ తనాన్నే ఆరాధించారు.



**ప్ర. 'పాపాల భైరవుడు' అని ఎందుకు అంటారు. కాల భైరవుడు, ఆది భైరవుడు అని కూడా పేర్లు ఉన్నాయి, 'అష్ట భైరవులు' అంటే ఎవరు?**

**జ.** బ్రహ్మను శిక్షించడానికి అవతరించిన శివస్వరూపం కాలభైరవుడు. ఒకప్పుడు అహం కారం చేత బ్రహ్మదేవుడు అసత్యం పలికినందుకుగాను, మహాదేవుడు ఆయనను శిక్షించేందుకు సంకల్పించుకోగానే, అతడి భ్రుకుటి నుండి కాలభైరవుడు ఉద్భవించి అసత్యం పలికిన బ్రహ్మవదనాన్ని పెకిలించాడు. అతడినే ఆది భైరవుడు, వృజిన భైరవుడు అంటారు.

ధర్మరక్షణకై భీషణ స్వరూపాన్ని ధరించిన ఈ ఉగ్రమూర్తి పాపసంహారకుడు. 'వృజినం' అంటే 'పాపం' అని అర్థం. పాపాలను హరించే వాడు కనుకనే 'వృజిన భైరవుడు'. ఇదే తెలుగులో 'పాపాల భైరవుడు' అయింది.

**అష్ట భైరవులు:** అసితాంగభైరవుడు, రురుభైరవుడు, చండభైరవుడు, క్రోధ భైరవుడు,

ఉన్మత్త భైరవుడు, కపాల భైరవుడు, భీషణ భైరవుడు, వటుక భైరవుడు.

**ప్ర. వేదాలు కర్మల్ని బోధిస్తాయి. ఉపనిషత్తులు కర్మను కాదని, జ్ఞానాన్ని తెలియజేస్తాయి. పురాణాలు కేవలం ధర్మాల్ని మాత్రమే చెబుతాయి. వీటిలో ఏది గొప్పది? వేదాలు, పురాణాల కన్నా ఏకంగా ఉపనిషత్తుల్ని చదివితే సరిపోలేదా?**

**జ:** ఉపనిషత్తులు వేదాల్లోని భాగాలు. అందుకే 'వేదాంతం' అంటాం. వేదము ద్వారా పొందే ఫలం వేదాంతం. చెట్టుకి అంతిమదశ ఫలమే. అయితే చెట్టులేనిదే ఫలం లేనట్లు, వేదం చెప్పిన సత్కర్మాచరణ లేనిదే ఆత్మజ్ఞాన ఫలం రాదు. తినేది ఫలమేకదా అని, చెట్టుని తూలనాడేవాడు అవివేకి. వేదభాగాల్లో కూడా వేదాంతం ఇమిడి ఉంది. సత్కర్మానుష్ఠానం లేనివాడికి వేదాంతం అపార్థమై, అనర్థమౌతుంది.

శరీరం కలిగినవాడు తన దేహంతో చేయవలసిన విధ్యుక్త కర్మలు, వేదసమ్మతంగా చేయాల్సిందే. అది చేస్తేగానీ చిత్తశుద్ధి రాదు. చిత్తశుద్ధి లేనిదే జ్ఞానం కలుగదు. మానవుల్లో అధికులకి కోరికలుంటాయి. వాటి కోసం కర్మ చేయాలి. లేదా– జీవ యాత్రలో అవసరం కోసం కర్మ చేయాల్సిందే. జ్ఞానమే లక్ష్యంగా కలిగినవారు కూడా, గృహస్థాశ్రమాది ప్రవృత్తి మార్గాలలో ఉన్నప్పుడు వేదచోదిత కర్మ చేయవల సిందే. తాను గృహస్థుగా ఉంటూ, ఆత్మజ్ఞానం వల్లిస్తూ, నిత్యకర్మాది అనుష్ఠానాదుల్ని విడిచిపెడితే 'భ్రష్టుడ'వుతాడు.



అంతగా వైరాగ్యం ఉంటే కామ్యకర్మల్ని విడిచి పెట్టవచ్చు. వేదకర్మఫలమే వేదాంతం. దాని ఫలమే మోక్షం. ఇంక– పురాణాలు కూడా బ్రహ్మజ్ఞానాన్ని కలిగించ డానికే అవతరించాయి. ధర్మమయ కర్మ జీవనాన్నీ, జీవిత సాఫల్యమైన జ్ఞానాన్ని విస్తారంగా అందించినవి పురాణాలు. పురాణోద్దేశం వేదాంత విజ్ఞానం.

**ప్ర. నిత్యపూజల్లో, ఇతర కర్మల్లో సంకల్పం చెప్పేటప్పుడు సంవత్సరం, అయనం, ఋతువు, మాసం, పక్షం, వారం, తిథి– అన్నీ చెబుతారు. కానీ నక్షత్ర యోగకరణాల విషయంలో ఆ రోజుకి సంబంధించినవి చెప్పకుండా 'శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణే'– అని అంటారు. ఎందుకు? నక్షత్రయోగకరణాల పేర్లను ఉచ్చరించ కూడదా? ఏదైనా నియమం ఉందా?**

**జ.** అలాంటి నిషేధాలు, నియమాలు ఏమీ లేవు. పంచాంగంలో నక్షత్ర యోగకరణాలు కూడా ఉంటాయి. ఏ రోజున ఏ నక్షత్రం, ఏ యోగం, ఏ కరణం వస్తుందో తెలుసుకొని, వాటి పేర్లను కూడా చెప్పవచ్చు.

కానీ నిత్య వ్యవహారంలో వాటి గురించి అందరికీ తెలుసుకోవడం కుదరదు. అంత శ్రమపడి తెలుసుకోనక్కర లేకుండా వాటిని శుభభావంతో 'శుభ నక్షత్రే...' వగైరాలను పలుకుతారు. మనం ఓపిగ్గా తెలుసుకొని ఆ మూడింటినీ చెప్పినా అభ్యంతరం లేదు. ఉచ్చరించవచ్చు, 'శుభ' శబ్దంతో వాటిని పలకడం వల్ల ప్రత్యేకించి ఉచ్చరించని దోషం రాదు. ఉదాహరణకు "శతభిషా నక్షత్రే, సిద్ధయోగే, చతుష్పాద కరణే" అని రోజుననుసరించి పలుకవచ్చు. అవి తెలియని పక్షంలో 'శుభ' శబ్దంతో అంటే సరిపోతుంది.

ప్ర. **నాకు విష్ణువంటే ఇష్టదైవం. అందువల్ల సమాశ్రయణం చేసుకొని వైష్ణవం స్వీకరించాను. కానీ అందులో ప్రవేశించాక తెలిసింది. దీక్షనిచ్చిన గురువులు 'శివస్మరణ చేయవద్దని, శివాలయాలకి వెళ్లొద్దని' చెప్పడం మొదలు పెట్టారు. మా యింట్లో అనూచానంగా సర్వదేవతల్నీ ఆరాధిస్తారు. మాకు శివద్వేషం లేదు. ఇప్పుడు వీరి మాటలు నచ్చలేదు. కానీ నేను ఈ మతంలోకి వచ్చాను గనుక వీరినే గురువులుగా స్మరించాలా? వీరు చెప్పినట్లే శివుని దూరం చేయాలా? నాకు శివుని కూడా పూజించడంలో, శివాలయా నికి వెళ్ళడంలో అభ్యంతరం లేదు. పైగా వీళ్ళు గణపతిని కూడా కించపరుస్తున్నారు. ఇప్పుడు నేనేం చేయాలి?**



**జ.** మీకు విష్ణువు ఇష్ట దైవం కావడం భాగ్యమే. అంత మాత్రాన విష్ణువును ఆరాధించడానికి సమాశ్రయణం చేసుకోనక్కర్లేదు. మీ సంప్రదాయాన్ని విడిచి అందులోకి ప్రవేశించడమే మీ తొందరపాటు. ఎవరి పరంపరనీ, సంప్రదాయాన్నీ వారు నిలబెట్టుకోవాలి. పూర్వకాలం నుండి మీది స్మార్తసంప్రదాయం, అందుకే సర్వదేవతల యందు సమ బుద్ధి ఉంది. అచ్చమైన వేదధర్మంలో అన్ని దేవతల్ని ఆరాధించడమే ఉంది. అయితే అభిరుచిని బట్టి ఇష్టదేవత ఉండ వచ్చు. ఒక్క ఇంట్లోనే ఒక్కొక్కరికీ ఒక్కో అభిరుచి ఉంటుంది.

ఆ ఇష్టదేవతని ఆరాధిస్తూ, ఇతర దేవతల్ని ద్వేషించకుండా, వారిని కూడా కొలుచుకోవడం తప్పులేదు.ఏకాగ్రత అభీష్టంపైనే ఉంచవచ్చు.పనిగట్టుకొని ఇతరుల్ని పక్కన పెట్టనక్కర లేదు. ఈ పరంపరకి చెందిన మీరు దీని నుండి విడిపోకుండానే విష్ణువును కొలుచుకోవచ్చు. స్వామికృపను పొందవచ్చు. ఈ సంప్రదాయంలో ముక్తి పొందిన మహా మహులు ఎందరో ఉన్నారు. వ్యాసుడు, ఆదిశంకరులు, త్యాగరాజు, నారాయణతీర్థులు, తులసీదాసు, లీలాశుకులు, పోతన... ఇలా ఎందరో విష్ణుభక్తులు

ఈ సమాశ్రయణం లేకుండానే సర్వదేవతా సమబుద్ధితో ముక్తి పొందిన చారిత్రక పురుషులు. పురాణాల్లో ఇటువంటివారు ఎందరెందరో!

అయితే– శైవం, వైష్ణవం, గాణపత్యం వంటివి ఆగమాలను ఆధారం చేసుకుని ఏర్పడినవి. ఇవి వేదమూలం కలవి అయినా, వీటికి వేద (శ్రుతి), ధర్మశాస్త్రాల (స్మృతి) ప్రమాణం కంటే వాటి ఆగమాలే అధిక ప్రమాణం. ఇవీ గొప్ప సంప్రదాయాలే. కానీ ఆ సంప్రదాయాల్లో పుట్టినవారు వారి పరంపరను అనుసరించి సమాశ్రయణం (వైష్ణవులు), లింగధారణ (శైవులు) చేసుకోవచ్చు. కానీ ఇతర పరంపరకు చెందిన వారిని తమ వైపు మార్చనక్కరలేదు. ఒకరినొకరు గౌరవించుకుంటూ, ఎవరి పరంపరను వారు కాపాడు కోవడం మంచిది.

సరే– మీరిప్పుడు కొత్త దీక్ష తీసుకున్నాక, మీరు గురువులుగా ఎంచుకున్నవారి పేరును స్మరించవచ్చు. కానీ వారు చెప్పిన శివనిషేధం, శివద్వేషం, గణపతి ద్వేషం– వంటి అశాస్త్రీయభావాలను గౌరవించనక్కరలేదు. విష్ణుభక్తి గొప్పదే కానీ, మరొక దేవద్వేషం ద్రోహమే. దక్షుని కథే ఉదాహరణ. అదే విధంగా శివభక్తి గొప్పదేకానీ, హరి ద్వేషం క్షమార్హం కాదు. అందునా– ప్రస్తుత కాలంలో మన హిందూధర్మంలో ఒకరి పరంపరను ఒకరు మార్చి, అనూచానంగా సర్వదేవతలను కొలిచే ఇళ్ళ నుండి ఆ దేవతలను తొలగించడం కలిదోషం. ఇవి వేద హృదయాన్ని దెబ్బతీసే నాస్తిక ధోరణులు. ఇవి ధర్మవిరుద్ధాలు. నాస్తికో వేదనిందకః. శాస్త్ర విరుద్ధమైనవి ఎవరు చెప్పినా స్వీకరించనక్కరలేదు.

**ప్ర. మంత్రం– యంత్రం– తంత్రం... అంటే ఏమిటి? వాటి మధ్య తేడా ఏమిటి?**

**జ.** 'మంత్రం' అన్నది దేవత యొక్క శబ్దరూపం. దాని రేఖారూపమైన యంత్రం– దేవతను ఆవహించి ఆరాధించే కేంద్రం (ఆలంబన). ఈ రెండింటి శక్తి కలిగినది విగ్రహం. ఆ ఆరాధన, ఉపాసనా ప్రక్రియ, విశేషాలు, విజ్ఞానము తెలియజేసేది తంత్రం. మంత్ర, యంత్ర, ఉపాసనా జ్ఞానమే తంత్రం.

**ప్ర. స్వధర్మం నుంచి తప్పరాదు–అని చెబుతూ, మనం మత మార్పిడులను నిరసిస్తున్నాం. మరి పాశ్చాత్యులు హిందువులుగా మారడం సరియేనా? దీనిని ఆహ్వానించవచ్చా?**

**జ.** హిందూధర్మం మతం కాదు. దీనిలో తాత్త్వికత, విజ్ఞానం, యుగాల నుండి విస్తరిల్లిన మంత్ర విజ్ఞానం, యోగశాస్త్రం, ధార్మికత, ఉపాసన, వివిధ కళలు, శిల్ప, ఆగమ శాస్త్రాలు, సత్సంప్రదాయాలు ఎన్నో సమన్వయింపబడి మేళనమై ఉన్నాయి.

ఏదో ఒక ప్రవక్తను ఆధారం చేసుకొని, ఒక గ్రంథాన్ని ఆలంబన చేసుకొని వాటి ప్రాతిపదికన కొన్ని నమ్మకాలను మతంగా ఏర్పరచి, దానిని అన్ని ప్రాంతాలలో వ్యాపింపచేస్తూ, 'మార్పిడులను' ఆర్థిక వ్యాపారంగా కొనసాగిస్తున్న అన్యుల 'మత మార్పిడి'కీ... ఇటువైపు హిందూధర్మాన్ని గ్రహించి స్వీకరించే వారికీ తేడా ఉన్నది. స్వధర్మంపై అవగాహన లేకుండా, పరాయి దేశ మతసంస్థల నుండి వచ్చే ధననిధులతో ఇక్కడ వ్యూహాత్మకంగా సాగుతున్న వ్యాపారంలో, ధనాశతో మారుతున్న వారే అందరూను.

ఈ మతాలేవీ పుట్టక పూర్వమే విశ్వరహస్యాలని శోధించి సాధించి వివిధ శాస్త్రాలుగా ఏర్పరచి, వివిధ సంప్రదాయాలను పుష్టిపరచిన ధర్మపరంపర కలది మన దేశ (హిందూ) సంస్కృతి. విజ్ఞత కలిగిన వివేకవంతులు విచక్షణతో దీని విలువ తెలుసుకొని, ప్రపంచంలో ఎవరికైనా ఆధ్యాత్మిక ప్రగతి కావాలంటే హిందూ యోగ–వేదాంత–ఉపాసనా శాస్త్రాలే మార్గదర్శకాలు అని గ్రహించారు. ఇది వివేక వంతుల నిర్ణయం. ఇది మార్పిడి కాదు. కేవలం 15 వందల ఏళ్ళక్రితం కొందరు వ్యక్తులు సృష్టించిన నమ్మకానికీ, యుగాల నుండి తపశ్శక్తితో ఆవిష్కరించిన ఆధ్యాత్మిక జ్ఞానానికీ పోలికే లేదు.

ఈ రెండవది సార్వజనీనం. ఇది ధనాశతోనో, వ్యూహ రచనతోనో జరుగుతున్నది కాదు. సత్యాన్వేషణతో, సాధనాదృష్టితో దీనిని స్వీకరిస్తున్నారు. ఇందులో మిషనరీల వంటి క్రియాకలాపాలు లేవు.

**ప్ర. పితృవాక్య పరిపాలనలో ఈ క్రింద ఉదహరించిన వారిలో ఎవరు గొప్పవారు? అతి పిన్న వయసులో తన యౌవనాన్ని తండ్రికి సమర్పించిన పురూరువుడా? తండ్రి ఆజ్ఞ మేరకు తన కన్నతల్లి శిరస్సును ఖండించిన పరశురాముడా? తండ్రి కోరిక తీర్చుటకు ఆజన్మ బ్రహ్మచర్యం వహిస్తానని భీషణ ప్రతిజ్ఞ చేసిన భీష్ముడా? తండ్రి కోరిక తెలుసుకొని పధ్నాలుగేళ్ళు అరణ్యవాసం చేసి తిరిగి పట్టాభిషిక్తుడై రాజ్యపాలన చేసిన శ్రీరాముడా?**

**జ.** మీరు చెప్పిన వారిలో ఎవరికి వారే గొప్పవారు. అందరికీ ఒకే పరిస్థితి, ఒకే సమస్య ఎప్పుడూ ఎదురు కాదు. ఎవరికెదురైన స్థితి వారిదే. వాటిని నిర్వహించడంలో ధర్మబద్ధంగా పితృభక్తిని ప్రదర్శించిన వారే అందరూ. పరశురాముడు తండ్రిమాట పాటించాడు. కానీ– తండ్రి తపోబలంతో తల్లిని తిరిగి బ్రతికించుకోగలను– అనే

ధైర్యం ఆ తపస్వికి ఉంది. తండ్రి 'కోరిక' తెలుసుకొని రాముడు అరణ్యవాసం చేయలేదు. తండ్రి ఇచ్చిన మాటను తాను నిలబెట్టాడు. తండ్రికి అసత్యదోషం రాకుండా, సత్యపాలన చేశాడు. అందుకే వాల్మీకి 'పితృ సత్యమనుపాలయన్' అని పేర్కొన్నాడు. పై నలుగురు పితృభక్తి ప్రకటించి, ధర్మపాలన చేశారు.

**ప్ర. అన్నదానం, వస్త్రదానం వంటివి చేసినవారు మోక్షం పొందుతారా? సకామంగా కాకుండా, నిష్కామంగా చేసినా మోక్షం రాదా?**

**జ.** దాన ధర్మాదికాలు చేయడం ఉత్తమ సంస్కారం. ఇవి పాపనాశనాన్ని చేస్తాయి. అభీష్టసిద్ధినీ ఇస్తాయి. కానీ నేరుగా మోక్షాన్నీయలేవు. నిష్కామంగా దానకార్యాలు, ధర్మకర్మలు చేయడం వలన క్రమంగా పాపరహితులమై, చిత్తశుద్ధిని పొందగలరు. ఈ చిత్తశుద్ధి క్రమంగా శ్రద్ధనీ, భగవద్భక్తినీ, జ్ఞానాన్నీ కలిగించి ముక్తి నిస్తుంది.

ఈ జన్మలో చిత్తశుద్ధి, జ్ఞానం కలగని పక్షంలో నిష్కామ కర్మాచరణ తరువాతి జన్మలో యోగంతో కూడిన పుట్టుక నిచ్చి, అప్పుడు జ్ఞానమార్గం వైపు మళ్ళిస్తుంది.

**ప్ర. 'పాపీ చిరాయుః' అంటుంటారు కదా! ఈ మాట ఎక్కడి నుండి వచ్చింది. ఎందుకలా అంటారు?**



**జ.** కలియుగంలో అన్నీ విపరీతాలుగా ఉంటాయని చెబుతూ, పూర్వపు పెద్దలు రచించిన శ్లోకంలోని మాట అది. ఇది ఒక సుభాషితం లాంటి మాట. అజ్ఞాతకర్తృకం (వ్రాసినదెవరో తెలియనిది). ఈ శ్లోకం పూర్తిపాఠం:

**దాతాదరిద్రః కృపణో ధనాఢ్యః**
**పాపీ చిరాయుః సుకృతీ గతాయుః।**
**రాజాఽకులీనః సుకులశ్చ సేవీ**
**కలౌయుగే షడ్గుణ మాశ్రయంతి॥**

"దానం చేసే స్వభావం కలిగినవాడు దరిద్రుడుగా ఉంటాడు. పిసినారివాడు ధన వంతుడుగా ఉంటాడు. పాపాత్ముడు కలకాలం బ్రతికితే, పుణ్యాత్ముడు త్వరగా అంత రించుతాడు. మంచి పుట్టుకలేనివాడు ప్రభువౌతాడు. సద్వంశ సంజాతుడు సేవకుడౌ తాడు. కలియుగంలో ఇలా ఆరు గుణాలు విపరీతంగా ఉంటాయి" – అని శ్లోక భావం. సద్గుణాలు అసమర్థములుగా వ్యవహరింపబడతాయి– అని చెప్పడం తాత్పర్యం.

కలియుగంలో ఇలా ఉంటుంది– లేక, ఇలా ఉంటే కలియుగం... అని అర్థం.

**ప్ర. పెళ్లిలో 'సప్తపది' కి ఉన్న ప్రాధాన్యమేమిటి?**

**జ.** అగ్ని సన్నిధిలో వధూవరులు పాణిగ్రహణం చేసిన తరువాత, సప్తపది సంస్కారం ఉంటుంది. వివాహంలో ఇది అత్యంత ప్రధానం. వరుడు వధువు చేతిని పట్టుకొని అగ్ని సన్నిధిలో, మంత్ర సహితంగా ఏడు అడుగులు నడిపిస్తాడు.

దాంపత్య జీవితంలో తమకు కావలసిన ముఖ్య సంపదలను ప్రసాదించ వలసిందిగా, ఒక్కొక్క అడుగులో ఒక్కొక్క సంపదను కోరుతూ, శ్రీ మహావిష్ణువును ప్రార్థిస్తారు.

**"ఏకమిషే విష్ణు స్త్వాఽన్వేతు"** అని ఆ మంత్రాలు ప్రారంభమౌతాయి.

వాటి భావం: **1.** మొదటి అడుగుతో **అన్నసమృద్ధిని**, **2.** రెండవ అడుగుతో **ఆరోగ్యబల** సంపదలనీ, **3.** మూడవ అడుగుతో **సత్కార్యాలను**, **4.** నాలుగవ అడుగు వలన **సౌఖ్యాన్నీ**, **5.** ఐదో అడుగు వలన **పశు సమృద్ధినీ**, **6.** ఆరవ అడుగుచేత **సర్వ ఋతుసంపద**లనీ, **7.** ఏడవ అడుగు వలన **హోతలను**... అనుగ్రహించాలని ప్రార్థిస్తారు.

ఏడడుగుల వలన సఖ్యం ఏర్పడి బలపడుతుందని శాస్త్ర వచనం. **'సఖా సప్తపదా భవ..'** అని శ్రుతివాక్యం.

ఈ సప్తపదుల వలన వధువు తన పుట్టింటి గోత్రం నుండి, భర్త గోత్రంలోకి చేరుతుంది.

**"స్వగోత్రాత్ భ్రశ్యతే నారీ వివాహాత్సప్తమే పదీ"**– అనే శాస్త్రవాక్యం ఇందుకు ప్రమాణం. ఈ సప్తపదీ సంస్కారం చేతనే భార్యకు భర్త సంపదలపై, ఆస్తిపై పూర్తి హక్కు ఏర్పడు తుందని శాస్త్రం. **"దంపత్యోస్సహాధికారాత్"** అని శాస్త్ర వాక్యం.

ఈ ఏడడుగుల తరువాతనే వధువుకి 'పత్ని' అనే మాట వస్తుంది.

ధర్మపత్ని, భార్య– అనే మాట ఇక్కడి నుండే ప్రారంభం. అందుకే పాణిగ్రహణం, సప్తపది– వివాహ సంస్కారంలో ప్రధానం– అని పెద్దలు చెబుతారు.

**నోదకేన న వా వాచా కన్యాయాః పతిరుచ్యతే।**
**పాణిగ్రహణ సంస్కారాత్ పతిత్వం సప్తమే పదే॥**

"కేవలం మాటమాత్రపు అంగీకారంగానీ, నీటి ధారతో స్వీకారంగా 'పతి'ని చేయదు. పాణిగ్రహణ సంస్కారంతో చేసే సప్తపదియే పతిత్వాన్నిస్తుంది." పతీపత్ని– అనే దాంపత్య భావసిద్ధి ఈ సంస్కారం వల్ల ఏర్పడుతుంది.

**ప్ర. 'సంస్కారాలు' అనే మాటకి అర్థం ఏమిటి?**

**జ.** దీనికి సందర్భం బట్టి వివిధార్థాలున్నాయి. గత జన్మల కర్మవాసనలననుసరించి జీవునికి స్వతఃసిద్ధంగా ఉన్నవి 'సంస్కారాలు' అనే వ్యవహారం ఉంది. ఎక్కడ ఎలా ఎవరితో ఏ విధంగా ప్రవర్తించాలో, సందర్భోచిత విధానాన్ని 'సంస్కారం' అన్నది వ్యవహారంలో అర్థం.

శాస్త్రపరంగా– **"మానవానాం అంతరనిష్ఠః విహితక్రియా జన్యః అతిశయ విశేష స్సంస్కారః"**– "మానవుల మనస్సులలో అంతకు ముందులేనిదీ, ఈ క్రియ తరువాతనే శుద్ధమై భావరూపంలో కలిగినదీ అయిన గొప్పతనమే సంస్కా రం"– అని ధర్మశాస్త్ర నిర్వచనం. దేనిచేత మనం సంస్కరింప (శుద్ధిచేయ) బడతామో అదే సంస్కారం.

జన్మతో పశుప్రాయుడైన మానవుని సంస్కారంతో శుద్ధిచేస్తారు. రత్నానికి ముందు మెరుగుపెట్టి, మాలిన్యాన్ని పోగొట్టిన తరువాత అది ప్రకాశించినట్లుగా, జన్మతః మాలిన్యం ఉన్న జీవుని సంస్కరించి అతడిని శుద్ధుని చేసి, సద్గతులను సాధించేటట్లు చేసేదే సంస్కారం.



ఇవి గర్భాధానం మొదలకొని 'అంత్యేష్టి' వరకు 16 చెప్పబడ్డాయి. **"కార్యః శరీర సంస్కారః పావనః ప్రేత్య చేహ చ"** – అని స్మృతి వాక్యం. శరీరానికి ఈ సంస్కారాలు చేయవలసినది. ఇవి పాపక్షయం చేసి, పవిత్రతనిచ్చి ఇహ, పర శ్రేయస్సును ప్రసాది స్తాయి– అని దీని భావం.

**ప్ర: పిల్లలకి పేరు పెట్టడంలో ఏవైనా శాస్త్రనియ మాలున్నాయా? ఇష్టమొచ్చిన పేరు పెట్టుకోవచ్చా?**

**జ:** అది వారి అభిప్రాయాన్ని బట్టి ఉంటుంది. అయితే శాస్త్రంపై గౌరవం ఉన్నవారు కొన్ని నియమాలు పాటించడం మంచిది. నక్షత్రరీత్యా పేర్లు పెట్టడాన్ని కొందరు చెప్తారు. కానీ సంప్రదాయ సిద్ధంగా ఉన్న నియమాల ప్రకారం–

**1.** మగ పిల్లల పేరులోని అక్షరాలు సరి సంఖ్యలోనూ, ఆడపిల్లల పేరులోని అక్షరాలు బేసి సంఖ్యలోనూ ఉండాలి. **'...అయుజాక్షరం, కుమార్యాః విషయాక్షరం'** అని ప్రమాణ వాక్యం.

**2. 'ఋష్యణాకం దేవతాఽణూకం వా యథా వైషాం పూర్వ పురుషాణాం నామానిస్యుః"** మహర్షుల పేర్లు, దేవతల పేర్లు, తమ వంశంలోని పూర్వీకులలో మహాత్ముల పేర్లు పిల్లలకి పెట్టినట్లయితే– శీఘ్రంగా సత్కీర్తినీ, ప్రఖ్యాతినీ, ఆయుర్దా

యాన్నీ పొందుతారని శాస్త్రోక్తి.

**3.** కఠినంగా, ఎక్కువ ద్విత్వాక్షరాలతో కూడిన పేర్లను పెట్టరాదని కూడా సంప్రదాయముంది.

**4.** నదుల పేర్లు, చెట్ల పేర్లు, అడవుల పేర్లు పెట్టకపోవడం మంచిది. ఇవి కొన్ని సంప్రదాయాలు.

ప్ర: **జ్ఞానమార్గంలో ఉన్నవారు క్షేత్ర తీర్థయాత్రలు చేయాలా?**

**జ:** 'మార్గం'లో ఉన్నారు కనుక, గమ్యాన్ని చేరడానికి తీర్థక్షేత్రయాత్రలు సహకరిస్తాయి. చిత్తశుద్ధి కలిగితే కానీ జ్ఞానం లభించదు. చిత్తశుద్ధికి తోడ్పడే నిత్యనైమిత్తికాది కర్మలతోపాటు, తీర్థక్షేత్ర యాత్రలు కూడా ప్రాముఖ్యాన్ని వహిస్తున్నాయి.

అంతేకాదు జ్ఞానసిద్ధిని పొందిన తరువాత కూడా జీవన్ముక్తులు పవిత్రభూముల్లో సంచరిస్తుంటారు. వారివలన తీర్థాలకు మరింత శక్తి కలుగుతుంది. జ్ఞాన, ధ్యాన, భక్తి సాధనల్లో దేనికైనా తీర్థక్షేత్రయాత్రలు సహకరిస్తాయి. పవిత్రక్షేత్రాదులలో సహజంగా ఉండేశక్తి, శీఘ్రంగా పాపక్షయం చేసి, సాధనను త్వరగా, పూర్ణంగా ఫలింపజేస్తుంది.



జ్ఞానమార్గగాములు, జ్ఞానసిద్ధిని పొందినవారు మహాత్ములు శ్రీరమణమహర్షి అరుణాచల క్షేత్రానికి చేరడం, అక్కడే జ్ఞానసిద్ధినీ, నిర్యాణాన్నీ కూడా పొందడం– ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి. యుగాలనుండి వివిధ ఆధ్యాత్మిక మార్గాల్లో సాధన చేసినవారు, సిద్ధి పొందినవారు–ఎందరో యోగులు, మహర్షులు, తపస్సులు తీర్థక్షేత్రాలను ఆశ్ర యించిన పురాణగాథలు ఎన్నో ఉన్నాయి. చారిత్రకంగా నేటికీ అందుకు తార్కాణాలున్నాయి. ఏ విధమైన ఆధ్యాత్మిక సాధనకైనా పుణ్యక్షేత్ర, తీర్థ యాత్రలు బలాన్నిస్తాయి, ఫలాన్నిస్తాయి అనడంలో సందేహం లేదు. దీనికి శాస్త్ర ప్రమాణమూ, మహాత్ముల అనుభవ ప్రమాణమూ ఉన్నాయి.

ప్ర: **జ్యోతిషం, వాస్తు– ఇవన్నీ శాస్త్రాలేనా? ఒకరు చెప్పినవి జరగడం, మరొకరు చెప్పినవి జరగకపోవడం ఏమిటి? ఒకరికీ, మరొకరికీ తేడా ఉన్నప్పుడు శాస్త్రంగా ఒప్పుకోవచ్చా?**

**జ:** శాస్త్రం వేరు, శాస్త్రవేత్తలు వేరు. శాస్త్రంలో ఒక్కొక్కరి అభ్యాసం, పరిశోధన, అధ్యయనం, అవగాహన... ఒక్కొక్క విధంగా ఉంటుంది. చక్కని అవగాహన, సమగ్ర మైన అధ్యయనం ఉన్న శాస్త్రవేత్త కచ్చితంగా సమాధానాలు చెప్పగలడు.

వైద్యులందరూ వైద్యశాస్త్రం చదివినా, కొందరి హస్తవాసి మాత్రమే బాగుండటం, ఒక వైద్యుడు సవరించలేని దానిని మరో వైద్యుడు సవరించడం మనం చూస్తున్నాం. అంత మాత్రాన అది శాస్త్రం కాకుండా పోదు కదా! అది ఆయా విద్యల్లో సాధించిన పరిణతి, నైపుణ్యం మీద ఆధారపడి ఉంటుంది. కాబట్టి తేడా కనిపించినంత మాత్రాన జ్యోతిషాదుల్ని 'శాస్త్రం కాదు' అనలేం.

ప్ర: **విగ్రహాల్లో దేవుళ్లుంటారా?**

**జ:** ఉండి తీరతారు. ఒక ఆకృతి ఇవ్వగానే, ఒక భావం కూడా ఆవిష్కరింపబడుతుంది. ఈ రెండూ కలసి ఒక ప్రభావాన్ని ఏర్పరుస్తాయి. ఒక చక్కని దృశ్యాన్ని చూసినప్పుడు ఆహ్లాదం, వికృత దృశ్యం చూస్తే ఆందోళన కలగడం సహజమే కదా! అలాగే దేవతాకృతి చిత్రంగానైనా, శిల్పంగానైనా కనబడితే ఎదుటివారిలో ఆ దేవతా లక్షణాన్ని తెలియజేస్తూ స్పందింపజేస్తుంది. అయితే ఆరాధన సమయంలో విగ్రహాలలో 'ఆవాహన' అనే కార్యక్రమం జరుగుతుంది. కొన్ని చోట్ల 'ప్రాణప్రతిష్ఠ' చేస్తారు. అంటే– మనం ధ్యానించే దైవమూర్తిని శబ్దశక్తి (మంత్రం) ద్వారా, భావన ద్వారా బింబం (విగ్రహం/ యంత్రం)లో ఆవహింప జేయడం. ఇది జరిగాక– మన నమ్మకాలతో పనిలేదు. అందులో దైవశక్తి వచ్చి తీరుతుంది. దానిని ఆరాధించడం అనేది మన అదృష్టం మీద ఆధారపడుతుంది. దురదృష్ట వంతులకి విగ్రహంలోనే కాదు, దైవంలోనూ దైవం కనబడదు.



ప్ర: **రుద్రసూక్తం రోజూ పారాయణ చేయడం మంచిదంటారు. కానీ అభిషేకం చేస్తున్నప్పుడే దానిని చదవాలని కొందరంటున్నారు. ఏది శ్రేష్ఠం?**

**జ:** రుద్రసూక్తాన్ని అభిషేకం చేస్తున్నప్పుడు మాత్రమే చదవాలని లేదు. అభిషేకంలో వినియోగించడమే కాక, శుచిగా ఆసీనుడై స్వర, అక్షర లోపం లేకుండా పారాయణ కూడా చేసుకోవచ్చు.

ప్ర: **భగవంతుని నామం ఏఏ సమయాల్లో, ఏ ఏ నియమాల్లో చేయాలి? వాటికి ఉపదేశం ఉండాలా?**

**జ:** భగవన్నామ జపానికి ఇది సమయమనీ, ఇది నియమమనీ లేదు. సర్వకాల సర్వావస్థలలోనూ చేయవచ్చు. రామ, కృష్ణ, శివ, దుర్గ, లక్ష్మి, సరస్వతి వంటి ఏ నామమైనా, ఏ సమయంలోనైనా స్మరించవచ్చు. నియమాలూ, పద్ధతులూ మంత్రజపానికి మాత్రమే అవసరం.

నామ జపానికి ఏ ఉపదేశాలూ అక్కర్లేదు. మంత్ర జపానికి మాత్రం ఉపదేశం అవసరం. సర్వకాల సర్వావస్థల్లోనూ నామజపం చేయడం వల్ల భగవత్కృప తప్పక లభిస్తుంది.

**ప్ర: మా ఇంట్లో ఒక స్ఫటికపు గణపతి విగ్రహం ఉంది. అదీ మధ్య కిందపడి కాస్త పగులు చూపింది. ఆ వినాయకుని పూజించరాదంటున్నారు. నిజమేనా?**

**జ:** పగిలిన విగ్రహాన్ని పూజించరాదు. దానిని ఏ నదిలోనో, సముద్రంలోనో, నూతిలోనో వదలి – కొత్త విగ్రహాన్ని తెచ్చి పూజించుకోండి.

**ప్ర: భగవంతుడు సర్వత్రా ఉన్నప్పుడు దేవాలయాలెందుకు ఏర్పాటు చేశారు. కాస్త వివరిస్తారా?**

**జ:** సర్వత్రా (అన్నిచోట్ల) భగవంతుడ్ని చూడగలిగేటంత స్థితి మనకు ఉంటే దేవాలయాలతో పనిలేదు. ఆ స్థితి కలగడానికే దేవాలయం. అంతేకాక – దేవాలయ నిర్మాణం ఆగమ శాస్త్ర రహస్యాలతో ఉన్నది. వాటి ద్వారా సూక్ష్మ ప్రపంచంలోని దివ్యశక్తులు ఆ పరిసర ప్రాంతాలను క్షేమంగా మలచుతాయి.

ఏ అవధూత స్థాయిలోనో చెప్పాల్సిన మాటని, అన్నిటికీ అన్వయించకూడదు. మనం ఆ స్థాయిలో ఉన్నామా లేదా అని చూడాలి.



**ప్ర: మా బంధువుల్లో కొందరు రేకీ అనీ, ప్రాణిక్ హీలింగ్ అనీ కొన్ని విద్యలలో ప్రవీణులున్నారు. అయితే వాళ్ళు నిత్యపూజాదికాలు, శ్రాద్ధ, శౌచాదులు పాటించరు. "మా దగ్గర 'హీలింగ్ పవర్స్' ఉన్నాయి కనుక, మాకు ఇంక వేటితోనూ అవసరం లేదు" అంటారు. అది సమంజసమా!**

**జ:** ఎన్ని విద్యలూ, శక్తులూ సంపాదించినా అనూచాన మైన సంప్రదాయాల్ని కాదనరాదు. అవి మనకున్న సహజ ఋణాలను తీర్చుకోవడానికి, సూక్ష్మమైన ధర్మరహస్యాలతో కూడినవి. వాటిని కాదన్నాక ఏ హీలింగ్సుతోనూ ప్రయోజనం లేదు. అందులోనూ ఒకరకంగా మన సనాతన ధర్మాన్ని దెబ్బ తీసే విధానాలుగా ఈ కొత్త విద్యల్ని వాడరాదు. మనది మనం కాపాడుకుంటూనే మిగిలినవి నేర్చుకొని, ఉపయోగించవచ్చు.

**కురు కర్మైవ తస్మాత్ త్వం**
**పూర్వైః పూర్వతరైః కృతమ్ ॥**

మన పూర్వతరం వారు, వేదశాస్త్రాదుల ఆధారంగా పాటిస్తూ వచ్చిన పరంపరాగత

ధర్మాన్ని వదలరాదు - అని శ్రీకృష్ణపరమాత్ముని వచనం. మన పరంపరని వది లేసేలా చేసే ఏదైనా సరే, ఒక విధంగా మనకు శత్రువే.

**ప్ర: ఇంటిగుమ్మానికిపైన గణపతి పటం వంటివి పెట్టుకుంటే, మన రాక-పోకల సమయాల్లో దాటినట్లు అవదా?**

**జ:** గుమ్మానికి పైన-అంటే శిరోభాగానికి పైనే కనుక- దాటినట్లు అవదు. పైగా అలా ఉండడం ఇంటికి మంచిది. మనకీ మంచిది.

**ప్ర. వేదాలను సోమకాసురుడు అపహరించగా విష్ణువు మత్స్యావతారమెత్తి, ఆ రాక్షసుని సంహరించి, వేదాలను కాపాడి బ్రహ్మకు ఇచ్చాడని ఒక కథ ఉంది. మరొక చోట మధుకైటభులనే రాక్షసులు వేదాపహరణ చేశారని, విష్ణువు హయగ్రీవ అవతారమెత్తి అసుర సంహారం చేశాడని ఉంది. ఈ రెండింటిలో ఏది నిజం? వేదాలు పుస్తక రూపంలో బ్రహ్మవద్ద ఉన్నాయా?**

**జ.** మీరు చెప్పిన రెండు కథలూ పురాణాల్లో ఉన్నవే. రెండింటినీ నిజాలుగా స్వీకరించ వచ్చు. వివిధ సందర్భాల్లో జరిగిన వివిధ ఘట్టాలుగా వీటిని భావించవచ్చు. అసుర శక్తుల విజృంభణ వివిధ కాలాల్లో జరుగుతూనే ఉంటుంది. ఆయా సమయాల్లో భగవదవతారాలు ఏర్పడతాయి. కల్ప భేదాల్లో జరిగిన కథా భేదాలైనా కావచ్చు. లేదా ఒకే కల్పంలో రెండు భిన్న ఘట్టాలైనా కావచ్చు.

వేదాలు పుస్తక రూపంలో ఉన్నాయని భావించనక్కరలేదు. అవి పురుషరూపాల్లో ఉంటాయని శాస్త్రవర్ణనలున్నాయి. వాటిని అసురులు అపహరించారని అనుకోవచ్చు. మీరు చెప్పిన రెండు కథలేకాక, దేవీ భాగవతంలో మరో కథ కూడా ఉంది.

'దుర్గముడు' అనే రాక్షసుడు బ్రహ్మదత్త వరం చేతనే, సమస్త వేదరాశినీ తన వద్దనే దాచి ఉంచి, అది లోకానికి ప్రకటింపబడకుండా ఉండేశక్తిని సంపాదించాడు. వేదవిజ్ఞానం లోకం నుండి లుప్తమయింది. అప్పుడు దేవతల, ఋషుల ప్రార్థన మేరకు జగదంబ అసురుని సంహారం చేసిందని, తద్వారా ఆమెకు 'దుర్గా'నామం లభించిందని కథ. మొత్తానికి ఈ కథల సారాన్ని సమన్వయించుకుంటే లోకరక్షణకి పనికివచ్చే వేద విజ్ఞానాన్ని, లోకకంటకులైన అసురులు దొంగిలించి, విశ్వక్షేమానికి భంగం కలిగిం చారు. తిరిగి భగవచ్ఛక్తి అవతరించి వేదాన్ని ఉద్ధరించింది.

స్వార్థపరమై, హింసాప్రవృత్తి కలిగిన లక్షణమే అసురత్వం. అది రజోగుణ, తమోగుణాల ఆధిక్యం కలిగినది. సత్త్వగుణం జ్ఞానాన్ని సాధించగలిగే ప్రవృత్తి.

దాని అందుబాటులో ఉన్న జ్ఞానాన్ని, మిగిలిన రెండు గుణాల వలన పోగొట్టు కొనడమే–ఈ కథల్లోని సంకేతవాదం.

అసురశక్తులు (రాక్షసప్రవృత్తులు) బుద్ధిని ఆక్రమిస్తే, జ్ఞానాన్ని కోల్పోతాం. భగవదు పాసన వలన, సాధన వలన తిరిగి ఆ అవరోధాలను తొలగించుకోగలగాలి. పై కథలను ఈ కోణంలో సమన్వయించుకోవాలి.

ప్ర: **"భారతానికి 'పంచమవేదం' అనే పేరు రావడానికి రెండు అంశాలే కారణం– 1. భగవద్గీత, 2.విష్ణుసహస్రనామాలు. ఈ రెండూ ఉన్నాయి కనుక భారతాన్ని పంచమవేదం అన్నారు. ఈ రెండూ మినహాయిస్తే మరేమీ లేవు వేదంతో పోల్చడానికి" అని కొందరంటున్నారు? ఇది సమంజసమేనా?**

**జ:** భారతానికి ఆ రెండింటి వలన మాత్రమే 'పంచమ వేదం' అనే పేరు వచ్చిందని ఎక్కడా ప్రమాణవాక్యాలు లేవు.

ఆ రెండూ గొప్ప గ్రంథాలు–అనడంలో సందేహం లేదు. కానీ వాటి వల్లనే వేదసమాన ప్రాధాన్యం వచ్చిందనలేము. భారతమంతా ధర్మాలమయం, ఎన్నో ధర్మసూక్ష్మాలు, వేదాంత శాస్త్రాంశాలు కుప్పలు తెప్పలుగా ఉన్నాయి. ప్రతి పర్వంలో ఉపోద్ఘాతాల రూపంలోను, ఉపదేశాలుగాను, ఉపాఖ్యానాలగాను, సంభాషణలుగాను ధర్మజ్ఞానాంశాలున్నాయి.



శాంతి అనుశాసనిక పర్వాలు వేదవేదాంత ధర్మాలను రాశులుగా అందించాయి. సనత్సుజాతీయ సంహిత, శివ సహస్రనామస్తోత్రం సూర్య అగ్ని విషయాలు వంటి గొప్ప జ్ఞాన, ఉపాసనా గ్రంథాలు కూడా ఉన్నాయి. వీటన్నిటి కారణంగా ఇది 'పంచమవేదం' అనే కీర్తిని పొందింది.

ప్ర. **'శ్వేతదీపం' అంటే యూరోప్ ఖండమని కొందరంటున్నారు– అదే శ్వేతద్వీప వైకుంఠ మనీ, అక్కడి నుండే విష్ణుభక్తి భారతదేశంలోకి వచ్చిందని ఒక చోట చదివాను. అదే విధంగా 'టిబెట్' అంటే 'త్రివిష్టపం' (స్వర్గం) అని, పాండవులు మహా ప్రస్థానంలో వెళ్లిందక్కడికేనని కూడా వ్రాశారు. ఇది ఎంతవరకు సమంజసం?**

**జ.** ఇలాంటి రాతలు చాలా వచ్చాయి. కానీ ఇవేవీ ప్రమాణాలు కావు. ఏదో 'టిబెట్' మాటకి, స్వర్గానికున్న పేర్లలో ఒకటి సరిపోయినంత మాత్రాన అది ఇదేననడం అసమంజసం.

స్వర్గవర్ణనకీ, టిబెట్‌కీ సంబంధం లేదు. అయితే హిమాలయప్రాంతం కనుక

అది పవిత్రమూ, మహిమాన్వితమూ అనడంలో సందేహం లేదు. కానీ అదే స్వర్గధామం అనడం ఔచిత్యం కాదు. స్వర్గరాజధాని అమరావతి. అందుకని గుంటూరు జిల్లాలోని అమరావతియే ఇంద్రుని రాజధానీ నగరం- అనవచ్చా? అదే నామము, లేదా నామసామ్యం ఉన్నంతమాత్రాన సరిపోతుందా?

ఇక- శ్వేతదీప వైకుంఠం అన్నది భూమికి సంబంధించినది కాదు. తెల్లవారి ద్వీప మైనందుకు 'శ్వేతద్వీపం' అని మనం వ్యవహరించవచ్చు. లేదా ఏదో ప్రాచీన గ్రంథా లలో యూరోప్ పేరు ఆ విధంగా మనవాళ్ళు చెప్పి ఉండవచ్చు. కానీ శ్వేత ద్వీప వైకుంఠం అది కాదు.

ఒకప్పుడు భారతీయమైన వైదికమతం ప్రపంచమంతా ఉండేది-అనే మాట వాస్తవమే. బహుశా- యూరోప్‌లో కూడా ఉండి ఉండవచ్చు. కానీ దీనిని వైకుంఠపరమైన శ్వేతద్వీపం అనడం తగదు.

శ్వేతద్వీపవాసులు ముక్తులు. భోగలాలసులు కారు. 'వారి శరీరం తేజోమయం. స్వేదం లాంటి వికారాలు లేనిది. ఆధి వ్యాధులు లేనిది. రెప్పపాటు లేనిది'-అని మన శాస్త్రాలు వర్ణించాయి. అది భూమిలోని భాగం కాదు. దివ్యభూమిక, దానిని దీనితో కలిపి చెప్పడం అసంగతం. పురాణాల్లోని అలౌకికాంశాలను లౌకికంతో ముడిపెట్టడం కంటె వాటిని కల్పితాలుగా అనుకున్నా తప్పులేదు. ఈ లోకంలో చూడలేనిది 'లేదు' అనే నాస్తిక మూర్ఖత్వం ఎలానూ ఉంది.



దివ్యభూమికలను భౌతిక దృష్టితో చూడాలనుకోవడమే మొదటి అవివేకం. దానికి తోడు భౌతికస్థాయికి దివ్యత్వాన్ని దించడం మరో మూర్ఖత్వం.

**ప్ర. "ముస్లిములు నిరాకారాన్ని ఆరాధిస్తారు. వారికి గుళ్ళులేవు. విగ్రహాలు లేవు. అందుకే వాళ్ళు అద్వైతానికి దగ్గరగా ఉన్నారు" అని ఈ మధ్య ఒక అద్వైత పండితులు సెలవిచ్చారు. అంటే మన హిందూమతంలోని ఆలయాలు, దేవుళ్ళు, విగ్రహాలు అద్వైతానికి దూరంగా ఉన్నట్లా? ఆయన మాట వినగానే ఆశ్చర్యం కలిగింది. కొంచెం వివరించగలరా?**

**జ.** మీరు చెప్పిన ప్రకారంగా చూస్తే- ఆ సెలవిచ్చిన ఆయన అద్వైత పండితులు కారు. కేవలం ఏకపక్షదృష్టితో, పండితాహంకారంతో అని ఉంటారని సవినయంగా మనవి చేసుకుంటున్నాను. ఇటువంటి మాటలు క్రమంగా ద్వేష, వైషమ్యాలకు దారితీయవచ్చు. ప్రతి మతంలోనూ మంచి విషయాలుంటాయి. కనుక ఎవరి మతాన్ని

వారు అనుసరిస్తూ, ఇతరుల ధర్మాలను గౌరవించడం సరియైన పద్ధతి.

అద్వైతం కూడా హిందూమతానిదే. అసలైన అద్వైతం ప్రకారం పరమాత్మ సర్వవ్యాపకుడు. పరమాత్మకు భిన్నంగా ఏదీ లేదు. కానీ 'దేహమే నేను' అనే భావం సామాన్యం. అది కలిగిన వారెవ్వరూ సర్వవ్యాపక బ్రహ్మను అనుభవ పూర్వ కంగా తెలుసుకోలేరు. సర్వసమర్థుడైన పరమాత్మనే ఆరాధిస్తున్నప్పుడు, ఆయన తత్త్వాన్ని తెలియజేసే ప్రతీకలనో, ఆలంబనలనో ఆధారం చేసుకోవడం సహజం. విగ్రహంలో, అగ్నిహోత్రంలో, దీపంలో, ఉత్తమ ధాతువుల్లో, శిలల్లో–పరమాత్మ యొక్క వివిధ శక్తులు వ్యక్తమౌతాయి. వివిధ రూపాలుగా విగ్రహాదులయందు, ఆవాహనాది శాస్త్రవిధులతో దివ్యత్వాన్ని కేంద్రీకృతం చేసి, ఫలితాలను పొందడం నేటికీ అను భవంలో ఉంది. ఇది ఒక ప్రత్యేక శాస్త్రం.

ముస్లిం సోదరులు కూడా మసీదులను ఏర్పరచారు. లెక్కకందనన్ని ఉన్నాయి. అంతటా చూడడం సాధ్యమైతే అవి ఎందుకు? వారికీ పరలోక విశ్వాసముంది. అద్వైతంలోని జీవన్ముక్తి భావం వారిలో లేదు. విగ్రహం లేకపోవచ్చు కానీ, వారికీ ఏ గోడో, ఏ కట్టడమో ఆలంబనగా, ప్రతీకగా ఉన్నాయి. వారి ప్రధానక్షేత్రమైన మక్కాలో నల్లని రాయి (శివలింగం వలె ఉన్నది) ఈశ్వరస్వరూపంగా ఆరాధింప బడుతోంది. జీవేశ్వర భేదం వారి మతంలో స్పష్టం.

ఇవన్నీ పరిశీలిస్తే ద్వైతభావాలే ఉన్నాయి. కేవలం ఆకారం లేకుండా ఆరాధించి నంత మాత్రాన అద్వైతానికి దగ్గరైపోతుందా? అద్వైతంలోని శ్రవణ, మనన, నిధి ద్యాసనలు వారిలో లేవు. మన హిందూమతంలో ఉన్న అన్ని సాధనా మార్గాలు సత్సంప్రదాయాలు. ప్రతి సంప్రదాయం దృష్టిలో ఈశ్వరుడు సర్వవ్యాపకుడు. జన్మలను, లోకాలను అద్వైతం కూడా కాదనదు. అంతా ఈశ్వరమయంగా చూడడమే అద్వైతం. జ్ఞాన దృష్టితో చేసే విగ్రహారాధనలు, జపతపాలు, ఉపాసనలు చిత్తశుద్ధి నిచ్చి, క్రమంగా అద్వైతనిష్ఠను అందిస్తాయని అసలైన అద్వైతానుభవజ్ఞులు (ఆది శంకరాదులు) సెలవిచ్చిన మాట. 'నిరాకార' 'నిర్గుణ' అనే మాటలు మన మతంలో పెక్కు చోట్ల వినబడుతూనే ఉంటాయి. ఆ తత్త్వానికి అభిన్నంగా సగుణసాకారంగా ఆరాధించడం ఒక ఉత్తమమైన సౌలభ్య మార్గం.

ఇంకొకరి మార్గాలని నిరసించడం, ధ్వంసం చేయడం అద్వైత పద్ధతి కాదు. అన్నిటినీ పరబ్రహ్మజ్ఞానం దిశగా సమన్వయించేదే అద్వైతం. ఆ మార్గంలో మన

ఆలయాలు, భక్త్యుపాసనలు, యాగాలు, యోగాలు... అన్నీ సహకరిస్తాయి. ఆ మార్గానికి మీరు చెప్పిన మతం చాలా దూరంలోనే ఉంది. వేదాది శాస్త్రప్రమాణంగా ఏర్పరచిన సంప్రదాయ మార్గాలన్నీ అద్వైత లక్ష్యంతో ఉన్నవే. ప్రతి మార్గంలో సంపూర్ణ ఈశ్వరజ్ఞానం ఉంది. ఆ విధమైన జ్ఞానాన్నే వివిధ ప్రతీకలుగా– అగ్నిహోత్ర, మంత్ర, యంత్రాదుల ద్వారా కూడా వ్యక్తపరచారు.

కేవలం కొన్ని నియమాలను ఏర్పరచుకొని, భగవంతుని 'ఆకారం' లేనివాడిగా భావిస్తున్న ఆ మతం– ఆ మేరకు గొప్పదే. అంత మాత్రంచేత వారి మతం అద్వైతానికి సమీపం– అని వాక్రుచ్చడం అవగాహనా రాహిత్యమే. లోకక్షేమానికి ఈ ఆలయాది వ్యవస్థ చాలా గొప్పది. వివిధ దేవతలు, వారి ఆకృతులు, వారి శక్తులు– వీటి ఉనికిని అద్వైతం నిరసించలేదు. ఆ పనే చేస్తే అది 'నాస్తికం' అనిపించుకుంటుంది. వాటన్నిటినీ ఏక పరబ్రహ్మమయంగా దర్శించే తెలివియే అసలైన జ్ఞానం.

అనాదిగా పూర్తి విజ్ఞాన సరళిలో, లోతైన తాత్త్విక స్పృహతో ఏర్పరచిన మన మతసంప్రదాయాలను, సంపూర్ణ పరిశీలన లేకుండా తూలనాడడం బాధాకరం.



**ప్ర. 'కల్పశాస్త్రం' అంటే ఏమిటి? ఈ శాస్త్రాలు ఎలా ఉంటాయి? అవగాహన కోసం కాస్త వివరించగలరు.**

**జ.** సిద్ధరూప ప్రయోగో యైః కర్మణా మనుగమ్యతే తే కల్పాః–అని శాస్త్రవాక్యం. వేదం చెప్పిన కర్మలను అనుష్ఠించే పద్ధతులను స్థిరపరచి బోధించే గ్రంథం కల్పం. ఒక పని చేసేటప్పుడు చేతులకెంత ప్రాముఖ్యముందో, వైదిక కర్మానుష్ఠానాలలో కల్ప సూత్రాలకు అంతటి ప్రాధాన్యముంది.

ఈ కల్పం ఒక్క శాస్త్రగ్రంథం మాత్రమే కాదు. వివిధాలుగా ఉంటుంది.

**1.** శ్రౌతసూత్ర, **2.** గృహ్య సూత్ర, **3.** ధర్మ సూత్ర నామాలతో కల్పం ప్రధానంగా మూడు భాగాలు.

నేరుగా వేదపద్ధతులను చెప్పేది శ్రౌతసూత్రాలు. అలాంటివి కాకుండా చెప్పే విధి వాక్యాలు మిగిలిన రెండు. అయితే అవి కూడా వేద ప్రామాణ్యాన్ని గౌరవించేవే. వాటికీ ఆనాటి కాలంలో వేదమూలాలు ఉండి ఉంటాయి. ఇప్పుడు అవి కొందరు శిష్టులైన అనుష్ఠాతల వల్ల నిలబడ్డాయి. ఆపస్తంబుడు, బోధాయనుడు, కాత్యాయ నుడు, గోభిలుడు, ఆశ్వలాయనుడు, శాంఖాయనుడు, ద్రాహ్యాయణుడు, జైమిని, కౌషీతకి, కౌశికుడు మొదలైనవారు గృహ్యసూత్రకారులు.

ఇవన్నీ వివిధ సంస్కారాలను చెబుతాయి.

ధర్మసూత్రాలు మనువు, యాజ్ఞవల్క్యుడు మొదలైన వారు రచించారు. ఇవి కూడా వివిధ సంస్కారాలను, ధర్మాలను తెలియజేస్తాయి. వేద మూలకమైన ధర్మాలను బలపరచడానికి ఇవి ఏర్పడ్డాయి.

**ప్ర. సంస్కృతికీ, సంస్కారానికీ తేడా ఏమిటి? శాస్త్రపరంగావాటి అర్థాలేమిటి? అవసరమేమిటి?**

**జ.** సంస్కారం, సంస్కృతి– రెండూ సమానార్థకాలే. ముడిగా దొరికే బంగారాన్ని అగ్ని ద్వారా శుద్ధి చేసినట్లుగా, పశుప్రాయంగా పుట్టిన మానవుని సంస్కరించడమే సంస్కారం.

**"సంస్క్రియతే జ్ఞానయోగ్యతామాపాద్యతే పురుషస్య చ్ఛితమనేనేతి సంస్కారః"**– అని ఉత్పత్తి. చిత్తాన్ని శుద్ధి చేసి,దానిని ఆత్మజ్ఞాన యోగ్యంగా చేయడమే సంస్కారం. సంస్కారాలు రెండు రకాలు: 1. దోషాన్ని పోగొట్టేవి, 2. యోగ్యతను, గొప్పతనాన్ని కల్పించేవి.

జననానికి పూర్వరంగంగా తల్లిదండ్రులకు చెందిన మైథున సంకల్పాది పైతృక బీజదోషాలను, మాతృగర్భ వాసం వలన కలిగిన సంసర్గాది దోషాలను పరిహరించేవి– గర్భాధాన, జాతకర్మ, చౌలాది సంస్కారాలు. మిగిలినవి యోగ్యతను కలిగించేవి. తాత్పర్యంగా– **అంతఃకరణ శుద్ధికోసమే సంస్కారాలు.** తగిన సంస్కారాన్నిచ్చి దీక్షలను, ఉపదేశాలను అందించడం సంప్రదాయం. ఆ దీక్షాదుల వల్ల జీవుడు మరింత శుద్ధుడౌతాడు.

"ఒక విగ్రహాన్ని శిల్పించదలచిన శిల్పి, రాతిపై అక్క డక్కడ కొన్ని చిన్న చిన్న సంకేతాలను పెట్టుకొని, దాని ననుసరించి రేఖలను నిర్మించి, అటుపై చెక్కి తానను కున్న రూపాన్ని ఏర్పరచుతాడు. ఇన్ని సంస్కారాల వలన ఆ చిత్రం, శిల్పం ఒక సృష్టిస్వరూపం ధరించి చూపరుల కానందం కలిగిస్తుంది. ఈ విధంగానే మంత్ర ద్రష్టలైన మహర్షులు ఏర్పరచిన సంస్కారాలతో పశుప్రాయమైన జన్మ, పరిపూర్ణతకు దారితీస్తుంది"– అని పరాశర మహర్షి వివరించారు.

**ప్ర. ఏ ఊళ్లోనైనా శ్మశానం ఉంటుంది. మరి కాశీని మాత్రమే 'మహాశ్మశానం' అంటారెందుకు?**

**జ.** 'శ్మశానం' అంటే 'లయమయ్యే చోటు' అని ప్రధానార్థం. ప్రతి ఊళ్లో శ్మశానాలలో

శరీరాలు లయమౌతాయి. మళ్ళీ జీవుడు జనన మరణ ప్రవాహంలో పడతాడు. కానీ కాశీలో మరణించినవారి శరీరాలే కాదు, జీవుడే పరమాత్మలో లయమౌతాడు. మరి జన్మించడు. జీవులు లయమయ్యే చోటు, తిరిగి సంసారబంధంలోపడని శాశ్వతముక్తిని పొందేచోటు "మహాశ్మశానం". బ్రహ్మ జ్ఞానం పొందిన యోగి కూడా మోక్షాన్ని (శాశ్వత లయని) పొందుతాడు కనుక, తత్త్వపరంగా 'బ్రహ్మ జ్ఞానమే మహాశ్మశానం. అది అజ్ఞానాంధకారం లేని 'వెలుగు' కనుక 'కాశి' క్రాంతి క్షేత్రం.

మరో కోణంలో-ప్రళయ కాలంలో అన్నీ నశించినా, తాను మాత్రం శాశ్వతంగా ఉండే చోటు కనుక కాశీ 'మహాశ్మశానం'.

ప్ర. **లలితా సహస్రనామాల్లో 'కరాంగుళినఖోత్పన్న నారాయణ దశాకృతిః' అనే నామం ఉంది. అమ్మవారి చేతి వేళ్ళగోళ్ళ నుండి విష్ణు దశావతారాలు వచ్చాయని దాని భావం కదా! మరి వైకుంఠంలోని విష్ణువు వివిధ కాలాలలో పది అవతారాలెత్తాడని పురాణాలు చెబుతున్నాయి. ఈ రెండూ ఎలా కుదురుతాయి. దేనిని ప్రమాణంగా గ్రహించాలి?**



జ. పురాణాల్లో కొన్ని కథలు తేడాలుగానే కనిపిస్తాయి. వాటిని జాగ్రత్తగా సమన్వయించుకోవాలి. అవతారాలన్నీ ఒకేసారి జరిగినవి కావు. విభిన్న సందర్భాల్లో జరిగాయి. కానీ లలితాదేవి చేతివేళ్ళ గోళ్ళ నుండి ఒకేసారి దశావ తారాలు ఆవిర్భవించినట్లు చెప్పారు. ఈ కథ ఉపాసనా పరమైన అంశం. దశావతారాలు విడివిడిగా జరిగినా, మనం వాటిని ఏకంగానే ఆరాధించాలి. వాటన్నిటి అనుగ్రహం మనకి ఉండాలి. ఇవి శ్రీహరి దాల్చిన అవతారాలే. సందేహం లేదు.

అయితే అమ్మవారి కరాంగుళుల నుండి జరిగాయని చెప్పడంలో ఆంతర్యం వేరు. సర్వదేవతాత్మకమైన పరా శక్తి లలితాదేవిని ఉపాసించేవారికి ఈ తత్త్వం అవసరం. ఆమెయే విష్ణురూపిణి-వైష్ణవి. చేతులు స్థితికి సంకేతం. స్థితికారకుడైన హరిస్వరూపం అమ్మవారి హస్తాలు. **"బాహవో విష్ణుతేజసా"** - సర్వదేవమయి అయిన జగ దంబ చేతులు విష్ణుతేజస్సుతో ఏర్పడినవి- అని 'మార్కండేయపురాణం'లోని 'దేవీ మాహాత్మ్యం' చెబుతోంది.

శ్రీవిద్యాధిదేవత అయిన లలితోపాసనలో సర్వదేవతారాధనలు సమైక్యంగా ఉన్నాయి. అందులో విష్ణూపాసన ఒకటి. ధర్మాన్ని దెబ్బతీసే అసురశక్తులను నశింపజేసే నారాయణుని దశావతారాలను ఉపాసించాలని ఈ ఘట్టంలోని ఆంతర్యం.

**ప్ర: కృష్ణుని శంఖం పేరు 'పాంచజన్యం' అంటారు. ఇలా ఒక్కొక్కరికి ప్రత్యేక నామాలున్న శంఖాలుంటాయా! కృష్ణునితో పాటు పాండవులకి కూడ ప్రత్యేక శంఖాలున్నాయా? వాటి పేర్లు ఏమిటి?**

**జ:** 'పంచజనుడు' అనే జలరాక్షసుని శ్రీకృష్ణుడు సంహరించి అతడి శరీరం నుండి జనించిన శంఖాన్ని ఉపయోగించాడు. అదే పాంచజన్యం.

ఇక పంచపాండవులకీ ప్రత్యేక శంఖాలున్నాయి. ధర్మరాజు శంఖం అనంత విజయం. అర్జునుని శంఖం దేవదత్తం. భీముని శంఖం పౌండ్రం. నకులుని శంఖం సుఘోషం, సహదేవుని శంఖం మణిపుష్పకం.

**ప్ర: గంగకు 'త్రిపథగా' అనే పేరు ఎందుకు వచ్చింది?**

**జ:** విష్ణుపదం నుండి గంగ భగీరథుని తపఃఫలంగా వచ్చేటప్పుడు దేవతల ప్రార్థన మేరకు స్వర్గంలో ఒక ప్రవాహంగా చేరిందని పురాణగాథ. అదేవిధంగా భూమిపై ఒక ప్రవాహంగా భగీరథుని వెంట చేరి సగరులను తరింప జేసింది. క్రమంగా పాతాళం చేరి అక్కడి వారి వేడికోలు మేరకు అక్కడ కూడా ప్రవహించింది.

ఇలా ముల్లోకాలలో ప్రవహించిన కారణంగా గంగాదేవికి 'త్రిపథగా' అనిపేరు. 'మూడు తోవల పయనించినది' అని అర్థం. స్వర్గంలో 'మందాకిని'గా, భూమి యందు 'భాగీరథి'గా, పాతాళంలో 'భోగవతి'గా గంగకు మూడు పేర్లు.



**ప్ర: 'శివసహస్రనామస్తోత్రం' మహాభారతంలో లేదని, దానిని 'నీలకంఠదీక్షితులు' (శైవుడు కనుక) భారతంలో ప్రక్షిప్తం చేశారని ఒక వైష్ణవ పండితుడు ఇటీవల ఒక పత్రికలో వ్రాశారు. మరోచోట మరికొందరు వైష్ణవప్రముఖులు కరపత్రాలుగా కూడా పంచుతూ, మహాభారతంలో శివుని గురించి గొప్పగా ఎక్కడా చెప్పలేదనీ, తిక్కనగారు కూడా భారతాంధ్రీకరణలో శివసహస్రం ప్రసక్తి తీసుకు రాలేదని తెలియజేశారు. దీనిలో వాస్తవాలు ఎంతవరకు?**

**జ:** మహాభారతంలో ఎన్నో విషయాలను, తమకు నచ్చని వాటన్నిటినీ 'ప్రక్షిప్తాలు' అని తీసిపారేసే ఒక రకపు 'మేధావులనుకొనే వర్గం' చాలా కాలం నుండి ఉన్నారు. వీరు కూడా ఆ వర్గంలో ఒకరు అని చెప్పవచ్చు.

నీలకంఠదీక్షితులు భారతానికి వ్యాఖ్య వ్రాశారు. అందులో భాగంగా భారతంలో ఉన్న శివసహస్రనామస్తుతికి కూడా వ్యాఖ్య వ్రాశారు. దానిని ఎక్కడి నుండో తెచ్చి అక్కడ ప్రక్షిప్తం చేయవలసిన అవసరం దీక్షితులకు లేదు.

ఆ గ్రంథాన్నే విడిగా వ్యాప్తి చేసినప్పటికీ ప్రసిద్ధి పొందగలదు. భారతంలో లేని ఎన్నో గ్రంథాలు ప్రాచ్యుర్యమై, పారాయణలు చేయబడుతున్నాయి.

అసలు భారతంలోనిదిగా ప్రసిద్ధి పొందిన శివసహస్రమే కానీ, ఇంకా 'శివపురాణంలో, పద్మపురాణంలో, దేవీపురాణంలో, రుద్రయామళంలో, చాలా ఆర్షగ్రంథాలలో ఎన్నో శివసహస్ర నామాలున్నాయి. కూర్మపురాణంలో, శివపురాణంలో కూడా శ్రీకృష్ణుడు ఉపమన్యువు ద్వారా శివజ్ఞానోపదేశం పొంది, శివారాధన చేసినట్లు ఉన్నది. ఎవరి దేవతా భక్తులు వారి దేవతా ప్రాధాన్యాన్ని చెప్పిన గ్రంథాలను వారు ప్రమాణంగా తీసుకోవడం దోషం కాదు. తిక్కనగారు ఆంధ్రీకరించలేదు, ప్రస్తావించ లేదు కనుక భారతాంతర్గతం కాదని ఎలా అనగలము! ఆయన ఎన్నిటినో ఆంధ్రీ కరించలేదు. కొన్నింటిని అసలు ప్రస్తావన చేయలేదు. అంత మాత్రాన భారతంలో లేవని అనలేము. ఆయన భారతాన్ని యథాతథంగా అనువదించిన వాడు కాదు. కావ్యంగా తనకు తగిన ఔచిత్యాలను మాత్రమే తీసుకున్నాడు.

ఆ మాటకొస్తే – 'భగవద్గీత' 'విష్ణుసహస్రనామం' వంటివి కూడా భారతంలోనివి కావనీ, అవికూడా ప్రక్షిప్తాలేనని కొన్ని ప్రమాణాలతో కొందరు పండితులు వ్రాశారు. ఆ మాటల్ని పట్టుకొని గీతనీ, విష్ణుసహస్రనామాలని కాదనగలమా!



మరో కోణంలో ఆలోచిస్తే – శివసహస్రం భారతంలోది కూడా కాదు. భారతానికి మునుపే ఏనాడో ఉన్న వేదాలలోని నామాలే అందులో ఉన్నాయి.

**"బ్రహ్మప్రోక్తైః ఋషిప్రోక్తైః**

**వేదవేదాంత సంభవైః"** అని భారతవాక్యం. ఆదిగా బ్రహ్మదేవుడు వేదవేదాంగాల నుండి స్వీకరించిన బహువేల నామాలు ఋషుల ద్వారా మనలోకానికి వ్యాప్తి చెందేటప్పటికి వేయి ఎనిమిది నామాలయ్యాయి. ఋషి పరంపర నుండి గ్రహించి భువికందించినవాడు 'తండి' మహర్షి. ఆయన నుండి క్రమంగా మార్కండేయుడు స్వీకరిం చాడు. ఆతడు ఉపమన్యు మహర్షికి ఉపదేశించాడు. ఆయన శ్రీకృష్ణునకు బోధించాడు.

–ఈ ఇతివృత్తం 'మహాభారతం' అనుశాసనిక పర్వంలో ఉంది. అనేక ప్రాచీన భారత ప్రతులలో ఉంది. ఒకవేళ "భారతంలో ఈనామాలు లేవు" అని ఘోషించినా నష్టం లేదు. దీనికిదే ప్రత్యేక గ్రంథంగా పారాయణ చేయవచ్చు. దీనిలో నామాలన్నీ వేదాల నుండి గ్రహించినవే కనుక.

శివద్వేషాన్నే వైష్ణవమనుకొని, పనికట్టుకొని ఈ ప్రచారం చేయడం వలన ఆ పండితమ్మన్యులు ఏ ప్రయోజనాన్ని ఆశించినట్టు? నమ్మి శివారాధన చేసుకొనే వారు సత్ఫలితాలు ఎలాగూ పొందుతున్నారు. వారి మనసుల్ని కలతబెట్టడం కన్నా మరో ప్రయోజనం లేదు.

శివపురాణంలో విష్ణునామాలులేవనీ, నారాయణ గ్రంథాలలో శివస్తోత్రాలు లేవనీ బాధపడనక్కర్లేదు. ఈ అజ్ఞానాలని పారద్రోలేప్రయత్నం ప్రతివారూ చేయాలి. ఏ వైష్ణవ పండితుడో భేదాభిప్రాయంతో భారతప్రతిలోనే శివసహస్రనామాలను తొలగించారేమో! ఆ ప్రతియే తిక్కనవారికి లభించిందేమో! ఆలోచించవలసినదే. భారతంలోనిదిగా భావించబడుతున్న శివసహస్రనామస్తోత్రం – ప్రత్యేక గ్రంథంగా తీసుకున్నా, దాని విశిష్టతకు ఏ లోపమూ రాదు. మహిమాన్వితమైన పరమేశ్వర నామాలే అందులో ఉన్నాయి. అది అలా ఉంచి – భారతంలో అనేక పర్వాలలో అనేక సందర్భాలలో శివప్రశస్తి ఉంది. ద్రోణపర్వంలో 'శతరుద్రీయం' వ్యాసుడు చెప్పినట్లుగా ఒక అధ్యాయం ఉంది. అశ్వమేథ పర్వంలో, శాంతి, అనుశాసనిక పర్వాలలో పలు తావులలో రుద్రుని వైభవం చెప్పబడింది. అనుశాసనిక పర్వంలో మరొకచోట – 'శివనామనిరుక్తం' పేరుతో ప్రత్యేక అధ్యాయం ఉంది. దానిని తిక్కనగారు ఆంధ్రీకరించారు:

**ధర్మరాజు ప్రశ్న:**

**శివముఖ్యనామములు, ప్రస్తవన కృతిన్భోగమోక్ష దములగునని విందు విమలబోధ!**
**యెరిగింపవె వానినిరుక్తి ననిన పరమ ప్రీతిన్॥**

**శ్రీకృష్ణుని సమాధానం :**

**శివదేవు ముట్టగొల్వగ, నవనీశ్వర యితని పేళ్ళ యర్థమెరిగి, సం-**
**స్తవన కృతి గూర్పనా కైన విధాతకునైన నరిది నామదిజూడన్॥**
**నీవిట్లు నన్ను నడిగితి గావున నాయెఱిగినట్టి గతి జెప్పెదన-**
**ద్దేవాది దేవు వరనామావలి విను మచలమైన అవధానముతోన్ ॥**
**అగ్నివాయువాసవాదిత్య వసుమరుదాది దేవతా మయాత్ముడైన శివుని**
**మహిమ ప్రీతి, జెప్పుట వినుట సర్వార్థ సాధకంబులగు నృపాల ॥**

.....ఇలాంటి తిక్కన పలుకులు 'శివపరంగా' చాలా ఉన్నాయి.

అసలు 'విష్ణురూపాయ నమశ్శివాయ' అంటూ 'హరిహరా ద్వైతా'న్ని ఆవిష్కరించిన

మనీషి తిక్కనగారు – అన్నది మరువరాదు.

హైందవధర్మంలో ఈ వైషమ్యాలను ఇంకా రేకెత్తిస్తున్న ఈ మౌఢ్యవాదులనుండి మన ధర్మాన్ని మనం కాపాడు కోవాలి.

**ప్ర. ఈ మధ్య ఒక టీవీ ఛానల్‌లో ఒక వైష్ణవ పండితుని ఒకరు సందేహం అడుగుతూ – 'ఈశాన్యంలో పడకగదిని ఎందుకు ఉంచరాదు?' అని ప్రశ్నించారు. దానికి ఆయన సమాధానం చెబుతూ – "ఈశాన్యం రుద్రుని స్థానం. అంటే శ్మశానంతో సమానం. కనుక అక్కడ పడుకోరాదు. అందులోనూ–ఈశానుడు భూతప్రేతాధిపతి కనుక ఆ చోట శయనించే వారికి సంతానానికి కూడా దుష్టత్వం వచ్చే అవకాశం ఉంది" అన్నారు. ఇది నిజమేనా?**

**జ.** మీ ఉత్తరం చాలా సుదీర్ఘంగా ఉంది. కుదించి ప్రశ్నగా మార్చి ఇక్కడ క్లుప్తీకరించాల్సి వచ్చింది. ఇదే ప్రశ్న అనేక మంది వ్రాయడం మరీ ఆశ్చర్యం. పైగా – మీరు ఆ వైష్ణవ పండితుని పేరు కూడా వ్రాశారు. కానీ వ్యక్తిగతంగా ఏ ఒక్కరినీ కించపరచడం, ఎత్తిచూపించడం 'ఋషిపీఠం' సంప్రదాయం కాదు కనుక వారి పేరును మీ ప్రశ్నలో తొలగించవలసి వచ్చింది.



అయితే మొదటిగా చిన్న సవరణ: వారిని 'వైష్ణవ పండితుడు' అనడం కన్నా 'శివద్వేషి' (దక్షునివంటివాడు) అనడం సమంజసం. పవిత్రమైన వైష్ణవధర్మానికి ద్వేష పూరితుల వల్ల కళంకం తేరాదు. వారు చెప్పిన హేతువులు ఏ శాస్త్రాలలోనూ, వైష్ణవాగమాలలో సైతం లేవు. వారి బుద్ధికి తోచిన సమాధానాలు మాత్రమే ఇవి.

ఈశాన్య దిశలో శ్మశానం ఉండడం ఏ ఊరిలోనూ అంగీకరించని విషయం. 'దిశాంచ పతయే నమః' అని చెప్పబడిన ప్రకారంగా, దిక్పాలకులకు ఆయా స్థాన నియామ కత్వమిస్తూ, ఈశ్వరుడు పవిత్రమైన తూర్పు ఉత్తరదిశల సంధి స్థలాన్ని తన స్థానంగా స్వీకరించారు.

మయూరకవి సూర్యశతకంలో కూడా అందరి దిక్పాలకులను శాసించి, పలకరించే సూర్య భగవానుడు ఈశాన్య దిశాధినాథుడైన ఈశ్వరునకు భక్తిగా నమస్కరించినట్లు వ్రాశారు.

పూజలలో, పర్వాలలో ఇంటి ఈశాన్యస్థానాన్ని శుభ్రపరచి ఆరాధించమని శాస్త్రాలలో పలు తావుల్లో ఉన్నది. మన సంప్రదాయాల్లో అది సుప్రసిద్ధం కూడా. శ్మశానంలో పూజ ఏమిటి?– అనగలరా?

ఈశాన్యం శ్మశానస్థానం అనడం ఏ శాస్త్రానికీ సమ్మతం కాదు. ఆ దిక్కు అత్యంత పవిత్రమైనది. కనుక నిద్ర, మల విసర్జనవంటివి చేయరాదు-అని పెద్దలు నిర్దేశించారు. దేవుడి మందిరంలోపల (గర్భగుడిలో) నిద్రించడం క్షేమం కాదు కదా! మన ఇంటి దేవుడి గది కూడా నిద్రాస్థానం కాదు. నిద్రలో శరీర మాలిన్యాలు విసర్జింపబడతాయి. అందుకే పడకగదులు, మరుగుదొడ్లు ఈశాన్యంలో నిషేధించారు.

కాస్త ఇంగితజ్ఞానం ఉన్నవారు కూడా తేలిగ్గా తెలుసుకొనే ఈ విషయాలు, ఈ మహాపండితునికి తెలియలేదు-అంటే ఎంతటి కరడుగట్టిన శివద్వేషియో స్పష్టమౌతోంది కదా! ఇటువంటివారు పావనమైన వైష్ణవసంప్రదాయానికే కళంకం.

విష్ణు పారమ్యాన్ని చెప్పేదే వైష్ణవం. ఇతర దేవతాద్వేషం తో రగులుకుపోతే పాషండం. మరి-ఈశాన్యంలో మంచినీటి సదుపాయం, బావి వంటివి ఎందుకు ఒప్పుకుంటారు? శ్మశానంలోని నీరు త్రాగవచ్చా? ఈశ్వరుడు 'ఈశానః సర్వావిద్యానాం ఈశ్వరః సర్వభూతానాం...' ఇక్కడ 'భూతములు' అంటే 'సర్వ ప్రాణులు' అని అర్థం.

**'భూతకృత్-భూతభృత్-భూతాత్మా-భూతభావనః'** అని విష్ణుసహస్రనామాలలో 'భూత' శబ్దార్థమే ఇక్కడ ఉంది.

సందేహాలకి సమాధానాలు ఆయా శాస్త్రమర్యాదలతో ఉండాలి. కానీ – కేవలం తాను చదివిన పరిమిత శాస్త్రజ్ఞానంలో, సర్వాగమ విషయాలకు సాహసించడం వారి దుర్మార్గం అయితే, వారిని ప్రశ్నించడం ఆ సందేహి అవివేకం.

తన మతంలోని దేవతని తప్ప, ఇతర దేవతలను కించపరచేవాడికి, ఆ అన్య దేవతా విషయమై ప్రస్తావించే అర్హత కూడా లేదు. నిజంగా అతడు వైష్ణవ పండితుడే అయితే, కేవలం వైష్ణవాగమాల సంబంధవిషయమే మాట్లాడాలి కానీ, ఇతర ఆగమాలలో అంతే ప్రామాణ్య పారమ్యాలతో పూజింపబడే దేవతల్ని కించబరచేటట్లు వదరడం దుస్సాహసం. వారిని శ్రీమన్నారాయణుడు సైతం క్షమించడు. వీరి బారి నుండి సనాతన వైదిక ధర్మం రక్షింపబడుగాక! అని శ్రీ మహావిష్ణువును ప్రార్థిద్దాం.

ప్ర. **తిరుమలలో స్వామి కైంకర్యానికి వాడే 'పునుగు' కోసం పునుగుపిల్లిని వాడడం జీవహింస కదా! ఇటీవల ఒక ఛానల్‌లో దానిపై చర్చ చేశారు. కరుణామయుడైన భగవంతుని సేవలో భూతకారుణ్యం లేదా?**

**జ.** ఇలాంటి ప్రశ్నలతోపాటు మాకూ మరికొన్ని సమాచారాలను కూడా కొందరు

పాఠకులు వివరిస్తున్నారు. హిందూధర్మాన్ని కించబరచడం, దెబ్బతీయడం లక్ష్యం పెట్టుకున్న విమతస్థులు కొన్ని ఛానల్స్ పోషకుల్లో ప్రధానులనీ, వారి వ్యూహాలనను సరించి హైందవ విశ్వాసాలను ప్రణాళికాబద్ధంగా దెబ్బతీసే ప్రయత్నాలు జరుగుతున్నా యనీ, అందుకే తరచుగా మనకు అత్యంత పెద్దబలమైన శ్రీ తిరుమల తిరుపతి దేవాలయాలను ఉద్దేశించి ఏదో ఒక ప్రతికూల వార్తని సృష్టించడమో, లేదా-ఏదో ఒక గోరంత ప్రతికూలతను కొండంత చేయడమో జరుగుతోందని చెబుతున్నారు. దీనికి ఆధారాలు వివిధ వెబ్‌సైట్‌లలో కూడా ఉన్నాయట. అవి ఎంత వరకు నిజమో తెలియదు కానీ, ఆ సమాచారాలను తీసిపారేయలేమని అనిపిస్తుంది.

దానికి మీ ప్రశ్నలోని విషయం కూడా ఒక తార్కాణం. స్వామి కైంకర్యంలో పునుగు వాడకం ఈనాటిది కాదు. ప్రాచీన చారిత్రక కాలం నుండి ఉన్నదే. ఇప్పటికీ సుగంధ ద్రవ్యాలలో పునుగుకి స్థానముంది.

కస్తూరీమృగాల నాభిలోని 'కస్తూరి', చమరీ (ఆక్స్) మృగం తోక కుచ్చు 'చామరం' కూడా అన్ని భగవత్కైంకర్యా లలోనూ ఉన్నదే. దీనిలో హింస ఏమీలేదు. వాటిని చంపడం, గాయ పరచడం జరగదు. వాటి నుండి విడుదలైన ఒక పదార్థం మాత్రమే పునుగు. నిజంగా వాటి దేహధర్మం ప్రకారం అది వ్యర్థపదార్థమే. దానిని మనం ఉపయోగించడం దానికి బాధాకరం కాదు.

గోమయం, గోజలం ఆవు విసర్జించినవి. వాటి వినియోగం వ్యవసాయంలోనూ, ఔషధాల్లోనూ మానవోపయోగకారి. ఆ ఉపయోగం వాటికి హింసకాదు.

ఆ మాటకొస్తే పాలకోసం గేదెల్ని, ఆవుల్నీ బంధించడం 'హింస' అనిపించు కుంటుందా? 'డెయిరీ' పరిశ్రమ ఏమవ్వాలి! పాలు మాంసాహారం కాదుకదా! చట్టవిరుద్ధంగా, అతి క్రూరంగా, రాక్షసంగా వేలాది గోవుల్ని చంపివేస్తున్న కిరాతకుల గురించి ఒక్కమాట కూడా పలకలేని ఛానల్ మేధావులు, వాళ్ళ మతవిశ్వాసాల దౌర్జన్యాల గురించి ఒక్క చర్చావేదిక పెట్టలేని ఈ కుహనా లౌకిక వాదులు, హిందువులలోని హింసాదూరమైన వాటిని రంగుటద్దాలలో చూసి పెద్ద విషయం చేయడంలో కుత్సితం లేదని ఎలా అనగలం?

హింసించబడడం, అవమానింపబడడం, సహించడం అలవాటైన హిందువులను 'చేతకాని వారిగా' భావించి బాధించడంలో ఇదో భాగం అయితే శ్రీ వేంకటపతి ధర్మ ద్రోహులకు శిక్షకుడు కూడా – అని మరచిపోవద్దని మనం హెచ్చరించాలి.

సర్వమత సామరస్యం మన మత ధర్మం. అదే సమయంలో స్వధర్మ పరిరక్షణ కూడా మన బాధ్యతయే.

**ప్ర: ఈ మధ్యకాలంలో 'బలి-వామన' పేరుతో ఒక నృత్యనాటిక పలుచోట్ల ప్రదర్శిం చారు. వామనుడు బలి తలపై పాదముంచి తొక్కివేయడాన్ని -అగ్రవర్ణాల వారు అట్టడుగు వారిని అణచడమేనని చక్కగా ప్రతిపాదించారు. అనేక పత్రికలలో కూడా దీనిపై సమీక్షలు వచ్చాయి. ఇది ఎంతమేరకు సమంజసం?**

**జ:** ఇది ఒక గొప్ప అంశాన్ని కువ్యాఖ్య చేయడమే. భాగవతంలోగానీ, మరే పురాణాల్లో గానీ దీనికి ఆధారం లేదు. ఇన్ని వేళ ఏళ్ళుగా వామనావతార గాథను విన్న వాళ్లుగానీ, చదివిన వాళ్లు గానీ, చెప్పినవాళ్ళుగానీ ఇంతఘోరమైన అపార్థాన్ని కనీసం ఊహిం చనూ లేదు. ఆ మాటకొస్తే బలిచక్రవర్తి బ్రహ్మగారి వంశం నుండి వచ్చినవాడే. కశ్యపప్రజాపతి బ్రహ్మ మానసపుత్రుడు. ఆతని పుత్రుడు హిరణ్యకశిపుడు. ఇతడూ బ్రహ్మను గూర్చిన తపస్సు చేసిన వేదవిద్యాపారంగతుడు. ఆతని తనయుడు ప్రహ్లా దుడు. ఈ మహానుభావుడు భాగవతోత్తముడు-విష్ణుభక్తుడు, జ్ఞాని. ప్రహ్లాదపుత్రుడు విరోచనుడు. ఇతడూ ఉత్తమమైన వేదసంస్కారం కలవాడే. ఆతని పుత్రుడు బలిచక్రవర్తి.

బలి కూడా మహావిష్ణుభక్తుడు. శుక్రాచార్యుని వలన విశ్వజిద్యాగం చేసి, అమరా వతి (దేవతల రాజధాని)పై దండెత్తాడు. అంటే - తనది కాని రాజ్యంపైకి వెళ్లాడు. యజ్ఞశక్తిని పొందిన బలిని ప్రస్తుతం జయించలేమని తెలుసుకొని ఇంద్రుడు ఇతర దేవతలతో కలసి స్వర్గాన్ని విడిచిపెట్టాడు. తనదైన స్వర్గాన్ని కోల్పోయిన ఇంద్రాది దేవతలను చూసి తల్లి అదితీదేవి పుత్రుల దుఃఖాన్ని తట్టుకోలేక, భర్త (కశ్యపుని) ద్వారా దీక్షను పొంది తపస్సు చేసి విష్ణు ప్రసాదాన్ని పొందింది. ఫలితంగా విష్ణువు వామనునిగా అవతరించి, బలిని దానమడిగి, దానంగా పొందిన స్వర్గాన్ని తిరిగి ఇంద్రునికిచ్చాడు.

ఇది అసలు కథ. ఇందులో ముఖ్యంగా గ్రహించవలసిన అంశాలు.

**1.** బలి, ఇంద్రుడు - మానవజాతులు కారు. అందువలన వారిరువురినీ అట్టడుగు, అగ్రవర్ణాల కింద జమకట్టరాదు. ఇది పురాణకథ.

నమ్మితే దేవ దానవులుగా నమ్మాలి-అంతే. అక్కడ స్పష్టంగా చెప్పిన అంశం. దితి, అదితి..కూడా దక్ష ప్రజాపతి కూతుర్లు. దితి వంశం దైత్యులు- ఆ వంశం వాడు

బలి. అదితి తనయులు దేవతలు. ఈ వరుసలో కూడా బలి, ఇంద్రులు వర్ణాలవారు కారు.

**2.** బలి–ఇతరుల రాజ్యాలను ఆక్రమించినవాడు. ఇంద్రుడు– విశ్వనియమ ప్రవర్తకుడైన విష్ణువుచే నియమింపబడినవాడు. ఇది దేవతా భూమిక. అంతేకానీ మానవలోక గాథకాదు. ఈ నియమానికి భిన్నంగా బలి, తన తపశ్శక్తితో ప్రవర్తించాడు. అందుకే విష్ణువు వామనునిగా అవతరించి వెళ్ళి దానమడిగి, ముల్లోకాలూ తన స్వరూపమేననే సత్యాన్ని విశ్వరూపంగా ప్రదర్శించి త్రివిక్రముడై బుద్ధి చెప్పాడు. ఊర్ధ్వ లోకాలూ, అధోలోకాలూ రెండు అడుగులకే సరిపోయాయి. మరి మాట ఇచ్చిన మూడవ అడుగుకి స్థానమేది? అని అడిగితే, 'నాతలపై నీ మూడవ అడుగు పెట్టు' అన్నాడు బలి–సత్యవ్రతుడై.

దాని అర్థం–నెత్తిమీద పాదంపెట్టమని కాదు. నావైన రెండులోకాలు నీ రెండు అడుగులకి సరిపోయాయి. ఇక మూడవపాదానికి నన్ను నేను సమర్పించుకుంటు న్నాను. విష్ణుభక్తుడైన బలి చేసిన సమర్పణ ఇది. 'బలి' అనే మాటకి 'పూజ, సమర్పణ' అని అర్థాలు. రెండడుగులకి ఇచ్చిన రెండులోకాలు మమకారత్యాగం.



మూడవ అడుగుకి 'అహంకార త్యాగం'. ఈ రెండే భక్తి. భక్తి గురించి చెప్పే అంశమిది. అయితే–విష్ణువు నెత్తిమీద పాదం పెట్టినట్టుగా ఎక్కడా లేదు. దైత్యుల స్థిరనివాసమైన రసాతలంలో బలిని ఉండమని చెప్పాడు. రానున్న మన్వంతరంలో బలియే ఇంద్రుడౌతాడని, నేటి మన్వంతరం నేటి ఇంద్రుని పదవీకాలం కనుక ఆ ఇంద్రుడే పదవిలో కొనసాగుతాడని వివరించాడు. తాను బలి ఇంటికి రక్షకుడిగా ఉన్నాడు. ఎంతో తాత్త్వికత, విశ్వవిజ్ఞానం కలిగిన ఇంత అద్భుత మైన కథని తమ కుత్సితమైన కులవిద్వేషదృష్టితో వక్రీకరించడమే బాధాకరం. దానిని ప్రదర్శించడం విచారకరం.

ఉదాత్తమైన హిందూ గ్రంథాలను అవమానించడానికి కొన్ని విదేశీ మత సంస్థల వికృత వ్యూహంలో భాగమిది. కులాల చీలికను కొనసాగిస్తున్న నేతల దుర్మార్గం కూడా తోడై వీటిని ప్రోత్సహిస్తోంది.

దేవ, దానవుల గాథను మానవజాతులకి అన్వయించడమనే ప్రధానదోషం కలిగిన, ఈ అసంగతపు నృత్య నాటికను నిషేధించలేకపోతున్నాం.

ఇదే మరే మత గ్రంథాన్నైనా తమకు అనుకూలంగా కువ్యాఖ్య చేసి ప్రదర్శిస్తే

ఈనాటికి ఆ ప్రదర్శకులకు ఉనికియే ప్రమాదమయ్యేది. సమాజంలో సమస్థాయికి, ఉన్నత స్థితికి ఎదగవలసిన అడుగు వర్గాల వారిని, పురాణాల్లో రాక్షసులతో పోల్చి అవమానిస్తున్న కుసంస్కారపరుల కుత్సిత మేధాశక్తిని శిక్షించలేక పోతున్నాం. గతంలో మహిషాసురుడితోనూ, రావణుని తోనూ, ఇప్పుడు బలితోనూ పోల్చారు. ఈ పోలికలకి ఆధారం లేదు. దేవదానవుల్ని నమ్మకపోతే, ఈ పురాణాలనీ నమ్మవద్దు. దేవదానవుల కథల్ని అగ్రవర్ణాల అట్టడుగు వర్గాల ఘర్షణగా లేనిపోని దురన్వయాలు చేసి విద్వేషాలను రగల్చవద్దు.

మొత్తానికి – మీరు చెప్పిన నాటిక ముమ్మాటికీ, ఏనాటికీ అసమంజసమే.

**ప్ర. 'తత్త్వం' అనే మాటకి అసలు అర్థం ఏమిటి? 'శరీర తత్త్వం', 'మనస్తత్వం', 'పరతత్త్వం' లాంటి మాటలు వింటుంటాం. వాటికి భేదాలున్నాయా?**

**జ.** 'తత్త్వం యాథార్థ్యే బ్రహ్మణి' అని అర్థాన్ని చెప్పాయి శాస్త్రాలు. ఒక వస్తువు యొక్క యథార్థ (ఉన్నదున్నట్టు) స్వరూపాన్నీ, లేదా–పరబ్రహ్మని 'తత్త్వం' అనే మాటతో చెప్పవచ్చు. ఉన్నది ఉన్నట్టు అంటే 'స్వభావం'. కనుక 'స్వభావాన్ని' కూడా తత్త్వం అనవచ్చు. శరీర స్వభావం – 'శరీర తత్త్వం'. మనస్స్వభావం 'మనస్తత్త్వం'.

ఆయుర్వేద ప్రకారం– వాతపిత్త కఫాలు శరీరతత్త్వాలు. సత్త్వరజస్తమోగుణాలు మనస్తత్త్వాలు. ఈ రెంటికీ అతీతమై, అన్నిటా చైతన్యంగా ఉన్న పరమాత్మయే 'పరతత్త్వం'., ఇదే 'బ్రహ్మణి' (పర బ్రహ్మగా) అని చెప్పబడినది.

**ప్ర. 'అష్టవర్షా భవేత్కన్యా' అంటారు కదా... 'ఎనిమిదేళ్ళకే కన్యా' అంటే ఏమిటి? ఆ వయస్సులోనే వివాహం చేయాలనా? దాని అసలు అర్థం?**

**జ.** ఏ వయస్సులో వివాహమనేది వారి వారి సంప్రదాయపు విశ్వాసాలు. వేటి ప్రయోజనాలు వాటివి. కానీ మీ ప్రశ్నలో చెప్పిన దాని భావం మాత్రం వేరు.

ఈ శ్లోకం పూర్తిపాఠం:

**అష్టవర్షా భవేత్కన్యా**
**నవవార్షతు రోహిణీ ।**
**దశవర్షా భవేద్గౌరీ**
**అత ఊర్ధ్వా రజస్వలా ॥**

స్త్రీ ఎనిమిదేళ్ళ ప్రాయంలో 'కన్య' అనీ, తొమ్మిదేళ్ళకు 'రోహిణి' అనీ, పదేళ్ళవయసులో 'గౌరీ' అనీ, ఆ పైన 'రజస్వలా' అని వ్యవహరింపబడుతున్నదని భావం.

**ప్ర. ఒక టీవీలో ధర్మసందేహాల కార్యక్రమంలో ఒక శ్రోత ప్రశ్నకు సమాధానంగా ఒక వైష్ణవ పండితుడు చెప్పిన విషయాలపై సందేహ నివృత్తికోసం వ్రాస్తున్నాను. 'బ్రహ్మవిష్ణు మహేశ్వరులలో ఎవరిని పూజించినా ఒకటేనా' అనే ప్రశ్నకు – విష్ణువును పూజిస్తే సాత్త్విక గుణం ఇస్తాడనీ, బ్రహ్మ రజోగుణం ఇస్తాడనీ, శివుడు తామస గుణం ఇస్తాడనీ మాట్లాడారు. విష్ణువు నల్లగా ఉంటాడు కాబట్టి ఆయన తన భక్తులకు తెల్లనైన సాత్వికగుణం ఇస్తాడట. శివుడు తెల్లగా ఉంటాడు కాబట్టి తన భక్తులకు నల్లనైన తామసగుణం ఇస్తాడట. ఈ మాటకి ఏమైనా శాస్త్రప్రమాణాలు ఉన్నాయా?**

**జ.** ఇదే ప్రశ్నను చాలామంది వ్రాశారు. కనుక మరో మారు ఇలాంటి విషయాన్ని ప్రస్తావన చేయవలసి వస్తోంది. చెప్పిన వ్యక్తి ఎవరన్నది అనవసరం. కానీ చెప్పిన విషయాలు మాత్రం అశాస్త్రీయాలు. సర్వశాస్త్రసమన్వయంతో సమాధానం చెప్పి ధర్మాన్ని పరిరక్షించ వలసిన బాధ్యత పండితులకు ఉంది. పూజ, ఉపాసనల పరంగా ఆయా శాస్త్రాలలో ఉదాత్తమైన విషయాలు ఉన్నాయి. బ్రహ్మవిష్ణు మహేశ్వ రులు–ముగ్గురూ ఒకే పరమేశ్వరుని మూడు అభివ్యక్తులు.... అని పురాణాలు చెప్తున్నాయి. ఆ పరమేశ్వరుని రూపాలే గనుక – ఎవరినైనా పరమేశ్వర భావనతో ఆరాధించవచ్చు.



**'ఏకోదేవః కేశవో వా శివోవా'** – అనే శాస్త్రవాక్యం ఎలాగూ ఉంది. ఆ పరమేశ్వరుని శివునిగా అభీష్టంగా ఆరాధించేవారు శైవాగమాలో, శివపురాణాలో ప్రమాణంగా తీసుకుంటారు. వీటిప్రకారం–త్రిమూర్త్యాత్మకుడైన పరమాత్మయే శివుడు.... అని శాస్త్రం. అలాగే వైష్ణవాగమాల ప్రకారం ముగురువేల్పుల సమైక్య పరమేశ్వర తత్త్వమే విష్ణువు. శాక్తేయ శాస్త్రాల ప్రకారం జగదంబ 'బ్రహ్మ విష్ణు శివాత్మికా'. ఎవరి ఉపాస కులకు వారి శాస్త్రాలు ప్రమాణం. అది వారి ఇష్టదేవతపై ఏకాగ్రభావనను నిలుపు తుంది. అంతవరకు సమంజసమే. కానీ తమ ఆగమాల, శాస్త్రాల ప్రమాణాలతో ఇతర దేవతల ఆరాధనల గురించి మాట్లాడరాదు.

ఈ నల్ల, తెల్ల వాదాలు వెర్రి సిద్ధాంతాలు. ఉదాత్తమైన తత్త్వదృష్టితో సమన్వయించి చెప్పవలసినవి చాలా అధమ దృష్టిలో వ్యాఖ్యానించడం పొరపాటుకాదా! వారి వాక్యా లకు ఏ శాస్త్రాలలోనూ ప్రమాణం లేదు. అయినా నల్లవాడు తెల్ల దనాన్నీ, తెల్లవాడు నల్లదనాన్నీ ఇవ్వడమేమిటి?

ఏ దేవత అయినా మనకు అభీష్టసిద్ధిని కలిగించడం ఐహిక ప్రయోజనం.

చిత్తశుద్ధిని ప్రసాదించి, ఆత్మజ్ఞానాన్ని అందించడం పారమార్థిక ప్రయోజనం. ఉపాసన, పూజలకు ఈ రెండే ప్రయోజనాలు. గుణాలు ఒకరు ఇచ్చేవి కావు. అందరిలో ఉంటాయి. పొందవలసినది గుణాతీతస్థితి. అదే బ్రాహ్మీస్థితి. దానికి కావలసిన చిత్తశుద్ధి శాస్త్రీయమైన ఆరాధన వలన ప్రాప్తిస్తుంది. త్రిమూర్తులు త్రిగుణనియామకులు (త్రిగుణాలను నియంత్రించువారు) మాత్రమే. వివిధ శాస్త్రాలు చెప్పిన వాటిని కూడా కేవలం యథాతథంగా గ్రహించడం కాక, ఔచితీ దృష్టితో ధార్మిక తాత్త్విక వివేచనతో గ్రహించడం విజ్ఞుల లక్షణం.

హిందూధర్మంలో ఇంకా ఇలాంటి మొండి అభిప్రాయాల సంకుచిత ధోరణుల వికారాలను విడనాడకపోతే–అనైక్యత, క్షీణతలకు దారితీసే ప్రమాదముందని పండితులు గ్రహించాలి. లేదా–వారి వికారాలకు లోనుకాకుండా మీవంటి విజ్ఞులు ప్రవర్తించాలి.

**ప్ర. పురుడు, మైల అనేవి శాస్త్రప్రమాణంగా వచ్చినవా? 'ఇవేమీ మేము పాటించము–మేం విడగొట్టుకున్నాం' అని కొందరంటుంటారు. అది ఎలా సాధ్యమౌతుంది?**

**జ.** పురుడు, మైలలు శాస్త్రప్రమాణాల వల్లనే వచ్చాయి. అవి ఏమిటి? – అనేది పెద్దల ఆచారాల నుండి తెలుసుకోవలసినదే. వాటిని అతిక్రమిస్తే కాలాంతరంలో దుష్ఫలితాలూ తప్పవు. ఆస్తికులైనవారికి ఇవి ప్రమాణాలు. 'విడగొట్టుకున్నాం' అనడానికి శాస్త్రప్రమాణం లేదు. అది వారి దౌర్భాగ్యం. విడగొట్టుకునే పద్ధతులేమీ లేవు. పాటించడమే ఆచారం కానీ, విడగొట్టడం కాదు. ధర్మమార్గంలో శౌచం, సదాచారం– అనే భాగాలలో ఈ పురుడు, మైలలు అంతర్భాగాలు.



**ప్ర. వితంతువును సమాజంలో అందరూ చిన్నచూపు చూస్తారు. 'గంగా భాగీరథీ' అని సంబోధిస్తారు. ఎందుకు? మగవానికి భార్యపోతే గౌరవం పోదు. ఎందుకీ వివక్ష? అలంకారాలను వాడరాదంటారెందుకు?**

**జ.** 'చిన్నచూపు' చూడడం సామాజిక దోషం. ఇది శాస్త్రం ఒప్పుకోదు. ఏ వ్యక్తినీ చిన్న చూపు చూడరాదు. అందుకే 'గంగా భాగీరథీ సమానురాలు' అని గౌరవించడం సంప్రదాయం. ఇది పవిత్రతకు గుర్తుగా చెప్పేది. భార్యను కోల్పోయిన పురుషునికి కూడా కొన్ని విధులను నిషేధించారు. అది ఒక మర్యాద మాత్రమే. అలాగే భర్తను కోల్పోయిన భార్యకు కొన్ని నిషేధాలు ఉంటాయి. అవి అగౌరవాలు కావు. ఒక విధమైన దీక్ష. దీనిని సమాజం గ్రహించేలా శాస్త్రవేత్తలు బోధించాలి.

స్త్రీ ప్రతి దశలోనూ పూజ్యురాలు. కర్మమార్గాన్ని వదలిన సన్న్యాసి ఇంక కర్మలు ఆచరించడానికి అర్హుడు కాడు. గృహస్థ కర్మల్లో పాల్గొనరాదు. అలంకారాలు చేసుకోరాదు. కేశాలంకార, వస్త్రాలంకార, భూషణాలంకారాలు యతికి నిషేధాలు. అయినా అతడు పూజ్యుడే. అగౌరవం లేదు. లౌకిక లంపటాలను వదలిన త్యాగానికి సంకేతంగా, కేవలం ఆధ్యాత్మిక దృష్టితో ఉన్న యతివలెనే, వితంతువు కూడా భోగత్యాగం చేసి, ఒక దీక్షతో మిగిలిన జీవితాన్ని పవిత్రం చేసుకుంటోంది. ఆ దశలో ఆమెను అవమానించకుండా 'గంగా భాగీరథీ' సమానమైన పవిత్ర మూర్తిగా సంభావించాలి. ఈ దీక్ష కూడా వారి వారి మనఃపరిపాకాన్ని అనుసరించి ఉంటుంది. నిర్బంధాలు లేవు. లౌకిక దృష్టితో చూస్తేనే శరీరాలంకారాలు, గౌరవాలు. కాసింత ఆధ్యాత్మిక దృష్టితో చూస్తే మలిన భూయిష్ఠమైన రక్తమాంసాస్థిచర్మ శరీరం ధర్మాది సాధనలకు ఉపయుక్తంగా వినియోగించాలి. పై అలంకారాలు పరమార్థ దృష్టికి గౌరవనీయాలు కావు. సామాజిక రుగ్మతకు శాస్త్రం కారణం కాదు. శుభ్రత, శుచి ఆరోగ్యం వంటివి బాహ్యాభ్యంతర శుద్ధికి ఆవశ్యకం. ఆ మేరకు దేహాన్ని నిర్వహిస్తూ, మనమున్న వివిధ దశలకు, స్థితులకు అనుగుణంగా ప్రవర్తించడానికే శాస్త్రాచారాలు ఏర్పడ్డాయి.

ప్ర: **స్త్రీ దేవతల రూపాలను జుట్టు విరబోసుకున్నట్టు పటాలను చిత్రిస్తారు. అలా స్త్రీలు జుట్టు విరబోయరాదు అంటారు కదా! మరి దేవతల విషయంలో మినహాయింపా? సీతాదేవి కూడా లంకలో జుట్టు విరబోసుకుని ఉన్నట్లు చిత్రిస్తారు.**

**జ:** పటాలను గీసిన చిత్రకారులు ఆ విధంగా విరబోసిన జుట్టును బొమ్మలుగా చిత్రించుతారు. అంతేగానీ స్త్రీ దేవతలు కూడా జుట్టు విరబోసుకుని ఉండరు. వారి పవిత్రకర మంగళ వేషధారణను ఋషులు దర్శించి మనలను ఆ విధమైన కట్టుబొట్టుతో ఉండేలా నిర్దేశించారు. వేణీ బంధం (జడ)తోనే దేవతా స్త్రీలు ఉంటారు.

సీతాదేవి లంకలో అంత బాధలో ఉన్నప్పుడు కూడా జడతోనే ఉన్నట్లు వాల్మీకి వర్ణించారు. **"నీలానాగాభయా వేణ్యా జఘనం గతయైకయా"** నల్లత్రాచువంటి ఒక్క జడతో, అదీ పిరుదుల దాకా ఉన్న విశాలమైన వేణితో సీతమ్మ ప్రకాశిస్తున్నది. – అని వాల్మీకి వాక్యం.

ప్ర. **మహాభారతానికి ముందుగా 'జయ' అనే పేరుండేదనీ, తరువాత 'భారతం' అనే పేరు వచ్చిందనీ అంటారు. 'భారతం' పేరు ఎలావచ్చింది?**

**జ.** సంప్రదాయాన్ని అనుసరించి, భారత గ్రంథాన్ని అనుసరించి ముందుగా 'జయ' అనే పేరుండేదనడానికి ఆధారం లేదు. వ్యాసుడు 'మహాభారతం' అనే పేరుతోనే ఆ మహా గ్రంథాన్ని రచించాడని – గ్రంథ అవతారికలో వ్యాస వాక్యాల ద్వారానే తెలుస్తోంది.

**"మహత్త్వాత్ భారవత్త్వాచ్చ మహాభారతముచ్యతే"** – గొప్పదనం చేత, రాశి (బరువు) చేత 'మహాభారతం' అనే అర్థం ఉంది. దానితో పాటు ప్రధాన కథగా భరతవంశ గాథను విస్తారంగా చెప్పడం చేత 'మహాభారతం' అనే పేరు.

ఇక 'జయ' అంటే "ధర్మార్థకామమోక్షాలను సాధింపజేసే గ్రంథం" అని అర్థం. ఈ వ్యవహారం అష్టాదశపురాణ విద్యకు కూడా ఉంది. సంఖ్యాశాస్త్ర ప్రకారం 'జయ' అనేది '18' సంఖ్యను తెలియజేస్తుంది. 18 పర్వాల మహాభారతం, 18 సంఖ్యగల పురాణవిద్య కూడా 'జయ' పేరుతో వ్యవహరింప బడుతున్నాయి. అందువల్ల మహా భారతాన్ని కూడా 'జయ' అనవచ్చు. అంతేగానీ మొదటిగా 'జయ' అనే పేరుతో రచింపబడిందనడానికి ఆధారం లేదు.

సూతుడు చెప్పినట్లు రచించిన గ్రంథాలన్నీ 'నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం। దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్" అని ప్రారంభ మౌతాయి. అందుకే 'జయ' అని వ్యవహారం. భారతం కూడా సూతుడు చెప్పినట్లే మొదలౌతుంది.



పై కారణాల వల్ల మహాభారతానికి 'జయ' అనే పేరు ప్రసిద్ధి అయింది. దాని అసలు పేరు 'మహాభారతం'.

**ప్ర. బుద్ధుడు వేదాలను, కర్మకాండను నిరసిస్తూ తాను అష్టవిధ మార్గాలను, చతుర్విధ సంస్కరణలను బోధించేవాడు. అలా బుద్ధుడు స్థాపించిన బౌద్ధమతం మన భారతా వనిలో అట్టే కాలం నిలవలేదు. హీనయాన–మహాయాన శాఖలుగా విడివడి ఎక్కువ కాలం ఆసియా దేశాల్లో ప్రచారంలో ఉంది. ఈ బౌద్ధమతం స్థాపించిన బుద్ధుని మహావిష్ణు అవతారంగా ఎలా నమ్మాలి? కలియుగాంతంలో విష్ణువు కల్కి అవతారంగా వస్తారని అభివర్ణించారు. కానీ ఇప్పుడే కల్కిభగవానుడు దంపతులుగా ముప్పయ్యే ళ్ళుగా ప్రచారంలో ఉన్నారు. ఇదంతా ఎలా అర్థం చేసుకోవాలో అర్థం కావడం లేదు. దయచేసి బుద్ధుని గురించి వివరించండి.**

**జ.** మహావిష్ణు అవతారంగా చెప్పబడినవాడు హీనయాన మహాయాన శాఖలకు మూల

మైన గౌతమ బుద్ధుడు కాదు. పురాణాల ప్రకారం– బుద్ధావతారం త్రిపురాసుర సంహార కాలం నాటిది. బౌద్ధమత స్థాపకుడైన బుద్ధుడు కాదు. గౌతమ బుద్ధుడు వేదాలలోని జ్ఞానకాండకు సంబంధించిన కొన్ని భాగాలను వ్యక్తపరచాడు. తరువాతి వారు దానిని మతంగా తీర్చారు. అది కర్మకాండ నిరసనగా ప్రసిద్ధి కెక్కింది. దానికి అవతారంతో సంబంధం లేదు. ఇక కల్కి భగవానుడిగా ప్రచారమౌతున్న వారికీ, విష్ణు అవతారమైన కల్కికీ సంబంధం లేదు. కేవలం వారి వారి నమ్మకాలతో సాగిపోతున్న వ్యవహారం. దానికీ మన గ్రంథాలకీ, విష్ణు అవతారానికీ సంబంధం లేదు. 'కల్కి' అవతారం, పుట్టుక, చరిత్ర, ఆకృతి– ఇవేవీ ప్రస్తుత ప్రచార వ్యక్తులకి చెందవు. పురాణాలు వర్ణించిన కల్కి జననగాథ, చరిత్ర దీనికి పూర్తి భిన్నం. అసలైన ఆ కల్కి అవతారం ఇంకా జరగలేదు. కలియుగాంతానికి చాలా సమయముంది. ఆ సమయంలో వ్యక్తమౌతుంది.

సారాంశంగా...మనం భావించుకుంటున్న బుద్ధుడుగానీ, భ్రమిస్తున్న కల్కిభగవానుడు గానీ–పురాణాది శాస్త్రాలలో విష్ణు అవతారాలు కావు.

ఐతే–గౌతమబుద్ధుడు గొప్ప తత్త్వవేత్త. అవతారంగా భావిస్తే తప్పు లేదు. తత్త్వం కర్మకి విరుద్ధం కాదు. కానీ, సంబంధం లేదు. రెండూ వేర్వేరు విషయాలు. ఈ భిన్నాంశాలను విరుద్ధాంశాలుగా భావించి తరువాతి మతకర్తలు సిద్ధాంతాల రాద్ధాంతాలు చేశారు.



**ప్ర: సంధ్యావందనంలో తర్పణాలు వదులుతూ "సంధ్యాం తర్పయామి, గాయత్రీం తర్పయామి, బ్రాహ్మీం తర్పయామి, 'నిమృజీం' తర్పయామి" అంటారు. ఇందులో 'నిమృజీం' అనే మాట మూడు సంధ్యలలోను ఉంటుంది. ఈ శబ్దానికి అర్థం ఏమిటి? అది కాలసూచియా, దేవతాసూచియా?**

**జ:** "మృజ శుద్ధౌ" ధాతువు ప్రకారం 'నిమృజీ' అన్నది శుచికి సంబంధించిన శబ్దం. ఇది దేవతాసూచి. శుచికి అధిష్ఠాన దేవత నిమృజీ.

**ప్ర: నుదుటిపై భస్మధారణ చేస్తే చాలా? ఊర్ధ్వ పుండ్ర (నిలువు బొట్టు) కూడా ధరించాలా? ఎలా ధరించాలి? రెండూ కలిపి దాల్చవచ్చా?**

**జ.** 'రెండూ ధరించాలి' – అని శాస్త్రం చెబుతోంది.

**"ఊర్ధ్వపుండ్రం త్రిపుండ్రంచ ద్వావేతౌ ధారయే ద్విజః"** ఊర్ధ్వ పుండ్రం, త్రిపుండ్రం – రెండింటినీ ధరించాలి...అని శాస్త్రోక్తి. ఊర్ధ్వపుండ్రం ధరించాకనే త్రిపుండ్రం

(భస్మంతో మూడురేఖలు) ధరించాలి అని కూడా శాస్త్రవచనం. ధారణ గురించి శాస్త్రంలో పలు పద్ధతులున్నాయి. స్నానానంతరం సంధ్యాది అనుష్ఠానానికి ముందు నీటితో ఊర్ధ్వపుండ్రం (నిలువుబొట్టు) ధరించాలి. మళ్ళీ జపసమయంలో 'శ్వేతమృత్తిక' (గోపీచందనం)తో, ధరించాలి. దానితోపాటు భస్మధారణ 'తిర్యక్ త్రిపుండ్రం' (అడ్డము)గా చేయాలి. దేవతార్చనానంతరం కుంకుమను ధరించాలి. భస్మం మూడురేఖలు దాల్చాలి.

శివకేశవులపట్ల భిన్నభావం లేని, ఇరువురినీ సమాన గౌరవంతో కొలిచే స్మార్త సంప్రదాయాలకు పై పద్ధతి అనుసరించాలి-అని సనాతన ధర్మశాస్త్రాల మాట.

ఊర్ధ్వపుండ్రం అనామికతో (ఉంగరం వేలితో ధరించాలి) 'కేశవాయ నమః' అని 'నుదుట' దాల్చి క్రమంగా నారాయణాయ నమః (పొట్టపై, బొడ్డుకుపైన), మాధవాయ నమః (గుండెపై), గోవిందాయ నమః (గొంతుపై), విష్ణవే నమః (పొట్టకు కుడివైపు), మధుసూదనాయ నమః (కుడిచేయి మణికట్టుకు మోచేతికి మధ్య), త్రివిక్రమాయ నమః (కుడిభుజం మీదకి), వామనాయ నమః (పొట్టకు ఎడమ ప్రక్కన), శ్రీధరాయ నమః (ఎడమ చేయి మణికట్టుకు మోచేతికి మధ్య), హృషీకేశాయ నమః (ఎడమ భుజం మీద), పద్మనాభాయ నమః (వీపు నడుమ), దామోదరాయ నమః (మెడవెనక వైపు) - అంటూ ధరించాలి.



అయితే- శైవసంప్రదాయంలో కేవలం భస్మధారణ మాత్రమే ఉన్నది. వైష్ణవ సంప్రదాయానుసారం ఊర్ధ్వ త్రిపుండ్రం ధారణ మాత్రమే విహితం. ఆ సంప్రదాయాలకు ఆ పద్ధతియే శిరోధార్యం. తదితరులకు మాత్రం పైన వివరించిన ఊర్ధ్వపుండ్రం, భస్మత్రిపుండ్రాలు స్వీకరించదగినవి.

**ప్ర: భోజనం చేసేటప్పుడు మడి, మరుగు అంటూ చాదస్తాలకి పోయి కొందరితో కలిసి అన్నం తినము అంటూ దూరంగా ఉండడం, ఉంచడం వల్లనే మన మతంలో చీలికలు, అనైక్యత వచ్చాయని కొందరంటారు. సామూహిక భోజనాలు, సహపంక్తి భోజనాలు ఎందుకు కూడదు? కులాల వారీ భోజన సత్రాలు క్షేత్రాలలో కూడా ఎందుకు? ఆకలి అందరికీ ఒకటే కదా?**

**జ:** ఆకలి అందరికీ ఒకటే-అని స్థూలంగా అన్నా, దాని భేదాలు దానికీ ఉన్నాయి. సరే. పోనీ-ఆకలి ఒకటే అన్నప్పటికీ, తినే పద్ధతులు ఒకటి కావు.

జీవన విధానాలు, ఆచార వ్యవహారాలబట్టి ఆహార రీతులుంటాయి.

మంత్రానుష్ఠానాదులు కలవారు ఆ ఉపాసనా నియమాల ననుసరించి ఆహార వ్యవహారాల పద్ధతుల నవలంబిస్తారు.

శుచిగా వండి, దేవతార్చన చేసి, నివేదించి, ఆ ఆహారాన్ని కూడా పరిషేచన చేసి, ప్రాణాహుతులు పుచ్చుకొని కుడి చేతిని మాత్రమే కంచానికి తాకించి భుజించే సదాచారం పాటించడం మంత్ర, జప, అర్చనాది అనుష్ఠానపరులకు ఆవశ్యకం. ఇది భగవద్విశ్వాసం లేనివారు చర్చించడం కూడా అనవసరం.

విశ్వాసం కల శాస్త్రాలననుసరించి, ఆహారాది నియమాలతోనే అనుష్ఠానం సార్థక మౌతుంది. లేనప్పుడు నిష్ఫలమవుతుంది. విపరీత ఫలాలనిస్తుంది. ఇదొక శ్రద్ధామయ సూక్ష్మ విజ్ఞానం. దీనిని విశ్వసించేవారు పాటిస్తారు. అలా పాటించేవారే నియమా లను అతిక్రమించకుండా, తగిన ఆచారాలను అనుసరిస్తారు. ఇది నిజానికి ఏ ఒక్కరినీ అవమానించడం కాదు. వాడే పదార్థాలు, వండే పద్ధతులు కూడా ఎవరివి వారివే. అలా శుచిగా భుజించాలనుకొనే నియమం కలవారి కోసం, నియమభంగం కలగకుండా ఏర్పాటు చేసినవే క్షేత్రాలలో భోజన సత్రాలు. ఈ లోతు గ్రహించకుండా కులానికో సత్రం చొప్పున తయారయ్యాయి.



కలిసి తిననంత మాత్రాన అనైక్యత వస్తుందనడం అజ్ఞానం. తిండి అనేది వ్యక్తిగత వ్యవహారం. సామాజికం కాదు. ఎవరి భోజనం వారిదే. వైద్య విజ్ఞానరీత్యా కూడా సమూహ భోజనాలు, ఎక్కడ పడితే అక్కడ తినడాలు అనారోగ్య హేతువులే కదా! ఈ రోజుల్లో ఆహార నియమాలెక్కడున్నాయి? ఎవరైనా, ఎక్కడైనా, ఎవరితోనైనా తినే నియమరహిత జీవితమే అన్ని చోట్లా కనిపిస్తోంది. కానీ ఐక్యత, స్నేహాలు వృద్ధి చెందుతున్నాయా? సౌమనస్యం హృదయ సంబంధమైనది. ఎవరి నియమాలు వారు పాటిస్తున్నా స్నేహ సహకారాలు వీడని అనుబంధాలు గతంలో ఉండేవి. ఇప్పుడు అందరూ కలిసి మెలసి నియమరహితంగా మెలగుతూ, విద్వేషాలతో చెల రేగుతున్నారు. ఒక్కో ఇల్లు, ఒక్కో జీవనరీతి.... వాటికి తగినట్లు అన్నపానాలుంటాయి. అందునా సూక్ష్మశక్తుల్ని (అవి దివ్యమైనవీ కావచ్చు, ప్రతికూలమైనవీ కావచ్చు) గ్రహించే లక్షణం అన్నానికున్నది. బలి, పిండప్రదానం వంటివి అన్నంతోనే చేయడంలో విశేషమిది.

మన మతంలో భిన్న భిన్న జీవన విధానాలకు తగినట్లుగా ఆధ్యాత్మిక సాధనలు, ఆచార వ్యవహారాలు ఉంటాయి. అందరూ ఒకే పనిని చేయలేరు కదా! ఈ విభిన్నతల

తోనే ఏకతా సూత్రముంది. అన్ని మతాలవలెనే మన మతం ఉండాలి-అనడం సబబు కాదు కదా! దేని స్వభావం దానిదే. శుచిగా భుజించేవారికి, అదే యింట్లో నియమరహితంగా ఆరగించేవారితో కూడా సహపంక్తి, స్పర్శ, ఒకే ఆహారం ఉండవు.

**ప్ర: బదరీక్షేత్రంలో ఉన్న నదినే 'సరస్వతి' అంటారు. అది అక్కడ అలకనందాలో కలిసిపోయింది కదా?**

**జ:** సరస్వతీ నది కలియుగారంభమైన కొంత కాలానికి అంతరిస్తుందని పురాణాలు చెబుతున్నాయి. వాటి ప్రకారం, ఇటీవలి ఉపగ్రహ చిత్రాల ప్రకారం కొన్ని వేల ఏళ్ళ క్రితమే సరస్వతీనది అంతర్ధానమయింది. అయితే - కొన్ని చోట్ల సరస్వతీ జలాలు అంతంత మాత్రంగా ఉన్నాయి. ఆబూ పర్వతం వద్ద, పుష్కర్ సమీపంలో ఈ నదీ భాగాలున్నట్టు చెప్పబడుతున్నాయి.

హిమాలయాలలో బదరీ ప్రాంతం వద్ద ఉన్నది సరస్వతీ తీర్థం/కుండం అని పిలువ బడుతున్నాయి. పురాణాల్లో దీనిని తీర్థంగానే భావించారు. అయితే ఇది కూడా సరస్వతీ స్వరూపమే కనుక, నదిగా భావించి, సరస్వతీ పుష్కరాదికాలను వ్యవహరిస్తారు.



**ప్ర: కలియుగంలో బ్రహ్మకు పూజ, గుడి ఉండదు-అంటారు. త్రిమూర్తులలో ఒకడైన అతడికి పూజలేకపోవడం భావ్యమా? ఎందుకు ఆయనను పూజించరాదు?**

**జ:** పురాణాల్లో చెప్పిన మాటలకి సంకేతార్థం వేరు. బ్రహ్మ వేదవిద్యకి గురువు. 'కలియుగం' అంటే అజ్ఞానపు కాలం. కాలమనే మాటని తత్త్వార్థంలో 'స్థితి'గా గ్రహిస్తే, అజ్ఞానస్థితిలో ఉన్నప్పుడు జ్ఞానాన్ని గౌరవించరు -అని సంకేతార్థం.

**'క్వచిద్బ్రహ్మా క్వచిద్విష్ణుః క్వచిద్రుద్రః ప్రశస్యతే'** అని చెప్పినట్లుగా, కొన్ని వేదాలలో కొందరికి విశేష పూజలు ఉంటాయి. అంతేగానీ బ్రహ్మను పూజించరాదు-అనేది ఎక్కడా లేదు. బ్రహ్మ అంటే గురుమూర్తి. గురువు ప్రత్యక్షదైవం. గురుపూజయే బ్రహ్మపూజ. అసలు 'పరబ్రహ్మ' అనే మాట బ్రహ్మకు ఉంచడంలోనే 'పెద్దవాడు', 'పితామహుడు' అనే గౌరవాన్ని సూచించారు. వేదాధ్యయన గృహాలే బ్రహ్మకు గుడులు. విద్యాస్థలాలే ఆయన చోట్లు. విజ్ఞానం, విద్య బ్రహ్మ సరస్వతులు.

ఒక వస్తువు తయారు కావాలంటే దానిని నిర్మించే విజ్ఞానం ముందుండాలి. విజ్ఞాన రూపుడైన బ్రహ్మ సృష్టిని నిర్మించే స్వరూపుడు.

యజ్ఞాలలో బ్రహ్మకు ఆహుతులున్నాయి. పుణ్యావహవచన క్రియలో బ్రహ్మను

ఆవహించి ఆరాధిస్తారు. మండపారాధనలో కూడా ఆయనకు ప్రత్యేక స్థానముంది. క్రతువుల్లో 'త్వం బ్రహ్మ భవ' అని ఋత్విక్కును పూజించడం బ్రహ్మ పూజయే. 'పుష్కర్' లాంటి క్షేత్రాలలో బ్రహ్మ గుడులున్నాయి.

**ప్ర: ఇంట్లో దేవతార్చనలో పూజించే సాలగ్రామ బాణలింగాదులకు నిత్యం ఆవాహన చేయాలా? విగ్రహాలకు కూడా చేయవచ్చా? పూజించే దేవతలను వెంటనే నీటిలో కలిపేయడం సమంజసమా?**

**జ:** ఆరాధించే విగ్రహాలను, సాలగ్రామాదులను 'అధిష్ఠానం' అంటారు. దానియందు మంత్రం, ప్రక్రియ ద్వారా దేవతావాహనం చేసి పూజిస్తాం. దాని ఆధారంగా దేవత సాన్నిధ్యం వహించి పూజింపబడుతుంది.

ఈ అధిష్ఠానాలు రెండు రకాలు: 1. స్థిరాధిష్ఠానం, 2. అస్థిరాధిష్ఠానం. సాల గ్రామం (విష్ణురూపం), బాణలింగం (శివరూపం), శోణశిల (గణపతి స్వరూపం), స్ఫటిక బింబం (సూర్యుడు), సువర్ణముఖీ నదీ జనిత ధాతువు (అంబిక)...ఇవి స్థిరాధి ష్ఠానాలు. వీటిలో స్వతః సిద్ధంగా దేవతాసాన్నిధ్యం ఉంటుంది. కనుక వాటియందు ఆవాహన, ఉద్వాసన అక్కరలేదని శాస్త్రవచనం. అందుకే వీటికి శౌచం, సదాచారంతో నిత్యపూజ జరగాలి. శిలా నిర్మితమైనవి, అస్థిరాధిష్ఠానాలు. వీటిలో ప్రతిష్ఠ చేసినవి సంస్కారాదులచే, యంత్రంతో ప్రతిష్ఠిస్తారు కనుక వాటిలో దేవత మంత్రాది ప్రక్రియలతో స్థిరమౌతుంది. వీటికీ నిత్యపూజాదికాలు తప్పనిసరి. ఇక ఇంట్లో అరచేతి ప్రమాణాన్ని మించని విగ్రహాలను ఉంచాలి. వాటిని తరచు శుద్ధి చేసి ఆరాధించాలి. వాటికి ఆవాహ నాదులు అవసరమే. ఇక, వినాయక చతుర్థి వంటి తిథుల్లో పార్థివ (మట్టి) విగ్రహాలను పూజిస్తారు. పృథ్వీతత్త్వాన్ని జలతత్త్వంలో లయం చేసే యోగప్రక్రియ ననుసరించి వాటిని నీటిలో కలుపుతారు. ఇది దేవతను కలపడం కాదు. విగ్రహాన్ని కలపడమే. దేవతను ఆ విగ్రహంలో ఆవహింపజేసి, తిరిగి ఉద్యాపనతో స్వస్థానానికి (అది మన హృదయ పద్మమూ కావచ్చు) పంపి– కేవలం విగ్రహంగా మిగిలినదానిని నిమజ్జనం చేస్తారు.

అంతవరకూ భగవచ్ఛక్తిని గ్రహించినది కనుక పవిత్రంగా దానిని నీటిలో లీనం చేయడం, కేవలం మట్టి, పసుపు అధిష్ఠానాలకే జలంలో నిమజ్జనం. మన భావుకత లకు దేవతావిజ్ఞానం అందదు. మన భావనను అనుసరించి భక్తి చూపించినా, శాస్త్రాన్ని పాటించి పూజించాలి.

**ప్ర: పూజాదికాలు చేస్తున్నప్పుడు మధ్యలో తుమ్మువంటివి వస్తే, పూజ నిష్ఫలమా?**

**జ:** శాస్త్రరీత్యా పూజాదికాల సమయంలో కన్నీరు కారినా, క్రోధం కలిగినా, అపాన వాయువు, తుమ్ము వంటివి కలిగినా, అశౌచులను చూసినా ఆచమనం చేస్తే ఆ దోషాలు పోతాయి. అదే విధంగా కుడి చెవిని కుడిచేతితో తాకాలి.

**ప్ర: 'అతిథి' అనే దానికి అర్థం ఏమిటి?**

**జ:** 'ఏకరాత్రం నివసన్ అతిథిః' – అనీ 'అనిత్యం హి స్థితో యస్మాదస్మాదతిథి రుచ్యతే' అని శాస్త్ర నిర్వచనాలు. ఒక రాత్రిపూటకు మాత్రమే ఉండేవాడు అతిథి. అనిత్యంగా (ఎల్లప్పుడూ కాకుండా) ఉండేవాడు అతిథి అని అర్థాలు.

**ప్ర: 'దశదానాలు' అంటే ఏమిటి?**

**జ:** పదిరకాల దానాలను 'దశదానాలు' అంటారు.

శాస్త్రపరంగా ఆ పది: 1. గోవు, 2. భూమి, 3. తిలలు (నువ్వులు), 4. సువర్ణం, 5. ఘృతం (నేయి), 6. వస్త్రం, 7. ధాన్యం, 8. బెల్లం, 9. వెండి, 10. లవణం (ఉప్పు).

**ప్ర: 'పితృకర్మ' 'పితృపక్షం' 'పితృదేవతలు'......ఇలా అన్నీ తండ్రి పరంగానే చెప్తారు. మరి–మరణించిన తల్లి గురించి కర్మచేసేటప్పుడు 'మాతృకర్మ' అని ఎందుకు అనరు? ఇక్కడ కూడా పురుషాధిక్యమా? 'మాతృదేవతలు' హిందువుల్లో లేరా?**



**జ:** సంస్కృతంలో 'పితృ' శబ్దం తల్లిదండ్రులిద్దరికీ వాడ బడుతుంది. 'మాతా చ పితాచ పితరౌ'–తల్లిదండ్రులిద్దరినీ కలిపి చెప్పేటప్పుడు (మాతాపితలు) "పితరౌ" అనాలి. అదే తెలుగులో అనేటప్పుడు 'పితరులు' అంటారు. అందువల్ల–'పితృ' శబ్దం ఉభయులనూ తెలియజేస్తుంది. 'పితృదేవతలు' వేరు, మరణించిన పూర్వీకులు వేరు. వీరు ఒక విధమైన దేవతాగణం. వారిని ఆరాధించి, వారికృప వలన తమ తల్లి దండ్రులు ఎక్కడున్నా సద్గతి పొందాలని ఆశించేదే 'పితృకర్మ'.

'మాతృగణాలు' అని దేవతల్లో మరో ప్రత్యేకగణం ఉన్నారు. వారు జీవుల కర్మఫలాల బట్టి వివిధానుభవాలను ఇస్తారు. ఇదికాక 'అష్టమాతృకలు' వంటివి ఉన్నాయి.

అసలు హిందువుల్లోనే దేవతలను మాతృరూపంలో, మాతను దేవతగా పూజించడం నేటికీ ఉంటుంది. దుర్గలక్ష్మి, సరస్వతి, పార్వతి వంటి నామాలతో జగన్మాతను ఆరాధించే దేశం మనది.

**ప్ర. నవగ్రహ విగ్రహాలు ఏ ఊర్లో చూసినా శివాలయాల్లో ప్రతిష్ఠింప బడతాయి గానీ వైష్ణవాలయాల్లో ఉండవు. ఎందుచేత?**

**జ.** ప్రాచీనంగా చూస్తే ఆనాటి శివాలయాలన్నింటిలోనూ నవగ్రహవిగ్రహాలు కనిపించవు. అక్కడక్కడా ఎక్కడో ఉంటాయి. తమిళనాడులో నవగ్రహాలకు సంబంధించి ప్రతి గ్రహానికి విడిగా క్షేత్రాలు ఉన్నాయి.

అటు తరువాత ఎక్కువగా శివాలయాల్లో నవగ్రహ విగ్రహాలు ప్రతిష్ఠించడం జరుగుతోంది. దీనికి జ్యోతిషపరమైన అంతరార్థం ఉంది.

**"కాలకర్తా మహేశ్వరః"** అని శివ పురాణ వచనం. ఒక్కొక్క గ్రహానికి అధిష్ఠాన దేవతలను దేవదేవుడైన శివుడు నియమించాడని పురాణాలు చెబుతున్నాయి. రుద్రుని ఆజ్ఞననుసరించి గ్రహాలు సంచరిస్తాయి. రుద్రుని అనుగ్రహం పొందిన వారిని గ్రహ నక్షత్ర దేవతలు అనుకూలంగా ఆదుకుంటాయని శాస్త్రాలు చెబుతున్నాయి.

అంతేకాక-గ్రహాలకి మూలం సూర్యభగవానుడు. జ్యోతిష శాస్త్రరీత్యా- సూర్య గ్రహానికి అధిదేవత (లేదా-ప్రత్యధిదేవత) శివుడు. చన్ద్రగ్రహానికి గౌరి. మంగళ గ్రహానికి సుబ్రహ్మణ్యుడు. బుధగ్రహానికి విష్ణువు, గురుగ్రహానికి బ్రహ్మ, శుక్రగ్రహానికి ఇన్ద్రుడు. శని గ్రహానికి యముడు. రాహువునకు సుబ్రహ్మణ్యుడు. (కొన్ని శాస్త్రాలలో 'దుర్గ'ను పేర్కొన్నారు.) కేతువుకి గణపతి. వీరిలో సూర్యుడు గ్రహాలకు మూలం కనుక శివాలయంలో గ్రహాల విగ్రహాలు ఉంచుతారు.

**ప్ర. "చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభి రేవ చ। హూయతే చ పునర్ద్వాభ్యాం సమే విష్ణుః ప్రసీదతు॥"-ఈ శ్లోకానికి వివరణ ఇవ్వకోరు తున్నాను.**

**జ.** ఈ శ్లోకం అనేక విష్ణు శ్లోకాలలో వస్తుంది. ఇది 'అను స్మృతి' లోనిది. 'భీష్మస్తవరాజం' (మహాభారతం)లో ఇదే శ్లోకం చివరి వాక్యంలో **"తస్మై హోమాత్మనే నమః"** అని మారి వస్తుంది. హోమం చేసేటప్పుడు వాడే శబ్దములు- 5 విధాలుగా ఉంటాయి. ఈ అయిదింటితో హోమవిధి పూర్ణమవుతుంది.

విష్ణువు యజ్ఞస్వరూపుడు కనుక, యాజ్ఞికమైన ఈ శబ్దాలు పేర్కొన్నారు.

1. చతుర్భిశ్చ= "ఆశ్రావయ" అనే నాలుగక్షరాలతో
2. చతుర్భిశ్చ= "అస్తుశ్రౌషట్" అనే నాలుగక్షరాలతో
3. ద్వాభ్యాం= "యజ" అనే రెండక్షరాల మంత్రముతో
4. పంచభిః= "యే యజామహే" అనే ఐదక్షరాల మంత్రముతో

5. ద్వాభ్యాం= "వషట్" అనే రెండక్షరాలతో......

– ఇలా పదిహేడు అక్షరాలతో హోమక్రియ ఉపక్రమణ జరుగుతుంది. ఈ విధమైన మంత్రాలతో హోమక్రియా స్వరూపంగా ఉన్న యజ్ఞమూర్తి నారాయణుడు– అని భావం. ఇందులో యజ్ఞానికి సిద్ధమైన ఋత్విక్కులు, యజమాని యజ్ఞానికి ఉద్యుక్తులౌతూ– సన్నద్ధులై, సంకల్పించి, కర్మ చేయడం సూచితమౌతుంది.

**ప్ర. ఈ మధ్య ఒక పెద్ద స్వామిజీ మా ఊళ్ళో కృష్ణ కథ చెబుతూ, 'రోహిణీదేవి నందుని ఇల్లాలు' అనీ, బలరాముని దేవకీ గర్భం నుండి సంకర్షించి రోహిణీ గర్భంలో యోగమాయ ఉంచిందని చెప్పారు. ఇది అచ్చెరువుగా ఉంది. నిజానికి రోహిణి ఎవరి ఇల్లాలు?**

**జ.** రోహిణీదేవి వసుదేవుని ఇల్లాలు. దేవకీ వసుదేవులను చెరసాలలో ఉంచాడు కంసుడు. దేవకీ అష్టమగర్భం వల్లనే తనకు మరణం అని తెలుసుకున్న కంసుడు దేవకీ వసుదేవుల్ని మాత్రమే చెరలో ఉంచాడు. ఆ సమయంలో రోహిణీదేవి నందవ్రజంలో ఉన్నది. దేవకీ సప్తమ గర్భకాలంలోనే ఆ దంపతులు బంధితులయ్యారు. అప్పుడు యోగమాయా ప్రభావంచే, విష్ణు సంకల్పానుసారం ఆ సప్తమగర్భం (బలరాముడు), గోకులంలో ఉన్న వసుదేవుని మరియొక భార్య రోహిణీగర్భంలోకి ప్రవేశింపబడింది. ఈ విషయమే భాగవతం చెబుతున్నది. 

**రోహిణీ వసుదేవస్య భార్యాస్తే నన్దగోకులే।**

**అన్యాశ్చ కంససంవిగ్నా వివరేషు వసన్తిహి॥** ( శ్రీమద్భాగవతం – 10 స్కందం. 2వ అధ్యాయం)

"వసుదేవుని భార్య రోహిణీ నందగోకులంలో ఉన్నది. వసుదేవుని ఇతర భార్యలు కూడా కంసునికి భయపడి అక్కడ ఏకాంతంలో నివసిస్తున్నారు." ఇంత స్పష్టంగా భాగవతం చెబుతున్నది. అయితే ఒక పెద్ద స్వామీజీ వేరే విధంగా చెప్పారంటే అచ్చెరువే. అది ఏదో ప్రవాహ వేగంలో దొర్లిన పొరపాటు కావచ్చు. అంతటి పెద్దలకు తెలియక కాదు. ప్రమాదో ధీమతామపి.

**ప్ర. గోపీ చందనం అంటే ఏమిటి? దీనిని ఎవరు ధరించాలి?**

**జ.** ఇది లేత పసుపుపచ్చని మన్ను. బృందావనం, ద్వారక– వంటి క్షేత్రాలలో లభ్యమవుతుంది. శ్రీ కృష్ణుని పాదస్పర్శచే పవిత్రమైన మన్నుని గోపీచందనం అంటారు. వీటిని ఆ ప్రాంతాలలో గుర్తించి ధారణయోగ్యంగా అమ్ముతుంటారు. వాటిని ఎవరైనా

ఊర్ధ్వ పుండ్రంగా ధరించవచ్చు. ఇది లభించని పక్షంలో పుణ్యతీర్థ మృత్తిక, తులసీమూలం లోని మన్ను ధరించవచ్చు.

ప్ర. **టీవీ ఛానల్స్‌లో బీజాక్షరాలతో కూడిన మంత్రాలను కొందరు స్వామీజీలు చెబుతున్నారు. అలా విని చేసుకోవచ్చా?**

**జ.** ఆ పద్ధతిని శాస్త్రం అంగీకరించదు. బహిరంగంగా, సభల్లోనూ, ప్రదర్శనల్లోనూ మంత్రాలను చెప్పరాదని మంత్రశాస్త్ర నియమం.

**'వినా ఉపదేశం'** – ఉపదేశం లేకుండా మంత్ర జపం నిషేధం. వ్యక్తిని పరీక్షించి మంత్రసిద్ధుడైన గురువు ఉపదేశించాలి. అదేవిధంగా **'సదసి న ప్రకాశయేత్'** సభల్లో మంత్రాలను బైట పెట్టకూడదు– అని శాస్త్ర నిర్దేశం.

వైద్య సలహాలు, వంటింటి వైద్యాలు పుస్తకాల్లో టీవీల్లో చెప్పవచ్చు. జాగ్రత్తలూ చెప్పవచ్చు. కానీ దేనికి ఏ మందు వాడాలో ఏ వైద్యుడూ ప్రజలకు బాహాటంగా చెప్పడు. ప్రతి మందు పాకింగ్‌పైనా 'వైద్యుని సంప్రదించి మాత్రమే వాడాలి' అని స్పష్టంగా ఉంటుంది. ఔషధానికి ఎలాంటి నియమాలు ఉన్నాయో అదే విధంగా యంత్ర తంత్రాలకూ ఉన్నాయి. వ్యాపారధోరణిలో మంత్ర, యంత్రాలను అమ్మడం, ధనం కోసమో, ప్రాచుర్యం కోసమో జరుగుతున్న పాతకం. అధ్యాత్మికత పేరుతో ప్రలోభపెట్టడం ధర్మవిరుద్ధం. అయితే అలాంటి అధిక నియమాల అవసరం లేని కొన్నిశ్లోకాలు, దివ్య నామాలు మనకు చాలా ఉన్నాయి. వాటిని తెలుసుకుని భక్తితో అనుష్ఠిస్తే ధన్యులౌతారు. వేద మంత్రాలను, బీజాక్షర మంత్రాలను మాత్రం సరియైన గురువు నుంచి గ్రహించవలసినదే.



ప్ర: **వశిన్యాది వాగ్దేవతలు అంటే ఎవరు?**

**జ:** వీరు అమ్మవారి నుండి వెలువడిన వాక్ శక్తులు. శ్రీ చక్రంలో బిందువు నుండి మూడవ ఆవరణలో ఉంటారు. ఆ ఆవరణ పేరు: సర్వరోగహర చక్రం. ఆ దేవతలు ఎనిమిది మంది. 1. వశిని, 2.కామేశ్వరి, 3.మోదిని, 4.విమల, 5.అరుణ, 6.జయిని, 7.సర్వేశ్వరి, 8.కౌళిని.

వీరు అక్షర వర్గంలో 'అ' వర్గం నుండి 'శ' వర్గం వరకు ఉన్న 8 వర్గాలలో– ఒక్కొక్క దానికి ఒక్కొకరు అధిదేవతలు. 'అ' నుండి 'అః' వరకు అ – వర్గం. ఇలాగే క్రమంగా 2. కవర్గ, 3.చవర్గ, 4. టవర్గ, 5. తవర్గ, 6. పవర్గ, 7. యవర్గ, 8. శవర్గలు. ఈ ఎనిమిది వర్గాలకే అధిదేవతలు ఈ ఎనిమిది మంది. వీరి ఆరాధన

వలన మంచి శబ్ద శక్తి, జ్ఞానం, ఆరోగ్యం సమకూరుతాయి. వీరు వాగ్దేవతలు కనుక స్వయంగా తమ వాక్ శక్తితో శ్రీలలితాసహస్రనామస్తోత్రాలను గానం చేశారు.

**ప్ర: శ్రీకృష్ణ జన్మ సందర్భంలో ముందుకు వచ్చిన 'యోగమాయ'కు పురాణపరంగా ఆ తర్వాత ప్రాధాన్యం ఉన్నదా?**

జ: యోగమాయ శ్రీకృష్ణుని కంసకారాగారం నుండి నందవ్రజానికి చేర్చడానికై అవతరించిన మూర్తి. తన శిశురూపాన్ని వదలి, లీలామయమైన అష్టభుజ స్వరూపాన్ని ప్రకటించి అంతర్ధానమయ్యింది. భాగవతం ఇంతవరకు చెబుతోంది.

కానీ ఆ స్వరూపం వింధ్య పర్వతంలో నెలకొని, దేవతలచే ఋషులచే పూజలందుకుంటూ –క్రమంగా శుంభ నిశుంభులనే రాక్షసుల్ని సంహరించి జగతిని కాపాడిందని 'దేవీమాహాత్మ్యం' (మార్కండేయ పురాణం) చెబుతోంది. ఈ శక్తి పేర్లు నందాదేవి, వింధ్యవాసిని.

**ప్ర. శ్రీశంకర భగవత్పాదులు–శ్రీకృష్ణుని తర్వాత జగద్గురు స్థానం పొందిన మహనీయులు. అయినా కొంత మంది వారిని విమర్శించడం బాధాకరం. ఈ జాతి ఆయన ఋణాన్ని ఏవిధంగా తీర్చుకోవాలో తెలియ జేయండి?**



జ. మీరడిగిన పై ప్రశ్నలో చెప్పినట్లు భేదవాదులు మాత్రమే జగద్గురు శంకరుల్ని నిందాహేళనాదులు చేస్తుంటారు. అది వారి అవివేకజన్యమైన ఆచార్యాపరాధం. పాప సంస్కారాలున్నవారు మహాత్ముల్ని నిందించడం మామూలు. 'శ్రీకృష్ణుని తర్వాత...' అని మీరన్నారు. ఆ శ్రీకృష్ణునికి కూడా నిందలు, ఆరోపణలు ఆయన కాలంలోనూ, తరువాతి కాలంలోనూ ఉన్నాయి. పుణ్య సంస్కారం ఉన్నవారు కీర్తించి ఆరాధించి తరిస్తే, పాపసంస్కారులు నిందించి పతితులవుతారు. మహాత్ముల జీవితాలనీ, బోధనలనీ అధ్యయనం చేసి ఆచరించడమే వారి ఋణాన్ని తీర్చుకోవడం. ప్రపంచానికంతటికీ పనికి వచ్చే మతాతీతమైన గొప్ప తాత్త్విక సత్యాల్ని అందించిన మహాత్ములు జగద్గురు శంకరులు.

**ప్ర: మేము ఋగ్వేదీయులం, భారద్వాజ గోత్రీకులం. ఋగ్వేదుల శుభకార్యాల్లో సతీ సమేతంగా పాల్గొనేటప్పుడు, భార్య కుడి వైపునే ఉండాలని మా పూర్వీకులు తెలిపారు. మేము అదే విధంగా పాటిస్తున్నాము. ఇటీవల కొన్ని ప్రవచనాలలో కొందరు – 'భర్తకు భార్య విధిగా ఎడమవైపునే ఉండాల'ని చెప్పారు. ఏది సమంజసం?**

జ: సర్వసాధారణంగా భార్య భర్తకు ఎడమవైపునే ఉండాలనే నియమం ఉన్నదే. కానీ

భిన్న సంప్రదాయాలలో ఇది విభిన్నంగా ఉంటుంది. ప్రాంత భేదాలు, పరంపరా భేదాలు – వీటి ప్రకారం ఒక్కొక్కరికి ఒక్కొక్క విధం. తమిళ ప్రాంతాలలో, వైష్ణవ సంప్రదాయాలలో భార్య భర్తకు కుడి వైపునే ఉండాలనేది పద్ధతి. అలాగే మీరు చెప్పినట్లు ఋగ్వేదులకు ఈ పద్ధతి ఉండవచ్చు. ఇలాంటి వాటిలో పరంపరకే ప్రాధాన్యమివ్వాలి. మీ పూర్వీకులు తెల్పిన దానినే మీరు పాటించాల్సి ఉంటుంది.

ప్ర: **శ్రద్ధ, విశ్వాసం– రెండూ వేరు వేరు పదాలా? లేక పర్యాయపదాలా? శ్రద్ధకీ విశ్వాసానికి తేడా ఏమిటి? 'శ్రద్ధ' అంటే 'ఏకాగ్రత' అని అర్థం చెప్పుకోవచ్చా?**

జ: 'శ్రద్ధ' అనే పదానికి 'ఏకాగ్రత' అని అర్థం లేదు. 'శ్రద్ధ' అంటే 'ఆస్తిక్యబుద్ధి' అని శాస్త్ర నిర్వచనం. శాస్త్ర వాక్యాలను విశ్వసించడమే ఆస్తికత. అంటే– ఒక విధంగా 'శ్రద్ధ' అంటే 'విశ్వాసం' అని అర్థం. కానీ శాస్త్ర విషయాలపై విశ్వాసాన్ని 'శ్రద్ధ' అంటారు. తోచినది నమ్మితే 'విశ్వాసం' అనవచ్చు.

ఆధ్యాత్మిక సాధనలో శ్రద్ధకే ప్రాధాన్యం, 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' అని గీతా వాక్యం.

ప్ర: **ఈ మధ్య దీపావళినాడు నరకాసురుడు అట్టడుగు వర్గాలకు చెందినవాడని, వారిపై అగ్రవర్ణాల ఆధిపత్యానికి నిదర్శనమే 'నరకాసుర సంహారం' అనీ, అందుకే దీపావళి అగ్ర వర్ణాల పండుగేనని ఒక విమర్శ గోష్ఠి ప్రసారం చేశారు. గతంలో 'మహిషాసురుడే మా దేవుడు' అని కొందరు పూజలు కూడా చేశారు. వీటికి ఏవైనా ఆధారాలున్నాయా? ఆ విమర్శ ఎంతమేరకు ప్రమాణం?**



జ: ఆ వాదన అర్థరహిత ప్రమాణం. అసంబద్ధమైన ఒక వాదాన్ని భుజాన వేసుకుని హిందూధర్మంలో చీలికలు తీసుకురావాలని ప్రయత్నించే కుహనామేధావుల కుత్సితమే ఆ విమర్శగోష్ఠి. హిందువులు, విజ్ఞులు వీటిని ఖండించాల్సిందే.

దేవ, మానవ, అసుర – జాతుల కథలే పురాణాల్లో ఉన్నాయి. ఇందులో మానవ జాతికి చెందనివారు దేవ దానవులు– అని స్పష్టంగా ఉంది. నమ్మితే మూడింటినీ నమ్మాలి. అంతేకానీ మానవజాతిలో అసురజాతిని భాగంగా భావించి కొత్తవాదాలు తీయడం, బలహీన వర్గాలను రాక్షసులుగా జమకట్టి అవమానించడమే. దీనిని మానవతా వాదులు అంగీకరించరు.

నరకాసురుడు ఒక గ్రహశకలానికి చెందినవాడు. అందుకే అతడికి భూగ్రహ పుత్రుడిగా పురాణం పేర్కొంది. కృష్ణుడు కూడా విష్ణువాహనమైన గరుత్మంతునిపై వెళ్ళి సంహరిం చాడు. దేవ, మానవులను, లోక క్షేమాన్ని దెబ్బతీసిన లోకకంటకుడు

నరకుడు. మానవుల్లో ఏ వర్గానికీ చెందడు. అతడు బలహీన వర్గానికి చెందినవాడే అయితే, కృష్ణుడు అంత ఏర్పాటుతో యద్ధం చేయనక్కరలేదు. ఆ యుద్ధం, ఆ కథ భూమికి చెందినది కాదు. నమ్మిన వారికి అది నిజం. నమ్మనివారికి ఆ కథే ప్రమాణం కాదు. అటువంటప్పుడు వాటిని తమకు తోచినట్టు వ్యాఖ్యానించుకొని, అన్వయించు కొని ధర్మ వ్యతిరేక శక్తుల బృందాల తరఫున పనిచేస్తున్న అవివేకుల మాటలను చర్చకు తెచ్చిన వారు బుద్ధి రహితులే.

అదే విధంగా మహిషాసురుని వృత్తాంతం కూడ. ఈ దేవాసుర సంగ్రామాలన్నిం టిలో రెండే కోణాలుంటాయి:

**1.** లోక క్షేమాన్ని దెబ్బతీసే దుర్మార్గుల బారి నుండి జగతిని రక్షించటం,

**2.** తాత్త్వికంగా–మనలోని దుర్గుణాలను నిర్మూలించి, సద్గుణాలను వృద్ధి పరచి ఆధ్యాత్మికోన్నతిని సాధించే ఆధ్యాత్మికసాధన.

ఉదాత్తమైన తత్త్వచింతన కలిగిన ఆర్షపురాణ గాథలను, క్షుద్రమైన జాతివిద్వేషంతో కుళ్ళిపోయిన అవివేకులు తలాతోకా లేని విధంగా వ్యాఖ్యానిస్తుంటే – మనం నివ్వెరపోయి సందేహించడమూ సమంజసం కాదు.



**ప్ర. 'ఆత్మసాక్షాత్కారం' అంటే ఏమిటి? సాక్షాత్కారం– అంటే 'కనిపించడం' అని అర్థం కదా! ఆత్మ కనబడు తుందా? అయితే ఆత్మ సాకారమా? నిరాకారమా?**

**జ.** 'తెలియడమే' సాక్షాత్కారం. 'రుచి చూశాను' అంటే 'రుచి కనబడింది' అని అర్థం కాదు కదా! 'తెలుసుకొన్నాము' అనే అర్థాన్నే ఇక్కడ 'చూశాను' అనే పదంలో గ్రహించాలి. అదే విధంగా 'ఆత్మజ్ఞానమే' – ఆత్మసాక్షాత్కారం.

కనబడే ప్రపంచమంతా ఉపాధులతో కూడినదే. ఈ ప్రపంచాన్ని చూసే 'నేను' కూడా ఒక ఉపాధిలోనే ఉన్నాడు. కానీ ఉపాధుల దృష్టి వదలి – అన్నిటా వ్యాపించిన 'చైతన్యాన్ని' తెలుసుకున్నవాడు ఆత్మజ్ఞాని. ఆ తెలుసుకోవడమే సాక్షాత్కారం. 'నేను శరీరాది ఉపాధిని' అనే భ్రాంతి నుండి, ఈ ఉపాధులను ప్రకాశింపజేసే 'చైతన్యాన్ని నేను'– అనే ఎరుక కలగాలి. ఆ చైతన్యాన్నే మన శాస్త్రాలు ఆత్మ, పరమాత్మ, బ్రహ్మము – అని పేర్కొన్నాయి.

'ఆకారం' అనగానే వాళ్ళ ఉపాధి అవుతుంది. ఉపాధిని ఆత్మగా భావించడం అజ్ఞానం కనుక – సాకారం సాక్షాత్కారం కాదు. చైతన్యం నిరాకారమే.

అయితే ఆకృతులలో భాసించేది చైతన్యమే కనుక, ఉపాధితో కలిపి చైతన్యాన్ని

చూస్తే అది 'సాకారమే'. 'నిరాకారమైన బ్రహ్మము ఉపాసనా దశలో సాకారంగా భావించబడుతుంది. 'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా' ప్రసిద్ధ వాక్యం. ఉపాసకుల కోసమే బ్రహ్మము సోపాధికం (సాకారం). దేహాదులతో కలిపి ఆత్మచైత న్యాన్ని వ్యవహరిస్తే 'జీవాత్మ' అంటారు. వాటికి అతీతంగా చూడగలిగితే పరమాత్మతో ఏకత్వమే. ఆ స్థితియే సాక్షాత్కారం.

ప్ర: **బ్రహ్మ విష్ణు మహేశ్వర అంబికాదులలో మోక్ష దాత ఎవరు? శివుడు మోక్ష ప్రదాత కాదని కొందరు అనగా విన్నాను. ఇది వాస్తవమా? ఈ రకమైన వాదనలు సాధకులను గందరగోళపరచే అవకాశం ఉన్నందున - వివరింప ప్రార్థన.**

**జ:** ఈ వాదనలు 'మా మతము మాత్రమే మిమ్ములను స్వస్థపరుచును' అన్న మార్పిడివాద విదేశీ మతాల వలె ఉన్నవి. నిజానికి - హిందూ సంస్కృతిలో ఈ వాదనలు వ్యర్థాలు. ఎవరి అభీష్టదైవం వారికి మోక్ష ప్రదాత. నిజానికి పరమేశ్వరుని శివకేశవాది శాస్త్ర ప్రతిపాదిత మూర్తులలో ఏ మూర్తినైనా సరే, త్రికరణ శుద్ధితో, ప్రపన్నులై ఉపాసిస్తే - ఆ ఉపాసనాబలం వల్ల చిత్తశుద్ధి, దాని వలన జ్ఞానము, దాని ఫలితంగా మోక్షము లభిస్తాయి. ఎవరి ఉపాస్యదైవం వారికి మోక్ష ప్రదాత అన్నది స్పష్టం. ఇంత సమన్వయ సూత్రం మన మతంలో మూలసూత్రం. దీనిని విస్మరించి 'మా దైవమే మోక్షమిచ్చును' అని మాట్లాడేవారంతా అవివేకులే.



ప్ర: **మా కులదైవం నరసింహస్వామి. అయినా- మేము తిరుమల వేంకటేశ్వర క్షేత్రానికి వెళుతుంటాం. ఈ మధ్య కొందరు 'అలా వెళ్ళరాదు' అని అంటున్నారు. నిజమేనా?**

**జ:** ఇలాంటి మాటలకు శాస్త్రాధారాలేమీ లేవు. కుల దైవాన్ని ఆరాధించడం మానరాదు. అంతవరకు సమంజసం. అంతేకానీ - తిరుమలకు కానీ, ఇతర తీర్థక్షేత్రాలకు గానీ వెళ్ళరాదు- అనే మాట శాస్త్రవిరుద్ధం. నిరభ్యంతరంగా వెళ్ళవచ్చు.

ప్ర: **స్త్రీలు సుందరకాండ చదవవచ్చా? పారాయణం చేయవచ్చా?**

**జ:** కావ్యమై, ఇతిహాసమై అలరారుతున్న పవిత్రగ్రంథం రామాయణం. అది ధర్మబోధనమే కాక, మహిమాన్వితం కూడా. అందులో భాగమైన సుందరకాండను స్త్రీలు పారా యణం చేయరాదని చెప్పడానికి ఎక్కడా ప్రమాణం లేదు. స్త్రీలు కూడా పఠించవచ్చు. పారాయణ చేయవచ్చు.

ప్ర: **'మన దేవాలయాల్లో గర్భాలయాలలోకి అడుగు వర్ణాలను ప్రవేశింపజేయరు. అగ్ర వర్ణాలదే ప్రవేశం. కల్యాణోత్సవాలకు కూడా పల్లకీ మోయిస్తారే కానీ వేదిక పైకి**

**రానివ్వరు. కేవలం ఒక వర్ణంవారికే పరిమితమైన దేవుళ్ళను ఆరాధించే మతంలో మేమెందుకుండాలీ' అని ప్రశ్నిస్తున్నవారికి సమాధానమేమిటి?**

**జ:** మనం ఆరాధించే దేవుళ్ళు గుడిలో ఉన్నవారు కాదు. వారు సర్వవ్యాపకులు. కానీ గుడిలో ఆ దేవుని ఆరాధించినప్పుడు కొన్ని మర్యాదలుంటాయి. గుడిలో దేవుళ్ళు అందరినీ కాపాడే శక్తి స్వరూపులు. మన ఆలయవ్యవస్థ, మతస్వరూపం వేరు. ఇతరులతో పోల్చడానికి లేదు.

ఆలయాలలో విగ్రహాలు కేవలం నమ్మకానికి ఆధారాలు కావు. దైవశక్తిని మంత్ర యంత్ర హోమాది పద్ధతుల ద్వారా ప్రతిష్ఠ చేశాక, కొన్ని నియమాలుంటాయి. వాటి పవిత్రతను 'శౌచం' వంటి సదాచారాలతో కాపాడుకోవాలి. అప్పుడు ఆ ఆలయశక్తి అందరినీ రక్షించగలుగుతుంది. అలా కాపాడి అర్చించడానికి ఆ దేవతా మంత్రానుష్ఠానం, యంత్రారాధన విధానం, దానికి తగిన సదాచారం పరంపరగా తెలిసిన వారికి సౌలభ్యం ఉంటుంది.

రోగి మన బంధువైనా డాక్టర్ మాత్రమే చికిత్స చేస్తారు. ఐసియూలో ఉంచినప్పుడు ఆత్మీయులనైనా రానివ్వరు. తగిన సమయంలో అనుమతించినా చెప్పులతో, మామూలు దుస్తులతో అనుమతినివ్వరు. ఎక్కువ సంఖ్యలో రానివ్వరు.



మామూలు కంటికి కనబడని సూక్ష్మవిజ్ఞానం ఇక్కడ ఉంది. అలాగే ఆలయాల్లో దివ్యత్వం అర్చావిధానంతో కేంద్రీకృతమై ఉంది. దానిని కాపాడే బాధ్యత కొందరిది. అది భౌతికోద్యోగాలవలె సాధించలేము. కేవలం అగ్రవర్ణాలలో పుట్టినంత మాత్రాన అందరినీ గర్భాలయంలో ప్రవేశింపజేయరు.

హఠాత్తుగా –'మేమూ స్నానం చేశాం' అనగానే లభించే అవకాశం కాదిది. దానికి తగిన సంస్కారాలు, విద్య అవసరం. ఆ విధంగా వాళ్ళు కొలుచుకుంటుంటే, మరికొందరు పల్లకీ మోసి, డప్పు మోగించి, భూములిచ్చి కొలుచుకుంటారు. ఇక్కడ ధనప్రశక్తి లేదు. దర్శించే వారికంటే నిరుపేదలైన అర్చకులు కూడా ఉంటారు. ఏవో కొన్ని ప్రధాన ప్రముఖాలయాల్లో తప్ప, అన్ని ఆలయాల్లోనూ గొప్ప ఆదాయమేమీ ఉండదు. కేవలం సదాచారాలకు అంకితమైతే తప్ప పూర్తికాలపు అర్చకత్వం సాధ్యం కాదు. అందరూ అలా జీవించడం కుదరదు. అన్ని రకాల వృత్తులవారు, కర్మశీలురు సమాజంలో ఉంటారు. అందరూ సదాచారాలతో పూజానుష్ఠానాలను తీరిగ్గా చేసే అవకాశం ఉండదు. అందుకే కొందరు దానికై అంకితమై ఉంటారు. అందునా

పూర్వీకుల నుండి ఇంటా బయటా అలవాటైన అర్చావిధులూ, మంత్ర శాస్త్రాలూ అందరికీ అందేవి కావు.

వైద్య శాస్త్రం వైద్యుల చేతిలో ఉన్నా, ఆరోగ్యం అందరిదీను. అలాగే- అర్చకత్వం ప్రత్యేక వర్గం చేతిలో ఉన్నా, దాని ఫలితాలు అందరివీను. అందుకే ఆలయ మర్యాదల ననుసరించి కొన్ని కట్టు బాట్లతో లోపల అర్చనాదికాలు జరుగుతాయి.

కొన్ని చోట్ల విరాళాలిచ్చినవారు, నిర్మించినవారు, కార్యనిర్వాహక వర్గం వారు అసంఖ్యాకంగా ఉన్నా వారెవ్వరూ ఏనాడూ గర్భగుడిలో ప్రవేశించరు.

మరొక ముఖ్యాంశం - ఇటువంటి కఠిన నియమాలు లేని ఆలయాలు కూడా మనకు ఉన్నాయి. గ్రామదేవతల రూపంలో, మన ఇంట్లో విగ్రహాల, పటాల రూపాలతో దేవతలుంటారు. శ్రద్ధగా పూజిస్తే ఆ దేవతలు సైతం స్పందించి, ఎవరికైనా అనుగ్రహా న్నివ్వగలరు. అర్చనతో కొందరు, నిర్వహణతో ఇంకొందరు, పరిచర్యలకు, ద్రవ్య సమర్పణ, కైంకర్యాలకు ఇంకొందరు సిద్ధంగా ఉన్నారు. ఎవరి పద్ధతిలో వారు భగ వంతుని కొలుచుకొని ధన్యులౌతారు. సరియైన శాస్త్ర, మర్యాదల ననుసరించే వారు వీటిని గౌరవిస్తారు, పాటిస్తారు.



మన దేవుళ్ళను కొలుచుకొనే సామాన్యులు, స్త్రీలు కూడా ఉన్నారు. అందరూ గుడిలోకి అందునా గర్భగుడిలోకి చొచ్చుకు వెళ్ళాలని నియమం లేదు. నైవేద్యం పెట్టేటప్పుడు ఉన్న నియమం, ప్రసాద భక్షణలో లేదు. నైవేద్యం పెట్టేవారు సదా చారంతో ఉండాలి. తినేవారికి ఆ నియమం లేదు కదా!

కొన్ని ఆలయాల్లో అగ్రవర్ణేతరుల నిర్వహణ, అర్చన కూడా ఉన్నాయి. వారి పద్ధతుల్లో వారు అర్చించే విధానాలూ ఉన్నాయి. వైదిక, పౌరాణిక, తాంత్రిక భేదాలతో ఒకే దైవాన్ని వివిధ వర్గాల వారు అర్చించుకొనే రీతులు మనకు ఉన్నాయి.

హరిదాసరి, నందనారు, నీలకంఠనాయనారు, ధర్మవ్యాధుడు లాంటి వారెందరో మన ధర్మంలో పూజ్యులైన ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు. కేవలం హిందూమతంలో చీలికలు తేవడానికి జరుగుతున్న కుట్రలో భాగమే ఈ కువిమర్శలు.

ప్ర: **తారకాసుర సంహారం కోసం కుమార జననం కావాలి. కనుక, దేవతలందరూ శివపార్వతుల కల్యాణం కోసం ప్రయత్నించారు. మరి-వివాహానంతరం ఆది దంపతులకు మొదట కలిగిన సంతానం సుబ్రహ్మ ణ్యుడా? వినాయకుడా? వీరిలో ఎవరు ముందు?**

**జ:** అగ్రజుడు వినాయకుడేనని బహు పురాణ ప్రమాణం. నన్నెచోడుడు తన కుమార సంభవంలో జగదంబ దక్షపుత్రి సతీదేవిగా శివుని వివాహమాడిన తరువాత గణపతి పుత్రుడైనాడని వ్రాశారు. పార్వతీ దేవిగా తిరిగి అమ్మవారు వచ్చాక సుబ్రహ్మణ్యుడు కలిగినట్లు తన 'కుమార సంభవం' కావ్యంలో రచించాడు.

పురాణాల్లో పార్వతీ పరమేశ్వరుల పెద్ద కొడుకుగానే గణపతిని వర్ణించారు.

**ప్ర: ఈ మధ్య జైపూర్‌లో ఒక సాహిత్య సదస్సులో ఒకాయన మాట్లాడుతూ హిందూ మతంలో దళితులు ఏనాటికీ పురోహితులూ, పీఠాధిపతులూ, పూజారులూ కాలేరని– ఎప్పటికీ దళితులుగానే మిగిలిపోతారనీ– అదే ఇతర మతాలలోనైతే మార్పు ఉంటుందని అన్నారు. దీనికి ఏమని సమాధానం?**

**జ:** హిందూమతంలో ఎవరైనా పురోహితులు గానో, పూజారులుగానో, పీఠాధిపతులుగానో కావాలనుకోరు. ఆధ్యాత్మిక సాధనలకు ప్రధానమైనది హిందూమతం. సాధన ద్వారా నిర్మలుడై గొప్ప భక్తుడుగానో, యోగిగానో, జ్ఞానిగానో మారాలని నిజమైన హిందువు ఆకాంక్షిస్తాడు. ఆధిపత్యాల కోసం, అగ్రస్థానం కోసం పోటీ పడడానికి మతం రాజకీయమో, వ్యాపారమో కాదు.

గొప్ప యోగిగా, భక్తుడుగా, జ్ఞానిగా పరిణతి చెందిన వాడు ఏ జాతి వాడైనా భక్తిగా గౌరవించి ఆరాధించే సంస్కారం హిందువులందరికీ ఉంది. బాలయోగి, అవధూత పిచ్చమ్మ, అవధూత వెంకట స్వామివంటి వారు జీవితకాలంలో, తదనంతరం సమాధుల్లో కూడా పూజలందుకుంటున్నారు. అలాంటివారు ఎందరో నేటికీ ఉన్నారు. బాబాలు, సిద్ధ పురుషులు అన్ని జాతుల్లోనూ ఉన్నారు. వారికి పెద్దపీఠాలు ఉన్నాయి. కొన్ని పీఠాలు కొన్ని సంప్రదాయాలను అనుసరించడం ఏనాటి నుండో ఉన్న పరంపర. వాటి కారణాలు, వారి పద్ధతులు సప్రమాణంగా ఉన్నాయి. ఆ పీఠాలు వాటిని అనుసరించినంత కాలం తమ ప్రతిష్ఠను నిలుపుకుంటాయి. అక్కడి ఆరాధనా పద్ధతులు, సంప్రదాయాలు– వాటి పవిత్రత, ప్రాచీనత వాటివే. వాటి గురించి తేలిగ్గా వ్యాఖ్యానించడం తగని పని.

వాటి సంగతి అలా ఉంచి– ఈ రోజుల్లో అనేక ప్రాంతాల్లో వర్ణాలతో నిమిత్తం లేని పీఠాలు, హైందవ మిషన్స్ చాలా ఉన్నాయి– లెక్కకందని సంఖ్యలో. అందులో ఎవరైనా చేరి, వారి సాధన పరిణతులలో పేరు పొందే అవకాశాలు ఉంటున్నాయి. అసలు–వీటి వేటితోనూ సంబంధం లేకుండా కేవలం భక్తితో, సాధనతో ఉన్నత

స్థితిని సాధించిన మహాత్ములు అన్ని వర్గాలలో, వర్ణాలలో ఉన్నారు. ప్రపంచంలోని ఆధ్యాత్మిక వాదులందరిచే గౌరవింపబడుతున్న 'మాతా అమృతానందమాయి' లాంటి మహాత్ములను వివక్ష లేకుండా అందరూ గౌరవిస్తూనే ఉన్నారు.

పూజారులుగా ఎవరిస్థాయిలో వారు అర్చించుకునే ఆలయాలు అన్ని తెగల్లోనూ ఉన్నాయి-బహుకాలంగా. ఇటువంటి స్పష్టమైన అంశాలు ప్రత్యక్షంగా కనిపిస్తున్నా, మూర్ఖంగా మాట్లాడిన ఆ "ఒకాయన" హైందవ విద్వేషి మాత్రమే కాక, కనులున్న అంధుడని అభివర్ణించినా దోషం రాదు కదా!

ఇక- రెండో అంశం: మతాలు మారినంత మాత్రాన కులాలను మార్చుకో గలుగుతున్నారా? ఆ కులం గుర్తింపులను, హోదాలను, సదుపాయాలను పొందేందుకు ప్రతి కులం తమ స్థితిలోనే కొనసాగుతున్నాయి. ఈ దేశంలో కులం ఒక సామాజికాంశం. దానిని మతపరంగా మాత్రమే చూడడం లేదన్నది స్పష్టమౌతున్న విషయమే. మతాలు మారినా వారి వివాహ సంబంధ బాంధవ్యాలు తమ కులం వారి తోనే జరుపుకోవాలని తాపత్రయ పడుతున్నారు. కొంద రైతే తమ కుల సూచక ఉపనామాలను పేర్ల చివరో, ముందో వదలకుండా వాడుతూనే ఉన్నారు. మతం మారినా తమ కులం పేర్లను కలిపి ఆ మతాన్ని వ్యవహరిస్తున్నారు. మరొక వైపు – వ్యాపార ధోరణిలో సాగుతున్న మత ప్రచార హోరులో డబ్బు, పలుకుబడి ఉన్నవాళ్ళే ఆ మతాల్లో అధిపతులై, ఆర్జన నిమిత్తం ప్రచారాలు చేస్తున్నారు. అదో వ్యాపార వ్యవస్థ. దానికి ఆధ్యాత్మికతతో గానీ, ధర్మంతో గానీ, భక్తి, యోగం, జ్ఞానంలాంటి పవిత్రాంశాలతోగానీ ఈషన్మాత్రం సంబంధం లేదు.

విదేశీ మత సంస్థలకు మార్పిడుల సంఖ్యను ఎంత ఎక్కువ చూపిస్తే అంత ఎక్కువ ధనార్జన చేయవచ్చు అనే ఆత్రమే తప్ప- ఏ ఒక్కరికీ సిద్ధాంతాలపై, సాధనలపై పట్టులేదు. అలాంటి వారు ఉభయ భ్రష్టత్వాలకు దారితీసే మార్పిడులకు మాత్రమే పనికి వచ్చే తెగ.

**ప్ర: బౌద్ధం మన దేశంలో పుట్టి క్రమంగా క్షీణించడానికి కారణం? హిందువులు మననీయలేదా?**

**జ:** బౌద్ధం హిందూధర్మంలో భాగమే. వేదాలలో జ్ఞాన (వేదాంత) భాగంలో అంశాలనే బుద్ధుడు బోధించాడు. అందులోని ఔచిత్యాన్ని ఏనాడో హిందూమతం స్వీకరించింది. బౌద్ధంలోని 'అనీశ్వరవాదం' సామాన్యుని ఆకట్టు కోలేకపోయింది. మళ్ళీ- హిందూ

తంత్ర శాస్త్రాలలోని ఉపాసనలను, వేదాలలోని 'ఓంకార', 'నమస్కారా'ది మంత్రాలను స్వీకరించడంచేత నిలబడగలిగింది.

క్రమంగా– రాజకీయ ప్రాబల్యం కోసం కొందరు వ్యక్తులు ప్రయత్నించి, నాటి పాలకుల్ని ఆశ్రయించి బౌద్ధ– వైదిక ధర్మాల నడుమ వైషమ్యాలను పెంచారు. ఆ తరువాత వచ్చిన ఆదిశంకరాది హిందూ యోగుల స్పష్టమైన జ్ఞానావిష్కరణల ప్రభావానికి ఆ వైషమ్యాలు మనలేని పరిస్థితి ఏర్పడింది. బౌద్ధుల మత బాహ్యరూపం అంతరించినట్టు కనబడినా–సిద్ధాంతం, తత్త్వం మాత్రం హిందూ జీవన సరళిలో ఐక్యమయ్యాయి.

1. పునర్జన్మ సిద్ధాంతం, 2. ఇంద్రియ నిగ్రహం, 3. యోగం, జపం, ధ్యానం, వివేక వైరాగ్యాది... బౌద్ధాంశాలు బుద్ధునికి పూర్వమే ఏనాడో వేదాలలో ప్రబోధించినవే. కేవలం భారతీయత (హిందూధర్మం) పట్ల ద్వేషపూరితులైన కొందరు బౌద్ధమతాన్ని వేరుగా తీసి చూపించాలని ప్రయత్ని(ంచారు)స్తున్నారు. కొత్త మతాన్ని స్థాపించాలని బుద్ధుడు ఏనాడూ అనుకోలేదు.

బుద్ధుడు ఒక తాత్త్వికుడు. అంతేకానీ మతప్రవక్త కాదు. ఆయన పేరున తరువాతి వారు మతాన్ని సృజించి, వారి కల్పనలను కూడా జతచేసి కొంతకాలం చెలామణి చేయగలిగారు. కానీ వారి సిద్ధాంతాలలో మౌళికంగా ఉన్న లోపాల వలన, వేద వేదాంత తత్త్వాల లోని స్పష్టత వలన, కర్మశీలత వలన క్రమంగా వారి చెలామణి మనలేకపోయింది.

సారాంశంగా – బౌద్ధతత్త్వ జీవనరీతి హిందూజీవన విధానంలో వేల యేళ్ళనాడే కలిసిపోయి మనగలుగుతూనే ఉంది.

**ప్ర: మహాభారతంలో దుష్యంతుని పుత్రుడు భరతుడు అని ఉన్నది. ఆ భరతుని పుత్రుడు ఎవరు? అదే విధంగా– భీష్ముని తండ్రియైన శంతనునికి తండ్రి ఎవరు? 'కురువంశం' అనే పేరు ఎందువల్ల వచ్చింది?**

**జ:** భరతుని పుత్రుడు 'భుమన్యువు' – అని భారతం చెబుతోంది. తరువాత కొన్ని తరాల చక్రవర్తులు గడిచాక 'సంవరణుడు' అనే భారతవంశీయుని కొడుకు 'కురు'. సంవరణుని కాలంలో రాజ్యాధికార భ్రష్టమై ఆతడు పరివారంతో సహా పారిపోయి అరణ్యంలో తలదాచుకున్నాడు. తరువాత వసిష్ఠుని దీవెనల వల్ల తిరిగి శత్రువుల్ని జయించి రాజ్యాన్ని సంపాదించుకున్నాడు. ఆతని పుత్రుడు 'కురు'. పోయిన రాజ్యం

తిరిగి వచ్చాక, కలిగిన ఈతడు అనంతర రాజైన కారణంగా ప్రత్యేకించి ఈతని నుండి 'కురు' పేరుతో వంశ వ్యవహారం నడిచింది. ఈతని పేరుతో 'కురుజాంగలదేశ'మనే ప్రసిద్ధి కూడా వచ్చింది.

వీరి తరువాత ఆరవ తరం వాడు శాంతనుడు. అతని పుత్రుడు భీష్ముడు. 'శాంతనుడు' అన్నా 'శంతన' చక్రవర్తి అన్నా ఒకడే. ఈతని తండ్రి పేరు ప్రతీపుడు.

**ప్ర: ఇటీవల చాలామంది పెద్దలు మనది హిందూమతం కాదనీ, సనాతన మతమనీ అంటున్నారు. హిందూ మతమని వ్యవహరించడం దోషమా?**

**జ:** ఆ పెద్దలకు ప్రణామాలు! మన ధర్మం, 'సనాతనం' అనడంలో దోషం లేదు. 'సనాతనం' అంటే 'శాశ్వతం' అని అర్థం. కానీ ప్రస్తుతం ఇది 'హిందూమతం' గానే గుర్తింప బడుతోంది. కనుక అలాగే వ్యవహరించాలి. అలా వ్యవహరించకపోతే దోషం.

ఇతర దేశస్థులు 'మీదే మతం?' అని ప్రశ్నిస్తే 'హిందూ' అనే సమాధానం చెబుతారు గానీ. 'సనాతన మతస్థుడను' అని ఎవరూ అనరు. అది హాస్యాస్పదం కూడా. భారతదేశానికి ఇపుడు 'ఇండియా' అని పేరు కూడా ఉంది. పూర్వం భరత వర్షమే. శత్రువులు ఈ దేశంపై దండెత్తినా, ఏదైనా ఒక గొప్ప గుర్తింపు లభించినా... "అవి ఇండియాకే గాని, భారత్‌కి కావు" అనలేం కదా. ఒకవేళ అలా అంటే వాడు అజ్ఞానే అవుతాడు కదా?



ఇండియా అన్నా, భారత్ అన్నా ఒకే దేశపు పేర్లే. హిందూ, భారతీయ సనాతన ధర్మం – అనే రెండూ ఒక్కటే. మన సనాతన ధర్మానికి మరో పేరే 'హిందూ'.

**ప్ర: గురువుల్ని, వేద పండితుల్ని పూజించడం ఎందుకు? వారి కాళ్లు కడిగి దేవతగా భావించి పూజించడం మూర్ఖత్వం కాదా? వ్యక్తి పూజ సమర్థనీయమా?**

**జ:** ఒక వ్యక్తిగా పూజించడం తగని పని అనిపించ వచ్చు. కానీ మన సంప్రదాయంలో సర్వవ్యాపకుడైన భగవంతుని అనుగ్రహాన్ని పొందడానికి, కొన్ని ఆలంబనలు, ప్రతీకలు అవసరం. అందులో మొదటిది సూర్యబింబం. సూర్యుడు, అగ్ని, జలము (కలశం), సాలగ్రామం, బాణలింగం, స్ఫటికం, యంత్రం, పసుపు, మట్టిముద్ద, దీపం, అగ్నిహోత్రం, ప్రతిమ–వీటిని దేవతకు ప్రతీకలుగా ఆరాధించడం సంప్రదాయం. వీటిలో ఉన్న 'విభూతి' (ప్రత్యేక దేవతాశక్తి) గుణం వలన వీటిని ఆలంబనగా భగవంతుని ఆరాధించవచ్చు. కానరాని విద్యుచ్ఛక్తిని రాగితీగ ద్వారా గ్రహించినట్లే

దేవతాశక్తిని ఈ ప్రతీకల ద్వారా గ్రహించవచ్చు.

వీటితో పాటు దేవతోపాసకులు, ఆధ్యాత్మికవిద్య నిచ్చిన గురువులు, వేదాది దివ్య విద్యలలో నిష్ణాతులు– వీరిలో ఉన్న పవిత్రతా లక్షణమే భగవత్స్వరూపం. జడమైన శిలలోనే మంత్రక్రియద్వారా భగవద్భావన చేయ గలుగుతున్నప్పుడు, ఒక పవిత్రమైన చైతన్యమూర్తి ఆరాధన ఈశ్వరార్చనగా స్వీకరించడంలో అభ్యంతరం దేనికి? అక్కడ నమస్కరిస్తున్నది ఒక శరీరానికి కాదు. దానియందున్న పవిత్ర భగవద్విభూతికి. మంత్రం, వేదం–వాటిని ఒక పద్ధతిలో, నియమబద్ధంగా అధ్యయన, అధ్యాపనాదులు చేయిస్తున్నప్పుడు, అందునా – సదాచారంతో కూడిన జీవితాన్ని గడిపేటప్పుడు ఆ ఆచారశక్తి చేత మంత్ర, శాస్త్రశక్తులు తప్పకుండా వృద్ధి చెందుతాయి. అలాంటి వ్యక్తులెదురైనప్పుడు వారియందు భగవద్భావనను ఆవహింపజేసి పూజించడంలో తప్పేముంది? సదాచార సంపన్నుడైన మహాత్ముని యందు కూడా దేవతలను ఆవహింపజేసి పూజించడం సంప్రదాయమే. బాలా, కుమారీ, దంపతీపూజలు, వివిధ వ్రత పూజల్లో సువాసినీ పూజలు .... ఇవన్నీ మన సంప్రదాయాలే. అదే విధంగా పుణ్యమానవుల్లో, అనుష్ఠానపరుల్లో, సిద్ధపురుషుల్లో వారు ఉపాసించే దేవతలు సన్నిహితులై ఉంటారు. అలాంటి పవిత్రత గలవారిని ఆరాధించడం గొప్ప పని కూడా. అలాగని – దీనిని కూడా లాభసాటి సంపాదన లాగా మార్చివేసే వికృతాచారంగా మార్చరాదు. ప్రతి దానికీ పరిమితులుంటాయి కూడా. గోవులో కూడా భగవంతుని భావించి పూజించడం అనే సంప్రదాయం కూడా ఉంది. ఇటువంటి పూజలు వ్యక్తికో, శరీరానికో కావు. వారి ఆలంబనగా దేవతల పూజ.

ఈ పూజ చేయించుకోవడం ద్వారా 'తానూ దేవతేనేమో' అని భావించనక్కర లేదు. అవతలి వారు తనను పూజించేటప్పుడు – తనలో విద్యా రూపంగానో, అనుష్ఠాన రూపంగానో లేదా అంతర్యామిగానో ఉన్న పరమాత్మకే అదంతా చెందు తోందని భావించాలి.

**'దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం...."** వంటివి 'శారీరక తపస్సు' అని భగవద్గీతలో శ్రీకృష్ణుని మాట మనకి ప్రమాణం. 'దేవతలను, ద్విజులను, గురువులను, ప్రాజ్ఞులను పూజించాలి' అని భావం. దీక్ష వల్ల, సాధన వల్ల, ఉపదేశాది ఉపాసనాక్రమం వల్ల – రెండవ జన్మ పొందినట్లే కనుక 'ద్విజ' శబ్దం.

**ప్ర: భాగవతంలో కాశీరాజు శ్రీకృష్ణుని హింసించదలచుకున్నందుకు, సుదర్శనుడు కాశీనగరాన్ని దహనం చేసినట్లు ఉంది. అంత వైభవరాశి అయిన కాశి ఎలా దహనం చేయబడింది? శివుడు ఆ జ్వాలలను ఆపలేకపోయాడు. ఇలా కాశీనీ, శివునీ కించపరచిన ఘట్టాన్ని సత్యమని స్వీకరించగలమా?**

**జ:** ఆ ఘట్టం సత్యంగా స్వీకరించవచ్చు. అంతమాత్రాన్న కాశీ, శివుడు కించపడినట్లు కాదు. సాక్షాత్తు పరమాత్మయైన కృష్ణుని హింసించదలచుకున్నం దుకు రాజు, రాజ్యం ప్రతిఫలాన్ని అనుభవించాయి. బ్రహ్మ వేత్తలను బాధించితేనే తీవ్ర పరిణామాలుం టాయని శాస్త్రాలు చెబుతున్నాయి.

మరి–సాక్షాత్తు పరబ్రహ్మమైన వాసుదేవునిపై ఎగ్గు తలపెడితే అరిష్టాలు కల గడంలో ఆశ్చర్యమేముంది? ఇది పరమాత్ముని గొప్ప తనాన్ని చెప్పే ఘట్టం. అదే సమయంలో – మహాత్ముల్ని హింసించదలచుకుంటే దుష్ఫలితాలు తప్పవు – అనే సత్యాన్ని ఉపదేశిస్తున్నది.

కాశీ విశ్వనాథుడు పరమేశ్వరుడు. ధర్మ ప్రతిష్ఠాపకుడు. అందుకే ధర్మ ప్రకారం కాశీరాజు శిక్షింపబడడం ఈశ్వరేచ్ఛయే. కాశీ దగ్ధమౌతున్నా తాను ఉపేక్షించాడు. తలచుకుంటే జ్వాలలు ఆపగలిగే గంగాధరుడు, ధర్మమంటే ఏమిటో తెలియ జేయడానికే ఆ విధంగా ప్రవర్తించాడు.



అంతమాత్రాన కాశీకి ప్రమాదమూ కాదు. అది తాత్కాలికమే. కాశీపై గతంలో దివోదాసుడు కూడా కొన్ని ఆంక్షలు విధించాడు. కొన్ని శతాబ్దాల క్రితం దుర్మార్గులు ఎన్నో విధ్వంసాలనూ సృష్టించారు. ఇవన్నీ ఆయా కాలాల్లో జరిగే కొన్ని అనివార్య ఘట్టాలు. ఇవి శివుని మహిమలను, కాశీ గరిమను కించపరచే అంశాలు కావు. మనకి కనబడే కాశీ నగరం భౌతికమైనది. మొత్తం వారణాశీ నగరమంతా విస్తరిస్తూ, స్థూల నేత్రాలకు గోచరించని జ్యోతిర్మయ కాశీ–పంచ క్రోశాత్మక వైశాల్యంతో ఉంది. దానిని ఏ అగ్నీ ధ్వంసం చేయలేదు.

ఆ దివ్య భూమికయే క్షేత్ర నియమాలను పాటించి ఆరాధించే భక్తులను కాపాడే పవిత్రధామం. అక్కడి జ్యోతిర్లింగమైన విశ్వ నాథుని, ఆ దివ్య క్షేత్రాల్ని సూక్ష్మద్రష్టలైన ఋషులు, యోగులు, దేవతలు దర్శిస్తూనే ఉంటారు.

మామూలుగా భక్తితో యాత్ర చేసే వారిని ఆ దివ్యక్షేత్రం, అందులోని దేవతలు అనుగ్రహిస్తూనే ఉంటారు. ఆ కాశీకి నాశనం లేదు.

**ప్ర: మన క్షేత్రాలు గురించి, తీర్థాల గురించి చాలా గొప్పగా చెబుతుంటారు. తీరా అక్కడికి వెళితే ఎంతో ఆశాభంగం కలుగుతుంది. పరిసరాలు శుభ్రంగా ఉండవు. అర్చకులు, పండాలు పీడిస్తూంటారు. ప్రశాంతంగా దర్శించనివ్వరు. అలాంటి పరిస్థితుల్లో దైవశక్తి అక్కడ ఉంటుందా? అందుకే అక్కడికి వెళ్ళకుండా మనం ఇంట్లో మనం పూజించుకుంటే చాలు కదా! దీనికి తోడు ఆలయాల్లో ధన ప్రాధాన్యం, అధికారుల దోపిడీలు మిక్కుటమౌతున్నాయి. దీనికి వ్యతిరేకంగా ఇతర మతాల శ్రద్ధా కేంద్రాలు శాంతంగా, శుభ్రంగా ఉంటాయి. ఎవరూ లాభాల పేరున, టిక్కెట్ల పేరున దోపిడీ చేయరు. ఏం చూసి మనం మన ఆలయాల పట్ల గర్వించాలి? ఎందుకు క్షేత్రాలకు వెళ్ళాలి?**

**జ:** మీ ఆవేదన కొంతమేరకు అర్థవంతమైనదే. ఈ యుగంలో క్షేత్ర, తీర్థాలు ఇలాంటి స్థితిలో ఉంటాయని పురాణాలు వివరించాయి. మనవైన గొప్ప చారిత్రక శిల్ప, తపశ్శక్తి కేంద్రాలు, క్షేత్రాలు, ఆలయాలు. వాటి గొప్పతనాన్ని మనం విస్మరించరాదు. అలాంటి క్షేత్రాల్లో అవాంఛనీయ పరిస్థితుల్ని సవరించే ప్రయత్నం చేయాలి. అక్కడి అధికారుల తీరుని ఎండగడుతూ ప్రజలకి తెలియజేయడమో, సంబంధిత ప్రభుత్వ శాఖల్లో బాధ్యత కలవారికి ఫిర్యాదు చేయడమో చేయాలి. ప్రజల్ని జాగృత పరచి ఉద్యమించడమైనా చేయాలి. పీడించే పండాలను పట్టించుకోకుండా మన దర్శనాదులు మనం చేసుకొని రావచ్చు. కేవలం శ్రద్ధతో క్షేత్రాదుల్ని దర్శించడమే మనం చేయగలిగినది. యాత్రకి వెళ్లే ముందే మనకి ఎటువంటి అవాంఛనీయ పరిస్థితులు ఎదురు కాకూడదని క్షేత్రాధిదేవతల్ని ఆరాధించి బయలుదేరడం మంచిది.



ఆలయాల పరిసరాల్లో ధ్వని కాలుష్యం, డబ్బుల కోసం చేసే ప్రకటనలు నియంత్రించడానికి పౌరులుగా మన వంతు బాధ్యతను మనం నెరవేర్చాలి.

ఈ దేశంలో కొన్ని మంచి ఆలయాలు, సరియైన పద్ధతుల్లో ఉన్నవీ లేకపోలేదు. అవినీతి, అక్రమాలు దేశంలో అన్ని రంగాల్లో వ్యాపించాయి. అలాంటి నాయకుల అధీనంలోని ప్రభుత్వ శాఖల్లో దేవాలయాలున్నాయి. వారి అవినీతి ఇటు కూడా ప్రతిఫలిస్తోంది. వీటిని సవరించే ప్రయత్నం చేయాలి. లేదా వాటిని గమనించకుండా మన యాత్ర మనం శ్రద్ధగా చేసుకురావాలి. ఎంత కాదన్నా క్షేత్రశక్తి, ఆలయశక్తి గొప్పవి. వాటికోసం వాటికి వెళ్ళాలి.

ఇతరుల ప్రార్థనా మందిరాలకు విదేశీ నిధుల బలం, ఇక్కడ ఆకర్షించి నిల

దొక్కుకోవాలని ఆత్రం ఉండడం చేత ప్రస్తుతానికి బాగానే ఉన్నారు. వాటికే ప్రాచుర్యం రావడం, అక్కడ నిధులు, భక్తజనులు ఎక్కువ అయితే అక్కడ కూడా ఇలాంటి అమానుష ప్రవర్తనలు తప్పవు. ఎక్కడైనా మనుషులే కదా! వాటికి ప్రభుత్వ కబంధ హస్తాల బారి కూడా లేదు కదా! కానీ – నేటికీ గమనించితే వాటి చీకటి కోణాలు కూడా చాలా కనిపిస్తాయి.

మన క్షేత్రాలు అత్యంత ప్రాచీనమైనవి. కానీ పౌరుల నిర్లక్ష్యం, పాలకుల దుర్మార్గం నేటి పరిస్థితికి కారణాలు. ఇప్పటికైనా మన ప్రయత్నం మనం చేసి ఆలయ వ్యవస్థను సుసంపన్నం చేయగలం. అందుకు ప్రణాళికాబద్ధమైన వ్యవస్థను, ఆయా ఆలయ కార్యశాఖలలో నిష్ణాతులను నియోగించితే తప్పక వ్యవస్థ బాగుపడ గలదు. మనవంతుగా మనం ఏం చేయగలం? – అనేది ఆలోచించి ప్రయత్నించాలి.

ప్ర: **సీతా స్వయంవరంలో జనకుని సభలో శ్రీరాముడు ఎక్కుపెట్టిన శివ ధనుస్సు, శివుడు ధరించే పినాకమనే ధనుస్సు ఒక్కటేనా? తరువాత శివుడు దానిని ధరించలేదా?**



**జ:** జనకుని సభలోని ధనుస్సు, పినాకమూ ఒక్కటి కాదు. ఒకానొక సందర్భంలో లీలగా శివకేశవుల నడుమ వివాదంగా జరిగిన సమరంలో ప్రత్యేకంగా వాడిన ధనువు శివుని ధనువు.

అది జనకుని పూర్వీకుల కాలం నుండి మిథిలలో ఆరాధనలో ఉంది. ఆ ధనువును రాముడు విరిచాడు. పినాకం శివుని వద్ద ఉన్న శాశ్వత ధనువు. అది ఎప్పటికీ తన ఆయుధంగా శంకరుడు ధరించుతాడని పురాణాల వర్ణన.

ప్ర: **ఆకాశాత్ పతితం తోయం యథాగచ్ఛతి సాగరం ।**
**సర్వ దేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి ॥ – అనే శ్లోకం ప్రకారం అన్య దేవతలను తక్కువని భావించాలా?**

**జ:** ఇది ఇతర దేవతలను తక్కువ చేసే శ్లోకం కాదు. ఒకే పరమాత్మ అనేక దేవతలుగా విశ్వ నిర్వహణ చేస్తున్నాడు. ఏ దేవతని నమస్కరించినా అది పరమాత్మకే చెందు తుంది. అలాగే – ఏ దేవతని నిందించినా కూడా పరమాత్మకే చెందుతుంది.

ఆ పరమాత్మను కేశవునిగా భావిస్తే – సర్వ దేవతల నమస్కారమూ కేశవ రూపుడైన పరమాత్మకే చెందుతుందని భావం.

ఇదే శ్లోకానికి **'సర్వదేవ నమస్కారః శంకరం ప్రతిగచ్ఛతి'** అనే పాఠం కూడా ఉంది.

**ప్ర: గుడిలో గోత్రం అడిగినప్పుడు ఇంటిల్లిపాది పేర్లు చెప్పాలా? లేక యజమాని పేరు చెప్పి 'సహ కుటుంబానాం' అంటే సరిపోతుందా? ఇంట్లో నిద్రలోనో, మరేదో స్థితిలోనో ఉన్న వారి పేర్లపై పూజ చేయించడం సబబా?**

**జ:** యజమాని పేరు చెప్పి 'సహ కుటుంబానాం' అని చెబితే సరిపోతుంది. అందరి పేర్లూ అవసరం లేదు. ఒకరి బాగుకోసం వారి పేరున పూజ చేయించినప్పుడు, వారు ఇంట్లోనో మరెక్కడో నిద్రిస్తూ ఉన్నా పూజ చేయించవచ్చు.

**ప్ర: చిరంజీవుల వరుసలో– అశ్వత్థామ, బలి, వ్యాసుడు, విభీషణుడు, పరశురాముడు, హనుమంతుడు ఉన్నారు. మార్కండేయుని పేరు ఇందులో లేదేమిటి?**

**జ:** సహజంగా చిరంజీవులైన వారు మాత్రమే ఈ వరుసలో ఉన్నారు. మార్కండేయుడు సహజమైన చిరంజీవి కాడు. శివుని కృప వల్ల చిరంజీవి అయ్యాడు.

**ప్ర: తులసి, బిల్వాలను ఏ రోజు కోయకూడదో కొన్ని గ్రంథాల్లో చెప్పారు. ఋషిపీఠంలో కూడా గతంలో వ్రాశారు. కానీ దూర్వాలు, ఉసిరిక పత్రాలు కోయకూడని దినాలున్నాయా?**

**జ:** వాటి విషయంకూడా శాస్త్రంలో చెప్పారు.

**నైవచ్ఛింద్యాత్ రవౌ దూర్వాం । తులసీం నిశిసంధ్యయోః ।**
**ధాత్రీ పత్రం కార్తికే చ పుణ్యార్థీ మతిమాన్ నరః ।**
**ద్వాదశ్యాం చ దివా స్వాపస్తులస్యాపచయ స్తథా ॥**

ఆదివారం దూర్వాలను త్రుంచరాదు. రాత్రిగానీ, సంధ్యాకాలం గానీ తులసి కోయ రాదు. కార్తిక మాసంలో ఉసిరిక పత్రం కోయరాదు. ద్వాదశి నాడు పగలు నిద్రించుట, తులసి కోయుట నిషేధం.

**ప్ర: శనిదోషం పోవడానికి మంత్రం తెలియనప్పుడు, ఏవైనా శ్లోకాలతో శని దోష నివారణ చేసే ఉపాయం ఉందా?**

**జ:** శనిదోషం ఉన్నప్పుడు ప్రత్యేకించి మంత్రాలు తెలియనప్పుడు తెలిసిన వారిచేత జపం చేయించవచ్చు. లేదా ఎవరికి వారు ఈ క్రింది స్తోత్రాలు పఠించవచ్చు. మంత్రజపం చేయిస్తున్నా, ఈ స్తోత్ర పఠనం మంచి ఫలాలనిస్తుంది.

**యః పునర్భ్రష్టరాజ్యాయ నలాయ పరితోషితః ।**
**స్వప్నే దదౌ నిజం రాజ్యం స మే సౌరిః ప్రసీదతు ॥**
**నమోర్క పుత్రాయ శనైశ్చరాయ**

**నీహారవర్ణాంజన వంచకాయ ।**
**శ్రుత్వా రహస్యం భవ కామదస్త్వం**
**ఫలప్రదో మే భవ సూర్యపుత్ర! ॥**

– ఈ మహిమాన్విత స్తోత్రంతో పాటు ఈ పది నామాలు పఠించాలి.

**కోణస్థః పింగళో బభ్రుః**
**కృష్ణో రౌద్రోంతకో యమః ।**
**సౌరిః శనైశ్చరో మన్దః**
**పిప్పలాదేన సంస్తుతః ॥**

– **"శ్రీ శనైశ్చరాయ నమః"** అనే మంత్రాన్ని అధిక సంఖ్యలో జపించడం మంచిది.

ప్ర: **చవితి నియమంగా గణేశపూజ చేసేటప్పుడు సూర్యోదయంతో ఉన్న చతుర్థిని స్వీకరించాలా? లేక పొద్దున తదియ ఉన్నా, మధ్యాహ్నం చవితి ఉన్న రోజును గ్రహించాలా?**

జ: కేవలం భాద్రపద శుద్ధ చవితినాడు మాత్రమే మధ్యాహ్న కాలంలో వచ్చే చవితిని గ్రహించాలి. ఆ రోజు ఉదయం తదియ ఉన్నప్పటికీ మధ్యాహ్న చతుర్థియే ప్రధానం. అది మినహాయించి –మిగిలిన శుక్ల పక్ష చతుర్థులన్నీ ప్రాతఃకాలంలో చవితి ఉన్నవే స్వీకరించాలి. శుక్లపక్ష చవితిని 'వరదా చవితి' అంటారు.

'సంకష్టహర చతుర్థి' కృష్ణపక్ష చవితి. ఇది మాత్రం చంద్రోదయకాలంలో ఉన్న చవితియే గ్రాహ్యం. పొద్దున్న, మధ్యా హ్నం తృతీయ ఉన్నప్పటికీ, రాత్రి చవితియే సంకట హర చవితి. అయితే–ఉపవాసాదులకు రాత్రి చవితి, ఉపవాసం లేకుండా చేసే అర్చనలకు కృష్ణపక్షమైనా సూర్యోదయంనాటి చవితియే గ్రాహ్యం అనే సంప్ర దాయం ఉంది.



ప్ర: **జపం, దేవతాపూజ సాయంకాలం చేయవచ్చా?**

**జ:** మధ్యాహ్నం భోజనం చేసిన తరువాత మరి దేవతా పీఠాన్ని స్పర్శించరాదు. సాయం కాలం స్నానం చేసి జపం చేసుకోవచ్చు. పీఠానికి సమీపంలో దీపం వెలిగించి, ఏ ఫలమో, క్షీరమో నివేదించి నీరాజనమివ్వాలి.

**'సాయంకాలే నీరాజనం కుర్యాత్'** – అని శాస్త్ర వచనం.

ప్ర: **మన తరఫున మరొకరిచేత పూజలు, వ్రతాలు చేయిస్తే మనకి ఫలితం వస్తుందా?**

జ: ప్రతినిధిచే పూజ చేయిస్తే ఫలం లభిస్తుంది. నిత్య పూజ ఎవరికి వారే చేయాలి.

కర్తకు ఏదైనా అనివార్యమైన విఘ్నం కలిగితే, అవాంతరం వస్తే ప్రతినిధి చేత చేయించవచ్చు. భర్త, భార్య, పుత్రుడు, సోదరుడు, పురోహితుడు, స్నేహితులు - వీరిని ప్రతినిధులు అంటారు. వీరిలో ఎవరైనా మనలను ఉద్దేశించి సంకల్పించి పూజాదికాలు చేయవచ్చు. వీటికి ఫలిత ముంటుంది.

**ప్ర: ఉపవాసమున్న రోజున పాటించవలసిన నియమాలేమిటి? ఆ రోజున చేయకూడని విధులేమిటి?**

**జ:** ఉపవాస దినానికి ముందు రోజు రాత్రి ఫలహారం మాత్రమే చేయాలి. అంటే - ముందురోజు ఏకభుక్తముండాలి. ఉపవాసం నాడు ఆరోగ్యం సహకరించని వారు క్షీరమో, ఫలమో మితంగా తీసుకుంటారు. ఆరోగ్యం సహకరించినప్పుడు పూర్ణోప వాసం చేయవచ్చు.

**ఉపవాసాది వ్రతాలలో ముఖ్య నియమాలు:** క్షమ, సత్యం, దయ, జపం, శుచిత్వం, ఇంద్రియ నిగ్రహం, దేవపూజ, సంతోషం ప్రధాన గణాలు. దంభాన్ని విడిచిపెట్టాలి. ఏ దేవతను ఉద్దేశించి ఉపవాసం చేస్తున్నామో ఆ దేవతను ధ్యానించుట, ఆ మంత్రాన్ని జపించుట, ఆ దేవతాపూజ, కథాశ్రవణం, నామశ్రవణ కీర్తన స్తోత్రాదులు చేయాలి. అన్నాదులపై దృష్టిని పోనీయరాదు. తలస్నానం చేయాలి గానీ, తలంటు (అభ్యంగ) స్నానం చేయరాదు. ఆరోగ్యం సహకరించితే చన్నీళ్ళ స్నానమే శ్రేష్ఠం. తాంబూలం, సుగంధాలంకరణ కూడదు. ముత్తయిదువులకు కొన్ని వ్రతాలలో తాంబూలాదులు స్వీకరించవచ్చు. జలం, కందమూలాదులు, ఫలం, పాలు, హవిస్సు, ఔషధం ఉపవాసానికి భంగాలు కావు. ఆ రోజున క్షురకర్మ, ముఖ క్షవరం కూడదు. ఎక్కువగా నీరు వంటివి స్వీకరించరాదు. పగలు నిద్రించరాదు.

కామాసక్తి స్మరణ మాత్రంగా కూడా ఉండరాదు. కన్నీరు, కోపము వంటివి ఉపవాస ఫలాన్ని దక్కనివ్వవు.

**ప్ర: నేను చాలా ఆధ్యాత్మిక గ్రంథాలు చదివాను. ఎన్నో విన్నాను. దానితో నాకు వైరాగ్యం, భక్తి కలిగాయి. నా వయస్సు 21 ఏళ్ళు. నాకు వివాహం చేసుకోవాలని లేదు. సన్యాసం తీసుకోవాలని ఉంది. అలా నేను సన్యాసినిని కావచ్చా?**

**జ:** 'వైరాగ్యం' అనే మాట తేలికైనది కాదు. భక్తి, వైరాగ్యాలు కలిగినంత మాత్రాన సన్యసించనవసరం లేదు. మన స్వధర్మ కర్మలను పాటిస్తూ మనసును భగవచ్చింతనలో ఉంచితే గృహస్థాశ్రమంలోనే తరించవచ్చు.

ఎందరో ఋషులు, జ్ఞానులు, గృహస్థ ధర్మంలోనే తరించారు. పైగా - స్త్రీకి సన్యాసం స్వధర్మం కాదు. పురుషులకు కూడా సన్యాసానికి చాలా నియమాలున్నాయి.

తన స్వధర్మాన్ని పాటిస్తూనే ఆధ్యాత్మిక సాధన చేయడమే కర్తవ్యం. 21 ఏళ్ళకే మనస్సుకి తగిన పక్వత రావడం అరుదు. ఏ కొందరో శంకరులు, రమణులు వంటి వారు జీవన్ముక్తులై సన్యసించారు. అంతే.

గ్రంథాలు, ప్రవచనాలు మనకు స్వధర్మాన్ని ప్రేరేపించాలి. అందులో ఉంటూనే సుఖదుఃఖాలకు, లోభాలకు లోబడకుండా ఉండే మనఃస్థైర్యం కావాలి. గృహస్థా శ్రమంలో దేవ, పితృ, ఋషి ఋణాలు తీర్చుకోవాలి. ధర్మబద్ధ జీవనం వలన చిత్తం నిర్మలమై, వివేకాన్ని పొందుతుంది. అప్పుడు వైరాగ్యం కలుగుతుంది. ఆ వైరాగ్యంతో మనస్సు భగవద్భక్తి మయ మవుతుంది.

అది జ్ఞాన, మోక్షాలకు హేతువౌతుంది. కేవలం పఠన శ్రవణాల ప్రభావంతో నిర్ణయాలు తీసుకోరాదు. అనుకూలమైన జీవిత భాగస్వామిని ప్రసాదించమని పరమేశ్వరుని ప్రార్థించి గృహస్థాశ్రమాన్ని స్వీకరించడం శ్రేష్ఠం.



**ప్ర: ప్రతిమారాధన వల్ల ఆధ్యాత్మిక ప్రయోజనం ఉందా? మానసిక భావన, ధ్యానం ప్రధానమా? ప్రతిమ ప్రారంభదశ అనుకోవచ్చా?**

**జ:** దేని ప్రయోజనం దానికుంది. అయితే 'ప్రతిమారాధన' అనే కంటే 'భగవదారాధన' అనాలి. ప్రతిమయందు భగవంతుని ఆవాహన చేసి ఆరాధిస్తాం కనుక అది భగవ దారాధనే. ప్రతిమను కేవలం ప్రారంభదశ అనుకోవడానికి లేదు. ఒక దేవతకు ఒక దివ్యాకృతి ఉంటుంది. ఋషులు దానిని దర్శించి వర్ణించారు. ఆ వర్ణనాను గుణంగా ఆ రూపాన్ని చిత్రపటంగా లిఖించో, శిల్పంగా మలచో ఆరాధించుతాం. ఆ ప్రతిమలను యంత్ర, మంత్ర, హోమ విజ్ఞానంతో ప్రతిష్ఠించడం, దానికి పూర్వం శిల్పాన్ని జలాధివాస, ధాన్యాధివాస, శయ్యాధివాస, క్షీరాధివాసాల వంటి ఆగమ ప్రక్రియలు జరపడం విగ్రహారాధనలో కనబడుతుంది.

విగ్రహ నిర్మాణంలో, ప్రతిష్ఠలో శాస్త్ర పద్ధతులున్నాయి. కేవలం నమ్మకంతో పెట్టే బొమ్మ అయితే ఇన్ని శాస్త్రాలు ఉండవు. విగ్రహం (ప్రతిమ)లో మంత్రం ద్వారా, భావన ద్వారా దైవశక్తి ప్రవేశించి వ్యాపిస్తుంది. ద్రవ్యాలతో చేసే అర్చన భగవంతునికే చెందుతుంది. ప్రతిమ మాధ్యమం. మంత్రంతో, అర్చనతో, భావనతో ప్రతిమకు సంక్రమించిన దివ్యత్వం-దర్శించిన వారిని, ఆ పరిసరాలనీ ప్రభావితం చేస్తుంది.

ఆధ్యాత్మిక సాధనకు, జ్ఞానానికి ప్రతిబంధ కాలైన పాపాది దోషాలను తొలగించడంలో విగ్రహార్చన ప్రధానంగా సహకరిస్తుంది. అభీష్ట సిద్ధిని కలిగించి, దుష్ట శక్తులను దూరం చేయడంలో కూడా శాస్త్రీయంగా నిర్మించబడిన విగ్రహం పని చేస్తుంది. దానికి నమ్మకంతో పనిలేదు. బాహ్యారాధన వల్ల భావారాధన బలపడుతుంది కూడా. భావనతో, ధ్యానంతో భగవంతుని తలంచుకున్నా, బాహ్యారాధన మాననక్కర్లేదు. బాహ్య విషయాలను అనుభవిస్తూ, బహిః ప్రపంచ దృష్టి ఉన్నప్పుడు బాహ్యారాధన కూడా అవసరమే. 'భావములోనా బాహ్యమునందును' అని అన్నమయ్య మాట.

ప్రతిమారాధనలో బహు ప్రయోజనాలున్నాయి కనుకనే, లోతుగా ఆలోచించిన మహాత్ములు, జ్ఞానులు ఆ వ్యవస్థను నిలిపారు. మరింత పటిష్టపరచారు.

"ప్రతిమలో దేవుని ఆరాధించవచ్చు. కానీ ప్రతిమయే దేవుడు అనుకోరాదు" అని వివేకానంద వచనం. ఆరాధించబడిన ప్రతిమ నుండి ప్రసరించే సూక్ష్మ దివ్యశక్తి అనిర్వచనీయం - అద్భుతం.

**ప్ర: మహాభారతాన్ని పంచమవేదమంటారు. భారతాన్ని వేదంతో సరిసమానంగా చూడడానికి ఉన్న గొప్పతనం ఏమిటి?**



**జ:** అది మహాభారతాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. వేదం సర్వధర్మాలకీ ఆధారం. కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండ - అనే భాగాలతో ఉండే వేదం చెప్పిన విషయాలన్నీ తేటగా చెప్పిన గ్రంథం మహాభారతం.

ఒక ప్రధాన ఆఖ్యానాన్ని (కౌరవ పాండవ గాథ) తీసుకొని, అనేక ఉపాఖ్యానాలతో, ఉపదేశాలతో వేద ధర్మాన్ని, వేదాంత విజ్ఞానాన్ని విస్తారంగా అందించిన గ్రంథమది. కొన్ని నేరుగా, కొన్ని సంకేతంగా వేద రహస్యాలను చెప్పిన ఈ గ్రంథంలోనే భగవద్గీత, సనత్సుజాతీయం - వంటి ఎన్నో వేదాంత విషయగ్రంథాలు న్నాయి. విదురనీతి, యక్షప్రశ్నలు, నహుషప్రశ్న-వంటి అంశాలు ఎన్నో వేదధర్మాలను బోధిస్తున్నాయి.

వైదిక యజ్ఞ విశేషాలు సంకేతంగా, ప్రతీకలుగా చెప్పిన ఘట్టాలు చాలా ఉండడం చేత వాటి పఠన, శ్రవణ, పారాయణలు యజ్ఞఫలాలను ప్రసాదిస్తాయి. కొన్ని పర్వాలైతే (శాంతి, అనుశాసనిక - పర్వాలవంటివి) పుంఖాను పుంఖాలుగా వేద, వేదాంత బోధలను అద్భుతంగా అందించాయి. మొత్తం వేదపురాణాలన్నీ మహాభారతం లోనే ఉండడం చేత - ఇది 'పంచమవేదం' అనిపించుకుంది.

మరొక గొప్ప విషయం– "మహాభారత జ్ఞానం లేనివారు వేదానికి అర్థం చెప్పలేర"ని మహాభారత ఆదిపర్వంలోనే ఉంది. 'ధర్మార్థకామమోక్షాలనే నాలుగు పురుషార్థాలలో అన్ని అంశాలు ఇందులోనే ఉన్నాయి' అని వ్యాస వాక్కు. ఇన్ని కారణాలచేత వేదంతో సరిసమానంగా చూసే గొప్పతనం భారతానికి లభించింది.

**ప్ర: వేద మంత్రాలను పుస్తకాల ద్వారా, సీడీల ద్వారా నేర్చుకోవచ్చా?**

**జ:** అది అసంప్రదాయం. సంప్రదాయగతమైన శిక్షణయే ప్రధానం. శాస్త్రబద్ధంగా తగిన సంస్కారంతో నేర్చుకొని ప్రవీణుడైన గురువు వద్ద పద్ధతిగా నేర్చుకున్న వేదమంత్రాలే శుద్ధంగా ఉంటాయి.

**ప్ర: ప్రతి రోజు అసురసంధ్యలో శివుడు నాట్యం చేస్తాడంటారు. మరి కైలాస లోకంలో సమయానికీ, భూలోక సమయానికీ వ్యత్యాసం ఉంటుంది కదా! దేవతాలోకానికీ, మానవలోకానికీ కాలభేదం ఉంది కదా!**

**జ:** మీరన్నది ఒక విధంగా నిజమే. కైలాస లోకపు లెక్కతో పోల్చితే మనకి కొన్ని కల్పాలు గడిచిపోవాలి. కానీ – భగవదుపాసనలో కాలం సాపేక్షమే. మన కాలాన్ని అనుసరించే భగవదుపాసన ఉంటుంది. సర్వ వ్యాపకుడైన భగవానుడు భూలోకంలో కూడా ఉంటాడు. ఇక్కడ కూడా వివిధ దేశాల కాలభేదం ఉన్నది కదా! ఏ దేశపు కాలం ఆ దేశంవారి ఉపాసనకి వర్తిస్తుంది. అందుకే మనమున్న దేశపు కాలంలోని అసురసంధ్యలో శివనాట్యం జరుగుతుంది. ఇది ఆ దేశపు సంధ్యా సమయంలో ఉండే దేవతాశక్తి విశేషం.

మరొక ప్రధానాంశం: బ్రహ్మాండాలకు ఆవల ఉన్న కైలాసం బ్రహ్మలోకం వరకు ఉండే కాలాలకు, లోకాలకు అతీతం. అది దేశ దిక్ కాలపు ఎల్లలకు అందనిది. కానీ – భూమియందున్న కైలాస పర్వతంపై కూడా సూక్ష్మ భూమికలో శివలోకం ఉంది. అది భూమి పరిధిలోనే ఉంది కనుక – అక్కడ సంధ్యా సమయంలో జరిగే శివనాట్యం దేవతలకు దుర్లభమైనదని పురాణం వర్ణించింది. అయితే – అది చిదంబర క్షేత్రంలో ప్రతి ప్రదోషంలో యోగ్యులైన దేవతలకు, ఋషులకు దర్శనమౌతుందని కూడా పురాణ వర్ణన. ఈ ప్రకారంగా చూస్తే – ప్రదోషకాల శివనాట్య విషయంలో కాలవ్యత్యాసానికి తావే లేదు కదా!

**ప్ర: 'మంగళవారం' అనే పేరులోనే 'మంగళం' ఉంది. కానీ ఆ రోజున 'అమంగళం'గా భావించి ఏ పనినీ మొదలు పెట్టరెందుకు?**

**జ:** 'మంగళవారం' పేరులో మంగళ శబ్దం కుజగ్రహానికి చెందిన పేరు. అంతేకానీ 'మంగళం' అనే భావంతో పెట్టినది కాదు. ఆ రోజు సూర్యోదయం కుజ (మంగళ) హోరలో జరుగుతుంది కనుక అది 'మంగళ' (భౌమ, కుజ) వారమయ్యింది.

కుజగ్రహ ప్రభావం ఉన్న రోజు కనుక – గ్రహ లక్షణాలను బట్టి ఆ రోజున కొన్ని పనులు ప్రారంభించరాదన్నారు. అంతేకానీ ఆ రోజు 'అమంగళం' కాదు. ఆ మాట కొస్తే ఏ రోజూ అమంగళం కాదు. ఒక్కొక్క వారం ఒక్కొక్క ప్రయోజనం కలిగి ఉంటుంది.

**ప్ర: అన్నపూర్ణాష్టకం చదివేటప్పుడు గృహిణులు "జ్ఞాన వైరాగ్యసిద్ధ్యర్థం" బదులు "జ్ఞాన సౌభాగ్యసిద్ధ్యర్థం" అనాలని ఒక పండితులు చెప్పారు. శ్రీ శంకరుల స్తోత్రాన్ని అలా మార్చ వచ్చా?– అని సందేహం.**

**జ:** గృహిణులైనా ఎవరైనా 'జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం' అని చదవవచ్చు. 'సౌభాగ్య' అని మార్చవలసిన అవసరం లేదు. జ్ఞాన వైరాగ్యాలు మానవులందరికీ అవసరమైనవే. వైరాగ్యం ఉన్నంత మాత్రాన సౌభాగ్యానికి ప్రమాదమేమీ రాదు.

**ప్ర: నా కుమారుడు 3 సంవత్సరాలుగా శబరిమలై వెళుతున్నందువల్ల ఆ సమయంలో వచ్చే మా అమ్మగారి తిథిని ఇంట్లో పెట్టవద్దంటున్నారు. ఇది ధర్మమేనా చెప్పండి.**



**జ:** మీ కుమారుడు శబరిమలైకి వెళ్ళడానికీ, మీ అమ్మగారి తిథిని ఇంట్లో పెట్టడానికి సంబంధం లేదు. మీరు నిరభ్యంతరంగా మీ అమ్మగారి తిథిని యథాప్రకారం ఇంట్లో పెట్టవచ్చు. మానితే దోషం వస్తుంది.

**ప్ర: 'స్వాధ్యాయం' అంటే 'వేదాలను వల్లెవేయడమనే' అర్థ ముందా? వేరే అర్థమింకేదైనా గ్రహించవచ్చా?**

**జ:** 'అధ్యయన సంస్కృతేనైవ స్వాధ్యాయేన అర్థం జానీయాత్' అని వేదభాష్య భూమికలో సాయణాచార్యుల మాట. 'అధ్యయన సంస్కృతమైన స్వాధ్యాయము' అనే మాట నన్నారు. కేవలం శబ్దాలను కంఠస్థం చేయడం స్వాధ్యాయమంటే సరిపోదని దీని భావం. వేదాలను వల్లెవేయడం ఆ విద్యార్థులకు, విద్యా వేత్తలకు అవసరమే. అయితే ఆ విద్యను 'శ్రవణ మననాది అభ్యాసాలతో' అధ్యయనం చేయడం స్వాధ్యాయం. అదే 'అధ్యయన సంస్కృతం'.

ఇది వేద విద్యాభ్యాసం చేసేవారు వారి విద్యలో స్వాధ్యాయం చేస్తే– ఇతరులు వారి వారి విద్యలను కూడా శ్రవణ మననాది అభ్యాసాలతో పటిష్టపరచుకోవచ్చు.

వేదవిద్య తెలియని వారు లౌకిక విద్యలు కాక, పురాణేతిహాసాది గ్రంథాలను పై రీతిగా అధ్యయనం చేస్తే దానికి 'స్వాధ్యాయం' అనే పదం వాడవచ్చు.

ప్ర: **'చిదగ్నికుండసంభూతా దేవకార్యసముద్యతా' అన్న నామాలు ద్రౌపదికి కూడా అన్వయించుకోవచ్చు కదా! ద్రౌపది చిదగ్నికుండ సంభూత. దేవకార్యమైన భూభారం తొలగడానికి అవతరించింది కదా!**

జ: ఇది చాలా దూరాన్వయం. చిదగ్నికుండ సంభూత శ్రీలలితా త్రిపురసుందరి. ఆ కుండము వేరు. అది ఉపాసనా విషయం. ద్రౌపది యజ్ఞాగ్ని నుండి సంభవించింది. ఇది ద్రుపదరాజ యజ్ఞం. అది సాక్షాత్తు పరశంభువు చేసిన అలౌకిక మహాయాగం. దానికీ దీనికీ పొంతన లేదు. ద్రౌపది శక్త్యంశ అనడంలో సందేహపడనక్కరలేదు. కానీ – లలితాదేవితో అన్వయించవలసిన పనిలేదు.

ప్ర: **పార్వతీశంకర కల్యాణ సమయంలో హిమవంతుడు కన్యాదానం చేయలేదా? అతడు కన్యాదానం చేస్తే, త్రికరణశుద్ధితో చేయలేదు కనుక, విష్ణువే చేశాదని ఒక పండితుడు చెప్పారు. తార్కాణంగా ప్రసిద్ధంగా కనబడే ఒక చిత్రపటం, శిల్పం చూపించారు. అందులో విష్ణువు కన్యాదానం చేస్తున్నట్లుంది. ఇది సత్యమేనా?**



జ: శివపురాణం, ఇతర పురాణాల ప్రకారం హిమవంతుడే కన్యాదానం చేశాడు. ఆ సందర్భంలో విష్ణువు కన్యాదానం చేయలేదు. అయితే – బ్రహ్మాండ పురాణాంతర్గత లలితోపాఖ్యానం ప్రకారం భండాసుర సంహారానికై జగదంబ లలితా పరమేశ్వరిగా చిదగ్ని కుండంలోంచి ఉద్భవించింది. పరాశక్తి ఎప్పుడు ఏ రూపంలో ఆవిర్భవించినా ఆమె శివశక్తియే కనుక, అప్పుడు శివుడు ఆమెను వివాహమాడాడు.

ఆ సమయంలో లలితాకామేశ్వరి రూపానికి తగిన విధంగా శివుడు కూడా తన రూపాన్ని 'కామేశ్వర' స్వరూపంగా మార్చుకున్నాడు. ఆ కామేశ్వరీ కామేశ్వర వివాహం లో గౌరీ సోదరుడైన (పద్మనాభ సహోదరీ – లలితానామం) విష్ణువు, శివకామేశ్వరునకు కామేశ్వరిని కన్యాదానం చేశాడు. ఆ వృత్తాంతమే తమిళనాట కామాక్షీ కల్యాణంగా ప్రసిద్ధి చెందింది. కాంచీపురంలో కామాక్షీదేవి కూడా ఏకామ్రనాథుని వివాహమాడేట ప్పుడు విష్ణువే కన్యాదాత. మధుర మీనాక్షికి అన్నగారైన అళగర్ విష్ణువు తన చెల్లెలిని సుందరేశ్వరుడైన శివునకిచ్చి వివాహం చేశాడు.

శక్తి ఏ రూపం ధరించినా శివుని పెళ్ళాడడం ఒక సంప్రదాయ విధానం.

అందుకే ఈ విభిన్న వృత్తాంతాల కథనం. ప్రసిద్ధి చెందిన ఈ పురాణ, స్థల

పురాణ అంశాలే విష్ణువు కన్యాదానం చేస్తున్నట్లున్న ప్రసిద్ధ శిల్ప, చిత్ర పటాలకు ఆధారాలు. పార్వతీ పరమేశ్వర కల్యాణంలో మాత్రం అమ్మవారి తండ్రి హిమవంతుడే కన్యాదాత.

**ప్ర: స్త్రీలు బహిష్టయిన నాలుగు రోజుల్లో – ఆలయాలను దర్శించవచ్చా? అలా కుదరని పక్షంలో ఆలయంలో జరిగే ఆధ్యాత్మిక ప్రవచనాలను వెళ్ళి వినవచ్చా?**

**జ:** ఈ ప్రశ్న అడిగే స్థితిలో ఉన్నారంటే, సమాజంలో సంప్రదాయాలు ఎంత అడుగంటుతున్నాయో స్పష్టమౌతుంది. ఆరోజుల్లో గుడులకు వెళ్లరాదు. ఇంట్లో కూడా వంట, పూజ కూడదు. వస్త్ర, జలాదులను తాకరాదు. దూరంగా ఉండాలని– వేదాలు, స్మృతులు చెబుతున్నాయి. ఇంక ఆలయంలోనే కాదు, ఎక్కడైనా సరే ఆధ్యాత్మిక, ప్రవచనాలకు వెళ్ళరాదు, వినరాదు.

**ప్ర: మంచి గురువును పొందడం ఎలా? శిష్యుడు గురువును పరీక్షించాలా? గురువు శిష్యుని పరీక్షించాలా?**

**జ:** గురువును పరీక్షించగలిగే బుద్ధిశక్తి శిష్యుడికి ఉండడం సాధ్యం కాదు. గురువుల జ్ఞానం, ప్రవర్తన అంత తేలికగా అర్థం కాదు. పరీక్షించగలిగే తెలివే ఉంటే శిష్యుడు కాగలడా? ఏ కొద్దిమంది యోగ్యులైన వివేక వంతులు మాత్రమే, తమ విచక్షణతో సరియైన గురువును గ్రహించగలరు – స్వామి వివేకానంద వలె.



కానీ గురువు మాత్రం శిష్యుని పరీక్షించాలి. మంత్ర గురువైనా, బ్రహ్మవిద్యా గురువైనా శిష్యుని స్థాయిని తెలుసుకొని, కుతూహలంతో ఆశ్రయించాడా, శ్రద్ధతో నిష్కపటంగా ఉన్నాడా అనేది పరీక్షించాలి. ఇక, గురువు లభించాలంటే ఇష్టదైవాన్ని ప్రార్థించి, ధ్యానించి సరియైన గురువును ప్రసాదించమని వేడుకోవాలి. అదే శిష్యుడి కర్తవ్యం. తనలో వినయం, నిష్కపటత్వం, ఉపదేశ నియమాలు పాటించడంలో సంసిద్ధత– వంటి శిష్య లక్షణాలు అలవరచుకోవాలి.

ఈశ్వరానుగ్రహం వల్లనే సద్గు రువు లభిస్తాడు. అయితే గురువు శాస్త్రప్రమాణాలతో బోధించేవాడు మాత్రమే కావాలి. ఇది శిష్యుడు ముందే గమనించుకోవాలి. ఎవరి బోధలో శాస్త్రప్రమాణం, తదను గుణవర్తన ఉంటాయో అతడే సరియైన గురువు.

**'శ్రోత్రియం, బ్రహ్మనిష్ఠం'** అని ఉపనిషత్తు ఈ లక్షణాలనే ప్రకటించింది.

రోగి వైద్యుని ఎంచుకున్నట్లు శిష్యుడు కొంత అవగాహనతో గరువును పొందవచ్చు.

**ప్ర: భారతదేశమంతా ఒకే సనాతన ధర్మం ఉన్నప్పుడు ఒక్కొక్క చోట ఒక్కొక్క పద్ధతు లెందుకుంటున్నాయి? ఆచార వ్యవహారాల్లో ఇన్ని భేదాలెందుకు? వైరుధ్యాలెందుకు?**

**జ:** సనాతన ధర్మంలో ఉన్న సౌందర్యమే అది. అవన్నీ వైరుధ్యాలు కావు. వైవిధ్యాలు మాత్రమే. దేశమంతా ఒక్కటే అయినా విభిన్న ప్రాంతాల భౌగోళిక పరిస్థితులను బట్టి, తమ ప్రాంత ప్రాధాన్యం బట్టి ఆ విభిన్నత్వం ఉంది. అందులోని సర్వసాధారణ సనాతన ధర్మం కూడా ఏకమై ఉంది కనుక అవి 'పరస్పరభేదాలు' అనలేము. విభిన్నతలో ఏకత్వమే సనాతన ధర్మం.

**ప్ర: నా మిత్రుడొకడు 'ఇంటర్నెట్' ద్వారా కొన్ని మంత్రాలు, స్తోత్రాలు సేకరించి జపిస్తుంటాడు. అది సరియైన పద్ధతేనా?**

**జ:** అలాంటి మాధ్యమాల ద్వారా స్తోత్రాలు సేకరించి పఠించవచ్చు. కానీ మంత్రాలను మాత్రం అలా గ్రహించి జపించరాదు. తగిన గురువు ద్వారా సంప్రదాయబద్ధంగా గ్రహించి, నియమాలతో జపించాలి.

నామాలు, స్తోత్రాలు, ఉపదేశం లేకుండానే చదువుకోవచ్చు. కానీ ఉచ్చారణ, పద విభజన స్పష్టంగా ఉండాలి కనుక, ఆ భాష తెలిసిన వారి ద్వారా సరిచేసుకొని పఠించాలి. ఇంటర్నెట్ ద్వారా అనారోగ్యాలకు మందులు తెలుసుకొని వినియోగించు కోవడం వైద్యశాస్త్రం అంగీకరించదు. ఔషధసేవనకు వైద్యుడెంత అవసరమో, మంత్రానికి గురువు అంత అవసరం.



**ప్ర: మధురలో మీనాక్షీదేవి చేతి వద్ద 'చిలుక' ఉంటుంది. అలాగే అనేక కామాక్షీ ప్రతిమలలో కూడా చిలుక ఉండడం చూస్తూంటాం. ఇందులో ఆంతర్యం ఏమిటి?**

**జ:** మీనాక్షీదేవి శ్యామలాస్వరూపిణి. శ్యామలాదేవి వీణను, శుకాన్ని దాల్చి ఉంటుంది. వీణ సంగీత విద్యకీ, చిలుక శిక్షణాత్మకమైన శాస్త్రవిద్యకీ ప్రతీకలు. నేర్పరితనంతో కూడిన పలుకులకి చిలుక సంకేతం. 'చాటుగాథాత్మకం' అని కాళిదాసు వివరించాడు. ఈ శ్యామలారూపమే మీనాక్షి కనుక ఆమె చేతిలో చిలుక ఉంది. ఇచ్ఛాశక్తి అయిన కామాక్షి యొక్క జ్ఞానశక్తి స్వరూపిణి శ్యామలాదేవి. శ్యామలా, వారాహి కామాక్షిలో (శ్రీ విద్యలో) అంతర్భాగాలు. అందుకే ఆ తల్లి చేతిలో చిలుక ఉంది.

**ప్ర: ఇతిహాసాలన్నీ జరిగిన కథలేనా? కల్పితాలా?**

**జ:** "ఇతి–హా–ఆసం" = ఇతిహాసం. 'నిస్సంశయంగా ఈ విధంగా జరిగింది' అని ఈ పదానికి అర్థం. ఊహ, కల్పన ఉంటే 'ఇతిహాసం' అనరు.

ఆ విషయాలు జరిగిన కాలంలో వ్రాయబద్ధప్పుడు ఇతిహాసాలవుతాయి. రామాయణ, మహాభారతాలు ఇతిహాసాలు.

**ప్ర: హనుమంతుని ఉపాసించడం పరబ్రహ్మను ఉపాసించినట్లు అవుతుందా? లేక – ఒక దేవతోపాసన మాత్రమేనా? హనుమంతుడు మోక్షదాతగా ఉపాస్యుడా?**

**జ:** అభీష్టసిద్ధులకు వివిధ దేవతారాధనలున్నాయి. అయితే 'సగుణ బ్రహ్మోపాసన' క్రమ ముక్తిని కలిగిస్తుందని శాస్త్రవచనం. వేదాలను అనుసరించి ఏర్పడిన ఆగమాలలో వైష్ణవ, శైవ, శాక్తేయ, సౌర, గాణపత్య, స్కాంద–అనే ఆరు మతాలు సగుణ బ్రహ్మోపాసనకు చెందినవే. ఈ ఆరు వేదసమ్మత ఉపాసనా మతాలు.

ఉపాసనవల్ల చిత్తశుద్ధి, చిత్త ఏకాగ్రత, భక్తి కలిగి – క్రమ ముక్తినీ, సాధనా తీవ్రత వలన బ్రహ్మజ్ఞానాన్నీ (జ్ఞానం ద్వారా ముక్తినీ) పొందవచ్చు.

అయితే హనుమదుపాసన ఈ ఆరింటికీ భిన్నం కాదు. హనుమంతుడు సాక్షాత్తూ శివస్వరూపమే. రామాయణంలో, పురాణాలలో, మంత్రశాస్త్రంలో హనుమంతుడు 'సర్వదేవతాత్మకుడు' – అని స్పష్టం చేయబడింది. అందుకే శైవ, వైష్ణవాది సర్వమతాలకీ సమ్మతం ఆంజనేయోపాసన.

హనుమదుపాసన కేవలం దేవతోపాసన కాదు. అది సమగ్రం, సంపూర్ణం. అది సగుణ బ్రహ్మోపాసనయే. ఇతర ఉపాసనలవలెనే ఇది తత్త్వజ్ఞానంతో కూడినదే. ఏ ఉపాసనయైనా కేవలం అభీష్టసిద్ధులకి కాకుండా, నిష్కపటభక్తితో సాధిస్తే అది చిత్తశుద్ధికీ, క్రమంగా ముక్తికీ హేతువౌతుంది.

**ప్ర: ఆలయాల్లో దేవుళ్ళకు కడవలతో పాలు పోస్తుంటారు. అన్ని పాలు వృధా చేయడం కంటే,పేదలెందరికో పంచవచ్చు కదా!**

**జ:** పారబోస్తే 'వృధా' అంటారు కానీ, 'అభిషేకిస్తే' వ్యర్థం కాదు. 'దేవుడు' అంటే విశ్వకారక 'దివ్య శక్తి'. ఆ భావంతో మంత్రపూత విగ్రహాన్ని అభిషేకిస్తే అది విశ్వానికి పుష్టినిస్తుంది. చెట్లు మొదట్లో నీరు పోస్తే–చూడడానికి పారపోసినట్లు కనిపించవచ్చుగానీ, అది మూలం ద్వారా చెట్టంతటికీ పుష్టినిస్తుంది. కొమ్మలలో పువ్వు కావాలంటే మూలానికి నీరు పోసినట్లే, ప్రపంచ క్షేమం కోసం భగవంతుని ఆరాధిస్తాం. కేవలం మనిషి తాగడమే సార్థకం అనుకోవడం అవి వేకం. ఆ మాటకొస్తే ఆవుపాలు మనిషి నోట్లో పోసి వృధా చేయడం కంటే, దూడ చేత తాగిస్తే మేలు అనుకోవచ్చు కదా! నమ్మకంలేని వాళ్ళు 'వృధా' అనుకోవచ్చు. శాస్త్రాన్నీ, దైవాన్నీ నమ్మేవారికి

అది వ్యర్థం కాదు. ఒక యజ్ఞం, ఒక ఆలయంలోని దేవతారాధన – లోకానికి క్షేమం కలిగించడం నేటికీ చూస్తూనే ఉన్నాం.

ప్ర: **పామును చంపితే 'నాగదోషం' అంటారు కదా! మరి – చైనా వంటి దేశాల్లో వారు పాముల్ని తింటారు. నాగదోషం – అంటే వేరే అర్థం ఉందా?**

జ: నాగులను చంపితే నాగదోషం–అనే మాట తీసివేయ దగ్గది కాదు. చైనీయులు పాముల్ని తింటే వారికీ నాగదోషం వస్తుంది. వారికి తెలియనంత మాత్రాన దోషం రాకుండా ఉంటుందా? చేసిన దానికి ఈ జన్మలోనో, మరుజన్మలోనో అనుభవించక తప్పదు– అనేది విశ్వనియమం. అయితే కొన్ని చేయవలసిన సత్కర్మలను, కనీస సంస్కార క్రియలను వదలి వేసినా 'నాగదోషం' అనవచ్చు. సంతాన విషయకంగా చేసిన దోషాలు, నియమాలనుల్లంఘించే కాముకచర్యలు వంటివి కూడా నాగదోషంగా పరిణమిస్తా యని కొన్ని శాస్త్రాల వచనం.

ప్ర: **మహాభారతంలో హనుమంతుని గురించి, శివుని గురించి కూడా ఉంది. కృష్ణుని గురించి ఎలాగూ ఉంది. కానీ రాముని గురించి చెప్పలేదెందుకు? ఆ కాలానికి రాముని ఆరాధించడం ఉందా? రామారాధన ఏ కాలం నుండి వచ్చింది?**



జ: ఆర్షగ్రంథాలను 'ఆధునికత' పేరుతో సంప్రదాయ విరుద్ధంగా వ్యాఖ్యానించరాదు. హనుమంతుడు భారతకాలంనాటికి కూడా ఉన్నవాడు. అతడు చిరంజీవి. కనుకనే అరణ్యవాసకాలంలో భీమునికి కనబడడం, ధ్వజంపై ఉంటానని అనుగ్రహించడం జరిగింది. ఈ విధంగా హనుమ భారతకథలో భాగం. శివతత్త్వం గురించి అర్జున తపస్సు, కృష్ణుని ఉపదేశం కథలో భాగాలు.

అంతేకాదు – రామాయణ కథను ఒక మహిమాన్విత అవతార గాథగానే మార్కండేయుడు ధర్మరాజాదులతో అరణ్యవాసంలో చెప్పడం – భారతంలో ఉంది.

రామారాధన రామునికి పూర్వం కూడా ఉంది. వేదమంత్రాల్లో పరబ్రహ్మ మంత్రమైన తారకమంత్రం (రామ మంత్రం) ఉంది. దానిని ఉపాసించిన ఋషులు, దేవతలు ఆ మంత్రాధిదేవతను అవతరించమని ప్రార్థించారు. అదే రామావతారం. అంతే కాదు– భారతంలో రాముడు కృష్ణ స్వరూపంలోనే లీనమై ఉన్నాడు.భారతంలో అనేక చోట్ల రామకథా ప్రస్తావన ఉంది.

ప్ర: **నామస్మరణ చేస్తే చాలు కదా? ఇతర మంత్ర తంత్రాలు, ఆచారాలు, ధర్మాలు ఎందుకు? పురాణాల్లోనూ ఈ విషయమే చెప్పారు కదా?**

**జ:** నామస్మరణ చేస్తే చాలు– ఇతర మంత్ర తంత్రాలు అనవసరం అన్నది నిజమే. కానీ ధర్మం, ఆచారం విడిచిపెట్టకూడదు. శక్తి వంచన లేకుండా ధర్మాచరణ చేస్తూ, ప్రేమపూర్వకంగా నామస్మరణ చేయాలి. ఈ విషయమే పురాణాల్లో చెప్పారు. ఆచారాలను, ధర్మాలను మాత్రం విడిచిపెట్టరాదు. ధర్మాన్ని విడిచి పెడితే ఏదీ ఫలించదు.

**ప్ర: జపమో, ధ్యానమో చేసేటప్పుడు కొన్ని రకాల అనుభూతులు కలుగుతుంటాయి. అవి సత్యమైనవేనా? ఇతరులతో చెప్పవచ్చా?**

**జ:** జప ధ్యాన సమయాల్లో కలిగే అనుభూతులు సత్యమో, అసత్యమో నిర్ణయించలేము. ఏవో దృశ్యాలు కనబడుతున్నట్లు, శబ్దాలు వినబడుతున్నట్లు జరుగు తాయి. అవి భ్రాంతులో, సత్యాలో తేల్చడం తేలిక కాదు. ఆ అనుభూతుల విషయంలో చర్చ చేయకుండా సాధన చేసుకుంటూ వెళ్ళడమే కర్తవ్యం. ఇక – వాటిని ఇతరులతో ఏనాడూ చెప్పకూడదు. ఒక వేళ అనుభూతులు సత్యమైతే, ఇతరులు వాటిని భ్రాంతి అని కొట్టివేసే ప్రమాదముంది. దానితో సాధన పై శ్రద్ధ తగ్గుతుంది. అయితే తమ గురువుతో వాటిని చెప్పవచ్చు. ఆ జపధ్యానాదులకు, ఆ అనుభూతులకు శాస్త్ర సమ్మతమైన పొంతన ఉన్నట్లయితే గురువే వాటిని 'సత్యాలు' అని నిర్దేశిస్తారు. ఇంకా సాధనలో ఎలా పురోగమించాలో సూచిస్తారు. అంతేకానీ మనకి మనమే దివ్యదర్శనాలుగా భావించి మురిసిపోరాదు.

**ప్ర: తత్త్వాల గురించి చెప్పేటప్పుడు కొన్ని చోట్ల 24 అనీ, ఇంకొన్ని చోట్ల 36 అనీ చెప్తారు. వీటిలో ఏది గ్రాహ్యం? అసలు 'తత్త్వం' అనే మాటకి అర్థమేమిటి?**

**జ:** 'తత్త్వం' శబ్దానికి సందర్భం బట్టి అర్థం చెప్పాలి. మీరు చెప్పిన సందర్భంలో ప్రపంచ దేహ విషయంలో చెప్పవలసిన అర్థాలే చెప్పాలి.

**ఆప్రళయం యత్తిష్ఠతి సర్వేషాం భోగదాయి భూతానాం।**

**తత్తత్త్వమితి ప్రోక్తం న శరీరాది ఘటాది తత్త్వమతః॥** (సూతసంహిత)

సృష్టిలో అనుభవించబడే పదార్థాలు (భోగ్యాలు), అందుకు సాధనాలు, అనుభవించే వాడు – వీటిని తత్త్వాలు అంటారు. వీటన్నింటికీ చైతన్యమిస్తూ, వీటికి అతీతంగా ఉండే పరబ్రహ్మను పర'తత్త్వ'మనీ, 'తత్త్వాతీతుడ'నీ అంటారు.

2. మరొక నిర్వచనంలో జ్ఞానపరంగా అర్థం చెప్పాలి.

**'తత్త్వం యాథార్థ్యే బ్రహ్మణి'** ఉన్నదున్నట్లు (యథార్థం) చెప్పడం తత్త్వం. ఒకదాని

యొక్క యథార్థ స్వరూపం తత్త్వం.

అదే విధంగా పరబ్రహ్మ స్వరూపాన్ని కూడా తత్త్వం అంటారు.

మొదటి నిర్వచనం ప్రకారం: సాంఖ్యులు 24 తత్త్వాలు చెప్పారు. వాటిని ఆత్మతత్త్వాలు అంటారు. ఇక్కడ 'ఆత్మ' శబ్దానికి 'జీవాత్మ – పరమాత్మలు' అనే అర్థం గ్రహించరాదు. ప్రతి వ్యక్తి అనుభవానికి వచ్చే అంశాలు ఇవి.

ప్రకృతి (1), మనోబుద్ధ్యహంకారాలు(3), పంచజ్ఞానేంద్రియాలు (5), పంచ కర్మేంద్రియాలు(5), పంచతన్మాత్రలు(5), పంచభూతాలు(5) –ఈ 24 ఆత్మతత్త్వాలు. వీటిపై ప్రభావం చూపించే సూక్ష్మతత్త్వాన్ని శైవ, శాక్తేయ, ఆగమ, తంత్ర శాస్త్రాలు 12 అదనంగా చెప్పాయి. అందులో విద్యాతత్త్వాలు ఏడు– 1.పురుష, 2.నియతి, 3. కాల, 4.రాగ, 5.అవిద్య, 6.కళ, 7.మాయ.

శివతత్త్వాలు అయిదు– 1.శివ, 2. శక్తి, 3.సదాశివ, 4.ఈశ్వర, 5.శుద్ధ విద్య. స్వస్వరూపం తెలియడానికి ఈ తత్త్వ వివేచనని ఆగమాది శాస్త్రాలు పేర్కొన్నాయి. నిజానికి ఇరవై నాలుగు, ముప్ఫయ్యారు కూడా ప్రపంచాన్నీ, జీవునీ అర్థం చేసుకోవడానికి సహకరిస్తాయి.



**ప్ర: శైవమతం, వైష్ణవమతం, శాక్తేయ మతం...ఇలా మనకు ఎన్నో మతాలున్నాయి. ఇవన్నీ ఒకే హిందూమతంగా అనగలమా? భిన్న భిన్న మతాలైన ఇవన్నీ ఒకే మతం ఎలా అవుతాయి?**

**జ:** శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణపత్య, సౌర, స్కాంద – ఈ షణ్మతాలూ హైందవమతాలే. ఒకే సనాతన ధర్మమైన వేదాలను మూలంగా కలిగిన మతాలు కనుక ఇవన్నీ వేదమతాలే. అంతేకాదు–ఆరుమతాలూ పూజ, ఆచారాలు ఇంచుమించు ఒకే పద్ధతిలో ఆచరిస్తాయి. కించిద్భేదాలతో ఈ ఆరూ వేదాన్ని గౌరవిస్తాయి. వేదాలను ఉటంకిస్తాయి. ఆరుగురిలో ప్రతి ఒక్కటీ మిగిలిన వాటి ఉనికిని అంగీకరిస్తాయి. కానీ తమ ఇష్ట దైవాన్ని అభిమానంగా ఆరాధించుకుంటాయి.

వేదవేదాంతాలు ప్రతిపాదించిన ఏకేశ్వరునే ఆరు మాతాలలో ఆరు రూపాలలో ఆరాధిస్తున్నారని స్పష్టమౌ తోంది.

**ప్ర: దేవుళ్ళకు మొక్కుకున్నాక, తిరిగి అవి తీర్చకపోతే వారికి కోపం వస్తుందనీ, శపిస్తారనీ అంటారు. కోపం, శాపం ఉంటే వారెలా దేవతలవుతారు? మొక్కు చెల్లించనంత మాత్రాన శిక్షించడం న్యాయమేనా?**

**జ:** అసలు తీర్చలేనప్పుడు మొక్కుకోవడం ఎందుకు? – అనే ప్రశ్న ఎందుకు రాలేదు? మొక్కుకోవడం అంటేనే ఒక నిబద్ధత. అదే సత్యం. ఆ సత్యాన్ని తప్పితే అసత్యమే శిక్షిస్తుంది. ఇది విశ్వవ్యవస్థలో దాగిన దివ్యత్వం.

అధర్మం పట్ల దేవతలకు ఆగ్రహం కలగడం దోషం కాదు. దుర్మార్గాన్నీ, అధర్మాన్నీ, అసత్యాన్నీ శిక్షించడమూ అన్యాయం కాదు. నిప్పులో చేయి పెడితే కాలుతుంది. కానీ దానిని సరిగ్గా వినియోగించితే ఆహారం వండుతుంది, వెలుగును పంచుతుంది. కాల్చడం అగ్ని దోషం కాదు. మన వినియోగంలోని లోపం. అలాగే దేవతల విషయం 'మాటతప్పడమ'నే పాపం దేవతాగ్రహానికి గురి చేయడం సహజమే. మన కర్మకు తగిన ఫలాన్ని ఇవ్వడమే దేవతల పని.

ఇది విశ్వంలోని ధార్మిక వ్యవస్థ.

**ప్ర: రుద్రం, మహారుద్రం, లఘురుద్రం, అతి రుద్రం– లాంటి మాటలు అభిషేక సందర్భాల్లో వింటూంటాం. అసలు వీటిలో తేడాలు ఏమిటి?**

**జ:** యజుర్వేదంలోని మంత్రభాగమైన 11 అనువాకాల 'శతరుద్రీయా'నికి 'రుద్రం' అని పేరు. దానిని ఒకసారి పఠిస్తూ చేసే అభిషేకం రుద్రాభిషేకం అంటారు. దానికి 'రుద్రం', 'ఏకరుద్రం' అని పేర్లు కూడా ఉన్నాయి. ఈ 11 అనువాకాల 'రుద్రం' పదకొండుసార్లు చెబుతూ చేస్తే 'ఏకాదశ రుద్రాభిషేకం' లేదా 'రుద్రి' అంటారు. రుద్రాన్ని 121 సార్లు పఠిస్తూ చేసే అభిషేకం 'లఘురుద్రాభిషేకం'.

11 లఘురుద్రాలు ఒక 'మహారుద్రం'. అంటే, ఈ అభిషేకంలో రుద్రం (మొత్తం 116 అనువాకాలు) 1331 సార్లు పఠించబడుతుంది.

ఈ మహారుద్రాలు పదకొండయితే 'అతిరుద్రం'. దీనిలో 14641 మారులు రుద్రం చెప్పబడుతుంది. ఈ రుద్రమంత్రాలను అభిషేకానికి వాడితే 'రుద్రాభిషేకం'! హోమంలో వినియోగిస్తే 'రుద్రయాగం'. ఇవే ఆయాపేర్లలో ఉన్న విభిన్నార్థాలు.

**ప్ర: ఈ మధ్య ఒక రాజకీయ నాయకుని ఆశీర్వదించడానికి అన్ని మతాల వాళ్ళూ వచ్చారు. అందులో హిందూ వేద పండితులు ఆశీర్వదించగానే ఆ నాయకుడు, 'అన్యమతాల ఆశీర్వచనం తెలుగులో చక్కగా అర్థమయ్యేలా చేశారు. కానీ మీ మంత్రాలు నాకేమీ అర్థం కాలేదు' అన్నాడు. మనవాళ్లు కూడా మంత్రాలు అనువదించి చెప్పవచ్చు కదా!**

**జ:** ఆ నాయకుడికి అసలు సంప్రదాయం, ఆశీర్వచన పరమార్థం తెలియదని దీనిని

బట్టి తెలుస్తోంది. ఆ నాయకుడి మాటకి మీరు ఇలా స్పందించడం మరీ విడ్డూరం! ఆశీర్వచనంలో ఇతరులు వాడేవి 'వాక్యాలు'. మన సంప్రదాయంలో వినియోగించేవి 'మంత్రాలు'. వాక్యాలు అర్థమవడం తేలిక. కానీ వాటిలో శక్తి ఉండదు. కేవలం భావన మాత్రమే. ఈ భావానికి ఒక తృప్తి కలగడం సహజం.
ఇవి శుభాకాంక్షలవంటివి.

మంత్రాల పద్ధతి అటువంటిది కాదు. మంత్రాల ఉచ్చారణలో ఆ శబ్దప్రకంపన లలో ఒక దివ్యశక్తి ఉంటుంది. దాని ప్రభావంతో ఆశీస్సులు పొందినవాడికి మేలు జరుగుతుంది. మేలు చేసేవారు దేవతలు. ఆ దేవతలను స్పందింపజేసేవి మంత్రాలు. వారిని స్పందింపజేసే శబ్దాలు మనకి అర్థం కావలసిన అవసరం లేదు. ఆ మంత్రాల నాదాన్ని శ్రద్ధగా గ్రహిస్తూ, దేవతల్ని నమస్కరించుకుంటే చాలు. దేవతా కృపచేత, మంత్రమహిమచేత ఆశీస్సులు ఫలిస్తాయి. అదృష్టవశాత్తూ, అటువంటి మహిమగల సత్యశక్తి హిందూ ధర్మంలోని మంత్రాలకి, శ్లోకాలకి మాత్రమే ఉంది. మిగిలిన వారి వాక్యాలలో మంచి భావం ఒక శుభాకాంక్షగా పనిచేయవచ్చు. కానీ వాటిలో మంత్రప్రభావం ఆశించలేం.



మందును ఉపయోగించే రోగికి దానిలో ఏ ఓషధులు ఉపయోగించారో తెలియ నక్కరలేదు. దానిని నిర్దేశించిన వైద్యునికి తెలిస్తే చాలు. రోగి తెలుసుకుంటే తప్పులేదు. కానీ తెలియక పోయినా, వైద్యుడు చెప్పింది సేవిస్తే స్వస్థుడౌతాడు.

అదేవిధంగా – ఋషికి మంత్రార్థాలు తెలుసు. వాటిని శ్రవణం చేస్తే చాలు మనం ధన్యులమౌతాం. అయితే వేదమంత్రాకు అర్థాలు లేవని కాదు. భౌతిక విజ్ఞానానికి అందని దివ్యార్థాలు ఎన్నో ఉన్నాయి. అవి ఆశీర్వచనంలో చెబితే 'భాష్య ప్రవచనం' అవుతుంది. అది ఆ సందర్భంలో అనవసరం. స్థూలంగా మంత్రాలలో భావాన్ని శ్రోతకు చెప్పి ఆనంద పరచవచ్చు. కానీ మంత్రం బదులు అనువాదాన్ని చదివితే మాత్రం – ఇతర మతాల వాక్యాలవలెనే శుభాకాంక్షలు మాత్రమే అవుతాయి. దీవెనలు కావు. మంత్రంలో ఆశీర్వదించాక, దానిలోని సారంశాన్ని, భావాన్ని కూడా వారికి చెప్పడంలో పొరపాటు లేదు.

హిందూ గ్రంథాల్లో సంస్కృతభాషలోనే కాక, తెలుగు పద్యాలలో, పాటలలో కూడా బోలెడన్ని శబ్దాలున్నాయి. వాటిని కూడా ఆశీర్వచనాలలో సమయోచితంగా చెప్పవచ్చు. ఆ దేశ భాషా వాక్యాలు కూడా ఇతర మత వాక్యాలకు ఏమీ తీసిపోవు.

అయితే అవి కూడా వేదమంత్రాలంత శక్తిమంతం కావు. వేదమంత్రాల తరువాత వాటిని కూడా జోడించవచ్చు. కానీ నిజమైన శ్రేయస్సును కోరేవాడు వేదమంత్రాశీర్వచనంతో మరొక దానిని పోల్చలేడు.

ప్ర: **నేపాల్‌లో పశుపతినాథ్ ఆలయంలో శివునికి నాలుగు వైపుల ముఖాలుంటాయి. కానీ 'పంచముఖుడు' అంటున్నారు. చతుర్ముఖాలుంటే బ్రహ్మదేవుడంటారు కదా! కొన్నిచోట్ల అలాంటి శివలింగాలను చూశాను! శివునకు 'ముఖలింగం' అనే పేరు ఎందుకుంది?**

ప్ర: మీరు చెప్పినట్లు ముఖాలు చిత్రించిన లింగం 'ముఖలింగం' అనవచ్చు.

పంచముఖుడైన శివుని ముఖలింగంగా చిత్రిస్తే నాలుగు వైపుల మాత్రమే ముఖాలుంటాయి. పైభాగంలో ముఖముండదు. అయినా అది పంచముఖమనే అనాలి. ఊర్ధ్వముఖం నిరాకార తత్త్వం.

చతుర్దిశలలో విస్తరించిన విశ్వవ్యాప్తమైన ఈశ్వరతత్త్వం నాలుగుముఖాలలో వ్యక్తమయింది. విశ్వాతీత విశ్వేశ్వర తత్త్వం ఊర్ధ్వముఖంగా ఉంది. కనుక అది నిరాకారం.

నాలుగు వైపులా ఉన్న ముఖాలు– సద్యోజాత, వామదేవ, తత్పురుష, అఘోర అనే పేర్లతో ఉంటాయి. పంచమ ముఖం (ఊర్ధ్వముఖం) 'ఈశానముఖం'. ఇది నిర్గుణ తత్త్వం. కనుక నిరాకారం. అందుకే ఐదవముఖస్థానంలో ముఖం ఉండదు.

పంచభూతతత్త్వాలకీ, పంచముఖాలకీ కూడా సమన్వయముంది. ఊర్ధ్వముఖం– ఆకాశతత్త్వం. అది సూక్ష్మం, నిరాకారం కదా!

ప్ర: **ఒక పెద్దమనిషి రామభక్తుడు "రామాయణమే గొప్ప గ్రంథం, భారతం వ్యర్థమైనది. అందులో ఉన్నవన్నీ జుగుప్సాకరమైన వృత్తాం తాలే. వ్యాసుడి పుట్టుక, పాండవుల కథ – ఏదీ గొప్పది కాదు" అంటూ రాసి వాటిని కరపత్రాలుగా పంచుతున్నాడు. అన్ని పత్రికల్లో వ్యాసాలుగా రాస్తున్నాడు, నిజానికి రెండింటిలో ఏది గొప్పది?**

జ: రామభక్తిలో రామాయణాన్ని గొప్ప గ్రంథంగా గౌరవించవచ్చు. కానీ భారతాన్ని ద్వేషించనక్కర్లేదు. దేని గొప్పదనం దానిదే. వ్యాసభగవానుని అవతారం దివ్యమైనది. కామవికారం లేని పరాశరుడు తపశ్శక్తితో, దైవాజ్ఞతో తనలో ప్రవేశించిన విష్ణు తేజస్సును, దివ్యమైన పుట్టుక కలిగిన సత్యవతిని క్షేత్రంగా స్వీకరించి ఆమె యందు నిహితం చేశాడు. ఆ సమయంలో 'యోజనగంధి'గా ఆమెను మార్చి, ద్వీపాన్ని

ఉత్పన్నం చేసి తన తపోమహిమని ప్రకటించాడు. సద్యోగర్భంగా వ్యాసుడు ఉద్భ వించాడు. ఈ జననగాథ మానుషాతీతమైనది.

సాక్షాన్నారాయాణాంశ సంభూతుడైన వ్యాసుడు భారతంలో అందించిన అద్భుత ధర్మ, జ్ఞాన సంపద ప్రపంచ మేధావుల్నే అబ్బురపరుస్తోంది. ఆ కాలంనాటికి దివ్యత్వ మానవత్వాల మేళవింపు ఉన్నది. ఆ ప్రత్యేకతే పాండవ జననాదుల్లో కనిపిస్తుంది. అడుగడుగునా ఆశ్చర్యకరమైన వృత్తాంతాలతో, విశిష్టశైలితో రచించిన మహాగ్రంథం భారతం. రామాయణాన్ని చదవమని బోధించాలంటే, భారతాన్ని నిందించనవసరం లేదు. మీరు చెప్పిన వ్యక్తి 'రామభక్తుడు' అనేకంటే 'మానసిక వికారమున్నవాడు' అనవచ్చు. భారతజాతి గర్వించదగ్గ మహేతిహాసాలు రామాయణ, భారతాలు.

విపరీత కోణాలతో చూస్తే ఎంత మహోన్నత విషయాన్నైనా హేళన చేయవచ్చు. రామాయణాన్ని కూడా అవహేళన చేసినవాళ్లు ఉన్నారు కదా! దీనినే 'అసూయా దృష్టి' అంటారు. 'గుణాన్ని కూడా దోషంగా చూసే నీచలక్షణ'మది. అలాంటివాళ్ల వల్ల మహాగ్రంథాలు, మహాత్ములు కూడా నిందకు గురిఅవుతారు. అయినా ఆ గ్రంథాల, మహాత్ముల తేజస్సు, మాహాత్మ్యం తగ్గదు.



**ప్ర: రాధాకృష్ణుల కల్యాణం భాగవతంలో లేదు. కొన్ని కొన్ని పురాణాల్లో ఉన్నట్లు చదివాను. కొన్నిచోట్ల కల్యాణం చేస్తున్నారు కూడా. భాగవతంలో రుక్మిణీ కల్యాణం ఉంది. రాధతో కల్యాణమయ్యాక మళ్ళీ రుక్మిణీదేవి వివాహం ఏమిటి? రాధాకల్యాణం కల్పితమా?**

**జ:** పురాణాల్లో రాధా కల్యాణం ఉంది. ఇప్పటికీ బృందా వనంలో రాధాతత్త్వం, గాథలు వ్యాప్తి చెంది ఉన్నాయి. రాధా కృష్ణోపాసకులున్నారు. దీనికి సంబం ధించిన శాస్త్రాలు చాలా ఉన్నాయి.

ఒక చరిత్ర వలె, సాహిత్యం వలె దేవతా విషయాలను పరిశీలించరాదు. రాధా కృష్ణతత్త్వం ఉపాసనకీ, తాత్త్వికతకీ సంబంధించినది. వారి వివాహం అలౌకికం. అది ధర్మానికీ, అధర్మానికీ కూడా అతీతమైన దివ్యత్వం. రాధాకృష్ణులు నిత్యధామమైన గోలోకంలో ఉండే శాశ్వత సగుణ బ్రహ్మమూర్తులు.

లీలగా భూమి యందవతరించినప్పుడు బృందావనంలో ఆ అవతారమూర్తులకు కల్యాణం జరిపించినది బ్రహ్మదేవుడు. అక్కడ పాల్గొన్నది గోలోక భక్తులు, ఈ వర్ణన చాలు – ఆ ఇరువురి బంధం అలౌకికమైనది అని చెప్పడానికి. అలౌకికతత్త్వంలో

మానవ ధర్మాధర్మాలు వర్తించవు. అదే రుక్మిణీ కృష్ణులు – లక్ష్మీనారాయణతత్త్వంగా వివాహితులైన అది లౌకిక ధర్మాన్ని అనుసరించడమే. రాధాకల్యాణం వంటిది కాదు రుక్మిణీ కల్యాణం. మొదటిది తాత్త్విక, ఉపాసనా విషయం రెండవది – లౌకిక, ధార్మిక ధర్మం.

ప్ర: **గురుభక్తి అనేది చాలాచోట్ల ఈరోజుల్లో చాలా వికృతంగా కనిపిస్తోంది. గురువులే దేవుళ్ళుగా భంగిమలిస్తూ, శిష్యులు బానిసల్లా ప్రవర్తించడం కనిపిస్తోంది. గురువుల్నీ, ఉపాధ్యాయుల్నీ వినయంగా చూడడం కూడా ఒకానొక బానిస సంస్కృతి – అని ఒక విదేశీ మిత్రుడు వ్యాఖ్యానించాడు. మన శాస్త్రాల ప్రకారం గురువును ఒక దేవుడిలా పూజించడం సమంజసమేనా?**

**జ:** మీ ప్రశ్న బాగుంది. గురు సంస్కృతి అనేది ఒక వికృతంగా కొన్నిచోట్ల మారిన మాట వాస్తవమే. అంత మాత్రాన గురుభక్తి అనే సంప్రదాయాన్ని కించపరచరాదు. గురుభక్తి అనేది శిష్యుడి ధర్మం మాత్రమే. గురువు ఆశించేది కాదు.

గురువు తండ్రి వంటివాడు. తల్లి, తండ్రి, గురువు –ఈ ముగ్గురూ దైవ సమానమే. విద్య నేర్పిన వారిని కృతజ్ఞతతో గౌరవించడం మానవీయ సంస్కారం. గురువుపట్ల ప్రకటించే భావమే 'గౌరవం'. నాగరిక సంస్కారానికి ఉదాహరణ అది. అలాంటి సంస్కారం కల భారతదేశం ఏనాడో నాగరక దేశం కనుక–గురువుల్నీ, ఉపాధ్యాయుల్నీ వినయంగా చూడడం అనే నాగరకతని ప్రకటిస్తున్నాం. ఆ సంస్కారం దాకా ఎదగని అనాగరికత ఇంకా ఉంది కనుక విదేశీ దృష్టి ఇంకా వికసించాలి. గురువులు బానిసలుగా చూడరు. గురుసమీపంలో సేవవల్ల అహంకారరాహిత్యం, విద్యార్జన లభిస్తాయి. జ్ఞానం కోసం, మనలో దివ్యశక్తిని జాగృతి పరచడం కోసమే గురువు. ఎక్కడో కొందరు దీనిని దుర్వినియోగం చేస్తున్నంత మాత్రాన వాటిని నిందించరాదు. ప్రతిరంగంలోను ఏదో ఒక విధంగా వికృతధోరణులు ఉంటూనే ఉంటాయి. అంతమాత్రాన వ్యవస్థను కాదనరాదు.

**యస్యదేవే పరాభక్తిః**

**యథాదేవే తథాగురౌ** – అని ఉపనిద్వాక్యము.

దేవునిపై భక్తి, అదే విధంగా గురువుపై భక్తి అవసరమని మన వేదాంత శాస్త్రమే చెబుతోంది. ఇక మంత్రశాస్త్రాది విషయాలు సరేసరి.

శ్రీరామకృష్ణ పరమహంస వంటి గురువుల వల్ల వివేకానంద వంటి మహా

శయులు లభించారు. గౌడభగవత్పాదులు, గోవింద భగవత్పాదులు వంటి ఆచార్యుల వల్ల ఆదిశంకరుల వంటి మహోన్నతులు లభించారు. గౌరవాన్ని బానిసత్వంగా, గౌరవించని పొగరుమోతుతనాన్ని సంస్కారంగా తలవడం పొరపాటు.

విద్యను కూడా ఒక వస్తువును కొన్నట్లుగా, వ్యాపార ధోరణిలో వినియోగదారునిలా విద్యార్థి భావించడం కుసంస్కారం.

ఇది వ్యాపార సంస్కృతికి చెల్లుతుంది. జ్ఞాన సంస్కృతికి సరిపోదు.

ప్ర: **ఒకామె 'భగవద్గీత' పాఠాలకి వెళుతున్నది. నేనామె ఇంటి కెళ్ళినప్పుడు దేవుడి గది చూపించమన్నాను. ఆమె చూపించింది. కానీ ఆ గది బూజులు పట్టి, విగ్రహాలు శుభ్రం లేకుండా ఉన్నది. నేనీ మధ్య అద్వైత వేదాంతం నేర్చుకుంటున్నాను. అందుకే నామరూపాలను పట్టుకోవడం మానేశాను. ఈ గదిలో మా ఆయన అప్పుడప్పుడు పూజ చేసుకుంటారు. అంతే. నేను పూజా పునస్కారాలు మానేశాను' అని వివరణ ఇచ్చింది. భగవద్గీత చెప్పిన ప్రకారం పూజాదులు అక్కర్లేదా? ఇది నాస్తికం కాదా?**

జ: కొందరు ప్రస్థానత్రయాలను చెప్తున్నామని చెప్పి వేదాంతం పేరుతో నాస్తికత్వమే బోధిస్తున్నారు. అది వేదాంతానికి విరుద్ధం. అద్వైత వేదాంతం పండినవారికి సర్వ బ్రహ్మమయం అనే భావన సిద్ధిస్తుంది. అంతేకానీ పూజాదులు వదిలిపెట్టేయాలి అనే మాట ఉండదు. మీరు చెప్పిన ఆమె ఇంట్లో వంటా, వార్పూ, అతిధులను పలకరించడం, కుటుంబ జీవితం పాటిస్తున్నారు కదా! వాటికి లేని అభ్యంతరం పూజకి ఎందుకు? సన్యాసి మాత్రమే–కర్మను విడిచిపెట్టి తురీయాశ్రమంలో ఉన్నారు కనుక – కేవల ఆత్మ విచారణలో ఉంటాడు. ఎంత వేదాంతాలు నేర్చుకుంటున్నా, వల్లిస్తున్నా గృహస్థాశ్రమంలో ఉన్నప్పుడు ఇంట్లో దేవతారాధన, వంశాచారాలు మొదలైనవి మానరాదు. అవి నిత్య నైమిత్తికాలు. వేదాంతమార్గంలో ఉంటే కామ్యకర్మలు, లౌకిక వ్యవహారాలు త్యజించాలి.

కోరికలు, రాగద్వేషాలు, అర్థకామాలు ఇవన్నీ ఉంటూ, కేవలం వేదాంతంలో ఉన్నాననుకొనే భ్రాంతిలో స్వాశ్రమ ధర్మమైన గృహస్థ కర్తవ్యాలను విడిచిపెడితే వారిని 'జ్ఞానులు' అనరు. 'భ్రష్టులు' అంటారు. వేదాంత జ్ఞానాన్ని సరిగ్గా గ్రహించలేక, సమన్వయించలేక భగవద్గీతాదులకు కూడా విపరీత వ్యాఖ్యలు చెబుతున్నారు.

**'యజ్ఞదానతపస్తీర్థం న త్యాజ్యం కార్యమేవ చ'**

**'పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి'।**

**తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః॥**

**'దేవ ద్విజ గురుప్రాజ్ఞ పూజనం'**- ఇలాంటి వాక్యాలు చాలా భగవద్గీతలోనే ఉన్నాయి. అద్వైతం పేరుతో నాస్తికత్వాన్ని చెప్పడం అద్వైతానికే విరుద్ధం. 'దేవపూజలు చేయను' అనే స్పృహ ఉన్నప్పుడు అది అద్వైతం ఎలా అవుతుంది? ఇంట్లో బూజులు, అశుభ్రం వేదాంతం కూడా సహించదు. స్నానం, శుభ్రత, వంటికీ, ఇంటికీ అవసరం. అవి దేవుడిగదిలో కూడా అవసరం.

**ప్ర: రామాయణం మొత్తంగానీ, సుందరకాండ గానీ, పారాయణ చేయడానికి వాల్మీకి రామాయణం మాత్రమే చదవాలా? లేక - 'అధ్మాత్మరామాయణం' చదవవచ్చా? దానివల్ల ప్రభావం ఉంటుందా?**

**జ:** పారాయణకు ప్రమాణానికి 'వాల్మీకి రామాయణం' పఠించడం మంచిది అనడంలో సందేహం లేదు. కానీ రామాయణ పారాయణాన్ని గౌరవించే సంప్రదాయజ్ఞులు వాల్మీకి రామాయణంతో పాటు, అధ్యాత్మరామాయణాన్ని కూడా ఆదరిస్తారు. అది కూడా ఆర్షరామాయణమే. ఋషులు చెప్పిన ప్రతిశ్లోకం మంత్రమయమే.

అందువలన పురాణాంతర్గతమైన అధాత్మరామాయణం కూడా పారాయణ చేయవచ్చు. దాని వలన కూడా ప్రభావం ఉంటుంది. మహాత్ముడైన తులసీదాసు రచించిన 'రామచరితమానస్' కూడా పారాయణ చేస్తూ సత్ఫలితాలు పొందుతున్న వారున్నారు. స్వానుభవంతో తపస్సుతో రచించిన గ్రంథం కనుక దానికా ప్రభావముంది. ఆ గ్రంధానికి ఆధారమైన 'అధ్యాత్మరామాయణ' ప్రభావాన్ని శంకించనవసరం లేదు.

**ప్ర: మా స్నేహితుడు సనాతనధర్మంపై ఆసక్తి కలవాడు. కానీ వాళ్ళ నాన్న నాస్తికుడు. అతడు మరణిస్తూ "నాకు మరణానంతర కర్మలపై నమ్మకం లేదు. కనుక నా చావు తర్వాత అటువంటి కర్మలకై ఖర్చు చేయవద్దు" అని రాసి పెట్టాడు. ఇప్పుడు నా స్నేహితుడు బాధపడుతున్నాడు. ధర్మంపై నమ్మకమున్నప్పుడు అవి చేయాలా? తండ్రి మాటని గౌరవించనప్పుడు పితృవాక్యధిక్కార దోషం రాదా?**

**జ.** ఎంత నాస్తికుడైనా ఎక్కడో కొంత పుణ్యం ఉంది కనుక ఇటువంటి ఆస్తికుడైన పుత్రుడు కలిగాడు. సంతోషమే. నమ్మకాలు లేని తండ్రి రాసిపెట్టిన మాటని ధిక్కరిస్తే దోషంరాదు. శరీరం పోవడంతో 'ఉనికి'యే ఉండదని నమ్మినవాని మాటకి కూడా ఉనికి ఉండదు. లేని వ్యక్తి బాధపడతాడని అతని మాటని పాటించడంలో అర్థం లేదు.

'పితృభక్తి' అనేది సనాతన ధర్మంలో భాగం. సనాతన ధర్మాన్ని నమ్మితే తండ్రికి దుర్గతులు కలుగరాదు కనుక, మరణానంతరం శాస్త్ర కర్మలని ఆచరించాలి. అవి చేయక పోతే పోయినవాడి గతి ఎలాగున్నా, పుత్రుడిగా తన ధర్మం దెబ్బతిన్నట్లే. లేదన్న నమ్మకం తండ్రిదైతే – ఉన్నదన్న నమ్మకం కొడుకుది. తన ఇష్టాన్నీ, తన నమ్మకాన్ని తాను పాటించడం తప్పులేదు. నాస్తికంగా ఆలోచించినా – పోయినవాడు ఎలాగూ లేడు కనుక వాడి మాటని పట్టించుకోనక్కర్లేదు. ఉన్నవాడే సత్యం కనుక నమ్ముకున్న వాడి బాధ్యతని మాత్రమే గౌరవించాలి. అందుకే కొడుకు నిరభ్యంతరంగా తన నమ్మకం ప్రకారం ఆచరించాలి

మరో కోణంలో–తండ్రి ఆస్తికుడైనా కొడుకు నాస్తికుడైతే ఏం చేయాలి. తనకి నమ్మకం లేకున్నా తన తండ్రి విశ్వాసాన్ని గౌరవిస్తూ మానవతా ధర్మంతో మరణా నంతర ధర్మాల్ని చేయాలి.

ప్ర: **జాతాశౌచ మృతాశౌచాలలో పూజలు, మంత్ర జపాదులు, అనుష్ఠానాలు చేయరాదం టారు. మరి– 'సర్వకా లేచ మామనుస్మర' – అన్ని కాలాలలో నన్ను అనుస్మరించు – అని 'భగవద్గీత'లో కృష్ణవాక్యం. ఇంక ఆ కాలాల్లో నిషేధాలెందుకు? అదే విధంగా పెద్దలు మరణించాక పిల్లలు ఏడాది పాటు యజ్ఞయాగాదులు తీర్థయాత్రలు ఎందుకు చేయరాదు. దోషం ఏడాది పాటు ఉంటుందా?**



జ: అనుష్ఠానం వేరు, స్మరణం వేరు. అనుష్ఠానం ఒక కర్మ. అశౌచాలలో సంబంధీకులు దేవకర్మలు చేయరాదు. పూజ, జపం వంటివి మామూలు క్రియలు కావు. శుచి స్వరూపులైన దేవతలను సన్నిహితం చేసే కర్మలు. అందుకే, మైలరోజుల్లో వాటిని ఆచరించరాదు. ఇది కర్మ పరమైన విషయం. మానసికంగా చేసే స్మరణం బాహ్య క్రియ కాదు. భగవంతుని భక్తితో తలచుకోవడం కేవల కర్మ కిందికి రాదు. ఆ తలంపులో నామము, లీలారూపాలు మాత్రమే ఉంటాయి. మంత్రదేవతలుండరు.

నిజానికి అలాంటి నిరంతరమైన స్మరణ చేయడం అసలైన భక్తులకే సాధ్యం. వారికి స్మరణము మేరకు మాత్రమే నిరభ్యంతరం, అనుష్ఠానమనబడే కర్మలకు మాత్రం నిషేధం.

'అనుష్ఠానం చేయాలి' అని చెప్పిన శాస్త్రమే ఎప్పుడు చేయాలి? ఎప్పుడు చేయకూడదో కూడా చెప్పింది.

సర్వకాలస్మరణ అనే మానసిక భావనాయోగానికి నిషేధం లేదు.

**ప్ర: ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వవేదాలు - అనేపేర్లు ఎలా ఏర్పడ్డాయి. వాటి మధ్య భేదాలేమిటి?**

**జ:** నిజానికి వేదమంతా కలిపి ఒక్కటే. కానీ మంత్రపద్ధతి బట్టి నాలుగుగా వ్యవహరిస్తాము. **'ఋచ్యతే స్తూయతే యయా సా ఋక్'** – దేవతలనుద్దేశించి చేసే స్తుతులు ఋక్కులు. ఈశ్వరుని బహుశక్తి విశేషాలే దేవతలు. వారి స్తుతి ద్వారా ఈశ్వరుని గ్రహించి, ఆయా శక్తుల జ్ఞానాన్ని ఆకళింపు చేసుకోగలం.

**"అనియతాక్ష రావసానో యజుః"** – అంటారు.

నియతమైన అక్షరములు లేనిది యజుస్సు. యజుస్సు అనేదానికి ప్రధానంగా 'గద్య' అని అర్థం, యజ్ఞార్థం వినియోగించే మంత్రం అని కూడా కొందరు నిర్ణయించారు. **"గీతేషు సామాన్యా"** అని జైమిని మహర్షి నిర్వచనం ప్రకారం 'గానమే' సామం. **సా చ అమశ్చేతి తతామ్నః'**–'సా' ఋక్, 'అమ' అంటే గాంధారాది స్వరాలు. 'ఋక్కుల యొక్కగానమే' సామం! ఇంకొక అర్థంలో సుఖంగా వినిపించడమే దేవతలకు ప్రీతికలిగించేది – అని చెప్పవచ్చు.

బ్రహ్మతనువునుండి వచ్చిన అథర్వ, అంగీరసులు దర్శించి అందించినది అథర్వ వేదం. దీనికి అథర్వణవేదం, అంగిరోవేదం, భృగ్వంగిరో వేదం –అని కూడా నామాంతరాలున్నాయి. ఈ నాలుగింటినీ యజ్ఞంలో వినియోగిస్తారు.

స్థూలంగా మరొక నిర్వచనాన్ని చెప్పాలంటే – శ్లోకాత్మకం 'ఋక్కు', గద్యాత్మకం 'యజుస్సు', గానాత్మకం 'సామం'. సిద్ధ మంత్రాలు 'అథర్వవేదం'. ఋక్కుతో స్తుతించి, యజుస్సుతో యజ్ఞం చేసి, సామంతో గానం చేసి దేవతానుగ్రహాన్ని పొందవచ్చు.

**ప్ర: 'మహాభారతం' మాయలు, మోసాలు, అభూతకల్పనలు, పొంతనలేని విషయాలు మొదలైన వ్యర్థాంశాలతో ఉన్న గ్రంథమనీ, దేనికీ పనికిరానిదనీ ఈ మధ్య ఒక పుస్తకం వచ్చింది. గతంలో రామాయణాన్ని విషవృక్షంగా చిత్రిస్తూ వ్రాసిన వ్యక్తి ఈ పుస్తకాన్ని వ్రాశారు. దానిని నిషేధించాల్సిందిగా ఏ ఉద్యమాలూ చేయలేదు. ఇలా ఉపేక్షించడం తగిన పనేనా?**

**జ:** ఏ ఉద్యమాలూ అవసరం లేదు. ఈ పుస్తకాన్ని ఉపేక్షిస్తే భారతానికి ఏ ప్రమాదమూ లేదు. గతంలో రామాయణాన్ని విషవృక్షంగా చిత్రీకరించినంత మాత్రాన రామాయణం పై ఉన్న జనాదరణనీ, భక్తినీ, శ్రద్ధనీ, ఇసుమంత కూడా కదిలించలేకపోయారన్నది కనిపిస్తున్న వాస్తవం.

'పనికిరానిద'ని చెప్పడానికి – మహాభారతం పుట్టిన వేల ఏళ్ళ తర్వాత వ్యక్తి వ్రాశా రంటే ఇన్నేళ్ళు సజీవంగా ఉన్న మహాభారతానికి నమస్కరించాల్సిందే. మరి ఇదే వ్యక్తులు వ్రాసిన నవలలు దశాబ్దాలు కూడా బ్రతకడం లేదు.

భారత రచనా సంవిధానం తమ నవలల వలెనే ఉండాలని ఆశించడం మొదటి దోషం, కొన్నివేల ఏళ్ళ క్రితం వ్రాయబడిన గ్రంథాల్ని ఆనాటి దేశకాల పరిస్థితుల నేపథ్యంలో పరిశీలించాలి. అందులో ఉన్న శాశ్వత విలువలను గమనించాలి. కేవల దోష దృష్టితోనే చూసి, తన నాస్తికత్వమే, ఆ పుస్తకాలలో ఉండాలని ఆశించడం మరో పొరపాటు.

పైగా, భారతంలో ఆ వ్యక్తి చూపించిన ఆక్షేపణలు కొత్తవేమీ కావు. ఇలాంటి దోష వీక్షణ గ్రంథాలు గతంలో చాలావచ్చాయి. వాటిని ఖండిస్తూ విజ్ఞులు వ్రాసిన గ్రంథాలూ చాలా వచ్చాయి. వాటిని ఈ పుస్తక కర్త చదివి ఉంటే ఈ పని చేసేవారే కాదు. కానీ ప్రాచుర్యం పొందాలంటే ఆర్షగ్రంథాలని వెక్కిరిస్తూ వ్రాసేయడమే మంచి మార్గమని చాలామంది అభిప్రాయం.

ఈ ధోరణులను నిషేధించాలని గోల పెట్టనక్కరలేదు. ఎలాంటి విమర్శలనైనా ఎదుర్కొని నిలిచే సంస్కృతి మనది. నిషేధించడం, శిక్షించడం లాంటి అనాగరిక చర్యలు అనవసరం. ప్రపంచంలో అన్ని రకాల అభిప్రాయాలు కలిసే ప్రవహి స్తాయి. వారి వారి సంస్కారాలకనుగుణంగా వాటిని తలో విధంగా గ్రహిస్తారు.

ఇదే మహాభారతం–సార్వకాలికమైన సార్వజనీనమైన ఎన్నో అంశాలను, ధర్మాలను, నీతిని, వ్యక్తిత్వ వికాసాలను గమనించి వివరించిన(స్తున్న) వారూ చాలా మంది ఉన్నారు. ప్రాచుర్యాన్ని పొందుతున్నారు. అలాంటి రచయితలలో విదేశస్థులూ ఉన్నారు. తమకి పొంతనలేనివిగా అనిపించినంత మాత్రాన గ్రంథాన్ని తీసిపారే యక్కర్లేదు. ఆ యుగాలలో దివ్యత్వమానవత్వాల అనుబంధాలు ఉండేవి. ఆ యుగజీవుల లక్షణాలు వేరు. మనం నమ్మినా నమ్మకపోయినా కొన్ని సత్యాలుంటాయి. మనకి నమ్మకం లేనంత మాత్రాన అవి అభూత కల్పనలనడం సమంజసమా?

నమ్మినవారికి అవి సమస్యలు కావు. ఈ కాలానికి కొన్ని అంశాలు అసమంజసం అనిపించవచ్చు. కానీ సమంజసమైన ఎన్నో అంశాలను గమనించి ఆ ఉపయుక్త విషయాలను ప్రజల కందించడం సకారాత్మక (Positive) లక్షణం.

ముందుగానే ఒక విపరీత ధోరణిలో, దోషదృష్టితో పరిశీలిస్తే అన్నీ దోషభూ

యిష్టంగానే ఉంటాయి. వాటిని వారు ప్రాచుర్యం కోసం పుస్తకాలుగా వ్రాయవచ్చు. అవి అమ్ముడు కావచ్చు. అయినప్పటికీ ఆ మహేతిహాసాల ఔన్నత్యాన్ని ఏ మాత్రం దెబ్బతీయలేరు.

అందుకే ఉపేక్షించడమే తగినపని. సమర్థులు సకారాత్మక ధోరణితో ఈ మహద్గ్రంథాంశాలను రచించి అందించడమే సరియైన ఉద్యమం. లేదా – ఇప్పటికే ప్రచురితమైన మంచి పుస్తకాలను మరింత వ్యాప్తిచేయడమైనా చేయాలి.

**ప్ర: ఒక సినిమాలో – "పరస్త్రీ రాధను ప్రేమించిన కృష్ణుడు, అయిదుగురు భర్తలున్నా ఆరో వ్యక్తి(కర్ణుడు) పై మనసు పడ్డ ద్రౌపది..." ఇలా మన పురాణ పాత్రల్ని నిందిస్తూ (ఇంకా అసహ్యకరమైన పదజాలంతో) మాటలున్నాయి. అవి చూసి మన స్తాపం చెందాను. ఇవి ఎంత వరకు నిజాలు?**

**జ:** ఇదీ మన దౌర్భాగ్యం. మనవాళ్ళే మన దేవతల్నీ, పురాణ పాత్రల్నీ నిందిస్తుంటే "ఇవి ఎంత వరకు నిజాలు?" అని అడిగే దుఃస్థితిలో ఉన్నాం. మీరు కనీసం మన స్తాపమైనా చెందారు. మీ సంస్కారానికి వందనాలు. ఆపాటి బాధ కూడా పడనివాళ్ళు ఎందరో! ఇదే ఇతర మతస్థుల దేవతలపై, మత గ్రంథాల పాత్రలపై విమర్శిస్తూ (నిజాలైనా సరే) మాటలంటే వాళ్ళు ఊరుకుంటారా? ఈ పాటికి ఆ సినిమాని తగలబెట్టేవాళ్ళు! వారి ధర్మనిష్ఠ అటువంటిది. మనం కనీసం నిరసన కూడా ప్రకటించుకోలేకపోతున్నాం. అసలు–చేతిలో కలం ఉందని ఏది తోచితే అది వ్రాసేయడమేనా? ఆ పురాణాలు ఎంత వరకు మనం చదివామని? పోనీ –కనీసం వ్రాసే ముందు పండితు ల్నెవరైనా అడిగారా? ఏమిటీ బాధ్యతా రాహిత్యం! శక్తిమంతమైన ఒక మాధ్యమం ద్వారా ఈ విష ప్రచారాలు జరిగితే ఎలా సహిస్తున్నాం? రాధాదేవి లౌకిక పాత్ర కాదు. అలౌకికమైన, గోలోకనివాసిని అయిన పరాశక్తి, శ్రీకృష్ణుడు పరమాత్మ. యోగ, ఆధ్యాత్మిక తత్త్వానికి చెందిన ఆ దివ్యమూర్తుల గురించి, కనీసం ఊహించడానికి అర్హతలేని వాళ్ళు, ఎలా తెగిస్తున్నారు?

ద్రౌపది ఇంద్రశక్తి, అయిదు మూర్తులు (పాండవులు) గా వచ్చిన ఒకే ఇంద్రుని శక్తి ఆమె. ఆ సాధ్వి కర్ణుని కోరినట్లు ఏ పురాణంలోనూ, మహాభారతంలోనూ లేదు. ఏ భ్రష్టులో కల్పించిన పిట్టకథని పట్టుకొని పురాణ పాత్రల్ని అవమానించడం తగునా! ఇటువంటి అనౌచిత్య, వికృత చేష్టల్ని నిరసించి, బహిష్కరించవలసిన బాధ్యత ప్రతి భారతీయునిపైనా ఉంది.

**ప్ర: మోక్షం జీవితానికి పరమ ప్రయోజనం. దానికి ఉత్తర మీమాంస (వేదాంత శాస్త్రం) ఉంది. మరి కర్మని పెంపొందించే విధివిధానాలను పూర్వ మీమాసం ఎందుకు బోధించింది?**

**జ:** జీవన విధానంలో 'ధర్మం' ఉండాలి. చింతనతో 'జ్ఞానం' దిశగా సాగాలి. ధర్మాన్ని బోధించేది కర్మ మీమాంస (పూర్వ మీమాంస) జ్ఞానాన్ని అందించేది ఉత్తర మీమాంస(వేదాంతశాస్త్రం), వ్యవహార జీవితం లో కర్మ ఉంటుంది.

పూర్వ మీమాంస మనకు కర్మవిషయంలో శ్రద్ధను పెంచుతుంది. కర్మ మనశ్శుద్ధిని కలిగించి, తద్వారా సాధకుని జ్ఞానప్రాప్తికి యోగ్యునిగా చేస్తుంది. చిత్తశుద్ధీ, వైరాగ్యం లేనివారికి జ్ఞానోపదేశం చేయరాదు. అంతే కాదు – అందరూ మోక్షకాంక్ష కలవారే కారు. భౌతిక సుఖాలు కోరేవారి సంఖ్యే ఎక్కువ. వారికి ధర్మం ప్రధానం. దానిని బోధించేది పూర్వమీమాంస.

**ప్ర: 'స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభిధేయతే' – అని శంకరులు వివేక చూడామణిలో చెప్పారు. ఉపనిషత్తుల్లో చెప్పిన తత్త్వాన్ని శ్రవణ మనన విధిధ్యాసనలతో అనుసంధాన పరచడమే భక్తి అని కదా అర్థం! అటువంటప్పుడు భగవంతుని ఆరాధించడం, నామస్మరణ వంటివి భక్తి ఎలా అవుతాయి?**

**జ:** స్వస్వరూపమైన పరమాత్మనే భక్తిలో నామ రూపాలతో ఉపాసిస్తున్నారు. తత్త్వజ్ఞానంలో నిర్గుణ మైనదీ, ఆరాధనలో సగుణమైనదీ – రెండు ఒక్కటే. అనన్యమైన భక్తిలో భగవంతునితో తాదాత్మ్యం కలుగుతుంది. అదే భక్తిలో ముక్తావస్థ. దీనిని జ్ఞాన మార్గం వారు అంగీకరించకపోయినా ఈ భక్తి వల్ల జ్ఞానము, దానివల్ల ముక్తి లభిస్తుంది అంటారు. వేదాంతంలో 'ఆత్మ', భక్తిలో 'భగవంతుడు' రెండూ ఒకే తత్త్వం.

భగవంతుడు తనలోని 'నేను' (ఆత్మ)కు 'అన్యము' (ఇతరులు) కాదనే 'అనన్యభక్తి' భగవత్తా దాత్మ్యంతో సిద్ధిస్తూనే ఉంది. అందుకే, 'జ్ఞానభక్తి, పరా భక్తి, ఏకభక్తి' అని అసలైన భక్తికి పర్యాయపదాలు.

**ప్ర: 'బిల్‌గేట్స్ లక్ష్మీ పూజ చేయలేదు. సంపన్నుడయ్యాడు. ఐన్‌స్టీన్ సరస్వతీ పూజ చేయలేదు. శాస్త్రవేత్త అయ్యాడు. కష్టపడి కృషి చేయాలేగానీ పూజలు చేయనక్కర్లేదు' – అని ఒకాయన చెప్పాడు. పూజల పరమార్థం ఏమిటి?**

**జ:** పూజల పరమార్థాలు చాలా ఉన్నాయి. **1.**మనమీనాడు శరీర శక్తి, ప్రకృతి పదార్థాలు, రకరకాల ఐశ్వర్యాలు అనుభవిస్తున్నామంటే అది భగవంతుని ప్రసాదం. ఈ భావం

నిలబడడానికే పూజ. ఇది ఒక కృతజ్ఞతాభావం. **2.** ఈ పూజల వల్ల చిత్త శుద్ధి ఏర్పడి జీవన పరమార్ధమైన భక్తి జ్ఞానాలు లభిస్తాయి. **3.**గ్రహదోషాల రీత్యా, ప్రారబ్ధ కర్మలననుసరించి అనుభవించే దుఃఖ, రోగ, దారిద్ర్యాపదలను తొలగించే శక్తి పూజలకుంది.

మీరు చెప్పిన సంపన్నులు, విద్యావంతులు గత జన్మలలో భగవదారాధన చేసి ఉంటేనే ఈ జన్మలో అనుభవించగలుగుతున్నారు. వాళ్ళు కూడా 'నాస్తికులు' కాదు కదా! వారికి తెలిసిన భాషలో, పద్ధతిలో వారూ దైవానికి కృతజ్ఞతలు చెప్పొండవచ్చు. పూజలు చేసినంతమాత్రాన సంపద, జ్ఞానం వస్తాయని శాస్త్రాలు ఎన్నడూ చెప్పలేదు.

**'ఉద్యమేన సిద్ధ్యంతి కార్యాణి' 'ఉద్యోగినం పురుష సింహముపైతి లక్ష్మీః'** అని మన ప్రాచీనులు – ప్రయత్నాల ద్వారానే, శ్రమతోనే కార్యసిద్ధి, లక్ష్మీప్రాప్తి లభిస్తాయని చెప్పారు. అయితే ప్రయత్నానికీ శ్రమకీ దైవశక్తి తోడు కోసం పూజ సహకరిస్తుంది. లోకంలో ఏ వ్యాయామమూ, ఏ ఔషధ సేవనమూ లేకుండానే కొందరు ఆరోగ్యంగా ఉండవచ్చు. వారిని పేర్కొని 'వ్యాయామం చేయనక్కరలేదు–మందులు వాడనవసరం లేదు' అనే సిద్ధాంతాలను ప్రతిపాదించలేము కదా! వ్యాయామం లేకుండా ఆరోగ్యాన్ని తెచ్చుకోలేనివారు, ఔషధ సేవనంలేకుండా అనారోగ్యాన్ని తొలగించుకోలేని వారూ ఉంటారు. వారు వ్యాయామం, ఔషధాలు సేవిస్తూనే ఆహార విహారాలను క్రమబద్ధీ కరించి ఆరోగ్యాన్ని పొందవచ్చు.



పూర్వపుణ్యంలేని సామాన్యులకు కాలం కలసిరావాలంటే దేవానుగ్రహం కావాలి, అంతమాత్రాన దేవతల పూజలతోనే అన్నీ సాధించుకోగలం అననక్కరలేదు. ధర్మంతో కూడిన సత్కర్మలతోనే దేనినైనా సాధించగలమని ఋషుల మాట. మన ఉపనిషత్తులు, భగవద్గీతాది శాస్త్రాలు వ్యక్తి ప్రయత్నానికి, కర్తవ్యనిష్ఠకి ప్రాధాన్యాన్నిచ్చాయి. మన విధ్యుక్త ధర్మ నిర్వహణయే పూజ. కర్తవ్య నిర్వహణ సామర్థ్యం, తగిన సాఫల్యం – భగవత్కృప. వచ్చిన లక్ష్మి, విద్య సవ్యంగా వినియోగింపబడాలన్నా ఆ కృప ఉండాలి. దానికోసం కూడా పూజించాలి. మన కర్మలు భగవత్ శక్తి చేతనే చేస్తున్నామని, నిరహంకారంగా, నీతిగా చేస్తే అది అర్చనయే.

**'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః'** (భగవద్గీత)

"మానవుడు తన కర్మతో భగవంతుని అర్చించి (నిస్వార్థమే ఈశ్వరార్పణ) సిద్ధిని పొందుతున్నాడు." అయినా కేవలం ధనం, విద్యా మాత్రమే కాకుండా జీవితంలో

ఎన్నో ప్రాధాన్యాలు, అవసరాలు ఉంటాయి. మన బుద్ధిని సరియైన దిశలో ఉంచి, సత్ఫలితాలను ప్రసాదించడానికి పూజాదికాలు సహకరిస్తాయి. లక్ష్మి, విద్య లభించి నందుకైనా – వాటిని దేవతలుగా భావించి ఆరాధించడంలో అద్భుతమైన మనోభావం వ్యక్తమౌతుంది. సైన్స్‌కి కూడా అందని పరమసత్యాన్ని ఐన్‌స్టీన్ వంటి శాస్త్రవేత్తలు ఆనాడే అంగీకరించారు.

**ప్ర: మడీ, ఆచారాలు దైవారాధనలో అవసరమా? ఎందుకు? ఇక్కడ తినం, అక్కడ తినం అని నోరుకట్టుకోవడం అనాగరికం కాదా?**

**జ:** మడి, ఆచారాలు అవసరమే. ఉపాసన, అనుష్ఠానం, ఆరాధన– వీటికి శౌచం, నియమం అవసరం. వీటివల్ల మనలో దైవశక్తి జాగృతమవుతుంది. ఎక్కడ పడితే అక్కడ తినడమే అనాగరికతగానీ, ఆహార నియమం అనాగరికత ఎలా అవుతుంది? శుచిగా ఉండడం అనేది విజ్ఞాన శాస్త్రపరంగా కూడా గొప్ప విషయమే కదా? ఆహార విషయంలో నియమం అనేది– నాగరికత ఎదిగిన ఉన్నతత్వానికి చిహ్నం. నియమిత ఆహారం, సకాలంలో, సక్రమంగా తినడం వల్ల ఆరోగ్యమూ, బుద్ధీ రెండు పనిచేస్తాయి. 'శౌచం' దైవారాధనలో ప్రధానమైనది. భక్తిలో భాగంగా గానం, కీర్తన, నామస్మరణ మొదలైనవి ఎప్పుడైనా, ఎక్కడైనా, ఎలాగైనా చేయవచ్చు. నిరంతర చింతనకి ఏ మడి అక్కర్లేదు. అర్చన, ఆరాధన, అనుష్ఠానం– వీటికి మాత్రం సదా చారం అవసరం. 'సదాచార ప్రవర్తినీ'– అనీ, 'శుచి'– అని అమ్మవారి సహస్రనామా ల్లోనే చెప్పారు కదా!

**ప్ర: ఇంట్లో భారతం మొత్తం చదవకూడదనీ, కలహాలు వస్తాయనీ కొందరు చెప్పారు. నిజమేనా?**

**జ:** కాదు. మహాభారతం మొత్తం హాయిగా ఇంట్లో చదువుకోవచ్చు. చదవాలి కూడా. మన జీవితాన్ని తీర్చిదిద్దే శక్తి ఆ పంచమవేదానికి ఉంది.

**ప్ర: 'లక్ష్మీ గణపతి' అంటే ఏమిటి? లక్ష్మి విష్ణువుపత్ని కదా? గణపతితో ఉన్న లక్ష్మి ఎవరు?**

**జ:** ఆ లక్ష్మి వేరు. ఈ లక్ష్మి వేరు. ఇవన్నీ మంత్రశాస్త్ర విషయాలు. ఉపాసనా రహస్యాలు. 'లక్ష్మి' అంటే 'లక్షణశక్తి'. ప్రతి దేవతకీ, ఆ దేవతా శక్తి లక్ష్మి. ఐశ్వర్యమే లక్ష్మి. ఆ దైవం యొక్క శక్తే ఆ దైవానికి ఐశ్వర్యం. కాబట్టి ఆ దైవశక్తిని 'లక్ష్మి' అన్నారు.

విష్ణుపత్ని లక్ష్మికీ, గణపతిశక్తి లక్ష్మికీ భేదం ఉంది. వీటిని పౌరాణికంగా

వ్యాఖ్యానించనవసరం లేదు. మంత్రోపాసనలో భాగాలివి. ఉపాస్య దైవంలో సర్వదేవతా శక్తులూ ఉంటాయి. ఆ విధంగా–పరాశక్తి 'లక్ష్మి' పేరుతో నున్న గౌరిగా శివాంకంలో ఉన్నట్లు తంత్రశాస్త్రం వర్ణిస్తోంది.

వాస్తవానికి–పరమాత్మను గణపతిగా ఉపాసిస్తే, ఆయన శక్తిని లక్ష్మిగా ఆరాధించడమే లక్ష్మీగణపతి భావన.

**ప్ర: చాలా పుస్తకాల్లో బీజాక్షరాలతో నున్న మంత్రాలు ముద్రిస్తున్నారు. యంత్రాలు ముద్రిస్తున్నారు. అంతేకాక కేవలం ఒక్క మంత్రం మాత్రమే (గాయత్రి, పంచాక్షరి వంటివి) ఉచ్చరిస్తూ పూర్తి కేసెట్లు వినుకోవచ్చా?**

**జ:** కలి ముదిరిందనడానికి ఇవి నిదర్శనాలు. భగవంతుడి కరుణ పొందడానికి నామోచ్చారణ, స్తోత్రాల పఠనం మనకు ఉన్నాయి. ఇవి చాలు. మంత్ర విద్యకి చాలా సంప్రదాయం ఉంది. ఒక మంత్రం అంటే సరిపోదు. దానికి ఋషి, శక్తి బీజం, కీలకం, అంగన్యాస, కరన్యాసాదులు తెలియాలి. సంప్రదాయం తెలిసిన గురువు వద్ద ఉపదేశం పొంది, మౌనంగా జపించాల్సినది మంత్రం. అలాకాక పుస్తకాల్లో ఉందికదా అని జపించేయడం మహాపాపం. మంత్రం ప్రచారానికి కాదు. భగవన్మహిమ, స్తోత్రం, నామం, కీర్తన మాత్రమే ప్రచారం చేయాలి. వేటి ప్రయోజనం వాటిదే. సంప్రదాయం తెలియక, కేవలం జనాకర్షణ కోసం, మంత్ర శాస్త్రోల్లంఘన చేయడం దుస్సాహసం. అలాంటి దుస్సాహసంతో, ధనాపేక్షతో పుస్తకాల్లో ప్రచురించడం, కేసెట్లు తేవడం జరుగుతోంది.

మంత్రం ఉపదేశం పొందాక, ఎవరికి వారు జపం చేసుకోదగినది మాత్రమే. అంతే గానీ పాటలవలె మంత్రాన్ని కేసెట్లుగా వినడం తగదు. భజనగా ఉచ్చరించడం, పాడడం తగదు. మంత్రానికి బాణీ కట్టడం కూడా పాపం. ఇలాంటి పనులు చేయడం, వాటిని మనం వినడం రెండూ విపరీతాలకే దారి తీస్తాయి.

వీటిని ఖండించడానికి విద్వాంసులు ముందుకు రాక, "మనకెందుకులే" అనే ఉదాసీన వైఖరి అవలంబించడం వల్ల ఈ విపరీత ధోరణులు ప్రబలుతున్నాయి.

కొన్ని పాటల్నీ స్తోత్రాల్ని వాటి వాద్యపరికరాలతో రికార్డు చేయడానికి అయ్యే ఖర్చు కన్నా, ఒక్క శ్రుతిబాక్స్‌తో, ఒక్కసారి ఒక్క మంత్రం చెప్పి, ఆధునిక సాంకేతిక సదుపాయంతో కేసెట్టంతా అదే నింపడం – చాలా తక్కువ ఖర్చుతో కూడిన పని. అందుకే కేవలం డబ్బు తప్ప ఏమీ పట్టని వ్యాపార సంస్థలు ఈ పనికి పూను

కుంటున్నాయి. పుణ్య మొచ్చేస్తుందేమోననే భ్రమతో పాపం మూటకట్టుకోడానికి ఇవి కొనుక్కొని, వింటున్నాం. మంత్రం, యంత్రం – వాటి నియమాలు తెలుసు కొని సాగాలి. భక్తికి ఇవి అనవసరం. మహిమాన్వితమైన స్తోత్రాలు, వాగ్గేయకారుల కీర్తనలు మనకు లెక్కలేనన్ని ఉన్నాయి. అవి చాలు.

**ప్ర: సుందరకాండ పారాయణ ఎలా చేయాలి? ఏ తిథుల్లో, ఏ వారాల్లో ప్రారంభించితే మంచిది?**

**జ:** సుందరకాండ పారాయణ పద్ధతులు అనేకంగా ఉన్నాయి. వారి వారి అనుకూలతల ననుసరించి పద్ధతిని ఎంచుకోవచ్చు. కొందరు నిత్య పారాయణగా సుందరాకాండను అనుష్ఠిస్తారు.

✦ ప్రతి రోజు ఏడు సర్గల చొప్పున సంవత్సరం వరకు సుందరాకాండను పఠించడం ఒక పద్ధతి. రోజుకి ఇరవై అయిదు సర్గలుగా నిత్యానుష్ఠానం చేసే పద్ధతి శాస్త్రం చెబుతోంది. అభీష్టసిద్ధికోసం, అనిష్ట పరిహారం కోసం పారాయణ చేసే విధానాలు చాలా ఉన్నాయి.

✦ ముప్ఫయి రెండు పర్యాయములు పారాయణ ఒక పద్ధతి. మొదటి రోజున సీతాదేవి ఆంజనేయునకు చూడామణినివ్వడం వరకు చదవాలి. రెండోరోజున మిగిలిన కాండ పారాయణ చేయాలి.

అలా 64 రోజుల్లో 32 పర్యాయాలు పూర్తవుతుంది.

✦ 72 దినాలలో 24 పర్యాయాలు పారాయణ చేసే విధానముంది. హనుమంతుడు సీతమ్మను చూసేవరకు మొదటిరోజున పఠించాలి. రెండవరోజున హనుమంతుడు అశోకవన ధ్వంసం చేసిన ఘట్టం వరకు చదవాలి. మూడవ రోజున మిగిలిన కాండను పూర్తి చేయాలి. ఇలా 72దినాలు చేస్తే 24 పర్యాయాలు పూర్తి అవుతాయి.

✦ 48 దినాలలో 12 ఆవృత్తులు పఠించే విధానముంది. మొదటిరోజు హనుమంతుడు సీతాదేవిని దర్శించే ఘట్టం వరకు, రెండవరోజు విశ్వరూపం సందర్శనం వరకు, మూడవరోజు హనుమ రావణునకు హితోపదేశం చేసే సన్నివేశం వరకు, నాలుగవరోజు కాండాంతం చదవాలి. ఇలా 48 రోజులు చేస్తే 12 పర్యాయాలవుతుంది.

✦ మొదటిరోజున సీతా సందర్శన ఘట్టం వరకు, రెండవరోజున త్రిజటా స్వప్న వృత్తాంతం వరకు, మూడవ రోజున చూడామణీ ప్రదానం వరకు, నాల్గవరోజున

లంకాదహనం వరకు, ఐదవరోజున మిగిలిన భాగం–పాంచాహ్నిక పారాయణ విధి.

ఇలా వివిధ ఆవృతుల విధానాలు ఉన్నాయి. ఇంతే కాకుండా– ఒక్కరోజు మొత్తం సుందరకాండ పారాయణ చేయవచ్చు. అలా చేసినట్లయితే బ్రాహ్మీ ముహూర్తంలో స్నానాదికాలు చేసి అపరాహ్ణాత్పూర్వమే (మధ్యాహ్నాం లోపల) పూర్తి చేయాలి. దీనికి శక్తి లేకపోతే రెండు రోజులు పారాయణ చేయవచ్చు.

✦ అలాగే మూడు రోజుల పాటు రోజుకు కొన్ని సర్గల చొప్పున విభజించుకొని పారాయణ చేయొచ్చు. అలాగే నాలుగు, అయిదు, ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది దినముల పారాయణ చేయవచ్చు.

ఎప్పుడు పారాయణ చేసినా ముందుగా విఘ్నేశ్వర పూజచేసి, సంకల్పం చెప్పుకొని శ్రీసీతారామాంజనేయులను షోడోపచారాలతో అర్చించి, పుస్తకాన్ని పూజించి, పారాయణ ప్రారంభించాలి. మధ్యలో ఇతరులతో సంభాషించడం కానీ, లేవడంగానీ చేయరాదు. పారాయణాంతంలో క్లుప్తంగా పునఃపూజచేసి మంగళ హారతి ఇచ్చి, మంగళశ్లోకాలు చదవాలి. పారాయణకు ముందు గురూపదేశం ద్వారా లభించిన శ్రీసీతారామమంత్రం, ఆంజనేయ మంత్రం జపించడం మంచిది.

ఉపదేశం లేనట్లతే '**శ్రీరామయనమః**' లేదా '**శ్రీరామ జయరామ జయ జయరామ**' – అనే మంత్రాన్నీ, '**శ్రీ హనుమతే నమః**' లేదా '**శ్రీహనుమాన్ జయ హనుమాన్ జయ జయ హనుమాన్**' అనే మంత్రాన్నీ జపించడం మంచిది.

పటిక బెల్లం కలిపిన పాలు, ఫలాలు, తాంబూలం, నేతి అప్పాలు నివేదించి పారాయణ చేయడం మంచిది.

"**అస్యశ్రీ సుందరకాండ మహామంత్రస్య వాల్మీకి ఋషిః – అనుష్టుప్ ఛందః, క్వచిన్నానా ఛందాంసి – శ్రీమదాంజనేయోదేవతా మమ సర్వానిష్ట నివారణార్థే సర్వాభీష్ట సిద్ధ్యర్థే శ్రీ సుందరాకాండ పారాయణ పాఠే వినియోగః**" అని చెప్పి పారాయణ చేయాలి.

చైత్రమాసంలో పారాయణ ధర్మవృద్ధి, వైశాఖంలో సంపత్స మృద్ధి, జ్యేష్ఠంలో సర్వార్థసిద్ధి, ఆషాఢంలో ధర్మనాశనం, శ్రావణంలో కర్మవృద్ధి, ఆశ్వయుజంలో ధనవృద్ధి, భాద్రపదంలో సామాన్యం, కార్తికంలో యశోవృద్ధి, మార్గశీర్షం బహుఫల ప్రదం, పుష్యం సర్వార్థనాశకం, మాఘంలో ధర్మాది సంపదలు, ఫాల్గుణంలో కార్యసిద్ధి.

తాత్పర్యంగా – ఆషాఢ, భాద్రపద, పుష్యమాసాలు విడిచి మిగిలిన తొమ్మిది నెలలు శ్రేష్ఠం. తిథులలో పారాయణ ప్రారంభానికి విదియ,(కృష్ణ) పాడ్యమి, తదియ, పంచమి, త్రయోదశి, సప్తమి, ఏకాదశి – ఉభయ పక్షాలలో శ్రేష్ఠాలు. వారాలలో–ఆదివారం కర్మవృద్ధి, సోమ వారం పాపనాశనం, బుధవారం కీర్తి, గురువారం శుభవృద్ధి, శుక్రవారం అర్థవృద్ధి. మంగళ, శనివారాలు పారాయణ ప్రారంభానికి మంచివి కావు.

నక్షత్రాలలో–అశ్విని, రేవతి, పూర్వాభాద్ర, పూర్వాషాఢ, పూర్వఫల్గుని (త్రిపూర్వలు), పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, శ్రవణం – శుభ కరాలు. శుద్ధి చేసిన గృహం, గంగా గోదావర్యాది పుణ్య నదీతీరాలు, సర్వపుణ్యక్షేత్రాలు, గోశాల, తులసికోట, అగ్నిహోత్రగృహం, వేదవేత్తల సన్నిధి – పారాయణకు ఉత్తమ క్షేత్రాలు. అయోధ్య, కాశీక్షేత్రాలు, సముద్రతీరం, దేవాలయం ఇవి ఉత్తమ స్థలాలు.

ప్ర: **ఈ మధ్య ఒక విదేశీఛానల్లో–హిందువుల మూఢ నమ్మకాలలో నెలవారీ బహిష్టు సమయాలలో స్త్రీని దూరం పెట్టడం ఒకటి – అంటూ కొంత అవహేళనగా ఎత్తి చూపించారు. చాలా బాధ కలిగింది. వీటికి సమాధానాలివ్వలేమా?**



జ: హిందువుల ప్రతి ఆచారం వెనుక చక్కని ఆంతర్యాలు న్నాయి. కానీ ఇలా అవహేళన చేస్తున్న మీడియా వారి వెనుక ఆంతర్యం – హిందూ మతాన్ని దెబ్బతీయడం, వారి మతాన్ని వ్యాపింపజేయడం. పేరుకి సెక్యులర్ ముసుగు తగిలించుకున్న మీడియాలన్నీ రెండు మతాల చేతుల్లో ఉన్నాయి. వాటి ఉద్దేశం హిందూ మతాన్ని రూపుమాపడం, అవహేళన చేయడం.

నిజానికి ఏ మతంలో విశ్వాసాలు ఆ మతాలవారికి గౌరవనీయాలు. తర్కము, వైజ్ఞానిక శాస్త్రమూ –ఈ రెండూ ఏ మత విశ్వాసాన్నీ అంగీకరించవు. హిందూ మతంలో దేవతాశక్తుల విజ్ఞానముంది. దానిని తెలుసుకుంటే హిందూ ఆచారాలు అర్థమౌతాయి. ఆ విజ్ఞానం, సంప్రదాయం తెలియని వారికి ఇవి అర్థం కావు.

దేవతారాధన, సదాచారం ఉంటే–సూక్ష్మమైన దైవశక్తులకు ఉన్న మర్యాదలలో రజస్వలాది స్పర్శ దోషం కనుక, మంత్రానుష్ఠానం, దేవపూజలకు కొన్ని నియమాలు పెట్టారు. స్నానం చేసి శుద్ధిగా పూజించడం మన సంప్రదాయం...

ఇలాంటి నియమాలు సూక్ష్మవిజ్ఞానం తెలిసిన నాగరిక దేశాలలో ఉన్నాయి. ఆ విజ్ఞానం లేని అనాగరికదేశాలు వీటిని ఎద్దేవా చేస్తాయి.

ఒక మతవిశ్వాసాన్ని గౌరవించడం, అవమానించకుండా ఉండడం మానవతా సంస్కారం. తమ మతం తప్ప మిగిలినవన్నీ మూర్ఖమేనన్న భయంకరమైన అహంకారం, పొగరు మోతుతనం ఉన్న మతాలవారు – ఈ కనీస మానవతా సంస్కారాన్ని కూడా విడచిపెట్టి పెద్ద శాస్త్రవేత్తల్లా మాట్లాడడం జగుప్సాకరం. నిజంగా విజ్ఞానశాస్త్ర రహస్యాలను తీసి చెప్తే – వాటిని తట్టుకొని నిలబడగలిగేది హిందూ మతం మాత్రమే. ఇటు భౌతిక శాస్త్రం ప్రకారం చూసినా, అటు సూక్ష్మమైన దివ్యశక్తుల విజ్ఞానపరంగా ఆలోచించినా – బహిష్టు సమయంలో దూరంగా ఉండడమనేది ఒక నాగరిక సమాజం సాధించిన సదాచారం. ఉత్తమసంస్కారం.

**ప్ర: వర్షాకాలంలో నదీ స్నానం నిషిద్ధం – అంటారు కదా. మరి వర్షాకాలంలో పుష్కరాలు వస్తే నదీస్నానం చేయవచ్చా?**

**జ:** వర్షాకాలంలో నదీస్నానం కూడదు – ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి.

**కర్కటే సరితస్సర్వాః భవన్తిహి రజస్వలాః।**
**అప్రశస్తం తదా స్నానం వర్షాదౌ నవవారిణి॥**

– ఇలాంటి ధర్మశాస్త్ర వాక్యాలు అనేకం – వర్షర్తువులో, శ్రావణ భాద్రపదాలలో నదీ స్నానాన్ని నిషేధిస్తున్నాయి. అయితే ఈ నిషేధం గంగా, గోదావరి, కృష్ణాది మహానదులకు వర్తించదని ఆ ధర్మ శాస్త్రాలే చెబుతున్నాయి.

**జాహ్నవ్యాదిత్య సంభూతా ప్లక్షజాతా సరస్వతీ।**
**రజసా నైవ దుష్యన్తి నదాః కృష్ణ చ వేణికా॥** (కాత్యాయన స్మృతి)
**కాళిందీ గౌతమీ గంగా వేణికా చ సరస్వతీ।**
**సామర్థ్యా దాభిజాత్యాశ్చ రజో నాభి భవన్త్యమూః॥** (మార్కండేయ స్మృతి)

గంగ, యమున, గోదావరి, కృష్ణవేణి, సరస్వతి – వంటి మహానదులకు ఈ దోషము లేదు. అవి నిత్య పవిత్రములు. ఇంక పుష్కరాది పర్వాలలో పర్వానికే ప్రాధాన్యం కనుక అసలు నిషిద్ధం వర్తించదు.

**ప్ర: పూర్ణిమలలో రాకా, అనుమతి – అనే భేదాలున్నా యంటారు. వాటి తేడాలను ఎలా గుర్తించడం? అమావాస్యలో సినీవాలీ, కుహూ అనే తేడాలు ఏమిటి?**

**జ:** పూర్ణిమలలో, అమావాస్యలలో ఈ భేదాలను కోశ గ్రంథాలు వివరించాయి.

**కళాహీనే సాఽనుమతిః పూర్ణే రాకే నిశాకరే।**
**సా దృష్టేందుస్సినీవాలీ సా నష్టేన్దుకలా కుహూః॥**

చంద్రుడు ఏ పూర్ణిమనాడు నిండు కళలతో పూర్తిగా ప్రకాశిస్తుంటాడో దానిని '**రాకా**' అనే శబ్దంతో వ్యవహరిస్తారు. వర్షాకాలంలో మేఘచ్ఛన్నమై కళాహీనంగా కనిపించే చంద్రునితో కూడిన పూర్ణిమను '**అనుమతి**' అంటారు.

చంద్రకళ కనిపించే అమావాస్య '**సినీవాలీ**'. ఆ కళలేని అమావాస్య '**కుహూ**'.

**ప్ర: జయన్తి తిథుల్లో శ్రీరామ, కృష్ణ జయన్తులే కాక – ముఖ్యమైన జయన్తిపర్వాలు ఏమిటి?**

**జ:** '**జయన్తీ**' వ్రతం అంటూ పురాణాల్లో కొన్ని ధర్మ శాస్త్రాల్లో వర్ణించారు. ఈ జయంతి తిథుల్లో శక్తి కొలది ఉప వాసం, జపార్చనాదులు విశేషం. నదీస్నానం, దానం కూడా గొప్ప ఫలితాన్నిస్తాయి.

**కృష్ణాష్టమీ చ నవమీ చైత్రేమాసి సితా శుభా।**
**కృష్ణాచతుర్దశీ కుంభే మేషే శుక్లా చతుర్దశీ॥**
**దుర్గాష్టమ్యాశ్వినే శుక్లే ద్వాదశీ శ్రవణాన్వితా**
**మహాపుణ్యాశ్చ శుభదాః జయన్త్యః షట్ ప్రకీర్తితాః॥ (పద్మపురాణం)**

1. **శ్రీకృష్ణజన్మాష్టమి** – శ్రావణ బహుళాష్టమి,
2. **శ్రీరామనవమి** – చైత్రశుద్ధ నవమి,
3. **మహాశివరాత్రి** – మాఘ బహుళ చతుర్దశి,
4. **నరసింహజయన్తి** – వైశాఖ శుక్ల చతుర్దశి,
5. **దుర్గాష్టమి**– ఆశ్వయుజ శుద్ధ అష్టమి,
6. **వామన జయన్తి** – భాద్రపదశుక్ల ద్వాదశి (శ్రవణానక్షత్రం).

ఈ '**షట్‌జయన్తులు**' (ఆరు) పరమ పవిత్రమైనవిగా '**పద్మ పురాణం**' వివరించింది.

**ప్ర: మయసభలో ఒకదానికొకటిగా భ్రమపడ్డ దుర్యోధనుని చూసి ద్రౌపది నవ్వడం తప్పు కాదా! ఆ పరిహాసానికి ప్రతీకారం తీర్చుకున్నాడు దుర్యోధనుడు. అంతే కదా!**

**జ:** దురదృష్టవశాత్తు రావణ, దుర్యోధనాది రాక్షస ప్రవృత్తుల అభిమానులు మనలో ఎక్కువై, వారిని కథానాయకులుగా మలచేందుకు ఎన్నో అకృత్యాలు చేశారు. అలాంటివే – దుర్యోధనుని భంగపాటు చూసి ద్రౌపది నవ్వడంలాంటి కల్పనలు చేయడం.

'మయసభ'లో దుర్యోధనుడు స్థలాన్ని జలంగా, జలాన్ని స్థలంగా భ్రమపడి

భంగపడ్డాడు. అది చూస్తే నవ్వురావడం సహజం. అన్నదమ్ములే అయిన భీమార్జున నకుల సహదేవులు అది చూసి నవ్వారు. అంతే. అక్కడ ద్రౌపది లేనే లేదు. రాజ మర్యాదలు కూడా మనకు తెలియాలి. ఒక రాజపత్ని ఆ విధంగా పరుల మందిరాల్లోకి రాదు కూడా. దుర్యోధనుడు ప్రతీకారదృష్టితో అకృత్యాలు చేయలేదు. అతడు ధర్మరాజాదుల పరాక్రమ, వైభవాలను రాజసూయ యాగంలో చూశాక తీవ్రంగా అసూయాగ్రస్తుడయ్యాడు. పరాక్రమంతో, యజ్ఞ నిర్వహణతో సుస్థిర సామ్రాజ్యాన్ని సాధించిన యుధిష్ఠిరుని పట్ల ఈర్ష్య చెందాడు. ఆ కారణంగా, అతడు మాయాద్యూతాదులు కల్పించి, పాండవుల సంపదలను రాబట్టుకొని ఇక్కట్ల పాలుజేశాడు.

**ప్ర: ఆదిశంకరులు 32 ఏళ్ళ వయస్సువరకు జీవించి యున్నారని ప్రసిద్ధి. కానీ వారు రచించిన 'దేవ్యపరాధక్షమాపణ స్తోత్రం'లో మయాపంచాశీతే ..అధికమపనీతేతు వయసి ...' అనే వాక్యం ఉంది. అంటే – 'నాకు 85 ఏళ్ళ పైబడి వయస్సు గడిచింది' అని అర్థం కదా! దీన్నిబట్టి ఒక విమర్శకుడు శంకరులు 85 ఏళ్లపైనే జీవించారు – అని వ్రాసారు. ఏది సరియైనది?**

**జ:** ఆది శంకరులు 32 ఏళ్లు జీవించి ఉన్నారని శంకరవిజయాలు, చారిత్రక పరిశోధనలు చెబుతున్నాయి. అదే సరియైనది. ఇక 'దేవ్యపరాధ క్షమాపణస్తోత్రం'లోని వాక్యం గురించి – శంకరకృతంగా చెప్పబడు తున్న స్తోత్రాలన్నీ ఆదిశంకరుల రచనలేనని చెప్పలేము. అందులో కొన్ని మాత్రమే వారివి. శంకరులు ప్రతిష్ఠించిన పీఠాలలో పరంపరగా వచ్చిన పరమహంసలు ఎందరో! వీరిని కూడ 'శంకరాచార్యులు' అనడం సంప్రదాయం. ఆదిశంకరులకీ తరువాతి శంకరాచార్యులకీ భేదముంది.



అలా వచ్చిన శంకరపరంపరకి చెందిన శంకరాచార్యులలో 85 ఏళ్ళకి పైగా జీవించిన ఏ శంకరాచార్యులో ఈ స్తోత్రాన్ని వ్రాసి ఉండవచ్చని భావించాలి. వారు కూడా శంకర పరంపరకి చెందిన వారే కనుక, ఆ స్తోత్రానికి గౌరవం, శక్తి ఉంటాయి.

**ప్ర: 'మతాల పేరుతో ఎన్నో హింసలు, యుద్ధాలు జరిగాయి. అందుకే నాకు మత సంప్రదాయాల మీద గౌరవం, నమ్మకం లేవు. నేను మీ పూజల్లో పాల్గోను' – అని మా అమ్మాయి అంటోంది. మేమేం సమాధానం చెప్పాలి?**

**జ:** పూజలు, సంప్రదాయాలు ఆచరించే మీరుగానీ, మీ పూర్వీకులుగానీ హింసలు, యుద్ధాలు చేయలేదు కదా! ఇక హింస, యుద్ధాలు చేసినవారికీ, మత సిద్ధాంతాలకీ సంబంధం లేదు. ఆ మాటకొస్తే భాషలపేరుతో ఎందరో హింసలు, ద్వేషాలు,

ఉద్యమాలు, పోరాటాలు, చీలికలు చేశారు. అంతమాత్రానికి 'నేను ఏ భాషా మాట్లాడను' అని మూగగా బ్రతుకుతామా! 'దేశాలపేరుతో యుద్ధాలు జరుగుతున్నాయి కనుక నేను ఏ దేశంలోనూ ఉండను' అనగలమా!

హింసనీ, యుద్ధాన్నీ అనుసరించకుండా మన మత సంప్రదాయాలను మనం పాటిస్తూ ఉంటే ఆధ్యాత్మిక పురోగతిని సాధించగలం.

ప్ర: **విదేశాలు కర్మభూములు కావు కనుక అక్కడ ఏ కర్మా చేయనక్కరలేదనీ, సంధ్యావందనం, దేవపూజ, ధ్యాన, జప, అనుష్ఠానాలు అక్కడ వ్యర్థమని అంటారు. అంటే విదేశాలలో అవేవీ చేయనక్కరలేదా! చేస్తే ఫలించవా?**

జ: పంచభూతాలు ఉన్న ఎక్కడైనా మనం మన విధ్యుక్తమైన కర్మలను ఆచరించవచ్చు – ఆచరించాలి. పుణ్యభూమి, కర్మభూమి అయిన భారతదేశంలో సత్కర్మలు ఆచరించడం శ్రేష్ఠం – అని మాత్రమే శాస్త్రోద్దేశం. మిగిలిన చోట్ల చేయకూడదు – అని చెప్పలేదు. మనదైన స్వధర్మాన్ని ఎక్కడున్నా పాటించాలి.

'కాశీలో మరణిస్తేనే మోక్షం వస్తుంది' అని పలు శాస్త్రాల్లో ఉంది. అంటే మిగిలిన ప్రాంతాలవారికి మోక్షం రాదు – అని అనలేము కదా! రమణుల వంటి మహాత్ములు, త్యాగరాజాది భక్తులు కాశీలో తనువు చాలించలేదు. వారికి ముక్తిలేదు – అంటే మహాపాపం! కాశీలో మరణం – అనేది ఒక శ్రేష్ఠతావాచకం. అలాగే భరతవర్షంలో కర్మాచరణ –శ్రేష్ఠత్వాన్ని మాత్రమే తెలియజేస్తుంది. వైశ్వీకరణ అనివార్యమైన నేటి దేశకాల పరిస్థితుల్లో – విదేశవాసాలు కూడా అనివార్యమౌతున్నాయి. ఆ స్థితిలో మన ధర్మాన్ని పాటించరాదు – అని మాట్లాడితే, అందరూ పరధర్మ పరాయణులయ్యే ప్రమాదముంది. శాస్త్రవాక్యాన్ని సరిగ్గా అర్థం చేసుకుని అన్వయించాలి. సర్వదేశకాలాలలో మన సంప్రదాయానుగుణంగా సాధ్య మైనంత సదాచారాన్ని పాటిస్తూ అనుష్ఠానాన్ని కొన సాగించాలి. చేయాలనే ఉద్దేశం ఉన్నవాడు ఎక్కడైనా చేసి తరిస్తాడు. వాటికి తప్పక సంపూర్ణ ఫలముంటుంది. ఆ ఉద్దేశం, సంస్కారం లేనివాడు 'కర్మభూమి' భారత దేశంలో కూడా అనుష్ఠానరహితుడై పతనమౌతాడు.

ప్ర: **ధర్మాన్ని ఆచరిస్తే బాగుపడతారు. లేకపోతే దెబ్బతింటారు అని మన శాస్త్రాలన్నీ చెబుతున్నాయి. కానీ లోకంలో విరు ద్ధంగా కనబడుతోంది. అధర్మపరులు అందలా లెక్కుతున్నారు. ధర్మపరులు క్షేమంగా ఉండడం లేదు. ఎందుకని? మరి ధర్మాలు చెప్పి, చేసి ప్రయోజనమేమిటి?**

జ: మద్యపానం, ధూమపానం ప్రమాదకరం. చక్కని అలవాట్లతో, ఆహార విహారాలతో జీవించాలి – అని వైద్యశాస్త్రాలన్నీ చెబుతున్నాయి. కానీ లోకంలో ఆ దురలవాట్లు ఉన్నవాళ్ళు చాలామంది పదికాలాలూ హాయిగా జీవిస్తున్నారు. అవేవీ లేని, మంచి అలవాట్లున్నవాళ్ళు హఠాత్తుగా ఘోరరోగాలపాలై మరణించడం కూడా కనబడుతోంది. అలాంటప్పుడు 'వైద్య శాస్త్రాలు చెప్పిన నియమాలన్నీ ఎందుకు? అవి చెప్పి, చేసి ప్రయోజనం యేమిటి?'–అని ప్రశ్నించకూడదు కదా!

అలాంటప్పుడు మనధర్మం 'ప్రారబ్ధం' అనే చక్కని సమాధానాన్ని చెప్పింది. మనవంతుగా మన ప్రయత్నాలు చేసినా జరగని దానికి 'ప్రారబ్ధమే' సమాధానం – అని భారతంలో భీష్ముని మాట. ఇది వరకు చేసిన కర్మల ఫలం అనుభవించక తప్పదు. అలాగని నేటి మన కర్తవ్యాన్ని, నియమపాలనని మానరాదు. గతజన్మ లలో ధర్మాన్ని ఉల్లంఘించడం, అధర్మాన్ని ఆచరించడం నేటి బాధలకి కారణమని గ్రహించి – ఆ దోషాన్ని ఈ జన్మలో ఆచరించకుండా జాగ్రత్త పడాలి.

అయితే ధర్మం ఆచరించినా ఇప్పుడు కష్టం తప్పలేదు – అనడం పొరపాటే. ధర్మా చరణకి తప్పకుండా సత్ఫలితం ఉంటుంది. వెంటనే కాకున్నా, కాలక్రమేణా లభించి తీరుతుంది. దృఢంగా ఆచరిస్తే శీఘ్రంగా లభించే అవకాశమూ ఉంది. వైద్యశాస్త్ర నియమాలు విఫలం కావచ్చు కానీ, ధర్మశాస్త్రం ఏనాడూ వైఫల్యం చెందదు. ధర్మా చరణ ఫలించి తీరుతుంది.



**ధర్మోరక్షతి రక్షితః**–అనేది నూటికి నూరుపాళ్ళూ సత్యం.

**ప్ర: 'నత్కీరుని' వృత్తాతంలో శివుడు అన్యాయం చేసినట్లు అనిపిస్తుంది. 'అమ్మవారి కురులకి సహజ సుగంధం – అంటే సమంజసమే కానీ, స్త్రీల కురులకి సహజ సుగంధం అనరాదు' అన్నాడు నత్కీరుడు. దానికే కోపగించి శివుడు శపించాడు. ఇది సమంజసమా?**

జ: ఆ వృత్తాంతాన్ని సరిగ్గా గమనించండి. శివుడు నత్కీరుని ముందు మారురూపంలో కనబడతాడు. అప్పుడు నత్కీరుడు పై వాదన చేశాడు. దానికి శివుడు తన మూడవ కన్ను చూపిస్తాడు. 'నీ తల చుట్టూ కన్నులున్నా పద్యం తప్పే' అన్నాడు నత్కీరుడు. ఇది అతడి అహంకారానికి తార్కాణం.

కవిత్వాలకీ, కళలకీ అతీతమైనది పరతత్త్వం. ఆ పరతత్త్వమే పరమేశ్వరుడు. సాక్షాత్తు ఆ శివుడే ఎదురుగా ఉండి, నిదర్శనాన్ని చూపించిన తరువాత కూడా

–'కవితాభిమానం' వహించి, లౌకికమైన కవితాహంకారాన్ని ప్రకటించడం దోషం. ఆ తత్త్వ దృష్టి, సత్య దృష్టి – కళాదృష్టి కంటె గొప్పవి. అది నత్కీరునికి లోపించింది. దానికి గుణపాఠంగా శివుడు శపించాడు. ఇది కోపమూ కాదు, అన్యాయమూ కాదు. కర్మ ఫలాన్ని ప్రసాదించడం. అంతేకాదు – తరువాత నత్కీరుడు ఈ శాప పరిహారంగా చేసిన యాత్రలో ఎన్నో అద్భుతానుభూతులు పొంది, సుబ్రహ్మణ్యదర్శనం చేసి, శ్రీకాళహస్తీశ్వరుని అనుగ్రహానికి పాత్రుడై ఒక మహద్గ్రంథాన్ని రచించి సత్కవిగా సత్కీర్తిని పొందాడు కూడా.

ఈశ్వరుడిచ్చిన శాపం అనుగ్రహంలో భాగమే. శిక్షారూప రక్షాకటాక్షమే.

**ప్ర: సృష్టిలో శక్తి స్వరూపిణీ ద్వారా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వచ్చారు. అందులో మహేశ్వరుని కుమారుడు వినాయకుడు. మరి అటువంటప్పుడు విఘ్నేశ్వరుని ముందుగా ఎందుకు పూజిస్తున్నారు?**

**జ:** సృష్టికి కారణం పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మయొక్క శక్తి పరాశక్తి. ఆ పరబ్రహ్మయే తన శక్తి ద్వారా బ్రహ్మ విష్ణు మహేశ్వరాది రూపాలు ధరించి సృష్టి శక్తులను కొనసాగిస్తు న్నాడు. విఘ్నేశ్వరుడు కూడా పరబ్రహ్మ యొక్క స్వరూపమే. మహేశ్వరుని కుమా రునిగా అవతరించాడంటే – ఆతని మరో రూపం అని అర్థం. అంతేకాక ఏ పనికైనా విఘ్నాలు పొంచి ఉంటాయి. కొన్ని పనులకు విఘ్నాలు కలగడం మంచిది. కొన్నిటికి విఘ్నాలు తొలగాలి. ఉదాహరణకు దుష్టశక్తుల పనులకు విఘ్నాలు కలిగితేనే లోకానికి క్షేమం. ఉత్తమ కార్యాలకు, పూజాదులకు విఘ్నాలు వాటిల్లరాదు. 'విఘ్నాలు' అనే దైవీశక్తులకు అధిపతిగా ఉన్న పరబ్రహ్మశక్తి గణపతి 'విఘ్నేశ్వరుడు'.

మన పూజాదికాలు, తలపెట్టిన సత్కార్యాలు నిర్విఘ్నంగా జరగడానికి గాను విఘ్నే శ్వరుని ముందుగా పూజించాలి. అప్పుడు ఏ విఘ్నాలూ కలుగకుండా ఉంటాయి.

**ప్ర: "హిందువులు ఆవుని దేవుడిగా పూజించడం ఆశ్చర్యం. దేవుడనేవాడు సర్వశక్తి మంతుడు, సర్వవ్యాపకుడు, జననమరణాలు లేనివాడు. ఆ లక్షణాలేవీలేని ఆవు దేవుడెలా అవుతాడు? ఇది హిందువుల మూర్ఖత్వం" అని ఒక ముస్లింమత మేధావి ఒకసభలో చెప్పాడు. దీనికి ఏం సమాధానం చెప్పాలి? గోవు ఏవిధంగా దేవుడవు తాడు?**

**జ:** దేవుడు సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపకుడు, జనన మరణాలు లేనివాడు – అని హిందువులకి ఎవరో చెప్పనవసరం లేదు.

**"అజరో౽మరోవ్యయః" "సర్వవ్యాపీ" "సర్వశక్తి సంపన్నః"** లాంటి శబ్దాలు హిందూధర్మంలో కోకొల్లలు. భగవంతుడు నిరాకారుడనీ, సాకారుడనీ కూడా హిందూ ధర్మం చెబుతుంది. 'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా'– ఉపాసనార్థం సగుణబ్రహ్మను దివ్యమంగళ విగ్రహంగా ధ్యానిస్తాం.

ఇంక – పరమేశ్వరుడు సర్వవ్యాపకుడైనా, విభూతుల రూపంలో ఆరాధించడం కనబడుతుంది. ఎక్కడ ఒక గొప్పతనం కనబడినా – అది భగవద్విభూతిగా గుర్తించి గౌరవించడం ఒక గొప్ప విజ్ఞానం. అలాంటి విభూతి ఆవులో ఉంది. ఇది భగవద్రూపం కాదు. ఇది భగవద్విభూతి రూపం.

సూర్యుడు, అగ్ని, దివ్యవృక్షాలు, సాలగ్రామాది శిలలు విభూతి రూపాలు. రాగితీగ విద్యుత్తు కాకపోయినా విద్యుత్తును గ్రహించి మనకందించే శక్తివున్నది.

రాగితీగ తెగిపోయినా విద్యుత్తు తెగదు. అదేవిధంగా భగవచ్ఛక్తిని విశేషంగా గ్రహించి అందించేవే 'విభూతులు'. భారతదేశంలో గోసంతతి ప్రత్యేకత – వేదాది శాస్త్రాలలోనే కాక, ఆయుర్వేదాది విజ్ఞానశాస్త్రాలలోనూ చెప్పబడుతోంది. ఈ దేశపు గోజాతికి మాత్రమే చాలా విశేషా లున్నాయి – వాటి పంచగవ్యాలు ఎన్నో దీర్ఘకాలిక రోగాలకు నివారణలు. గోవు మసలేచోట దివ్యశక్తి తరంగాలు వ్యాపిస్తాయని అనేక విధాలుగా ఋజువయ్యింది. గోవును చంపిన ప్రాంతాలలో అనేక ఉత్పాతాలు జరగడం శాస్త్రవాక్యమేకాక, అనుభవం కూడా. భారతదేశానికి మాత్రమే ప్రత్యేకమైన ఈ గోజాతిని కాపాడుకోవడం ఈ దేశంలో పుట్టిన ప్రతిఒక్కరి కర్తవ్యం.

ఆవుని దేవుడిగా అనుకోవడం తప్పుకాదు. 'దేవుడంటే ఆవు మాత్రమే' అని ఏ హిందువూ అనుకోడు. ఈ దృక్కోణం అన్యమతస్థులకు అర్థం కాలేదు. కొంచెం నిర్మల హృదయంతో ఆలోచిస్తే వారుకూడా ఈ గోప్రత్యేకతని గుర్తించి గోజాతిని కాపాడుకుంటారు. కానీ – భగవద్విషయంలో హైందవసనాతన ధర్మానికి ఉన్న విస్తృత, అగాధ, అఖండ జ్ఞానం వారికి లేకపోవడం వలన వారు ఈ అద్భుత అంశాలు తెలుసుకోలేకపోతున్నారు. వాటిని తెలుసుకొనే ప్రయత్నం చేయకుండా, తమ పరిమిత జ్ఞానంతో మాట్లాడటం శోచనీయం.

ప్ర: **కలికాలంలో యజ్ఞయాగాదులు, ధర్మాలు, జ్ఞానవైరా గ్యాలు, సదాచారాలు, శాస్త్రజ్ఞానం కష్టంకదా! పైగా–అంతా అయోమయం ఎక్కువగా ఉంటోంది. మరి సులభంగా తరించే ఉపాయం ఏమిటి?**

**జ:** మీరన్నది నిజమే. ధర్మాలు స్పష్టంగా చెప్పలేని అయోమయావస్థ ఈ యుగంలో సహజమే. కానీ సంప్రదాయబద్ధంగా వచ్చే సదాచారాలను సాధ్యమైనంత మేరకు పాటిస్తూ భగవద్భక్తి కలిగిఉంటే కలిలో తరించవచ్చు.

**విష్ణుం శివం వా భజతాం గురోః పిత్రోశ్చ సేవినాం।**
**గో వైష్ణవ మహాశైవ తులసీ సేవినామపి॥**
**నస్యాత్కలికృతో దోషః కాశ్యాం నివసతామపి।**
**కలౌ గురూణాం భజనమీశ భక్త్యధికం స్మృతమ్॥**

– అని ధర్మశాస్త్ర వచనం. “విష్ణువునుగానీ, శివునిగానీ భజించుట, గురువులను, తల్లిదండ్రులను సేవించుట, గోవులను, విష్ణుభక్తులను, శివభక్తులను, తులసిని సేవించుట – చేయు వారికి కలిదోషమంటదు. కాశీవాసముకూడా అట్టిదే. కలి యుగంలో గురుభజన, ఈశ్వరభక్తి అధిక ప్రభావవంతమైనవి.”

కలియుగమందు సత్కర్మలను స్మరించినప్పటికీ ఫలితమిస్తాయి.

అదేవిధంగా వేదాంత విజ్ఞాన శ్రవణం కూడా తరింపజేస్తుంది. ఆ జ్ఞానయోగం అసాధ్యమైనవారికి భక్తియోగం సులభ తరుణోపాయం.



**ప్ర: పాపాత్ములతో పంక్తిలో కలిసి భుజించరాదు – అంటారు కదా! మరి ఆ దోషాన్ని ఎలాపోగొట్టుకోవాలి.**

**జ:** ఎవరు పాపాత్ములో ఎవరు నిర్ణయించగలరు? ఏదేమైనా  పంక్తిలో ఒకరికొకరికి నడుమ విబూదిగానీ, జలముగానీ ఉంటే పంక్తి భేదమైనట్లే. అప్పుడు పంక్తిదోషం రాదు. ద్వారం, స్తంభం ఉన్నా దోషమంటదు.

ముఖ్యంగా – ఈశ్వరస్మరణ చేసి భోజనం చేయడం దోష పరిహారం. మనలో జఠరాగ్ని రూపంగాఉన్న పరమాత్మకు నివేదిస్తున్నామన్న భావనతో భగవన్నివేదితా న్నాన్ని తిన్నవారికి దోషంరాదు.

**ప్ర: షోడశోపచారాలతో భగవదర్చన చేస్తున్నప్పుడు, సాధారణంగా మనం– “...ప్రీత్యర్థం–ఛత్రం ఆచ్ఛాదయామి, చామరం వీజయామి, గజాన్ ఆరోహయామి...” వగైరాలు చెబు తుంటాం కదా! ఏ పెద్ద పెద్ద దేవాలయాలలోనో పీఠాలలోనో అన్ని ఉపచారాలు జరుగుతాయి. కానీ మనం నిత్యం ఇంట్లో అర్చన చేస్తే, కేవలం ఇవి వాచికంగానే మిగులుతాయి కానీ అసలు జరగవుకదా! అలాంటప్పుడు భగవంతునికి మనం ఏమీ చేయకుండా చేస్తున్నట్లు అభినయిస్తాం. మరి మనకు అసత్యదోషం ఉండదా?**

**జ:** మనం పూజకు ముందే 'యావచ్ఛక్తి' అంటాం. అంటే 'శక్తికొలది' అని అర్థం. బాహ్యపూజ చేయడం అవసరమే. కానీ అందులోనూ భావన ప్రధానం.

రోజూ రత్నాభరణాలు, వస్త్రయుగ్మాలు సమర్పించలేని వాళ్ళు ఆ ఉపచారాలకు బదులుగా అక్షతలనో, కుసుమాలనో సమర్పిస్తున్నారు కదా! అంటే–భావనాపరంగా భగవంతు నికి అందజేయడమే. అదేవిధంగా ఛత్రం, చామర, అశ్వారోహణాది ఉపచారాలు కూడా భావనాపరంగా–అంటే భావిస్తూ– ఆచరించాలి. భగవంతుడు భావదర్శి– భావవేద్యుడు.

ఆ కారణంచేత వాచికంగా చెప్పినా, ఆ వాచికానికి భావన ఉంటుంది గనుక, అది అసత్య దోషం కాదు. మనం ఇవ్వకుండా ఇచ్చేశాం అనుకున్నట్లే భగవంతుడూ, మన వరాల్ని 'తీర్చేసినట్టు' అనుకోమనడు. ఎందుకంటే – మనమిచ్చేవి భగవంతునికి అవసరం కావు. మన ప్రేమనూ, భక్తినీ వ్యక్తీకరించ డానికి సాధనాలు మాత్రమే. కానీ భగవంతుడు మనకు ఇవ్వాల్సినవి– మనకు అవసరమైనవి, మనమడిగినవి. ఈ కారణం చేత భావాన్ని మిళితం చేసిన బాహ్య పూజకు ఫలితం లభిస్తుంది.

**ప్ర: ఆర్యులు వైదిక మతాన్ని తెచ్చారని, వారు ద్రావిడులపై దండెత్తారనీ, రాముడు ఆర్యుడనీ, రావణుడు ద్రావిడుడనీ చదివాను. వేదమతస్థుడైన రాముడు, రావణునిపై దండెత్తడం ఆర్యుల ఆధిక్యాన్నీ, ఆక్రమణనీ తెలియజేయడానికేనని విమర్శించారు. ఇదెంత వరకు సమంజసం.**



**జ:** మన భారతదేశ చరిత్రకు పాశ్చాత్యులు చేసిన ద్రోహాలలో ఒకటి –ఆర్య, ద్రావిడ విభజన. ఆర్యులనే ఏదో తెగ ఎక్కడి నుండో ఇక్కడికి రాలేదు. వేదమతం ఆర్యులది కాదు. ద్రావిడులదీ కాదు. అది ఈ గడ్డపైన బ్రతికినవారి జీవన విధానం. ఆ మాటకొస్తే 'ద్రవిడుడు' అని చెప్పబడే రావణుడు మహా వేదపండితుడు. వైదిక దేవతలను స్వాధీనం చేసుకున్నవాడు. బ్రహ్మదేవుని వంశజుడు, వేదాలలో ఒక విధమైన ఘన పాఠానికి మార్గం వేసినవాడు. దీనిని ఏమంటారు?

మన చరిత్రను వక్రీకరించిన పాశ్చాత్యుల గ్రంథాలనే, తరువాత మన ప్రభుత్వాలు మనచేత చదివిస్తున్నాయి. అసలు చరిత్రని ఎందరో మహానుభావులు శాస్త్రీయంగా చూపిస్తూ, ఎన్నో గ్రంథా లను రచిస్తున్నా, అవి మన పాఠ్యగ్రంథాలుగా నోచుకోలేదు.

మనం ఇప్పటికీ భావనాపరంగా అస్వతంత్ర భారతీయులమే. పాశ్చాత్య భావదాసులమే.

**ప్ర: "రావణాసురుడు ఉత్తముడు. తనచెల్లిని అవమానించినందుకు రామునిభార్యను అపహరించాడు. సీతను అపహరించినా ఆమెను తాకలేదు. దూతను చంపకూడదని హనుమంతుని విడిచిపెట్టాడు. తమ్ముడు తననుండి దూరమై వెళ్ళినా సహించాడు. రాముడు తనభార్యను అనుమానించి, అవమానించి వదిలిపెట్టాడు." అంటూ రాముడికంటే రావణుడే గొప్పవాడు - అని ఈ మధ్య కొన్నిబృందాలు వ్యాసాలు వ్రాస్తున్నాయి. వీటికి సమాధానం ఏమిటి?**

**జ:** అర్థంలేని వ్యర్థ ప్రలాపాలు చాలాకాలంనుండి ఉన్నవే. వాటికి సమాధానాలుకూడా ఉన్నాయి. కానీ మనలో చాలామందికి రామాయణ పరిజ్ఞానంలేదు. దానిపై గౌరవంలేదు. కాసింత అవగాహన ఉన్న వాళ్ళుకూడా పై కువిమర్శలకు సమాధానం చెప్ప గలరు. ఆ అవగాహన సైతం మన సమాజంలో కొరవడు తున్నందుకు బాధపడాలి.

రావణుడి చెల్లిని (శూర్పణఖను) రాముడు పనికట్టుకుని వెళ్ళి అవమానించలేదు. పరపురుష వ్యామోహంతో ఆ రాక్షసివచ్చి తన కాముకత్వాన్ని బయటపెట్టింది. అంతేకాదు సీతమ్మను చంపబోయింది. తమంతతాము వచ్చి హింసించబోయే ఎవరి నైనా ఎవరైనా శిక్షించడం సహజం. అందునా చంపకుండా కేవలం అవమానించి వదిలివేయడం శ్రీరామ లక్ష్మణుల ఔదార్యం. తరువాత వేలమంది రాక్షసుల మూకను వెంటబెట్టుకు వచ్చింది శూర్పణఖ. అప్పుడు విల్లందుకున్న రాముడు తన పరాక్రమం తో వారిని మట్టుబెట్టాడు. అలాంటి శూర్పణఖను వెనకేసుకువచ్చిన వాళ్ళు ఉన్నారం టేనే ఆశ్చర్యం. వారి సంస్కారాలు ఎంత జగుప్సాకరమైనవో అర్థమౌతాయి.

వీరుడు వీరుని వీరత్వంతో ఎదుర్కోవాలి. రాముని పరాక్రమ వైఖరిని తెలిసిన రావణుడు, అతడిని ఎదుర్కొనలేక - మాయోపాయంతో వారిని తప్పించి - కేవలం కామవికారంతో సీతమ్మను అపహరించాడు. ఇందులో వాడి నీచత్వాన్ని ఉత్తమ లక్షణంగా చూసిన పాపజీవుల్ని ఏమనాలి?

అపహరించిన సీతమ్మను బలాత్కరించక పోవడం ఉత్తమ లక్షణమేమీ కాదు. అలా పరస్త్రీని బలాత్కరిస్తే వెంటనే ప్రాణాలు పోతాయన్న శాపం ఉన్న కారణంగా వెనక్కి తగ్గాడు. వాడి అధర్మరీతిని తట్టుకోలేక విభీషణుడు ఐచ్ఛికంగా దూర మయ్యారు. దూత అయిన హనుమంతుని వాడు విడిచిపెట్టలేదు. బంధించి తగుల బెట్టాలనుకున్నాడు. హనుమంతుని వేలకొలది రావణులైనా చంపలేరు. అతడు

అవధ్యుడు. అందుకే రావణుడు భయపడ్డాడు.

రాముడు బాలకాండనుండి ఉత్తరకాండ వరకు ఎక్కడ చూసినా, ఏ కోశానకూడా సీతమ్మను అనుమానించలేదు, అవమానించలేదు. ఒక ఉదాత్తమైన రాజధర్మాను సారం సీతమ్మను క్షేమంగా అరణ్యంలోని ఋషివాటికలకు పంపాడు. అది ప్రత్యేకంగా అధ్యయనం చేయవలసిన అంశం.

కాసింత ఆలోచించినా అర్థమయ్యే ఈ సామాన్య విషయాలు కూడా తెలియని స్థితిలో మనయువతరం ఉంది. వారికి రామాయణాంశాలు స్పష్టంగా చెప్పవలసిన బాధ్యత పెద్దలది.

ప్ర: **ఈ యాంత్రిక జీవితంలో సంధ్యావందనాదులు చేయడానికి సమయం ఎక్కడిది? ఏదైనా క్లుప్తంగా చేసుకొనే విధాన ముందా?**

**జ:** సంధ్యావందనాది నిత్యకృత్యాలను క్లుప్తపరచే పద్ధతుల్లేవు. నిజానికి– ఈ సత్కర్మల ఆచరణకు సమయం లేదనడం ఆత్మవంచన. వీటికి కేటాయించాల్సిన సమయం ఎక్కువ కాదు. శ్రద్ధలోపం చేత, బద్ధకం చేత మాత్రమే వీటిని వదులుకుంటాం. టీవీల ముందు కూర్చోడానికి, వ్యసనాలలో పాల్గొనడానికి బోలెడంత సమయాన్ని ఖర్చు చేసే మనకు సమయం లేదనడం సబబా?



ప్ర: **ఇటీవల ఒకరాజకీయ నాయకుడు పదవిలో ఉండగా పెద్దఎత్తున చండీయాగాన్ని చేశాడు. ప్రభుత్వంలో ఉన్నవారు ఆర్భాటంగా ఇలాంటి యాగాన్ని చేయడం సముచితమేనా?**

**జ:** పూర్తిగా సముచితమే. దేశక్షేమానికి ఇలాంటి యాగాలు జరపడం శ్రేయస్కరం. ఓట్లకోసం అన్యులవలె వేషాలు వేసుకుని తిరగటం కంటె ఇదే గొప్పపని. అందునా చండీయాగం భద్రతకీ, అభ్యున్నతికీ, శాంతికీ హేతువు.

**సర్వబాధా ప్రశమనం త్రైలోక్యం చాఖిలేశ్వరి।**
**ఏవ మేవ త్వయాకార్యం అస్మద్వైరి వినాశనమ్॥**

ముల్లోకాలలోని బాధలు పూర్తిగా తొలగాలనీ, లోకక్షేమాన్ని దెబ్బతీసే శత్రుశక్తులు నశించాలనీ ఆశించే భావం చండీసప్తశతిలో ఉంది. '... జగతాముపకారకం' – అనే వాక్యం పలుచోట్ల ఆ గ్రంథంలో కనబడుతుంది.

ఇంచుమించు రాజకీయనాయకులందరూ తాము ఎన్నికల్లో గెలిచేందుకు, పదవుల్లో పదిలంగా ఉండేందుకు యాగాలు చేస్తూనే ఉంటారు. కానీ దేశక్షేమంకోసం

స్వయంగా ప్రకటించి పెద్దలందర్నీ పిలిపించి, పీఠాధీశ్వరుల ఆశీస్సులతో, విద్వాంసుల పర్యవేక్షణలో ఇంతటి మహత్తర యాగం చేయడం దేశభక్తులు, ధార్మికులు అభినందించవలసిన కార్యం.

దేవాదాయ శాఖవారుకూడా ప్రతి ఆలయంలో విద్వాంసులైన పీఠాధిపతుల పర్యవేక్షణలో ఇలాంటి యాగాలు వీలైనన్ని నిరంతరం నిర్వహింపజేయడం అందరికీ క్షేమం. ఏ దేవత ఆలయంలో ఆ దేవతకి సంబంధించిన శాస్త్రోక్త యాగాలు - పూర్తి శాస్త్రీయ పద్ధతుల్లో జరగడం దేశానికి మంచిది. ఇది కేవలం దేశక్షేమాకాంక్షిగా చెప్పినమాట.

**ప్ర: చండీసప్తశతి ఉగ్రదేవతకు సంబంధించినది కదా! అలాంటి దేవతల్ని ఆరాధించడం సమంజసమేనా?**

**జ:** చండీసప్తశతిలోని దేవి ఉగ్రదేవతకాదు. సర్వశక్తిమయి, సర్వదేవతాత్మిక. కేవలం సాత్త్విక శక్తులైన దేవతలను రక్షిస్తూ, ముల్లోకాలకు క్షేమాన్ని కలిగించే జగన్మాత. శక్తియొక్క తీవ్రత చండి. ఇది దుష్టత్వాన్ని దునుమాడే పరమేశ్వరీ స్వరూపం. ఇదే చండీసప్తశతికి 'దేవీమహాత్మ్యం' అనేది అసలుపేరు. లక్ష్మి, గౌరి, సరస్వతి అనబడే సౌమ్యదేవతా రూపాలుకూడా ఆ పరాశక్తి మూర్తులే.

**సౌమ్యాని యాని రూపాణి త్రైలోక్యే విచరంతి తే,**
**యాని చాత్యంత ఘోరాణి తైరక్షాస్మాన్ తథాభువమ్।**

"అమ్మా! ముల్లోకాలలో ఉన్న నీ సౌమ్యరూపాలు, అత్యంత ఘోరరూపాలు మమ్మల్నీ, ఈ లోకాలను రక్షించాలి"- అని ఆ గ్రంథంలోని ఆకాంక్ష. ముల్లోకాలలో తీవ్రశక్తులు, ప్రసన్నశక్తులుకూడా ఉంటాయి. ప్రచండసూర్యుడు, ప్రసన్నభానుడు- వరదనీరు, తేటనీరు - పెనుగాలి, మలయపవనం అన్నీ భగవద్రూపాలే. ఇందులో దేనిని ఉగ్రం అంటాం? ఇవి ప్రకృతిలో సహజమైన శక్తులు. ఇవన్నీ మనల్ని రక్షించాలనే విశాలభావన, మంచిమనస్సు చండీసప్తశతి లోని ప్రధానాంశాలు.

**ప్ర: నిత్యానుష్ఠానం, మాతాపితృసేవ, కుటుంబ ధర్మాలు చేయడంకంటె - సమాజహిత కార్యక్రమాల్లో పాల్గొనడమే గొప్ప ధర్మం కదా! కొందరు మానవసేవా కార్యక్రమాల్లో తలమునకలై - ఆధ్యాత్మిక సాధనలకంటే ఇవేగొప్పవి అంటుంటారు. ఎంత వరకు దీనిని స్వీకరించాలి? వీటిలో దేనికి ప్రాధాన్యమివ్వాలి?**

**జ:** నిత్యానుష్ఠానవంటి ధర్మాలకు, మానవసేవా కార్యక్రమాలు ప్రత్యామ్నాయాలు కావు.

దేని ప్రయోజనం దానిదే. అత్యంత ముఖ్యమైనవి మనం చేయవలసిన నిత్యానుష్ఠానం, మాతాపితృసేవ, కుటుంబధర్మాలు. ఆ తరువాతే సేవాకార్యక్రమాలు. వాటినీ, వీటినీ కూడా సమర్థవంతంగా నిర్వహించేలా ప్రణాళిక చేసుకోవడమే ఔచిత్యం. మన నిత్యానుష్ఠానాది ధర్మాలకు దెబ్బతగలని విధంగా సమాజహిత కార్యాలలో పాల్గొనాలి.

ప్ర: **హనుమంతుడు 'పారిజాత తరుమూలవాసి' అంటారని మా మిత్రులొకరు పారిజాతం చెట్టుకింద హనుమంతుని విగ్రహం పెట్టి పూజిస్తున్నారు. అలాచేయవచ్చా? ఆచ్ఛాదన లేకుండా ఆరాధన చేయవచ్చా?**

జ: పై కప్పు(ఆచ్ఛాదన) ఉండాలని శాస్త్రం, సంప్రదాయం చెబుతున్నాయి. కానీ కొన్ని చెట్లకింద – వాటినీడలో భగవదారాధన శ్రేష్ఠం. ఆ చెట్టునీడయే ఆచ్ఛాదన. మారేడు చెట్టుకింద శివారాధనని శివపురాణం చెప్పింది. అలాగే గొప్ప దేవతా వృక్షాలకింద పూజలు శ్రేష్ఠమని చెప్పారు.

పారిజాతం చెట్టుకింద హనుమంతుని విగ్రహాన్ని పూజించడం తప్పు – అని చెప్పలేం.కానీ –'పారిజాత తరుమూలవాసినం' అనే వాక్యంలో చెప్పిన 'పారిజాతవృక్షం' మనమనుకొనే పారిజాతం చెట్టుకాదు. పారిజాతమంటే కల్పవృక్షం. దాని మూలంలో ఉన్న హనుమంతుడు – అనిఅర్థం. ఆ దేవతావృక్షం ఈ భూమిపై దొరకదు. దేవతను ధ్యానించేటప్పుడు కల్పవృక్ష మూలంలో ఉన్నట్లుగా ధ్యానించి, పూజించడం అభీష్ట సిద్ధి. అలాంటి భావన హనుమత్ శ్లోకంలో చెప్పబడుతోంది.

ప్ర: **ప్రతీకోపాసనలవల్ల ముక్తిలేదని ఉపనిషత్తుల్లో ఉందికదా! మరి విగ్రహారాధనను ఎలా మనధర్మం సమ్మతించింది? 'ప్రతిమా అల్పబుద్ధీనాం' అనే మాటకూడా ఉంది కదా!**

జ: ప్రతీకోపాసన అంటే మనమనుకొనే విగ్రహారాధనకాదు. ఉపనిషత్తులు చెప్పిన ప్రతీకోపాసన – వాక్కు బ్రహ్మమని, మనస్సు బ్రహ్మమని ఉపాసించుట వంటిది. దానికీ, విగ్రహారాధనకీ సంబంధం లేదు. అయితే ఈ ప్రతీకోపాసన పద్ధతులు ముక్తిని ఇవ్వలేక పోవచ్చు కానీ, కొన్ని యోగసిద్ధులని, సద్గతులని ప్రసాదిస్తాయి. ఆ పుణ్య విశేషంతో కాలాంతర, జన్మాంతరాలలో బ్రహ్మజ్ఞాన సాధన సమకూరవచ్చు.

ఇక – విగ్రహారాధన. ఇది ప్రతీకకాదు. ప్రతిమ. మనధర్మంలో విగ్రహారాధన చాలా విశిష్టమైనది. ప్రతి మతం వారు విగ్రహంవలె వివిధ చిహ్నాలు కలిగి ఉన్నారు.

నిజానికి అలాంటి చిహ్నాలు మనకు లేవు.

భగవంతుని ప్రతిమయందు పూజించడం భక్తినిష్ఠకు హేతువు. శరీరం, మనస్సు, ఇంద్రియాలు–వ్యక్త ప్రకృతివి కనుక –మనకు వ్యక్తమైన (కనబడుతున్న) వాటియందే బుద్ధి నిలుస్తుంది. కనుక – వ్యక్తాకారాలుగా భగవద్రూపాలను మలచి ఆరాధిస్తాం. ఇది కేవలం భావనామాత్రమేకాక – మంత్ర, హోమ, యంత్రాదుల ద్వారా చేసిన ప్రక్రియతో, శాస్త్రబద్ధంగా మలచిన శిల్పంలో శక్తిని ప్రతిష్ఠించే గొప్పవిధానాన్ని ఆగమశాస్త్రాలద్వారా గ్రహించవచ్చు. దీనినిబట్టి మనలను అనుగ్రహించే శక్తి ఆ విగ్రహంలో కేంద్రీకృత మౌతుంది – రాగితీగలో విద్యుచ్ఛక్తివలె.

ఇవికాక ప్రతిష్ఠాదులు లేకుండాచేసే చిత్రపటాల, విగ్రహాలవంటి వాటిలోకూడా భావన, అర్చన, శ్లోక, మంత్ర, స్తోత్రాదులవలన దేవతాశక్తి అత్యంత సూక్ష్మ భూమికలో ప్రగాఢంగా కేంద్రీకృత మౌతుంది. ఇది కేవల తర్కాలతో ఋజువు చేయలేం. అనుభవంతో తెలుస్తాయి.

భగవంతుడు ఒకడే అయినా వివిధ మంత్రాలతో, భావాలతో దర్శించిన ఋషులు పలు భగవద్రూపాలను వర్ణించారు. వాటిని వాటి ఉపాసనా పద్ధతుల్లో ఆయా ఉపాసకులు స్వీకరిస్తారు. అవి వారికి సత్యాలే. కాశీవెళ్లిన వాడికి కాశీ అనుభవం. ఎప్పుడూ చూడని వాడికి అది ఊహా విషయమే.

ఏ మంత్రం జపిస్తారో ఆ మంత్రాధి దేవతకు ఉన్న సూక్ష్మతేజో రూపాన్ని యంత్ర –విగ్రహాదులద్వారా గ్రహించి ఆరాధించే ప్రక్రియఉంది. వాటికి విశ్వాసాలతో పనిలేని మహిమలు ఉన్నాయి.

ఎంతోలోతైన ఆ భావనని కేవలం 'విగ్రహారాధన' అని పైపైన తేల్చి చెప్పలేం.

సర్వవ్యాపకమైన దైవశక్తి విగ్రహరూపంలో ఉందని భావించిన వారికి క్రమంగా సర్వత్ర భగవదనుభవాన్ని పొందేసిద్ధి లభిస్తుంది. అప్పుడు అంతటా బ్రహ్మానుభవ మున్నా విగ్రహాన్ని నిరసించడు.

కానీ భగవంతుడంటే విగ్రహం మాత్రమే అనుకుంటే – అది అల్పం. విగ్రహా రాధన అల్పబుద్ధులకు – అంటే అర్థమిది. ఇక్కడ 'అల్ప' అనేమాట 'ప్రారంభ దశలోవారికి' అనేఅర్థాన్ని చెబుతున్నది. "భగవంతుని విగ్రహంలో భావించడం తప్పుకాదు. కానీ భగవంతుడంటే విగ్రహం మాత్రమే అనుకుంటే అజ్ఞానమే" అన్న స్వామి వివేకానంద మాటలు గుర్తుంచుకోవాలి.

**ప్ర: అష్టోత్తర శతం(108), అష్టోత్తర సహస్రం (1008) అంటారు. ఈ సంఖ్యలకు ప్రాధాన్యం ఏమిటి?**

**జ:** ఇవి పరిపూర్ణతని తెలియజేసే సంఖ్యలు. '1' ఏకం అద్వితీ యం బ్రహ్మ - ఒక్కడే అయిన పరబ్రహ్మను సూచిస్తుంది. '0' లేదా '00' మిథ్యాత్మకమైన జగత్తును సూచిస్తుంది. 8- ప్రకృతిని సూచిస్తుంది - 'పంచభూతాలు, మనోబుద్ధి అహం కారాలు' కలిస్తే ప్రకృతి. 'భూమి రాపోనలో వాయుః ఖం మనోబుద్ధిరేవచ అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా' అని గీతలో చెప్పారు.

పరబ్రహ్మ - జగత్తు - ప్రకృతి - వీటిని సూచించే సంఖ్యలివి, అని శాస్త్రకారులు వివరించారు. 'విశ్వం శతం సహస్రం సర్వం అక్షయ వాచకమ్' అని మహాభారత వచనం. శతం (నూరు), సహస్రం(వేయి), సర్వ-ఇవన్నీ అనంతత్వాన్ని సూచిస్తాయి. పరమాత్ముడు అనం తుడు. ఆయన లీలలు, మహిమలు, గుణాలు అనం తాలు. వాటిని పేర్కొనగలిగే అనంతత్వ శక్తి మనకు లేదు. కానీ అనంతత్వాన్ని సూచించే సంఖ్యలతో చేసే నామ పారాయణాదుల వల్ల మన బుద్ధిని అనంత తత్త్వంతో అను సంధానం చేయగలుగుతాం. అందుకే శతం, సహస్రం - అనుష్ఠానంలో ప్రధాన మయ్యాయి. అయితే '8' సంఖ్యను కలిపి మొత్తంగా 108 లేదా, 1008 చేస్తే వీటిని కలిపితే '9' వస్తుంది. ఇది పూర్ణశక్తి. అన్ని అంకెలూ '9' లోనే ఉన్నాయి. ఈ విధంగా 108/1008 పూర్ణత్వానికి ప్రతీకలుగా ఉన్నాయి.



**ప్ర: ఆంధ్రరాష్ట్రంలో శ్రీశైలం కాక, ద్రాక్షారామ భీమేశ్వరుడు కూడా జ్యోతిర్లింగమేకదా! మరి 'డాకిన్యాం భీమశంకరం' అని ఉంది కదా! ఏది సరియైనది?**

**జ:** శ్రీశైలం మల్లికార్జునస్వామి జ్యోతిర్లింగమే. కానీ ద్రాక్షారామ భీమేశ్వరుడు ఉపజ్యోతి ర్లింగంగా కొన్ని పురాణాలు ప్రవచించాయి. అంటే జ్యోతిలక్షణం ఉన్నమాటను విశ్వసించవచ్చు. కానీ ఇది పంచారామ క్షేత్రాలలో ఒకటి. అసలైన భీమశంకర జ్యోతిర్లింగం (డాకినీక్షేత్రం) మహారాష్ట్రలో పుణేకి సమీపంలో ఉంది. ఆ ప్రాంతాన్ని కూడా 'భీమశంకర్' అనే వ్యవహరిస్తున్నారు.

**ప్ర: తిరుమల వేంకటేశ్వరస్వామికి బ్రహ్మగారు ఉత్సవాలు చేశారు కనుక 'బ్రహ్మోత్సవాలు' అనటం సమంజసంగా ఉంది. కానీ ప్రతిగుడికీ 'బ్రహ్మోత్సవం' అనే పేరుతో వేడుకలు చేయడం అసమంజసం-అని ఒక పండితుడు ఈ మధ్యనే పేర్కొన్నాడు. బ్రహ్మోత్సవాలు తిరుమలకు మాత్రమే పరిమితమా?**

**జ:** తిరుమల వేంకటేశునికి చతుర్ముఖ బ్రహ్మ స్వామి ఆవిర్భావ సమయంలో ఉత్సవాలు నిర్వహించారు. కన్యామాసంలో శ్రీనివాసుని ఆవిర్భావం జరిగినప్పుడు నిర్వహించినవి. బ్రహ్మగారు చేసిన ఆ తొలివేడుకలే ప్రతిఏడాదీ బ్రహ్మోత్సవాల పేరుతో చేస్తున్నారు-అనే అంశాన్ని సంప్రదాయంగా చెప్పుకోవడం ఉన్నది. ఈ అభిప్రాయం బాగానే ఉంది. కానీ 'బ్రహ్మోత్సవాలు' అన్నవి తిరుమలకి మాత్రమే పరిమితం అనడానికిలేదు. ప్రఖ్యాతిచెందిన మహాక్షేత్రానికిఉన్న ఉత్సవాలు కూడా ప్రఖ్యాతి చెందుతాయి. ఆ ఆలయంలో బ్రహ్మదేవుని ప్రసక్తి చెప్పవచ్చు. అయితే - 'బ్రహ్మ' శబ్దానికి ప్రతిచోటా 'బ్రహ్మదేవుడు' అనే అర్థాన్ని చెప్పనక్కర్లేదు.

బ్రహ్మశబ్దానికి 'అతిపెద్ద' 'వ్యాప్తిచెందిన' అనే అర్థాలను శాస్త్రం చెబుతోంది. 'బృహి వృద్ధౌ' 'బృహత్వాత్ బృంహణత్వాత్' అని బ్రహ్మ శబ్దానికి శాస్త్రపరమైన వ్యుత్పత్తులు. ఈ అర్థంతో - ఒక ఆలయంలో జరిగే 'పెద్దఉత్సవాల'ను బ్రహ్మోత్సవాలనడం సంప్రదాయం.

ప్రతి ఆలయానికి నిత్యకైంకర్యాలతో పాటు, ఆయా పర్వదినాలలో ప్రత్యేక సేవలుంటాయి. నిత్య, హోర, పక్ష, మాసోత్సవాలు ఆయా ఆగమాలు వర్ణించాయి. అలాగే ఏడాది పొడుగునా జరిగే ఉత్సవాలలో అతి ముఖ్యమైనవాటిని, ఎక్కువ వ్యాప్తిగా, పెద్దగా జరగవలసినవాటిని 'బ్రహ్మోత్సవాలు' అంటారు. ప్రధానంగా ఆ ఆలయంలో మూర్తి వెలసిన లేదా ప్రతిష్ఠితమైనరోజు ఆ గుడికి ముఖ్యం కనుక ఆ కాలానికి బ్రహ్మోత్సవమని వ్యవహారం.

ప్రతిగుడిలో ఆ ఉత్సవాలను బ్రహ్మోత్సవనామంతో వ్యవహరించడం తప్పుకాదు. సమంజసమే.

**ప్ర: దేవీభాగవతంలో మణిద్వీపవర్ణన ఉంది. లలితా సహస్రంలో 'శ్రీమన్నగరం' అన్నారు. మణిద్వీపానికీ, శ్రీమన్నగరానికీ తేడా ఉందా? కొన్నిచోట్ల వర్ణనలు విభిన్నంగా కనిపించాయి. రెండింటికీ పొంతన ఎలా?**

**జ:** మణిద్వీపం, శ్రీమన్నగరం - వేరు వేరు అనడం వాస్తవమే. దేవీభాగవతం చెప్పిన మణిద్వీపంలోని ఆవరణలు, శ్రీమన్నగరం చెప్పిన ఆవరణలు ఒకేనామాలతో వర్ణనలతో చాలావరకు చెప్ప బడుతున్నాయి. చివరలో కొన్ని మార్పులున్నాయి. మధ్యలో కూడా కదంబవనం, శ్యామలానివాసం, విద్రుమప్రాకారం, వారాహీ నివాసం వంటి అంశాలు శ్రీమన్నగరవర్ణనలో దర్శనమిస్తాయి.

మణిద్వీపం, శ్రీమన్నగరం ఒకటే అయినప్పటికీ ఈ భేదాలు ఎందుకున్నట్లు? అనేది సమంజసమైన విచారణీయాంశమే.

దేవీభాగవతం ప్రకారం మణిద్వీపవాసిని, సర్వశక్తిస్వరూపిణి, సగుణబ్రహ్మ రూపిణి, భువనేశ్వరీదేవి. భండాసుర సంహారార్థం, లోకరక్షణకై పరశంభువు చేసిన మహా యాగంలో చిదగ్నికుండం నుండి ఆ తల్లి వ్యక్తమయింది. అప్పుడామె పేరు లలితాత్రిపురసుందరి. ఆమెకై బ్రహ్మ ఆనతిమేరకు విశ్వకర్మ నిర్మించినది శ్రీమన్నగరం. మేరుపర్వత మధ్య శిఖరంపై నిర్మించాడు. ఇలాం టివి 16 నగరాలు నిర్మించినట్లుగా బ్రహ్మాండపురాణాంతర్గత 'లలితోపాఖ్యానం' వివరిస్తోంది.

మణిద్వీపంవలెనే నిర్మించబడిన నగరమిది.

జగదంబ తన సంకల్ప మాత్రంచేతనే నిర్మించిన సగుణబ్రహ్మ లోకం మణిద్వీపం. ఆ తల్లిని ఉపాసించి, ఆమె అనుగ్రహంతో పొందిన ప్రత్యేకశక్తితో విశ్వకర్మ నిర్మించి నది శ్రీమన్నగరం. ముఖ్యంగా ఈ లోకవర్ణనలను గమనిస్తే – ఆ లోకాలు ఆయా దేవతలను అకుంఠిత అఖండ అవ్యాజభక్తితో ఉపాసించే భక్తులకు లభించే దివ్యభూమి కలుగా అర్థమౌతాయి. అవి తాత్త్వికంగా కూడా వేదాంత తత్త్వంతో సమన్వయింప బడతాయి.



**ప్ర: పితృకర్మలకు 'శ్రాద్ధం' అనే పేరు ఎందుకు వచ్చింది?**

**జ:** పితృదేవతలనుద్దేశించి చేసే హోమం, పిండదానం, బ్రాహ్మణ భోజనం 'శ్రాద్ధం' అని చెప్పబడుతుంది.

**హోమశ్చ పిండదానంచ**
**తథా బ్రాహ్మణ భోజనం।**
**శ్రాద్ధ శబ్దాభిధేయంస్యాత్**
**ఏకస్మిన్నౌపచారికమ్॥**

'శ్రద్ధ' అనగా 'ఆస్తికత్వం'. భౌతిక విషయాలకు ప్రత్యక్ష ప్రమాణం. దివ్యవిషయాలకు శాస్త్రప్రమాణం. సామాన్యులకు దివ్యత్వం ప్రత్యక్షంవలె అనుభవంలో కనబడదు కనుక శాస్త్ర ప్రమాణం అవసరం. అంటే శాస్త్రాన్ని విశ్వసించడం. దాని పేరు 'శ్రద్ధ'. అటువంటి శ్రద్ధతో చేసేపని 'శ్రాద్ధం'. శాస్త్ర విశ్వాసంతో చేసే యజ్ఞయాగాదు లకు కూడా శ్రద్ధ ప్రధానం. కానీ ఆబ్దికాది పితృకర్మలు తప్పనిసరిగా చేయవలసినదే. లేకుంటే దుష్ఫలితాలు ఉంటాయి. కనుక ఈ కర్మలకు 'శ్రాద్ధకర్మ' అని ప్రత్యేకించి వ్యవహరిస్తారు.

**ప్ర: అగ్ని ఒకటే అయినా వివిధనామాలు ఉన్నాయి. ఆ పేర్లన్నీ ఒకే అగ్నికి చెందినవా? లేక వివిధ రకాల అగ్నులున్నట్లా?**

**జ:** అగ్నికి హోమాగ్ని, జఠరాగ్ని, వైశ్వానరాగ్ని – ఇలా స్థానాన్ని అనుసరించి వివిధ నామాలున్నాయి. కోపాగ్ని – వంటివి భావనా తీవ్రతలననుసరించి చెప్పేపేర్లు. ముఖ్యంగా వివిధ శాస్త్రకర్మల్లో వాడే అగ్నికి వివిధనామాలున్నాయి. అక్కడి మంత్ర, క్రియాభేదాల బట్టి ఆపేర్లు చెప్పబడతాయి. (ఇప్పుడు ఆ కర్మలు చాలామందికి తెలియవు కూడా). గర్భాదాన కర్మలో రగిల్చే హోమాగ్ని పేరు 'మరుత్'. పుంసవనంలో 'పవమానుడు', సీమంతంలో 'మంగలుడు', అన్నప్రాశనలో 'శుచి', చౌలకర్మలో 'సభ్యుడు', గోదానంలో 'సూర్యుడు', వివాహకాలంలో 'యోజకుడు', ప్రాయశ్చిత్తంలో 'విటుడు', పాకయజ్ఞంలో 'పావకుడు', పితృకర్మలలో 'కవ్యవాహనుడు', దేవకర్మలలో 'హవ్యవాహనుడు', శాంతిక కర్మలలో 'వరదుడు', పౌష్టిక కర్మలలో 'బలవర్ధనుడు', మృతదేహ దహనకాలంలో 'క్రవ్యాదుడు'. – ఇలా వివిధ సంస్కార కర్మలలో వివిధ నామాలతో అగ్నిని వ్యవహరిస్తారు. ఆ కర్మకి అనుగుణంగా అగ్ని వ్యవహరింప బడి ఫలప్రదాత అవుతాడు. ఒకే అగ్ని ఆయా కర్మలకు అనుగుణంగా వివిధ నామాలతో చెప్పబడుతున్నాడని భావం.



**ప్ర: ఈశ, కేన, కఠ – మొదలైన పది ఉపనిషత్తులు కాక, నూట ఎనిమిది ఉన్నాయని కొందరంటారు. అవేకాక ఇంకా ఎన్నో ఉపనిషత్తులు వినిపిస్తుంటాయి. అవన్నీ వేదాలలో ఉన్నవేనా? ఉదాహరణకు 'వల్లభేశోపనిషత్తు' అష్టోత్తర శతోపనిషత్తులలో కానీ, ఇతరోపనిషత్తుల్లో గానీ లేదని కొందరంటారు? అప్పుడు ఆ ఉపనిషత్తు సప్రమాణమేనా?**

**జ:** ఉపనిషద్విషయంలో సాహిత్య పరిశోధకుల దృష్టి వేరు, సంప్రదాయవాదుల దృష్టి వేరు. వేదశాఖల చివరలో చెప్పబడుతాయి కనుక 'వేద–అంతం' ఉపనిషత్తు. వేదశాఖలు అధిక సంఖ్యలో ఉన్నాయి. కనుక ఉపనిషత్తులు అధికంగానే ఉంటాయి. ఆదిశంకరులు ఒక పదింటికి భాష్యం వ్రాశారంటే ఆ ధోరణిలో ఇతరోపనిషత్తులను అన్వయించుకోవలసినదనే భావన.

అయితే ఉపాసనాపరంగా పరమాత్మను సగుణంగా భావించినప్పుడు వివిధ రూపాలతో ఆరాధించడం ఉంది – "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" అన్నట్లుగా. అలా వేద ప్రమాణంతో ఉపాసించే విష్ణు, శివ, శక్తి, గణేశ, స్కన్ద,

సౌర, రామ, కృష్ణాది వివిధ దేవతోపాసనలకు సంబంధించి తాపినీ ఉపనిషత్తులు, అధర్వశీర్షాలు చాలాఉన్నాయి. అవన్నీ వేదాలలో ఉన్నాయా? – అనే మీమాంస అనవసరం. వాటిలో ఉన్నదంతా వేద హృదయమే. ఉపాసనలో ఉపాస్యదేవతను పరబ్రహ్మభావనతో ఆరాధిస్తే అది 'సగుణబ్రహ్మోపాసన' గా, 'విద్య'గా ఉపకరిస్తుంది. అది క్రమంగా చిత్తశుద్ధినీ, చిత్త ఏకాగ్రతనీ కలిగించి ఈ జన్మలోనే బ్రహ్మజ్ఞానాన్నీ, తద్వారా మోక్షాన్ని ప్రసాదిస్తుంది లేదా–క్రమముక్తిని ప్రసాదిస్తుంది.

అందుకే ఉపాసనా సంప్రదాయంలో ఆయా ఉపాస్యదేవతల తత్త్వాన్నీ, పరిజ్ఞానాన్నీ, ప్రక్రియలనీ బోధిస్తూ ఉపనిషత్తులు వచ్చాయి. తత్త్వదృష్టితో ఉపాసించాలనే ఉద్దేశమే ఈ ఉపనిషత్పరమార్థం. అలాంటి ఉపనిషత్తులలో 'వల్లభేశోపనిషత్తు' ఒకటి. ఇది వేదాలలో చెప్పబడే 108 లో లేకపోవచ్చు. కానీ వేదోపనిషత్తత్త్వాన్నీ, వేదాంత వాక్యాలను వాడుతూనే ఉపాస్యమైన మహా గణపతి స్వరూప, స్వభావ, ప్రభావాలను చెబుతున్నది. వేద సమ్మత మార్గంలో ఉన్న ఆగమాలలో, మంత్రశాస్త్రాలలో అనేక ఉపనిషత్తులు చెప్పబడ్డాయి. ఆయాదేవతలు కూడా వైదిక దేవతలే.

శ్రీవిద్యలో ప్రధానమైన మహాగణపతి స్వరూపమే వల్లభేశుడు. ఈ గణపతిని గాణపత్యంలో 'మహాగణపతి'గా వ్యవహరిస్తారు.



ఇదే లలితోపాఖ్యాన, సహస్రనామాలలో వర్ణింపబడిన మూర్తి. బ్రహ్మవిద్యతో, వేద విజ్ఞానంతో సమన్వయించబడి, సగుణ బ్రహ్మముగా వల్లభగణపతిని వ్యాఖ్యానించే ఉపనిషత్తు వైదిక భావ గర్భితం, వేదాంతహృదయమే కనుక ఇది పూర్తిగా సప్రమాణమే.

**ప్ర: కేరళలో శబరిమలలో ఇన్నాళ్ళు స్త్రీలకు ప్రవేశం లేదు. ఇప్పుడు కోర్టువారు ప్రవేశాన్ని కల్పించాలని తీర్మానించారు. అదేవిధంగా మహారాష్ట్రలో కొన్ని ఆలయాల గర్భగుడులలోకి ఇప్పుడు స్త్రీలను ప్రవేశపెడుతున్నారు. ఇది సమంజసమేనా? 'ఆచార వ్యవహారాల కంటే కోర్టు తీర్పు గొప్పది'– అనే కోర్టువారి వ్యాఖ్య ఎంతవరకు సమర్థ నీయం? కమ్యూనిష్టులు కోర్టును సమర్థిస్తున్నారు కూడా.**

**జ:** కోర్టు తీర్పును గౌరవించడం మన ధర్మం. అయితే వారి అభిప్రాయం ప్రకారం మతాచారాలకంటె కోర్టు గొప్పదేకావచ్చు. కానీ అదేమాటకు కట్టుబడి మసీదులలోకి స్త్రీలను అనుమతించ గలరా? అక్కడ వారి ఆచారానికి కట్టుబడ్డకోర్టు హిందువుల విషయంలో వివక్ష ఎందుకు చూపిస్తోంది!

ఆలయ ప్రవేశాలలో స్త్రీలకు పరిమితులు పెట్టడం వారిని కించపరచడంకాదు. అక్కడున్న దేవతలు, ప్రతిష్ఠాన సమయంలో జరిపిన యంత్ర, మంత్ర నియమాలతో శాస్త్రం చెప్పిన పద్ధతులు బట్టి కొన్ని ఆలయాలకు కొన్ని పరిమితులుంటాయి. అవి ఆ శాస్త్ర నిష్ణాతులకు తెలుస్తాయి. పెద్దపెద్ద ఆలయాల్లో కూడా కొన్నిటిలో ప్రవేశాలుండి, కొన్నిటిలో లేకపోవడాన్ని పరిశీలించాలి. లోకకల్యాణం కోసం ఉన్న ఆలయాల మర్యాదలను, పరంపరను గౌరవించడం ఆవశ్యకం.

మత విషయాల్లో మతాతీతంగా ఆలోచిస్తాము–అనేది అజ్ఞానం. అసలు విశ్వాసమే లేని కమ్యూనిష్టులు గుడుల వ్యవహారాల విషయంలో మాట్లాడడం మరో అజ్ఞానం. శబరిమలలో స్వామి బ్రహ్మచర్యమూర్తి. ఆ దేవతా నియమానుసారం ఆ బ్రహ్మచర్యదీక్షలో ఉండగా స్త్రీమూర్తుల ప్రవేశాన్ని తన తపోధామంలో అనుమతించలేదు. ఇది ఆ ఆలయ చరిత్ర. ఈ నేపథ్యం తెలియకుండా రాజకీయంగా ఆలోచించడం విచారకరం. హిందూ ధర్మం పట్ల ఈ దేశంలో ఎంతటి వివక్ష ఉందో ఇలాంటి సందర్భాలు ఋజువు చేస్తుంటాయి.



ప్ర: **మనగుడులలో దేవుడికి ముడుపులు, మొక్కుబడులు చాలా కాలంనుండి ఆనవాయితీ కావడంతో ఈ దేశ ప్రజల్లో అవినీతి, లంచగొండితనం కూడా అలవాటయ్యాయని ఒక విదేశస్తుడు వ్యాసం రాశాడు. దానిని పట్టుకొని ఇక్కడ హిందూ వ్యతిరేకులు మనసంప్రదాయాన్ని ఎత్తిపొడుస్తున్నారు. దేవుడికి ముడుపులు, మొక్కుబళ్లు ఎందుకు? తప్పులుచేసి వాటినుండి తప్పించమని అడగడమెందుకు? మనదేవుళ్ళు లంచగొండితనం నేర్పు తున్నారా?**

**జ:** ఇంతవరకు ఏ హిందువుకీలేని ఆలోచన, రానిబుద్ధి ఆ పాశ్చాత్యుడికి వచ్చింది. భగవంతుడికి లంచం ఇవ్వడమే ముడుపులు, మొక్కుబళ్ళుఅనే అర్థం అజ్ఞానమే. సకల జగదీశ్వరుడికి, మనరూపాయలు అవసరమా? మరి ఈ ఆనవాయితీ ఎందుకుంది!

ఒక అనారోగ్యం కలిగితే ఔషధం వాడతాం. దానికి డబ్బు కడతాం. అంటే ఔషధం కోసం, వైద్యుడికోసం లంచమిచ్చినట్టు కాదుకదా! ఆపదలో ఉన్నవాడికి ఒక ఆసరా, భరోసా కావాలి. అది విశ్వాసంమీద ఆధారపడి ఉంటుంది.

**'కాంచనం కర్మమోచనం'** అని ఒకలోకోక్తి ఉంది. ఒక కర్మని అనుసరించి ఒక అనుభవం ఉంటుంది. దుఃఖానికి కారణమైన పాపకర్మనుండి విడుదలకు

తాను తనకర్మతో సంపాదించిన దానిని వినియోగించాలి. అప్పుడు కర్మమోచనం ఉంటుంది. అది దానమో, సత్కార్యమో కావాలి.

ఒక ఆలయంలో స్వయంభువుగానో, ప్రతిష్ఠితుడుగానో ఒక దైవశక్తి ఉంటుంది. ఆ స్వరూపాన్ని స్మరించడమో, ధ్యానించడమో, అర్చించడమో, అర్పించడమో ఆచరించి నపుడు ఆ శక్తి వారిని అనుగ్రహించడం సహజం. సూర్యునివైపు తిరిగితే వెలుగు వస్తుంది. తనవైపు తిరిగినవారికి మాత్రమే వెలుగునివ్వడం సూర్యుని పక్షపాతం కాదు.

మానవప్రయత్నానికి దైవసహకారం కావాలన్న నమ్మకం ఉన్న వారు తమ కృత జ్ఞతను, భక్తిని వస్తు, ధనరూపేణ వ్యక్త పరుస్తారు. ఆ డబ్బు భగవంతుడికవసరం కాదు. కానీ ఒకగుడి సామాజికమైన వ్యవస్థ. దాని నిర్వహణకు ధనాదులుకావాలి. తమ విశ్వాసానికి ఆధారంగా ఉన్న ఆలయాన్ని సమాజం అభివృద్ధి చేసుకుంటుంది. ఆ పాశ్చాత్యుడి దేశంలోకూడా వందలఏళ్లనుండి చర్చిలు ఉన్నాయి. అవికూడా నమ్మకస్థులు ఇచ్చిన డబ్బుతో, మొక్కుబళ్ళతో, ముడుపులతో నడుస్తున్నవే. వాటిని లంచగొండితనంగా వాళ్లు అనగలరా? ప్రతివ్యక్తి తమజీతంలో కొంతభాగం తప్పని సరిగా చర్చికి జమచేస్తారు. ఇది 'కమిషన్' అని చెప్పగలరా? అక్కడ అనలేని మాటలు మనమతం విషయంలో అనగలుగుతున్నారంటే అదివారి అజ్ఞానపు అహం కారానికి గుర్తు.

శాస్త్రరీత్యా – అవినీతిగా ఆర్జించిన సొమ్మును దైవానికీ, యజ్ఞాది సత్కర్మలకీ, గురుదక్షిణలకీ వినియోగించరాదు. అవినీతిపరుడు భగవంతుడికి సొమ్మిలిచ్చినా, అవినీతిని దైవం మాఫీచేయదు. ఎవరికర్మకి వారిఫలాన్ని ప్రసాదించడమే ఈశ్వరుని కృత్యం అని మనధర్మం చెబుతోంది. వ్యక్తిస్వార్థంవల్ల పెరిగిన అవినీతికి గుడులతో ముడిపెట్టడం అవివేకం.

ప్ర: **మనధర్మాన్ని 'మనువాది' అని, దానిని వ్యతిరేకించాలని కొందరు ఆందోళన చేస్తు న్నారు. కులవ్యవస్థ, స్త్రీ అస్వతంత్రత లాంటివి మనుధర్మంలో ఉన్నాయని ఎద్దేవాచేస్తున్నారు?**

జ: మనుధర్మశాస్త్రం లేకున్నా మనధర్మం ఇసుమంత చెదరదు. అసలు మన హిందువుల్లో చాలామందికి మనువు పేరూ తెలియదు. మనుధర్మశాస్త్రమూ తెలియదు. అయినా హిందువులుగా ఉన్నారు. మరి 'మనువాది' అని ఎలా అనగలం? మనకున్న వంద

లాది ధర్మశాస్త్రాల్లో మనుధర్మశాస్త్రం ఒకటి. కలియుగంలో ఆ శాస్త్రాన్ని కాకుండా, **"కలౌ పారాశరస్మృతిః"** – అని 'పరాశర ధర్మశాస్త్రా'న్ని కొందరు ప్రస్తావించారు.

మనువాది అని విమర్శించేవారెవరూ సరిగ్గా మనుధర్మశాస్త్రాన్ని చదివినవారు కారు. వర్గ విభజనలు ఏ సమాజంలోనైనా ఉంటాయి. పరిమితుల్ని 'అస్వతంత్రత' అనీ మితిమించడాన్ని 'స్వతంత్రత' అనీ నిర్వచించడం సమంజసంకాదు.

కొన్ని శాస్త్రాంశాలు కొన్ని కాలాల్లో సమాజాన్ని సువ్యవస్థితం చేస్తాయి. అవి తరువాతి కాలాల్లో సమంజసం కాకపోవచ్చు. ఆ అంశాలు మినహాయించి, సర్వ కాలాలకు పనికివచ్చే స్ఫూర్తియైన విషయాలను గ్రహించవచ్చుకదా!

మనధర్మంలో కులభేదాలు ఎన్ని చెప్పారో వాటి సమన్వయాలు, సామరస్యాలు కూడా చాలాచెప్పారు. వాటిని అనుసరించి భేదాలను తొలగిస్తూ, సమన్వయంతో బ్రతికే విధానాలను ఏర్పరచి సంస్క రించుకున్నాం. స్త్రీ ఔన్నత్యాన్ని మన ప్రాచీన గ్రంథాలు బహు విధాలుగా చెప్పాయి. వాటిననుసరించి తగిన సంస్కరణలతో స్త్రీ ప్రాధా న్యాలనుకూడా హిందూధర్మం ఆవిష్కరించింది.



ఇతర ధర్మాలలో స్త్రీలకున్న పరిమితులు, నిబంధనలు హిందూధర్మంలో లేవు. వివిధ తెగలుగా ఇతరమతాలలో జరుగుతున్న కొట్లాటలు హిందూధర్మంలో లేవు. కేవలం రాజకీయులు రెచ్చగొడుతూ విధర్మీయుల పక్షాన హైందవధర్మానికి విఘాతం కలిగించాలని ఈ వాదాలు లేవదీస్తున్నారు.

మనుశాస్త్రం మీద మాత్రమే మనధర్మం నిలబడలేదు. ఒక్క గ్రంథం మీద ఆధారపడ్డ మతాలవలె ఒక్కపుస్తకంపైననే నిలబడినట్లయితే – మనం ఆందోళన పడవచ్చు. కానీ ఆ స్థితి మన ధర్మానికి లేదు. యోగం, మంత్రం, గుడి, ధ్యానం – ఇవన్నీ లింగ, వర్ణ వివక్ష లేకుండా అందరూ అనుష్ఠించి సత్ఫలితాలు పొందుతున్నారు. మనధర్మంలో మనువు పేరు తెలియక పోయినా, హాయిగా హిందువుగా జీవించవచ్చు. అలాగని మనుధర్మశాస్త్రాన్ని తీసిపారేయనక్కర్లేదు.నేటి స్థితిగతులకి అనుగుణంకానివి మినహాయించితే, ప్రతి వ్యక్తికీ పనికివచ్చే ఎన్నో అద్భుతాంశాలు అందులో ఉన్నాయి. వాటిని స్వీకరించి జీవితాన్ని తీర్చిదిద్దుకోవచ్చు.

ప్ర: **రామాయణాలు మూడువందలు సంస్కృతంలో ఉన్నాయి. ఒకదానిలో ఉన్నట్లు మరొకటి ఉండదు. మరి ఏది సరియైనదో ఎలా నిర్ణయిస్తాం? – అని విమర్శ చేస్తున్నారు కొందరు. నిజమే – ఏది ప్రమాణమని భావిస్తాం.**

**జ:** సంస్కృతంలో బహురామాయణాలున్న మాట వాస్తవమే. కానీ ఇంచుమించు అన్ని రామాయణాలు వాల్మీకిని ప్రమాణంగా చెప్పాయి. వాల్మీకి విరచించిన రామాయణాన్ని ప్రమాణమనడంలో సందేహం లేదు. పురాణాల్లో రామాయణాలు వివిధ కల్పాలలో జరిగిన గాథల్ని చెప్పడంచేత వాటిలో భేదాలున్నాయని విజ్ఞులు వివరించారు.

ఇక కావ్యాలుగా, ప్రత్యేక గ్రంథాలుగా సంస్కృతంలో రామాయణాలు చాలా ఉన్నాయి. వారంతా వాల్మీకి రామాయణాన్ని ప్రమాణంగా చెప్పినవారే. ఆ రామాయణాన్ని తమకోణంలో, తమభావంలో దర్శించారు. ఎన్నో రామాయణాలుండడం లోపం కాదు, రామకథకుఉన్న ప్రశస్తిని తెలియజేస్తుంది. ఎందరికో ఆ కథ స్ఫూర్తినిచ్చిందని, రామాయణం అందరికీ ముఖ్యమని స్పష్టమౌతుంది.

ఆర్ష (ఋషులు రచించిన) రామాయణాలలో భరద్వాజ రామాయణం, అగస్త్య రామాయణం, ఆధ్యాత్మరామాయణం –వంటివి రామకథను ప్రత్యేకదృష్టితో చూసినవి. బౌద్ధాదుల ప్రభావంచే కొన్ని రామాయణాలు వచ్చాయి. ఇవి వారిసిద్ధాంత ప్రభావంతో వ్రాసినవి. అవి ఎలాగూ ప్రామాణికాలు కావు.



రామాయణంలో ఒకపాత్రఅయిన వాల్మీకి నారదునిద్వారా రామాయణోపదేశాన్ని పొంది, అటుపై బ్రహ్మఆశీస్సుతో, తన తపశ్శక్తితో దర్శించి రామాయణాన్ని రచించినట్లు అవతారికలో స్వయంగా వ్రాసుకున్నాడు. ధర్మం, భక్తి, జ్ఞానం – ఈ మూడింటిని వృద్ధిచేసే అంశాలేవైనా ఏ రామాయణం నుండైనా గ్రాహ్యమే.

**ప్ర: ఆదిశంకరాచార్య పరకాయ ప్రవేశంద్వారా అమరకుడనే రాజదేహంలో ప్రవేశించి కామశాస్త్రాన్ని అధ్యయనం చేయడం, సన్న్యాసియైకూడా పరదేహంద్వారా కామానుభవాలను పొందడం ఎంతవరకు సమంజసం? ఇది సరియైన గాథయేనా?**

**జ:** ఆదిశంకరులు మండనమిశ్రుని వాదనలో జయించాక, మిశ్రుని భార్య ఉభయభారతి కామశాస్త్ర సంబంధ ప్రశ్నలువేస్తే– సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన ఉపాధితో తత్సంబంధ శాస్త్రాధ్యయనం చేయరాదుకనుక, పరకాయవిద్యతో మరొకదేహంలోచేరి ఆ శాస్త్రాన్ని అధ్యయనం చేసినట్లు మాధవీయ శంకరవిజయంతో పాటు, మరికొన్ని శంకరవిజయాలు చెప్పాయి.

అయితే కొందరు పండితులు ఈ విషయాన్ని అంగీకరించరు. వారి అభిప్రాయం ప్రకారం–మండనమిశ్రుని జయించాక, అతడు శంకరులను అంగీకరించి

సన్యసించాడు. అంతే, దీనికి ఉభయభారతి ప్రశ్నాదికాలు అవసరమేలేదు.

కర్మ-జ్ఞాన చర్చలో ఈ అంశం అసమంజసం కూడా. ఈ పండితాభిప్రాయం అంగీకారయోగ్యంగానే భావించవచ్చు. అప్పుడు ఏ తగాదాలేదు.

ఈ పరకాయ ప్రవేశగాథ సరియైనదికాదు. దానిప్రమేయం లేకుండానే శంకర విజయం చక్కగా సమన్వయింపబడుతోంది. శంకరులు 'సర్వజ్ఞుడు' అని ఋజువు చేసుకోవడానికి కామాశాస్త్రా ధ్యయనం చేయనవసరంలేదు. బ్రహ్మజ్ఞానియే సర్వజ్ఞుడు కనుక శంకరులు సర్వజ్ఞులు. అంతేచాలు. సర్వజ్ఞత్వ నిరూపణకోసమో, జ్ఞాన ప్రాధాన్యం కోసమో పరకాయ ప్రవేశం, కామశాస్త్రాధ్యయనం ఆవశ్యకం కావు.

అయితే కొన్నిప్రామాణిక శంకర విజయాల్లోఉన్న పరకాయ ప్రవేశగాథ మత్స్యేంద్రనాథుని కథలోని వృత్తాంత ప్రభావంచేత కల్పించినదిఅని భావించవచ్చు. ఒకవేళ ఆ గాథని అంగీకరిస్తే – అమరకుని దేహంలో ఉన్నప్పటికీ కేవలం సాక్షిగా ఆ దేహ స్పందనలని పరిశీలించారేగానీ-'సంగం' వహించలేదు.

**'పద్మపత్రమివాంభసా'** అన్నట్లుగా యోగి దేనికీ అంటకుండా (నిస్సంగుడై) దేహేంద్రియ వ్యాపారాలను సాక్షిగా గమనిస్తాడు కనుక అతడికి దోషమంటదు. కర్మకు హేతువైన దేహంలో- చంద్రకళలను ఆధారం చేసుకొని జరిగే మార్పులు, వాటి ప్రభా వాల గురించి ఉభయభారతి అడిగిన ప్రశ్నకు సమాధానంగా శంకరులు ఆ శాస్త్రాన్ని అధ్యయనం చేశారు. ఒక యోగిగా వారుచేసిన చర్యలో దోషంలేదు. – ఇది ఆ గాథను సమర్థించేవారి అభిప్రాయం.



రెండురకాల విజ్ఞుల భావాలు ఇలా ఉన్నాయి. ఎవరి మనసుకి అంగీకార్యమైనది వారు గ్రహించవచ్చు. ఏదేమైనా ఈ గాథ ఉన్నా లేకున్నా శంకరుల చరిత్రకి కళంకం రాదు. వారు బోధించిన జ్ఞానానికి విఘాతం కలుగదు.

ప్ర: **ఈ మధ్య ఒక కృష్ణభక్త బృందంవారు ఆదిశంకరుడు 'మాయావాది', వీరు భక్తికి వ్యతిరేకి – అంటూ ప్రచారాలు చేశారు. ఇది ఆమోదయోగ్యమేనా?**

జ: 'మాయ', 'అద్వైతం' అనేపదాలు ఆదిశంకరులు తయారు చేయలేదు. **'ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే'** – లాంటి వేద మంత్రాలున్నాయి. అంతెందుకు ఆ కృష్ణభక్త బృందంవారు ప్రమాణంగా భావించే భగవద్గీతలోనే **"దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా। మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే-** అని సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మయే బోధించాడు.

అంటే శ్రీకృష్ణుడే 'మాయావాది' అని అంగీకరించాలి.

శంకరులు సూటిగా స్పష్టంగా చెప్పినప్పటికీ సరిగ్గా గ్రహించలేని వారు వారి సిద్ధాంతాన్ని తిరస్కరిస్తారు. కానీ సూక్ష్మదృష్టితో గ్రహించిన విజ్ఞులు విశ్వజనీనమైన వారి తాత్త్వికతను ప్రశంసించి శిరసా వహించారు.

శంకరులు భక్తికి ఎన్నడూ వ్యతిరేకికారు. అయితే – వారిది జ్ఞానభక్తి. 'ఈశ్వరునికి భిన్నంగా ఏదీలేదు' అనే ఉపనిషత్తత్త్వమే వారి సిద్ధాంతం. భిన్నత్వాన్ని చూసే ద్వైత భ్రాంతిని విడచి–ఏకమైన ఈశ్వరునితో అభిన్నతను పొందడంకంటే భక్తి ఏముంటుంది? సాధనలుగా అన్నిరకాల భక్తి సంప్రదాయాలను శంకరులు అంగీ కరించారు కనుకనే 'భజగోవిందం' 'గోవిందం పరమానందం' 'హరిమీడే స్తవం' 'విష్ణుషట్పదీస్తోత్రం','లక్ష్మీనృసింహకరావలంబ స్తోత్రం', 'శివానందలహరి', 'సౌందర్యలహరి' లాంటి భక్తి భరిత స్తోత్రవాఙ్మయాన్ని అందించారు.

**ప్ర: 'ఏకం సత్ విప్రా బహుధాభవన్తి' అనే ప్రసిద్ధిచెందిన వాక్యం ఏ గ్రంథంలోనిది? సందర్భం ఏమిటి?**

**జ:** ఇది ఋగ్వేదం లోని మహాసౌరపారంలోని 20 వ ఋక్కు పూర్తిపాఠం:

**ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహురథో దివ్యస్సుపర్ణో గరుత్మాన్**
**ఏకం సత్ విప్రాబహుధావదన్త్యగ్నింయమం మాతరిశ్వాన మాహుః**

ఉన్నది ఒక్కటే. అది శాశ్వతమైన ఉనికియైన పరమాత్మ. విశేష ప్రజ్ఞ గలిగినవారు దానిని బహువిధాలుగా చెప్తారు. (సృష్టి నిర్వహణలో ఆ పరమేశ్వరుడు ప్రకటించే వివిధశక్తులననుసరించి) – ఆతడే ఇంద్ర, మిత్ర, వరుణ, అగ్ని, సుపర్ణ, గరుత్మాన్, యమ, వాయు... మొదలైనదేవతలుగా జ్ఞానులచే చెప్పబడుతున్నాడు.

బహుదేవతలు ఏకేశ్వరునియొక్క విభిన్న అభివ్యక్తులేనని దీని భావం.

**ప్ర: హనుమంతుడు ఒకవీరుడు, ధీరుడు, మేధావి. అంతటి స్వామి రాముని పాదాలవద్ద బానిసలా కూర్చోవడం సమంజసమా?**

**జ:** అసలు ఈ కోణంలో ఆలోచించవచ్చనే దుర్భావం ఎవరికీ పుట్టలేదు. రాముని ఉపాస్యమూర్తిలో హనుమంతుడు పాదాంతికం వద్ద ఉన్నట్లు వర్ణించారు. అది దోషంకాదు. బానిసత్వమూకాదు. ఎంత గొప్పవాడైనా ఆ గొప్పతనమంతా భగవత్ప్ర సాదమనే సత్యం భక్తుని భావంలో ఉంటుంది. హనుమ రామపాదాలవద్ద బానిసలా కూర్చోలేదు. భక్తునిలా కూర్చున్నాడు.

వినయానికీ, సర్వసమర్పణకీ ప్రతీక ఈ భక్తహనుమన్మూర్తి. ఈ మూర్తితత్త్వాన్ని ఇలా వక్రీకరించడం అసమంజసం. రామాయణంలో ఇలాంటి స్వరూపం కనబడక పోయినా, ఉపాసనలో దీనిని గ్రహించడం దోషంకాదు. వీరుడు, ధీరుడు, మేధావి – అయిన హనుమ **"దాసోహం కోసలేంద్రస్య"** అని (వాల్మీకి రామాయణం) సుందరకాండలో ప్రకటించుకున్నాడు. గొప్పతనానికి వినయం, భక్తి, వన్నెతెస్తాయేగానీ తగ్గించవు.

ప్ర: **అనేక శాస్త్రాలు చదవడానికి లభిస్తున్నాయి. అటువంటప్పుడు అవి చదివి తెలుసుకో వచ్చుకదా, మరి గురువు అవసరం ఎందుకు? ఉపదేశం లేకుండా, పుస్తకంచూసి అనుష్ఠానం చేయవచ్చుకదా?**

**జ:** భౌతిక శాస్త్రాలు కూడా పుస్తకాలు దొరకుతున్నాయి. కానీ విద్యాలయాలకి వెళ్ళి ఉపాధ్యాయుల ద్వారా బోధింప జేయడమెందుకు? అలాగే గురువులద్వారానే ఆధ్యాత్మికవిద్యలు ఎందుకు నేర్వాలి?

ఔషధాలను పుస్తకాలుచూసి ఎంపిక చేసుకోడు రోగి. వైద్యుని ద్వారా నిర్దేశింప బడ్డవి మాత్రమే స్వీకరించాలి.



అలాగే ఎన్ని మంత్రాలు పుస్తకాల్లోఉన్నా, అవి ఎవరికి, ఎప్పుడు, ఎందుకు ఎలా అందివ్వాలో గ్రహించే అనుభవజ్ఞుడు అవసరం. అతడే గురువు. అందునా – అనేక శాస్త్రాలు, అనేక విషయాలు చెప్తాయి. అవి అయోమయానికి హేతువు కావచ్చు. వాటిని చక్కగా సమన్వయపరచి చెప్పే శాస్త్రజ్ఞుడు గురువు. మనకి ఏది ఎంతవరకు అవసరమో గురువుకి తెలుస్తుంది. అయితే సరియైన అర్థాన్ని, అన్వయాన్నిచెప్పే గురువును గ్రహించడంలో మన వివేకం ఉపయోగపడాలి. భాగ్యం కలిసిరావాలి.

ప్ర: **ఒకరికి చెప్పేముందు, మనం దానిని ఆచరించాలి – అంటారు. పిల్లలు తల్లిదండ్రుల్ని, పెద్దల్ని "మీరు చిన్నతనంలో, యౌవనంలో చేయని ధర్మాలు మాకుఎందుకు బోధిస్తు న్నారు?" అనిఅడిగే సందర్భాలు వస్తుంటాయి. అప్పుడు జవాబు చెప్పలేని పరిస్థితి వస్తుంది. చేస్తేగానీ చెప్పకూడదా?**

**జ:** సాధారణంగా – మనం చేయగలిగితేనే చెప్పగలం. దానికి బలమెక్కువ. కానీ ఇదే ఎల్లవేళలా సిద్ధాంతంఅని చెప్పడానికి లేదు. తానుచేసి చెప్పడం ఒకపద్ధతి.

తాను చేయలేకపోయినా ఇతరులకు చెప్పవచ్చు. ఒకవ్యక్తి అజాగ్రత్తవల్ల చూసుకో కుండా గోతిలో పడవచ్చు. కానీ తరువాత రాబోయేవారికి –తనలా గోతిలో పడకుండా,

సరియైనదారిలో వెళ్ళమని హెచ్చరించడం తప్పుకాదు.

"నేను చేయకపోవడంవల్ల నష్టపోయాను. నువ్వా అలానష్ట పోకుండా ఉండడానికి చెప్తున్నాను." అని పిల్లలకి పెద్దలు చెప్ప వచ్చు. "దానివల్ల నాకంటె గొప్పగా ఎదుగు తావు" అని కూడా నచ్చుజెప్పవచ్చు.

**ప్ర: తపస్వి, ముని, ఋషి, యోగి, జీవన్ముక్తుడు పదాలకు ఒకటే అర్థమా! లేక వేర్వేరు అర్థాలున్నాయా?**

**జ:** ఈ పదాలకు అర్థాలు వేర్వేరు. ఉపవాస, యజ్ఞ, జపాది నియమాలతో తనను తాను తపింపజేసుకొనేవాడు తపస్వి, 'తప ఆలోచనే' అనే ధాత్వర్థం ప్రకారం ఒక మహాపరమార్థం కోసం తన బుద్ధిశక్తులను మథనం చేసుకోవడాన్ని కూడా తపస్సు అంటారు. మననశీలి, మౌనిని–ముని అంటారు. మనోవికారాలు లేకుండా, ఆత్మ తత్త్వాన్ని మననం చేసుకొనేవాడు ముని.

**"ఋషయో మంత్ర ద్రష్టారః"**–అని అమోఘమైన తపస్సు వలన కొందరికి దివ్యమైన మంత్రాలు గోచరమౌతాయి. అతీంద్రియమైన ఆ శక్తిని దర్శించిన వారిని ఋషు లంటారు. **"ఋషిఃదర్శనాత్"** అని – నిర్వచనం.

పతంజలి మొదలైనవారు ప్రవచించిన యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యా హారధ్యానాది యోగపద్ధతుల్ని అవలంబించిన వారు 'యోగులు'.

ఈ నాలుగింటికీ పరమలక్ష్యం, పరిపూర్ణస్థితి జీవన్ముక్తావస్థ. జీవించి ఉండగానే, బ్రహ్మజ్ఞుడై, ముక్తుడైనవాడు–జీవన్ముక్తుడు.

**ప్ర: 'తాపత్రయాలు' అంటే ఏమిటి?**

**జ:** మూడు విధములగు దుఃఖములకే 'తాపత్రయము'లని పేరు. 'త్రయము' అంటే మూడు అని అర్థం.

అవి ఆధ్యాత్మిక దుఃఖం, ఆధిభౌతిక దుఃఖం,ఆధిదైవిక దుఃఖం. అందు 'ఆధ్యాత్మిక దుఃఖం' రెండు విధాలు. అవి శారీరకం, మానసికం. శారీరక దుఃఖం మన శరీర మందలి కఫ, వాత, పిత్తమను ధాతువుల వైషమ్యము వలన ఏర్పడే అనేక రోగాలకు కారణం. కామ, క్రోధ, లోభ, మోహ, భయ, ఈర్ష్య, అసూయ మొదలగు దోషము లను కలిగించే విషయాల వల్ల మానవులకు కలిగే దుఃఖం 'మానసదుఃఖం'. ఈ రెండు విధాలైన దుఃఖాలు మన శరీరంలోని మనస్సు, ధాతువుల వలన ఏర్పడుతాయి. కాబట్టి వీటికి 'ఆధ్యాత్మిక దుఃఖ'మని పేరు వచ్చినది. ఇక బాహ్యోపాయ సాధ్యమగు

దుఃఖములు ఆధిభౌతికము, ఆధిదైవికము..

ఇతర మానవుల వలన, పశువులు, పక్షులు, పాములు, దుష్ట, క్రూర, వన్య మృగముల వలనను పంచభూతముల వలనను ఏర్పడేవి, శీతోష్ణాల వలన కలిగేవీ 'ఆధిభౌతిక దుఃఖాలు'. యక్ష, రాక్షస, పిశాచ, గ్రహావేశాదుల వలనను, కారణమే తెలియని దుఃఖాలను 'ఆధిదైవిక దుఃఖాలు' అంటారు.

ఈ తాపత్రయాలందు 'ఆధ్యాత్మిక దుఃఖ' నివృత్తికై వైద్యులను, మనస్తత్వవేత్తలను అర్థిస్తాం. ఆధిభౌతిక దుఃఖాలను– చలికి కప్పుకొనుట, ఎండకు నీడను చేరుట, ఉష్ణమునకు పంకాలు వాడుట మొదలైన ఉపాయములలో కొద్దిగా నివారించు కుంటాం. మరి ఆధిదైవిక దుఃఖములకు భగవంతుని ప్రార్థించుట, యంత్రతంత్రాదులు తరుణోపాయాలు.

అయితే 'ఆధ్యాత్మికం' అనే పదానికి లోకమందు 'మంచి మార్గమని' కూడా అర్థమున్నది. ఇందులో 'ఆధ్యాత్మిక'మను పదం విశేషణం. ఆధ్యాత్మికచింత, ఆధ్యాత్మిక మార్గము అని పూర్తి చేసుకోవాలి. ఇక్కడ ఆత్మయను పదమునకు పరమాత్మయని అర్థం. ఆత్మ శబ్దమునకు అనేక అర్థాలున్నాయి. 'ఆత్మా– జీవే, ధృతౌ, దేహే, స్వభావే, పరమాత్మని' అని అమరకోశం. 'ఆత్మ అనే పదానికి జీవుడు, హృదయం, దేహం, స్వభావం, పరమాత్మ' అనే అర్థాలు. వాటి సందర్భం బట్టి అర్థాన్ని గ్రహించాలి. ఆధ్యాత్మిక దుఃఖం అనేచోట ఆత్మశబ్దానికి శరీరమని అర్థం. దీనినే దేహమని అమరసింహులు తెలిపారు. శరీరంలో కలుగుతుంది. కాబట్టి ఈ దుఃఖములు ఆధ్యాత్మిక దుఃఖాలయ్యాయి. ఇక ఆధ్యాత్మిక మార్గము, ఆధ్యాత్మిక చింతన, ఆధ్యాత్మిక ప్రతిపత్తి మొదలైన స్థలాలలో 'ఆత్మ' శబ్దమునకు పరమాత్మ అని అర్థం.

కాబట్టి సన్మార్గము, సచ్చింతనము, సద్భావన అనే అర్థము లేర్పడ్డాయి.

ప్ర: **భగవద్గీత యుద్ధం చేయమని హింసనే ప్రేరేపిస్తుంది. ఇతర మతస్థుల ఉగ్రవాద రూపమైన జిహాద్‌లాగే! మరి దీని గొప్పతనమేమిటి? – అని ఒకయువకుడు ప్రశ్నిస్తే సమా ధానం చెప్పలేకపోయాను. గీతకీ – జిహాద్‌కీ తేడాఏమిటి? శాంతిని బోధించక హింసను బోధించే గీత పరమార్థం ఏమిటి?**

**జ:** మిమ్మల్ని ప్రశ్నించిన యువకుడు ఏనాడూ భగవద్గీత కనీసం చదువలేదు అని అర్థం అవుతోంది. భగవద్గీత యుద్ధం చేయమని చెప్పడానికి వచ్చిందికాదు. ఎవరి కర్తవ్యం వారు చేయాలని చెప్పింది. దేశరక్షణకోసం సైనిక యోధుల్ని ప్రేరేపించే

ప్రభుత్వ కర్తవ్యానికీ– మతోన్మాదంతో అమాయక ప్రజల్ని హింసించి రక్తపాతం సృష్టించడానికీ ఎంత భేద ముందో... కృష్ణుడు అర్జునునికి చెప్పిన యుద్ధకర్తవ్యానికీ, ఈ ఉగ్రవాద జిహాద్‌కీ అంత భేదముంది.

సైనికుని దోషిగా ఏ దేశ ప్రభుత్వమూ భావించదు. హంతకుని ఘనునిగా ఏ నాగరకతా శ్లాఘించదు. అర్జునుడు అనివార్యమైన తన క్షత్రియ కర్తవ్యమైన ధర్మ రక్షణార్థం యుద్ధానికి సిద్ధపడ్డాడు. అదేవిధంగా తనకర్తవ్యం పాటించాల్సిన విద్యార్థికీ, సంసారికీ, సన్యాసికీకూడా వారివిధిని గుర్తుచేస్తుంది గీత. ఎవరి కర్తవ్యం వారిది! సమాజ గతిలో రక్షణ– పాలన బాధ్యతగల క్షత్రియుడికి **"ధర్మాద్ధియుద్ధాత్ శ్రేయోన్యత్ క్షత్రియస్య నవిద్యతే"** – ధర్మబద్ధమైన యుద్ధముకంటె క్షత్రియునికి మరో శ్రేయస్సులేదు అనిచెప్పాడు.

ఆయుధం ధరించే పోలీసుకి అభ్యంతరం చెప్పని చట్టం, గన్స్ పట్టుకుతిరిగే పౌరుల్ని శిక్షిస్తోంది ఎందుకు? పరాక్రమంతో పరస్పరం యుద్ధంచేసే వీరులకీ, దురాక్రమణ దారుల అనుచిత ఉగ్రవాదానికీ ముడిపెట్టడం సంపూర్ణ అజ్ఞానానికి తార్కాణం కదా!

గీత ప్రధానోద్దేశం–ధర్మజ్ఞానాలను బోధించడం. ఇది యుద్ధ వీరుల గ్రంథం కాదు. అర్జునుని స్వధర్మం అతడికి చెప్తూనే, యావత్ మానవాళికీ వారివారి విధ్యుక్త ధర్మాలను ఆచరించమంటోంది. అంతేకానీ తన సిద్ధాంతంతప్ప, ఇతర సిద్ధాంతాలను అనుసరించే వాళ్ళని చంపి, తమ సిద్ధాంతమే రాజ్యమేలాలనే – బోధ సూచన ప్రాయంగాకూడా గీతలోలేదు.

**"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ"**–అని బోధించిన గీతలో హింసకి అవకాశమేలేదు. వైరాగ్యం కలిగి ఉన్నప్పటికీ, పాలనాబాధ్యత కలవాడు రక్షణకోసం ప్రయత్నించాలి. వైరాగ్యం లేకుంటే, ధర్మబద్ధంగా స్వధర్మం చేయాలి. వైరాగ్యమే ఉంటే కర్మాహంకారం విడచి, ఫలత్యాగబుద్ధితో స్వధర్మాన్ని పాటించాలి.

"కర్మఫల త్యాగః – త్యాగాత్ **శాంతి** రనంతరం"

"తతః **శాంతిం** ప్రయచ్ఛతి", "జ్ఞాత్వామాం **శాంతి** మృచ్ఛతి" ఇలా శాంతినే బోధిస్తోంది గీత.

శాంతికీ వ్యవహార జీవితానికీ సమన్వయం చేసుకోవడం గీత చెప్పేపాఠం.

కొంతమంది సాత్త్వికులైన ముస్లింమిత్రులు చెప్పిన ప్రకారం సమాజశాంతికి

వ్యతిరేకులైన అంతర్గత హింసాప్రవృత్తులను ఆధ్యాత్మిక సాధనతో నిర్మూలించి - సర్వవిశ్వప్రేమతో ఉండడమే వారి మతోద్దేశం కూడా! కానీ బోధనలలో స్పష్టత లోపించడంచేత వ్యతిరేకార్థంలో వినియోగిస్తున్నారు.

అలాంటి ఇబ్బంది భగవద్గీతవలన ఏనాడూ కలుగలేదు.

ఒకదోషి, తన బంధువైన కారణంగా శిక్షవేయడానికి వెనుకాడే న్యాయమూర్తికి, శిక్షించడానికి వెనుకంజవేసే రక్షణాధికారికి - **"బంధుత్వాలు విడచి, కర్తవ్యం చేయాలి"** అని బోధించడం ధర్మం. ఆ పనిచేసినదే భగవద్గీత.

**"బాంధవ్యాలకంటె కర్తవ్యాలు మిన్న"** - ఏ నాగరిక సమాజంలోనైనా ముఖ్యమైన ధార్మికరీతి ఇది. దీనిని బోధించినదే ఈ పవిత్రగ్రంథం. అవతలివారికి శాంతి, సహనం బోధిస్తూ తాము హింసనీ, ద్వేషాన్నీ పాటించే ఇతరులు మనగ్రంథాల్ని విపరీత కోణంలో వ్యాఖ్యానిస్తారు. మన శాంతి సహనాలు వారి దౌర్జన్యానికి గొప్ప అవకాశాలు కనుక వారి కుతంత్రమిది.

దురాక్రమణను సహనం పేరుతో ఆమోదించకుండా-ధర్మ రక్షణకోసం ప్రతి క్రియను చేయడం సమూహక్షేమానికి ప్రధానం.అదే అర్జునునికి ప్రేరణ. ఆ ప్రేరణ భారతజాతి నేడు పొందాలి. అదే సమయంలో సర్వజీవహితానికి అహింసాది కర్తవ్యాలను ఆచరించాలి. అందుకే యోగులకు, యతీశ్వరులకుకూడా శిరోధార్యమయింది.

మరొక్కమాట- భగవద్గీత అధ్యయనంద్వారా విశాలహృదయం, ప్రేమ, శాంతి, కర్తవ్యనిష్ఠ, జగద్ధితానికై పనిచేయడం... ఈ ప్రయోజనాలను సాధించినవారు కోకొల్లలు. కానీ గీతచదివి హింసా మార్గంలోకి వెళ్లినవాడు ఒక్కడులేడు - చరిత్రలో! మీరు చెప్పిన ఉగ్రవాదులు వాళ్ళ మతగ్రంథాల ప్రేరణతోనే హింసావాదానికి దిగుతున్నామని బాహాటంగా చెప్తున్నారు. గీతకి ఇతరుల హింసా సిద్ధాంతాలకీ అసలు పొంతనేలేదని చెప్పడానికి కాసింత ఇంగిత జ్ఞానం చాలు.

ప్ర: **ఈ మధ్య ఒకప్రసిద్ధ పండితుడు 'సుందరకాండ పారాయణ వల్ల లాభాలేమీలేవు. రామాయణ పఠనం పుణ్యం ఇవ్వదు. పారాయణవల్ల లాభాలేమీ లేవు. అవిచదివి అందులో మంచిని గ్రహించడం చాలు' అని, అనేక పుణ్యగ్రంథాల విషయంలోకూడా ఫలశ్రుతులు, మహిమలు లేవు. అవి చదివి ధర్మం తెలుసుకోవడమే అసలు ప్రయోజనం అన్నారు. మరి పారాయణలకు ప్రయోజనం లేదా?**

జ: బహుశా ఆ పండితుని ఉద్దేశం - కేవల పారాయణాలుచేస్తూ ధర్మాన్ని విస్మరించేవారిని

హెచ్చరించడమే అయ్యుంటుంది. రామాయణాది ఆర్షగ్రంథాలలో ధర్మప్రేరణతో పాటు, దైవబలం ఉంది. కేవల ధర్మమే ప్రధానమైతే రామునికి పూర్వం రఘు మహారాజు, మాంధాత, కకుత్స్థుడు, ఇక్ష్వాకువు – వంటి ధర్మ మూర్తులు ఎందరో ఉన్నారు. కానీ రాముడు ఎంత ధార్మికుడో అంత దైవం. కేవలం 'పుణ్యం' కోసం చదవడమేకాక, ధర్మాలను తెలిసి పాటించడం కూడా అవసరం. మన పాపాలను శుద్ధిచేసి, గ్రహదోషాలను తొలగించే మహిమకూడా సుందరకాండ, సప్తశతి, దేవీ భాగవతం లాంటి దివ్యగ్రంథాలకు ఉంది. రెండింటినీ ఒప్పుకోవాలి. ఒక దానిని సమర్థిస్తూ రెండవ దానిని నిరసించితే సనాతన ధర్మానికి కొంతదెబ్బ తగులుతుందన్న మాట వాస్తవమే.

ప్ర: **ఈ మధ్య ఒక సినీదర్శకుడు ఒక ఇంటర్వ్యూలో మాట్లాడుతూ "ప్రకృతికి భయపడి పంచభూతాలే దేవుళ్ళనుకొని ఆది మానవులు ప్రార్థించారు. అవే వేదాలు" అని అన్నాడు. అదే విధంగా ఒక నవలారచయిత ఇదేభావం ఒక టీ.వీ.లో చెప్తూ, "తరువాతి కాలంలో రాళ్ళపై బొమ్మలుగీసి– వాటినే దేవతలుగా భావించారు" అని కూడా వివరించాడు. వేదాల లోఉన్న భావాలు ప్రకృతి ప్రార్థనలా? దేవతాకారాలు ఆదిమానవుడి బొమ్మలా?**



**జ:** ఒక సినీదర్శకుడు, ఒక నవలారచయిత – వాళ్ళరంగంలో నైపుణ్యం చూపించుకుంటే సరిపోతుంది. వారు ఏనాడూ చదివి ఎరుగని వేదాలగురించి మాట్లాడే అధికారం, అవసరం వారికిలేవు. ఒక్క వేదమంత్రాన్నికూడా అర్థసహితంగా అధ్యయనం చేయని వాళ్ళు వాటిలో ఏముందో చెప్పడానికి సాహసించడం క్షంతవ్యం కాదు.

పాశ్చాత్యులు మన చరిత్రగురించి రాస్తూ పై భావాలు వ్యక్తం చేశారు. వాటినే చదివిన ఈ 'మేధావులు' వాటినే వల్లెవేశారు. "తాముతప్ప మిగిలిన ప్రపంచవాసులు, అందునా తమచేత పాలింపబడుతున్న దేశాలవారు, వారిమతాలు, నాగరికతలు ఆటవికమైనవి, అజ్ఞానమైనవి" అనే తీవ్రాహంకారంతో ఇంగితజ్ఞానం పనిచేయని పాశ్చాత్యుల రాతలు మనవారికి శిరోధార్యమయ్యాయి.

కానీ వారి భావాలను ఖండిస్తూ ఆ కాలంనుండే శ్రీ అరబిందో వంటి మహాశయులు వేదానికిఉన్న విశాలార్థాన్ని ఆంగ్లంలో అందించారు. వారి దారిలోనే కొందరు విజ్ఞానులైన సహృదయ పాశ్చాత్యులు రచనలు చేశారు. వాటిని సదరు సినీదర్శక, రచయితలు చదివి ఉంటే బాగుంటుంది.

ఆదిమానవుడి మాటకీ, వేదవాక్యాలకీ పొంతనేలేదు. పూర్తి సంస్కారవంతమైన, శాస్త్రమర్యాదలు కలిగిన భాషలో ఉన్న వేదాలకీ – భాషావికాసంలేని ఆదిమానవుడి రచనలు అని అనడం – కనీస ఇంగితజ్ఞానం కూడా లేదనడానికి తార్కాణం.

వస్త్రాలంకారంకూడా చేతకాని ఆదిమానవుడు సర్వాలంకార భరితమై, మంత్ర, యంత్ర, యోగశాస్త్ర సంకేతాలతో చిత్రితమైన విగ్రహాలను బొమ్మలుగా గీశాడనడం మరో హాస్యాస్పదాంశం.

మనవిగ్రహాల, దేవతాకృతుల వెనుక విశ్వవిజ్ఞాన సంకేతాలు, మంత్రశాస్త్ర ఆధార మైన అంశాలు ఉన్నాయి. అలాగే వేదాలలో కూడా అంతరిక్ష సంబంధమైన పరి జ్ఞానం, తాత్త్వికత, ప్రకృతిలోని దైవీశక్తిని గ్రహించేశక్తి, మానవీయ ధర్మాలు... ఇవే వివరించబడ్డాయి. నిర్దిష్టస్వరాలు, నిర్దుష్టపదాలు కలిగిన వేదం పండిన నాగరికతకు ఉదాహరణ. దానిని నాగరికత తొలిదశలోని మనిషి రచన అనడం వారి అజ్ఞా నాన్ని బైటపెట్టుకోడమే.

**ప్ర: ఈ మధ్య – ప్రపంచ ప్రసిద్ధిపొందిన 'శివకథ'కి చెందిన టీవీ సీరియల్‌లో శివునకు ఒక కూతురు ఉన్నట్టుగా చూపించారు. దీనికేదైనా పురాణాధారముందా? గణేశ కుమార స్వాములు మాత్రమే శివపుత్రులు–అని ప్రాచుర్యంలో ఉంది కదా? ఒక వేళ ఈ కథకి పురాణాధారముంటే కాస్త వివరంగా చెప్పండి.**



**జ:** శివునకు పుత్రిక ఉన్నట్లు పౌరాణికాధారం ఉంది. అయితే వినాయక, కుమారస్వాముల వంటి సంతానం కాదు. పద్మపురాణంలో నూటరెండవ అధ్యాయం నుండి కొన్ని అధ్యాయాలలో ఈ వృత్తాంతం కనిపిస్తుంది.

ఒకప్పుడు శివపార్వతులు గణ, పరివార సహితంగా వినోద విహారార్థం స్వర్గంలోని నందనవనంలోకి చేరుకున్నారు. అక్కడ ఉన్న కల్పవృక్షాన్ని చూసి పార్వతీదేవి కుతూహలపడింది. ఆ కల్పవృక్ష విశేషాన్ని శివుడు గౌరీదేవికి వివరించాడు. – 'ఈ చెట్టు దగ్గర నిలబడి ఏది సంకల్పిస్తే అది సాకారమై సిద్ధిస్తుంది' అని.

ఆ మాటతో శివవదనాన్ని చూసి, తన హృదయంలో ఒక అద్భుతసౌందర్యాన్ని భావించింది. ఆ భావన ఒక రూపం ధరించి సాక్షాత్కరించింది. శివుని ధ్యానించి శక్తి భావించిన రూపం కనుక – సంకల్పజనితమైన ఆ మూర్తి శివపార్వతీపుత్రికగానే చెప్పబడు తుంది. గౌరీ మానసపుత్రికగా ఉద్భవించిన ఆ దేవి పేరు 'అశోక సుందరి!' ఆమె దేవకాంతలతో కల్పకవనంలో దివ్యభోగాలతో నివసింప సాగింది. రానున్న

కాలంలో చంద్రవంశానికి చెందిన 'ఆయువు' అనే చక్రవర్తి యొక్క తనయుడు నహుషుడు ఈమెకు భర్త అవుతాడనీ, అతడు మహాపురుషుడనీ లోక కల్యాణార్థం 'హుందాసురుడు' అనే రాక్షసుడిని సంహరిస్తాడనీ శివుడు భావికథను చెప్పాడు. అశోకసుందరిని దీవించి శివశక్తులు కైలాసానికి చేరుకున్నారు.

శివవాక్యాన్ని విన్న అశోకసుందరి నహుషుని చేపట్టడానికై తపస్సును పూనింది. దేవవనితల చేత సేవలందుకుంటూ లక్ష్మీ దేవివలె కల్పకవనంలోనే ఉన్నది.

హుందాసురుడనే రాక్షసుడు అశోకసుందరి అందచందాలకు మోహితుడై తనను చేపట్టమని కోరుకున్నాడు. అశోకసుందరి తిరస్కారంతో కోపగించుకున్న హుందా సురుని తన తపశ్శక్తితో నిరోధిస్తుంది ఆమె. తాను నహుషునకు కాబోయే పత్నిని– అని చెప్పి, 'అతడి చేతిలోనే నవ్వు మరణిస్తావు' అని శపించి, అక్కడి నుండి గంగాతీరప్రాంతంలోనికి తపస్సుకై చేరుకుంటుంది.

ఇంకాపుట్టని భర్తకోసం ఇప్పటినుండే కలవరించడం వెట్టిపని అనీ, భార్యకంటె తక్కువ వయసున్న వానిని పెళ్ళాడడం ధర్మవిరుద్ధం – అని హుందుడు మాట్లాడాడు. 'అయోనిజులైన వారికి, భూగతమైన ప్రాకృతశరీరాల ధర్మాలు వర్తించవు' అని అశోకసుందరి వివరించింది. ఆయువు అనే చక్రవర్తికి అతని భార్యయందు దత్తాత్రే యుని అనుగ్రహంవలన విష్ణ్వంశతో ఉద్భవించాడు నహుషుడు. అసుర సంహారార్థం పుట్టిన నారాయణాంశ ఇతడు – అని పద్మపురాణం చెప్తోంది. క్రమంగా నహుషునిచే హుందాసురుడు సంహరింపబడి, లోకక్షేమం ఏర్పడుతుంది.



అసురసంహారార్థం జరిగిన ఈ కథ భావరమ్యంగా విస్తారంగా కొన్ని అధ్యాయా లలో చెప్పబడుతోంది. హుందుని మరణం తరువాత, రంభ రాయబారం ద్వారా అశోక సుందరి గురించి తెలిసిన నహుషుడు, పెద్దల దీవెనలతో ఆమెను చేపడతాడు. ఉత్తమగుణాలతో ధర్మపాలన అందించిన నహుషుడు యజ్ఞబలంతో ఇంద్రుడు కూడా అయ్యాడు. ఆ నహుషుని తనయుడే యయాతి. ఇతడో పుణ్యరాశి. ఇటువంటి వానికి తల్లి అశోక సుందరి. ఆమె మహిమచేతనహుషుడు గొప్పవాడయ్యాడు.

ఒక కల్పంలో (పద్మకల్పం–అని భావించవచ్చు) జరిగిన కథగా భావించవచ్చు. అశోకం –అంటే 'ఆనందం'. సౌందర్యం 'సుందరి'. శివశక్తుల తత్త్వమైన ఆనంద సౌందర్యాల ఒక కల్పనరూపం ఈమె.

అయితే గణేశ, కుమారులవంటి పుత్రికాతత్త్వం ఈమెకు చెప్పవలసినది లేదు.

వినాయక, సుబ్రహ్మణ్యులు ఉపాస్యదేవతలు. శివపరివారంలో ఉన్నవారు.

ఈ అశోకసుందరి ధర్మరక్షణార్థం, ఒక మహాపురుషుని చేపట్టడానికై కలిగిన ఒక కారణజన్మురాలు. శివగౌరీ మానసతనయగా ఆమె పూజ్యురాలు. తపశ్శక్తి, దర్మనిష్ఠ, దివ్యత్వం కలిగిన వ్యక్తిత్వం. విస్తారమైన కథను మీ ప్రశ్నవల్ల, సంక్షేపంగా వివరింపడం జరిగింది.

**ప్ర: ఈ మధ్య ఒక వేదాంత విషయంపై ఇంటర్నెట్‌లో ఒక యువ ఇంజనీరు ఆర్టికల్ రాస్తూ 'సగుణభక్తివల్ల ముక్తిరాదు– నిర్గుణబ్రహ్మ జ్ఞానం వల్లనే వస్తుంది' అని రాశాడు. భక్తివల్ల ముక్తి వస్తుందా?**

**జ:** మీరు చెప్పిన యువ ఇంజనీరు అక్కడా ఇక్కడా విన్న, చదివిన అంశాలలో తనకు సమంజసమనిపించిన వాటిని సేకరించి రాసినట్లున్నారు. ఇలాంటి వేదాంత విషయాల్లో సంప్రదాయబద్ధంగా గురుశిక్షణలో అధ్యయనం చేస్తేనే స్పష్టత, సమన్వయం చేకూరుతుంటాయి. భక్తి, జ్ఞానాల విషయంలో శాస్త్రీయమైన నిర్వచనాలున్నాయి. లోకవ్యవహారాలలో ఉన్న అర్థాలు సరిపోవు.

నిర్గుణబ్రహ్మ, సగుణబ్రహ్మ– రెండూ పరబ్రహ్మలే. విశ్వనియామకుడై, విశ్వవ్యాపకుడై ఉన్న బ్రహ్మము 'సగుణబ్రహ్మ' అని వ్యవహారం. విశ్వానికి అతీతుడు – అన్నప్పుడు 'నిర్గుణుడు' – అని నిర్వచనం.



ఉపాసకుడు సగుణబ్రహ్మను ఆరాధిస్తాడు, ఆశ్రయిస్తాడు. నిర్గుణబ్రహ్మను అనుభవానికి తెచ్చుకున్న జ్ఞానయోగి బ్రహ్మమునందే నిష్ఠుడై ఉంటాడు. ఆ స్థితిలో కూడా జ్ఞాని బ్రహ్మముతానై ఉన్నాడంటే –అది జ్ఞానస్థితిలో భక్తియే. అప్పుడు బ్రహ్మము తప్ప అన్యము లేదనే ఆనందానుభూతి ఉంటుంది.

అందుచేతనే తనను ఆశ్రయించిన వారిలో–జ్ఞానిని గూడా భక్తుడుగా పేర్కొన్నాడు గీతాచార్యుడు (***జ్ఞానీ చ భరతర్షభ*** – భగవద్గీత).

సగుణబ్రహ్మను ఉపాసించేవారు–దేవతా భావనను మించిన బ్రహ్మభావనతో ఉపాసిస్తారు. ఈ ఉపాసనను 'సగుణభక్తి' అనవచ్చు. దీని ఫలితం 'క్రమముక్తి' –అని వేదాంతశాస్త్రం చెబుతోంది. ఉపాసనకు ఫలం – క్రమముక్తి. ఇది పొందిన వారు తిరిగి వెనక్కిరారు అని (**న పునరావర్తన్తే**) శాస్త్రం స్పష్టం చేస్తోంది.

సగుణభక్తిలో నిష్కామమైన భావనాబలం లభిస్తే–అది ఈ జన్మ లోనే చిత్తశుద్ధిని, ఏకాగ్రతనీ సిద్ధింపజేసి, నిర్గుణ బ్రహ్మ జ్ఞానంతో 'జీవన్ముక్తు'ని చేస్తుందని శాస్త్రాలు

వర్ణించాయి. ఆ జ్ఞానసిద్ధి లేకుండానే జన్మపూర్తయితే, సగుణభక్తి బలంతో క్రమ ముక్తిని పొందుతారు – అని కూడా వివరించాయి.

అందుకే 'భక్తి వల్ల ముక్తి లేదు' అనే మాట శాస్త్రవిరుద్ధం.

**'భక్త్యాత్వనన్యయాశక్యః**

**అహమేవం విధోఽర్జున!**

**జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన**

**ప్రవేష్టుం చ పరంతప!** – అని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ స్పష్టం చేశారు. భక్తితో తప్ప మరిదేనితోనూ పరమాత్మను తెలుసు కోలేం, చూడలేం (అనుభవానికి తెచ్చుకోలేము), యధార్థజ్ఞానంతో (బ్రహ్మజ్ఞానంతో) ఐక్యం (ముక్తి) కాలేము.

ప్ర: **'గణేశపురాణం'లోని– గణేశసహస్రనామస్తోత్రంలో 'జైన, ఆర్హత సంహిత' అనే నామాలున్నాయి. అంటే– జైన, బౌద్ధ మతాల తరువాత గణేశపురాణం రచించ బడిందా? మరి వ్యాసుడు ఎప్పటివాడు? బుద్ధుడు, జినుడు – హైందవమతానికి చెందినవారా?**

**జ:** జైన, బౌద్ధాల సిద్ధాంతాలు విస్తారమైన వేదవిజ్ఞానం నుండి స్వీకరింపబడినవే. యోగం, వేదాంతం (తత్త్వం) మాత్రమే గ్రహించాయి అవి. కర్మకాండను పరిగణించ లేదు. అంతే భేదం. అయితే – కాలగతిలో యోగసిద్ధులు, మహాత్ములు అన్ని రకాల సిద్ధాంతాలలోనూ ఉన్న ఏకసూత్రాన్ని, పరమతత్త్వాన్ని గ్రహించారు.



సిద్ధాంతరీత్యా భేదాలు కనిపించినప్పటికీ, పరమార్థదృష్టితో ప్రతిదీ ప్రయోజన వంతంగా ఉందని అనుభవంతో తెలుసుకున్నారు. అటువంటి–సమన్వయం సాధిం చిన ఋషితుల్యులు వాటన్నిటిలో ప్రతిపాదింపబడే 'సత్యం' ఒకే పరమాత్మ అని తెలియజేస్తూ – "ఆయా శాస్త్రాలరూపంలో ఉన్నవాడు ఈ పరమేశ్వరుడే" అన్న విశాలదృష్టితో వాటిని ఈ నామాలద్వారా బోధించారు. 'సర్వం బ్రహ్మమయం' అనే ఉపనిషత్‌జ్ఞానప్రాప్తికోసం నిర్దేశించిన, 'గణేశ సహస్రనామాలు' కూడా ఆ బ్రహ్మ మును గణేశునిగా ఉపాసిస్తూ – విభిన్న కాలాలలో విభిన్న జీవలక్షణాలున్న వారి కోసం విభిన్నంగా నిర్మించిన శాస్త్రాలసారం ఏకపరమాత్మయే అని ప్రతిపాదిం చాయి. అయితే ఇవి 'వ్యాసకృతులు' అని భావించకపోయినా, వీటిలోని సమైక్య భావాలు, సమన్వయ తత్త్వాలు, పరిశీ లిస్తే – ఇవి ప్రమాణాలుగానే స్వీకరించవచ్చు –వ్యాసహృదయానికి భిన్నాలు కావు కనుక! వ్యాసుని అనంతరకాల రచనలే అయినా,

లేదా – బౌద్ధజైనాల తరువాతి గ్రంథాలే అయినా వేద ధర్మసమ్మతాలు కనుక, ఆ కాలపు ఋషుల దర్శనాలుగా తెలుసుకొని అనుసరించవచ్చు. మరొక కోణంలో –త్రికాల వేత్తలైన వ్యాసాది మహర్షులు తమ తరువాతి కాలంలో జరగనున్న అద్భుత పరిణామాలను పూర్వమే దివ్యతపోదృష్టితో దర్శించి రచించారు – అని చెప్పడం కూడా సమంజసమే.

ప్ర: **పాప, పుణ్య కర్మలు జన్మలకు హేతువులంటారు కదా! మరి కర్మలు చేయకుండా ఉండలేం! చేసిన కర్మల్ని ఎలా క్షయం చేసుకోగలం! ఎంత చేసినా కర్మ అనుభవించ వలసిందే నంటారు కదా? ఎలా బయటపడగలం? పాపనాశనానికి మార్గమేమిటి? పూజాదులు ప్రారబ్ధాన్ని పోగొట్టగలవా?**

**జ:** కర్మచేయకుండా మానవుడు ఉండలేడు. అసలు కర్మాచరణ కోసమే జన్మ. కర్మాచరణ ద్వారానే కర్మబంధం నుండి విడుదల పొందగలం. ముల్లును ముల్లుతోనే తీయాలి కదా! ఈశ్వరార్పణ బుద్ధితో చేసే సత్కర్మ బంధన హేతువుకాదు. సత్కర్మాచరణ తప్పనిసరిగా చేయాలి.

**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః।** –'తన కర్మతో ఈశ్వరుని అర్చించి మానవుడు సిద్ధిని (ముక్తినీ, జ్ఞానాన్నీ) పొందుతాడు' అని గీతావచనం.



ఇక–పుణ్యకర్మకి గానీ, పాపకర్మకిగానీ మూడు అంశలుంటాయి. బీజాంశం, వృద్ధ్యంశం, భోగాంశం–అనే మూడు భాగాలవి.

బీజాంశం–జ్ఞానం చేతను, వృద్ధ్యంశం– ప్రాయశ్చిత్తాది పుణ్య కర్మలచేతను, భోగాంశం– అనుభవం చేతను నశిస్తాయి. క్షేత్ర యాత్రలు, అర్చనలు, ఉపవాసాది వ్రతాలు– పాపములు వృద్ధి కాకుండా మనల్ని కాపాడతాయి.

అంతేకాక, దేవతారాధన, దానాదుల వల్ల భోగాంశాన్ని తట్టుకొనే శక్తి లభిస్తుంది. ఆ సత్కర్మలు చేయనివాళ్ళు తట్టుకొనే శక్తి లేక వీగిపోతారు.

భగవచ్చింతన, కైంకర్యం తాళుకొనే శక్తినిచ్చి భోగాంశను దాటిస్తాయి. వృద్ధ్యంశను పోగొడతాయి. క్రమంగా జ్ఞానం సమ కూరి బీజాంశ కూడా పోతుంది. భగవత్ ధ్యానం వల్ల మానసిక పాపం నశిస్తుంది. జపంచేత, సంకీర్తన చేత వాచిక పాపం పోతుంది. ఉపవాస, అర్చనాదుల వల్ల శారీరక (క్రియతో చేసిన) పాపం హరింపబడుతుంది. ధనంతో, ధనంకోసం చేసిన పాపాలు దానం వల్ల పోతాయి. అందుకే మానవులు నిరంతరం పాప నిర్మూలన కోసం ప్రయత్నించాలి.

ఈ పాపాలు గతజన్మ పరంపరల నుండి వచ్చినవి కూడా కావచ్చు. లేదా –తరువాతి జన్మలలో అనుభవించ వలసిన వైనా కావచ్చు.

ఏవేమైనా సర్వపాప క్షయానికీ పైసాధనలే శరణ్యాలు.

**ప్ర: శివకేశవుల అభేదం గురించి తరచు చెబుతుంటారు. నేనూ విశ్వసిస్తాను. కానీ భాగవతంలో విష్ణువే పరముడు (సర్వోన్న తుడు) అని ఉన్నది. భస్మాసురుని విషయం లోను, భృగు మహర్షి త్రిమూర్తుల్ని పరీక్షించే సందర్భంలో శివుని కంటే విష్ణువు అధికుడని ఉన్నది కదా!**

**జ:** పురాణ కథల్ని చక్కగా సమన్వయించుకోవాలి. విష్ణుభక్తులకు విష్ణువునందు నిష్ఠ కల్పించే విష్ణుపారమ్య పురాణాలలో భాగవతం ఒకటి. అలాగే శివ పారమ్యాన్ని నిరూపించే పురాణాలు కూడా ఉన్నాయి. శివుడు అగ్నిలింగంగా ఆవిర్భవించినప్పుడు బ్రహ్మ విష్ణువులు తుదిమొదళ్ళు తెలుసుకోలేకపోయారనీ, అలాగే–విష్ణువు, శివుని అర్చించి సుదర్శన చక్రాన్ని పొందాడనీ, దక్షయజ్ఞ ఘట్టంలో యజ్ఞరక్షకుడుగా ఉన్న విష్ణువు వీరభద్రుని చేతిలో ఓడిపోయాడనీ అనేక ఉదాహరణలు శివ సంబంధ పురాణాలలో చాలా కనిపిస్తాయి. వాటిని చూపించి 'శివుడే పరముడు' అని నిరూపించవచ్చు. అలాగే శక్తి సంబంధ పురాణాల ఆధారంగా దేవీపారమ్యాన్ని (దేవియే సర్వోన్నతురాలని) ఋజువు చేయవచ్చు.

ఇవన్నీ ఒకే వ్యాసుడు రచించాడని మరచిపోవద్దు. అక్కడ ఇతర దేవతలని తక్కువ పరచాలని ఉద్దేశంకాదు. దీనిని 'నహినిందా న్యాయం' అంటారు. (ఇందులో ఇతరదేవతల నిందలేదు– అని అర్థం). తాను ఉపాసించే దైవాన్ని సర్వాధిక భావనతో కొలుచుకొనడమే ప్రధానోద్దేశం.

ఒకే పరమమైన తత్త్వాన్ని విష్ణువని కొందరు ఉపాసిస్తే, ఇంకొందరు శివుడని ఆరాధిస్తారు. మరికొందరు శక్తి అంటారు. ఉపాసనా సంప్రదాయాలు ఎన్నైనా – వాటిలో సమైక్యంగా ఉన్న పరమాత్మ తత్త్వాన్ని వివేకంతో సమన్వయించి బోధించ వలసిన బాధ్యతను పండితులు మరువరాదు. దైవాన్ని తన కోరిక తీర్చే ఒక దేవతా రూపంగా భావించేవారికి ఆ కోరిక తీర్చడం వరకే దేవత బాధ్యత. ఆ దేవతను పరతత్త్వంగా భక్తితో ఉపాసించేవారికి జ్ఞానం, ముక్తి లభిస్తాయి.

భస్మాసురుడు, శివుని తన కోరిక తీర్చే దేవతగా పూజించాడు. అంతవరకే అతడి దృష్టి. అతడికి పరమాత్మ భావనలేదు. కనుక జ్ఞానం లభించలేదు.

అయితే – ఏ రూపంలో దేవత వరమిస్తుందో, ఆ రూపంలో శిక్షించదు. అందుకే భస్మాసురుని శివుడు సంహరించలేదు. ప్రళయకాలంలో కాలాగ్నిరుద్రుడై సర్వ జగతినీ దహించే స్వామికి భస్మాసురుడు ఒక లెక్కా?

దేవతానియమం ప్రకారం–వరమిచ్చిన రూపంలో శిక్షించరాదు కనుక శివుడు ఉపేక్షించాడు. ఆ తత్త్వమే విష్ణురూపంలో శిక్షించింది. ఇలా అన్వయించి గ్రహించాలి. అలా కాకుండా – విశాలతలేని సంకుచిత బుద్ధులతో, ఒకే గ్రంథానికి లేదా సంప్రదాయానికి పరిమితమై ఇతర సంప్రదాయాలను, దేవతలను నిందించితే జ్ఞానము, ముక్తీ లభించవు. ఎవరు ఏ సంప్రదాయంలో ఉన్నా విశాలబుద్ధితో ఆలోచించి సమన్వయించుకొనే సుహృదయం ఉన్నప్పుడే తరించగలరు.

ప్ర: **మా అమ్మాయి ఇతర భాషకు చెందిన ఇతర వర్ణస్థుని ప్రేమించింది. మేమూ చేసేది లేక సమ్మతించవలసి వచ్చింది. అయితే వివాహం వరుడివైపు సంప్రదాయం ప్రకారం జరగాలా? లేక మా సంప్రదాయాన్ని అనుసరించి చేయాలా? లేదా – ఇక్కడా అక్కడా కూడా రెండు విధాలుగా చేయవచ్చా? మా అమ్మాయి మాత్రం అటువైపు వారి సంప్రదాయ పద్ధతులు నాకు నచ్చలేదు. మనవైపు ప్రకారమే చేయాలి – అంటోంది. ఏది సమంజసం?**



**జ:** ఇటీవల ఇలాంటి ప్రశ్నలు ఎక్కువ సంఖ్యలో తారసపడుతున్నాయి. అందుకే సమాధానమివ్వక తప్పడంలేదు.

ఒకప్పుడు వర్ణాంతరాది అసంప్రదాయ వివాహాలు పెద్దలు చేసేవారు కాదు. పిల్లలు ఏ 'రిజిస్ట్రేషన్' పెళ్ళిళ్ళో, దండల మార్పిడి పెళ్ళిళ్ళో చేసుకొనేవారు. గత్యంతరం లేక పెద్దలు సమ్మతించే వారు. కానీ ఇప్పుడు 'గత్యంతరం లేక' వీళ్ళే పూనుకొని పెళ్ళి చేస్తున్నారు. ఇది శోచనీయం. దోషం కూడా.

పెళ్ళి ఒక ముచ్చటో, వేడుకో కాదు. కాళ్ళు కడిగి కన్యాదానం చేయడం అనేది వివాహ 'సంప్రదాయం'. ఆ కన్యాదానం పూర్వతరాలను తరింపజేయడం కోసం అని సంకల్పిస్తారు. అటువంటప్పుడు అన్య వర్ణాల వారి కాళ్ళు కడిగి, "పితౄణాం తారణార్థాయ" అని చెప్పి కన్యాదానం చేయడం దోషం కాదా? ఆ క్రియ వల్ల పూర్వీకులు నరకంలో పడతారు. అలా పడవేసిన పాపం ఉభయులకూ వస్తుంది. ఇదంతా ఆస్తికులైతేనే గమనించాలి.

నాస్తికులకు సంప్రదాయ వివాహాలు గానీ, వివాహ సంప్రదాయాలు కానీ

అనవసరం కదా! 'సంప్రదాయం' అనే మాట ఎత్తితే అసలు ఏమిటో తెలియాలి కదా! వివాహంలో వాడే మంత్రాలన్నీ సవర్ణ, సంప్రదాయ వివాహాలకే చెల్లుతాయి. భౌతిక తర్కాలకందని పరంపర, సూక్ష్మవిజ్ఞానం దాంపత్య ధర్మంలో ఉంది. కేవలం వ్యక్తులు నచ్చుకుంటే సరిపోయిందా? ఆ వ్యక్తులననుసరించి ఉండే కుటుంబాలను, పరంపరను తప్పకుండా వాస్తవ జీవితంలో ఎదుర్కొనవలసిందే. అప్పుడు క్రమ క్రమంగా ఒకరికొకరు అలవడక, కలహించే పరిస్థితి ఏర్పడుతుంది.

మీ అమ్మాయి 'మన సంప్రదాయ ప్రకారమే పెళ్ళి జరగాల'ని పట్టుపడుతోంది – అని చెబుతున్నారు. అసలు ఈ విధమైన పెళ్ళి మన సంప్రదాయం కాదని చెప్పండి. తాను ఏ ఇంటికి కోడలిగా వెళ్ళబోతోందో ఆ ఇంటిని అనుసరించాలి అన్నది ఒక నియమం. ఇది గుడ్డిలో మెల్లలాంటిది.

మీ ప్రశ్నబట్టి మరొకటి అర్థమౌతోంది. మీ అమ్మాయికి సంప్రదాయమంటే గౌరవం ఉంది. కానీ దాని ప్రాధాన్యం, పరంపరలాంటివి మీరు బాల్యం నుండి బోధించి ఉంటే ఈ అయోమయం రాదు. యౌవనావస్థకు సహజమైన ఆకర్షణ, మోహం మాత్రమే – ఇహపరాలకు సంబంధించిన దాంపత్య ధర్మాన్ని నిర్ణయించ డానికి సరిపోదు.

పెద్దలు ముందుగా విజ్ఞుల ద్వారా పరంపరను తెలుసుకొని, సంప్రదాయ ధోరణికి దూరం కాకుండా, ఆధునిక విద్యను నేర్పే పద్ధతులను అవలంబించాలి.